శ్రీ ర స్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః.

# రామాభ్యుదయము

అయ్యలరాజు రామభద్రకవిప్రణీతము.







చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.



శ్రీ ర స్తు.

# రా మా భ్యు ద య ము.

---

## పీ ఠి క.



రామాకుచహారనాయకమణిశ్రీఁ జేయుసాకారశృం
గారంబై తగుమచ్చవక్షమున భూకాంతాస్థితిన్ దల్పసౌ
ఖ్యారూఢి న్విలసిల్లువేంకటనగాధ్యక్షుండు రక్షించు గొ
బ్బూరితిమ్మనృపాలసింహు నరసింహోర్వీశచూడామణిన్. 1

చ. పలుకుచెలంది యే యవిదపజ్జలఁ గోడలికంబు సేయ నే
కలికి కనుంగుటూడిగపుఁగత్తియపిండు శచీముఖామరీ
కుల మగజాత యేచెలువకుం జెలి యయ్యలమేలుమంగ భా
సిలుసిరు లుంచు గొబ్బురినృసింహనృపాలునిమందిరంబునన్. 2

ఉ. ఆయతధర్మబోధము నిరంతరశాస్త్రవివేకమున్ జగ
ద్గేయపటుప్రతాపమునుఁ గీర్తియు నూర్జితబాహుశక్తియున్
బాయక యుండఁ జేసి నిరపాయముగాఁ గరుణించి విష్ణుపం
చాయుధి యేలుఁ గావుత మహామహు గొబ్బురినారసింహునిన్. 3

చ. అలరులపాన్పు పచ్చడము నైనవరత్నమయాతపత్రమై
కొలువు హజారమై యలముకుందునియిచ్చకు వచ్చినట్ల నే
యలరు ననంతకుండలి సహస్రముఖంబుల నాకు సూక్తిమం
డలి కృపచేసి ప్రోచుఁ గృతినాయకుఁ గొబ్బురినారసింహునిన్. 4

వ. పసిఁడిమెఱుంగుటెక్కెపు లిరుఁబక్కియలన్ సురటుల్ వలెన్ సము
ల్లసదసమానిలాంకురములం బొరియించుచు నేడ దేర్ప రా

క్షసుల జయింప నేగునెడ శార్ఙ్గికి వారువమై భజించి సొం
పెసఁగెడుపుల్గురాయఁడు జయోన్నతు లిచ్చు నృసింహసూరికిన్. 5

శా. లంకారిన్ జలరాశిలంఘనజవాలంకారజంఘున్ నిరా
తంకు న్నిశ్చలు నిర్భయుం న్నిపుణు సీతాశోకలుంటాకని
శ్శంకప్రాభవు రామచంద్రచరణాబ్జాతద్వయీసర్వదా
కైంకర్యప్రియుం నాంజనేయుం నగదంకారప్రభుం గొల్చెదన్. 6

చ. వినుసికదేవర న్నలువ వేల్పుల ముప్పదిమూఁడుకోటులం
బనిఁగొని ముజ్జగంబు మనుపంగలపీరుఁడు వేత్రపాణి వే
న్నునిదళవాయి సూత్రవతి నోములపంట కనుంగొనుం జయం
బని మొనలన్ ఘటించుచు దయామతి గొబ్బురినారసింహునిన్. 7

ఉ. పాలును నీరు నేరుపఱుపంగలమావుల వేదవీథి వా
హ్యాళి యొనర్చు నేయఁలికులాలక తా సితవర్ణ యయ్యు నే
బాల సువర్ణరూపమున భాసిలు నానలుమోమువేల్పు ప్రో
యాలు ప్రవీణ మామకమహాకృతినాథుఁ గృతార్థుఁ జేయుంతన్. 8

తే. వ్యాసవల్మీకభవకాళిదాసభాస, చోరభవభూతిబాణమయూరదండి
మాఘభారవిబిల్హణమల్హణాది, పూర్వవిద్వత్కవివ్రాతముల భజించి. 9

తే. శబ్దశాసనసుకవి కంజలి యొనర్చి, యుంభయకవిమిత్రునకు హస్తయుగళి మోడ్చి
శంభుదాసుని సోము భాస్కరుఁ దలంచి, యాంధ్రవాగ్భాగవతకర్త నభినుతించి.

క. పరవస్తువంశరత్నా, కరకౌస్తుభమణి ప్రభావఖని యయి నాకుం
బరమగురు వయినమ్మడి, వరదాచార్యాంఘ్రివనజవందారుఁడ నై. 11

వ. ఇట్లభీష్టదేవతాగురునమస్కరణంబును బురాతనాద్యతనసుకవిస్మరణంబును గావించి యే నొక్కమహాప్రబంధనిర్మాణంబునకుం బ్రారంభించి యున్నసమయంబున నతుల వితరణగుణప్రభావిధూతమందారుండును, సరస్వతీమనోభండారచోరుండును, బ్రతిపక్షభూపాలహృదయభల్లుండును, నప్రతికమల్లుండును, ధవళకీర్తిచ్ఛవిచ్ఛటాచ్ఛాదితబ్రహ్మాండుండును, హత్తుమువ్వరగండుండును, జిరత్ననూత్నరాజరత్న గాఢాధకకరణ నిపుణచారిత్రుండును, గాశ్యపగోత్రపవిత్రుండును, నిఖిలగుణరత్నరత్నాకరుండును, నష్టదిగ్రాజభీకరుండును, నిరంతరారాధితేందిరానేతృకుండును, గొబ్బూరికులజలధిజైవాతృకుండును, సరసభోజనకృతసభాజనభోజనపల్లి నారాయణాచార్యకైంకర్యపరాయణుండును, దాటకానారాయణుండును, నవక్రవిక్రమజితసింహుండును నగు గొబ్బూరి నారసింహుం డొక్కనాఁడు వైదికతార్కికశాబ్దికాలంకారికలాక్షణికజ్యో

తిషికపౌరాణికసామాజికసకలభాషా ప్రగల్భవిద్వత్కవిరంజితంబును, వందివైతాళిక
వైణికగాయకనర్తకాగ్రామ్యపరిహాసకవిలాసినీభాసితంబును నగుసభాభవనంబునఁజతు
రుపాయచతురస్వతంత్రు లగుమంత్రులును, సుగుణసింధువు లగుబంధువులును, నవార్య
శౌర్యకృతకృత్యు లగుభృత్యులును గొలువంగొలువు చెంగలువకొలనుంబోలి కలకల
నగుచుఁ జెలువు మిగులం బేరోలగం బుండి సాహిత్యగోష్ఠీగరిష్ఠుం డై కృపారసశీతల
కటాక్షంబుల నన్నుం గనుంగొని యిట్లనియె. 12

చ. క్షితిపతి యెవ్వఁ డైన నగుఁ గీర్తియ సొమ్ము నృపాలకోటికిం
కృతిపతి యైనవాఁడె కృతకృత్యుఁడు గాన నొనర్పు సప్తసం
తతులకు నెక్కుడండ్రు కృతి దాశరథీద్ధకథాసుధాచమ
త్కృతకృతి రామభద్ర చెవికిం జవి గొల్పు భవత్కవిత్వముల్. 13

వ. అని బహూకరించి కర్పూరతాంబూలపురస్సరంబుగా నగ్రహారప్రత్యగ్రహారాభరణ
సమీచీనాంబరంబు లొసంగి గారవించిన నేనును మహాప్రసాదం బని యంగీకరించి
మదీయకృతికన్యకాహారవల్లికి సఫలంబుగా ననుగుణనాయకరత్నంబు గొబ్బూరినార
సింహనృపాలుండు గలిగెనని హర్షించి రచియింపం బూనితిఁ దదీయవంశావతారం
బెట్టి దనిన. 14

క. మిత్రబ్రహ్మము పొల్చె జ, గత్త్రయనయనమ్ముఁ జిత్ప్రకాశకమును మూ
ర్తిత్రితయాన్వితమును సమ, యత్రయకారణమహామహత్త్వము నగుచున్. 15

క. హాళిం గొనియాడం దగు, హేళిఁ బ్రసన్నోదయుం ద్రయీమధుపాళీ
కేళీసంకీలితకం, కేళిగుళుచ్ఛస్వరూపఘృణిరింఛోళిన్. 16

తే. పలుకుటిల్లాలిసెమ్మోముబాపనయ్య, పొడమునెలవయ్యె సంపత్తిపువ్వుఁబోఁడి
కాటపట్టయ్యె నేవేల్పుమేటిచేత, నలరు నెత్తమ్మి యాంకాఁకవెలుఁగు చెలఁగు. 17

చ. సమధికభక్తపోషణవశంకరశంకరమూర్తిభేద మే
యమలునిరూప మెవ్వఁ డమృతాంబుధితుంగతరంగరంగదా
శ్రమున కఘౌఘశిక్షణవిచక్షణదక్షిణవీక్షణస్వరూ
పమునఁ దనర్చు నాభువనబాంధవు నెన్నెద సప్తసైంధవున్. 18

శా. ఆనాళీకవనావనప్రవణుఁ డార్యస్తోత్రపాత్రుండు సం
జ్ఞానామాంగనయందుఁ గాంచె మనువున్సౌజన్యధన్యున్బుధా
ధీను న్వర్ణవిభేదనిర్ణయవిధాధిష్ఠానభూయిష్ఠని
ష్ఠానిర్నిద్రహితామరద్రు నఘశిక్షాదక్షదీక్షానిధిన్. 19

క. ఆవైవస్వతసుతుఁడు మహీపరకులసార్వభౌముఁ డిక్ష్వాకుఁడు త

త్పావనవంశమున సుధాంధోవిభువిభవుండు దశరథుం డుదయించెన్. 20

క. ఆదశరథునకుఁ గౌసల్యాదేవికి రాముఁ డుదయమై మించె నవా
ర్యౌదార్యశౌర్యధైర్యన, యాదరణగుణాభిరాముఁ డై జగ మెన్నన్. 21

క. ఆరఘుపతివంశసుధా, నీరధిఁ గలికాలచోళనృపచంద్రుఁడు దు
ర్వారరణభిన్నవిమతా, కారుఁ డుదారుఁడు జనించెఁ గలియుగవేళన్. 22

ఉ. ఆకలికాలచోళవసుధాధిపువంశమునందు నార్తర
క్షాకుశలుండు బాంధుజనకల్పకశాఖి జనించె రంగరా
జాకరుణాధురంధరున కాత్మజుఁ డై పొగడొందెఁ దిమ్మరా
జాకులభర్తకుం దనయుఁ డయ్యెను గొండనృపాలుఁ డున్నతిన్. 23

శా. ఆరాజన్యునియందు నేగు రుదయం బై రిద్ధసత్యవ్రతో
దారు ల్తిమ్మవిభుండు వెంగళధరాధారాగ్రగణ్యుండు గో
బ్బూరిక్ష్మావరచంద్రుఁడుం దిరుమలాఖ్యుం డోబళేశుండు మం
దారక్ష్మారుహపంచకంబు కలశోదన్వంతునందుం బలెన్. 24

వ. తత్కుమారపంచకంబునందుఁ దిమ్మరాజానుజుండు. 25

ఉ. బెబ్బులితోలుఁ బచ్చడముఁ బెద్ద నిసీ యని నవ్వి కయ్యపుం
బబ్బము లాచరించుమనిఁ బాఱఁగఁ బట్టి పడంకు గుబ్బపే
రు బ్బడఁగించి పాల్కడలి నోర్చి హసించు హళాహళిం దగెన్
గొబ్బురివెంగళక్షితిపకుంజరుమంజులకీర్తిమంజరుల్. 26

చ. అలయనఘుండు వెంగళధరాధిపచంద్రుఁ డుదాత్తధీరతా
కులగిరి రామరాజు పెదకొండనృపాలునికన్యకామణిం
గులసతిఁగా వరించెఁ దగ గోపమదేవిని దత్కుమారుఁ డు
జ్జ్వలజయశాలి చిన్ననరసక్షితిపాలకమౌళి రాజిలున్. 27

సీ. కంఠీరవాకుంఠకటుపరాక్రమభిన్నపరసామజుండు పిన్ననరసరాజు
బంధుసాధుసుహృద్వసుంధరాసురరాజసరసాదరుఁడు పిన్ననరసరాజు
క్రౌంచభిద్భర్గభార్గవవిక్రమాదిత్య నరసాహసుఁడు పిన్ననరసరాజు
పృథుతరైశ్వర్యగాంభీర్యరేఖాజితహరసాగరుఁడు పిన్ననరసరాజు
తే. స్మరసదృశవిగ్రహుండు పిన్ననరసరాజు, సరసబాహార్గళుఁడు పిన్ననరసరాజు
సురసరిద్గురుమతి పిన్ననరసరాజు, ధరసమున్నతధృతి పిన్ననరసరాజు. 28

క. వెంగళవిభుసంతతి యీ, భంగిన్ భాసిల్లె నానృపతితమ్ముఁడు భ
వ్యాంగుఁడు గొబ్బూరయ్య పతంగకులోత్తంస మతనిఁ దరమే పొగడన్. 29

తే. పాదములు గల్గి నడక చొప్పడక యుండుఁ, గదలలేవు విపత్తముల్ కఠినభావ
ముడుగవేల సురాద్రులఁగొడవ యపుడుఁ, బుడమి గొబ్బూరిరాజుమూఁపున వసించె.

ఉ. భావుకకీర్తి గొబ్బురినృపాలకుమారులు ధన్యులామర
గ్రావనిభుండుఁ గొండపధరావరశేఖరుఁడు న్సముల్లస
ద్ధీవిజితాహినాయకుఁడు తిమ్మమహీపతి పిన్న రంగపృ
థ్వీవరుఁడోబపార్థివుఁడు వేంకటరాజును దిమ్మధీరుఁడున్. 31

తే. ధరణి గొబ్బూరిరాజుసంతాన మిట్లు, చిగురుఁగొమ్మయుఁ జేవయై చెలఁగె నతని
యనుజమణియైన తిరుమల మనుజవిభుని, శుభచరిత్రంబు పొగడ శేషునకుఁ గరమె.

చ. గురుతరబాహువిక్రముఁడు గొబ్బురివంశవరుండు నైనయా
తిరుమలరాజు రాజిలు నుదీర్ణవిరోధివరూథినీశిర
స్సరసిజవాటికాసమదసామజమై బహుదిగ్విలాసినీ
తరుణనఖక్షతద్యుతివిధాయి నిజాశ్వఖురాంకకోటి యై. 33

తే. ధీరుఁడామేటిగొబ్బూరితిరుమలయ్య, రమణఁ గోనేటిపినకొండరాజుతనయ
రంగమాంబ వరించె వారాశికన్య, నబ్జనాభుండుబలె హర్షమావహిల్ల. 34

క. ఆరంగాంబకుఁ దిరుమల, శౌరికి సుతులైరి కొండ జనపతి రంగ
క్ష్మారమణగ్రామణిక, స్తూరీరంగక్షితీశచూడామణియున్. 35

వ. అందగ్రజుండు. 36

క. కొండమనుజాధినాథుఁ డ, ఖండపరాక్రముఁడు పుణ్యఖని సకలకళా
కుండలివిభుఁ డసిధారా, దండితరిపున్నృపతి యతనిఁ దరమే పొగడన్. 37

క. ఇది గొబ్బూరీతిరుమల, త్రిదశాధీశ్వరునిసంతతిసమున్నతసం
పదఁ దామరతంపర యై, పొదలెం దశదిశలఁ గీర్తి పూర్వముపర్వన్. 38

వ. తదనుజుండు. 39

మ. కలనం గవ్వడి సైనఁ గాదను భుజాగర్వాతిదుర్వారత
బలభిత్పుత్త్రవసంతకంతులఁ దృణప్రాయంబుగాఁ జూచు మం
జులసౌందర్యకళావిశేషమున రాజుల్లేరు గొబ్బూరియా
బళి రాజన్యునిఁబోలువారు హిమవత్పర్యంతభూమండలిన్. 40

ఉ. కోనేటిచిన్నతిమ్మనృపకుంజరునాత్మజ వెంగళాంబఁ జం
ద్రాననఁ బెండ్లియై కనియె నాబళభూవిభుఁ డోబళేశ్వరున్
ధీనిధిఁ గొండభూమివిభుఁ దిమ్మనృపు న్నరసేంద్రు ఖడ్గధా
రానిహతాహితప్రకరరామధరావరు లక్ష్మణాధిపున్. 41

వ. ఏతత్కుమారాగ్రజుండు. 42

ఉ. అల్లుఁడు రామరాజనుఁగుటల్లుఁడు గొబ్బురి యౌబళేశుఁడా
హల్లకహారిఁ గన్నఘనునల్లుఁడు పోమ్మణబుద్ధి గట్టురా
జల్లుఁడు వింటినేర్పున సమంచితరూపమునందుఁ జందమా
మల్లుఁడు దేవకీరమణియల్లుఁడు శత్రుసమిజ్జయంబునన్. 43

క. ఈరీతి నౌబళేశము, హీరమణునివంశ మమరె నీ యిందఱిలో
ధీరుఁడు సర్వజ్యేష్ఠుఁడు, దారుఁడు గొబ్బూరితిమ్మధరణిపుఁ డలరున్. 44

ఉ. గొబ్బురితిమ్మభూవిభునిఘోరతరాసిని ద్రెవ్వి వైరు లా
గుబ్బున నేగి వేల్పువెలగుబ్బెతలం గవగూడి పైఁబయిం
జుబ్బునఁ జూఱ లాడుటకుఁ జొత్తురు తన్మధురాధరామృతం
బబ్బక పొంచి యజ్వజను లవ్వల నువ్విళులూరుచుండఁగన్. 45

చ. కపటము లేదు సంగరముఖంబున నోట హుళిక్కి యెట్టిపో
గృపణవిధంబు నాస్తి నహి కిల్బిషవర్తనమిల్ల కల్లయె
ల్లపుడును సున్నఖిన్నత యహంకరణం బెటువంటిదో కదా
కుపితవిరోధిహర్త యగు గొబ్బురితిమ్మనృపాలమౌళికిన్. 46

సీ. పలుకుటింతికిఁ గ్రొత్తతెలిదమ్మిగద్దియ యలవిరించికి వింతయంచతేరు
భవునకు నుండ రెండవ వెండిగుబ్బలి పద్మాక్షునకు మాఱుపాపపాన్పు
మిగులఁ గుప్పసము పన్నగలోకభర్తకు వేఱొక్క వెలిమావు వేల్పుదొరకుఁ
గుముదినీవిభున కెక్కుడుఁ జుక్క త్రొక్కుడు నిలకు నొండొక్క రేయెండపిండు
తే. నగుచు జగములవారి కాయాయియుచిత, రూపములఁదాల్చితనప్రాపుఁ జూపనేర్చి
మించి యఖిలద్యుతుల నాక్రమించి భళిర, వెలయుం గొబ్బూరితిమ్మభూవిభునికీర్తి.

క. ఆతిమ్మవిభునకుం బ్ర, ఖ్యాతశ్రీ యోబమాంబ యాత్మేశ్వరియై
సీతాశాతోదరికిం, బాతివ్రత్యప్రసిద్ధిఁ బ్రతియై మించెన్. 48

వ. తన్నందగమనామందారవల్లీజననంబునకు రత్నాకరస్థానం బగుసోమవంశంబునకు మేటియగు శార్వీటిబుక్కభూపాలసుత్రామరామరాజన్యమూర్ధన్య శ్రీరంగరాజ రాజత్ప్రాభవం బెట్టిదనిన. 49

సీ. దుర్వారతరగర్వధూర్వహాహితఘోరసంగరార్జునుఁడు శ్రీరంగరాజు
సకలవిద్వద్వేదశాస్త్రోక్తిగుంభనాభంగురసభుఁడు శ్రీరంగవిభుఁడు
ధనురస్త్రశస్త్రవిద్యాసారసాహిత్య సంగీతహారి శ్రీరంగశౌరి
గురువృద్ధబుధబంధుశరణాగతారాంతరంగికకృపుఁడు శ్రీరంగనృపుఁడు

గీ. ప్రతిభఁ బన్నగరాజు శ్రీరంగరాజు, ప్రకటతరకాంతిరాజు శ్రీరంగరాజు
ప్రౌఢి నవభోజరాజు శ్రీరంగరాజు, ప్రథితధనరాజరాజు శ్రీరంగరాజు. 50

క. శ్రీరంగరాజసుతులు ధ, రారంగత్కీర్తు లళియ రామాధిపుఁడున్
ధీరుఁడు తిరుమలవిభుఁడు ను, దారుఁడు శ్రీవేంకటాద్రిధరణీధవుఁడున్. 51

తే. అతిపవిత్రత మూర్తిత్రయంబనంగ, నతులతరదీప్తి వహ్నిత్రయంబనంగ
రామరాజును దిరుమలరాజు వేంక, టాద్రిరాజును మనిరి విఖ్యాతమహిమ. 52

వ. అందు. 53

ఉత్సాహ.—

రామరా జనూనభోగరమ్యమానభూతను
త్రామరాజరాజు భీకరప్రతీపభూపసం
గ్రామరాజమాళినమ్రరాజరాజిమిత్రగో
త్రామరాజహృత్కృపాసమగ్రచిత్తుఁ డెత్తఱిన్. 54

ఉ. ఆపటుకీర్తి రామవసుధాధిపచంద్రుఁడు కృష్ణరాయధా
త్రీపతిసార్వభౌమదుహితృప్రియుఁడై వితతప్రతాపసం
తాపితశత్రుఁడై యలసదాశివరాయనిరంతరాయవి
ద్యాపురరాజ్యలక్ష్మికి నిదానము దా నయి మించె నెంతయున్. 55

శా. రామక్షోణివిభుండు కృష్ణమనుజేంద్రగ్రామణిన్ భీమసం
గ్రామేంద్రాత్మజుఁ బెద్దతిమ్మవిభుని న్రాచూరితిమ్మాధిపున్
శ్రీమంతుం బినకొండభూవరవరున్ శ్రీరంగరాజన్యను
త్రాముం గాంచెఁ గుమారరత్నముల మందారోపమోదారులన్. 56

వ. అందు. 57

సీ. జనియించె నేరాజు జైవాతృకాన్వయాంభోరాశినవకల్పభూజ మనఁగఁ
గప్పము ల్గొనియె నేఘనుఁడు కేరళచోళపాండ్యలాటాంగభూపతుల చేత
దిక్కరికరతాహితిక్కారియై లీల నేలె నేవిభుఁడు మహీపురంధ్రిఁ
దనియించె నేనృపోత్తముఁడు భూదేవసంతతుల సంతతమహాదానగరిమ

తే. నతఁ డభయదానసంరక్షితాజిరంగ, భీతభూకలనేత వాగ్భూతధాత
యసమసమరోగ్రచండబాహార్గళుండు, రమ్యగుణశాలి పెదతిమ్మరాజమౌళి. 58

మ. అరవేటల్లియ రామరాజు పెదతిమ్మాధీశు బాహాభయం
కరకౌక్షేయకధారఁ బోరనఁ గడంకం ద్రెవ్వవీరారిమ
ల్లురకు న్మట్టి యగుం దదీయబలధూళుల్ సంగడా శా వియ
చ్చరకాంతాస్తనపాళి వి న్నరడి నాశ్చర్యంబు చర్చింపఁగన్. 59

వ. తదనుజుండు. 60

క. రామారితిమ్మవిభునిక, రామారిం దెగి నిరంతరము సమరమ్మొగి
లోచనల మదనశాస్త్రా, లోచనలం దవిలి వర్తిలుదు రభియాతుల్. 61

మ. పినకొండక్షితినాథు నెన్నఁ దగు గాంభీర్యాంబురాశిం గరా
సినికృత్తప్రతివీరబాహుజవరున్ శీతాంశుబింబాననా
జనపుండ్రేక్షుశరాసనున్ యవనపాంచాలాంగ నేపాళభూ
పనికాయార్పితదర్పితద్విపమదాంభఃపంకిలప్రాంగణున్. 62

క. పరిపంథినృపాలకసం, హారుఁ డగుపినకొండవిభున కైశ్వర్యమునన్
సరి గా రెవ్వరు గౌరీ, శ్వరుఁడును నరదెగినపౌరుషమువాఁడె సుమీ. 63

క. శ్రీరంగరాజురామ, క్ష్మారమణుసిరంగరాజు మహీ రమీ కెక్కెన్
ధారాధరఖేచరమం, దారాధఃకారిదానధారానిధియై. 64

వ. ఏతాదృశకుమారజనకుం డయి రామరాజశేఖరుం డలరుఁ దదనుజుండు. 65

క. ఘృణిదినమణి గుణి యాదిమ, ఫణి ధరణీధరణసరణి ప్రతిభటగజతా
సృణి వితరణజితచింతా, మణి తిరుమలభూమిపాలమణి వినుతింపన్ 66

క. కృపణావనుఁ డాతిరుమల, నృపుఁ డలరఘునాథరాణ్మణిన్ శ్రీరంగా
ధిపురామధరణిపు రిపు, ద్విపకేసరి వేంకటాఖ్యవిభునిం గనియెన్. 67

వ. అందు. 68

చ. స్థిరయశుఁడున్ సువర్ణనగధీరుఁడు నౌరఘునాథరాజశే
ఖరుకరకాండకుండలితకార్ముకకుండలి చండిమోగ్ర ని
ర్భరరిపుమండలేశ్వరులప్రాణసమీరమె క్రోలు సంగరాం
తరమున జాతిధర్మమె కదా యది యంచు జగంబు లెంచఁగన్. 69

మ. కదనోగ్రారిచమూరజోవ్రజతమఃఖద్యోతకీటాయితా
రిదురంతాసిలతాస్ఫులింగుఁ డయి ధాత్రీరక్షణోదారసా
రదకూరంగదపాంగవీక్షణుఁడు శ్రీరంగక్షమాజాని స
ర్వదిశావారణకర్ణచామరితభాస్వత్కీర్తియై వర్తిలున్. 70

చ. సరసుఁడు శుద్ధసాత్త్వికుఁడు సత్యవచోనిపుణుండు ధర్మత
త్పరుఁడు సమిద్ధనంజయుఁడు బంధునిధానము మానకౌరవే
శ్వరుఁడు సమగ్రభోగజితవాసవుఁ డాశ్రితకల్పశాఖి యా
తిరుమలరాజురామజగతీపతిచంద్రుఁడు రాజమాత్రుఁడే. 71

చ. పరమదయాగుణంబు ప్రజపట్టును గుట్టును నోర్పు నేర్పు కా

తరశరణాగతోద్ధరణధైర్యము శౌర్యము నీతి యీతి త
స్కరపరిహారముఁ శుభవిచారము గల్గినధన్యుఁ డంచు మా
తిరుమలరాజువేంకటపతి స్తుతియింపఁ దగుం జగంబులన్. 72

వ. ఇట్టిపుత్త్రసంతానంబు గాంచి తిరుమలరాజు రాజిలుఁ దదవరజుండు. 73

మ. తనదుర్వారతరప్రతాపశిఖిచేతం బుట్టువీరాహితా
వనిరాట్పట్టణభస్మపాళి గొని తేవఁ వన్నె గావించు సా
ర నిజశ్రీకరకీర్తిదర్పణము శ్రీరంగక్షమానాథనం
దనరత్నం బగువేంకటాద్రి జయపద్మావర్శనార్థం బనన్. 74

క. ఆవేంకటాద్రివిభునకు, గ్రావాధిపధైర్యనిధికిఁ గలిగిరి రంగ
క్ష్మావరమణియును దురితత, మోవిభుఁ డగురామరాజు మొదలగుతనయుల్. 75

వ. అందు. 76

సీ. అరిపురంధ్రీమందహాసచంద్రిక కినచ్ఛాయ యెవ్వాని తేజఃప్రశస్తి
నవజయశ్రీనటీనటనలీలకు నీలమణియష్టి యెవ్వానిమహితహేతి
యహితవీరప్రతాపారుణాస్తమయసూచకతమం బెవ్వానిసైన్యరజము
దిగ్వధూకుంతలదేశంబులకు ముత్తియపుసేస లెవ్వానివిపులకీర్తు

తే. లతఁడు లోభినృపాలవేశ్యాభుజంగుఁ, డతులకారుణ్యరసపూరితాంతరంగుఁ
డంగనామోహనాంగుఁ డుదగ్రరుచిప, తంగుఁ డవ్వేంకటాద్రీంద్రురంగవిభుఁడు. 77

క. రంగావనీశ్వరుండు తు, రంగారోహణపటుత్వరవిసూనుఁడు సా
రంగాక్షీమదనుఁడు చతు, రంగాధికరాజ్యలక్షణాఢ్యుం డలరున్. 78

వ. ఏతాదృశతనూజరత్నంబులం గాంచి వేంకటాద్రిరాజన్యుండు మించునంత. 79

క. ఆరామరాజు తిరుమల, శౌరియు శ్రీవేంకటాద్రిజనపతి ముగురుఁ
గారాపుందోఁబుట్టువు, లైరాజిల సాధ్వి యోబమాంబ దనర్చున్. 80

మ. ప్రభురత్నం బగుతిమ్మభూవిభుతపఃప్రారబ్ధపుణ్యోదయం
బభిరామాకృతినొందె నొక్క యనఁగా నాయోబమాంబాననా
శుభగర్భాబ్ధి జనించి రానరసరాజుఁ జగ్గభూభర్తకౌ
స్తుభచింతామణులుంబలెఁ సహజతేజోదానధారేయులై. 81

చ. ఇరవుగ వేంకటాద్రిమనుజేంద్రుభుజంబులప్రాపుదాపునఁ
నరసవసుంధరావలయనాథుఁడు జగ్గనృపాలచంద్రుఁడుఁ
హరి కిరుఁగేలుదామరలయందును జక్రము పాంచజన్యముఁ
దొరయుంగలిం బ్రతాపపరదుర్జయకీర్తులు గాంచి రున్నతిన్. 82

వ. అం దనుజుం డగుజగ్గధాత్రీకళత్రుని చరిత్రం బెట్టి దనిన. 83

ఉ. గుబ్బలిఁ జేనిఁ దాలిమి నగు న్నిజభూరివిభూతిసంపదన్
గిబ్బవయాళిఁ జోదు నడఁకించు మురాంతకునంతవాఁడె పో
నిబ్బరపుంగృప న్స్మృతి ఫణిప్రభుఁ గెల్వఁగ నోపు బాపురే
గొబ్బురిజగ్గభూపతి యకుంఠపరాక్రమశక్రజుం డిలన్. 84

మ. నిజధాటీతురగీఖురాంకితము లై నిత్యంబు నెవ్వానిది
గ్విజయక్రీడభయద్రుతారుల కెఱింగించుం గులక్ష్మాధర
వ్రజముల్ సాక్షులువోలె నట్టిరణదుర్వారప్రతాపాధికుం
డు జగత్పూజ్యుఁడు జగ్గరాజు కృతపుణ్యుం డెన్న సామాన్యుఁడే. 85

ఉ. జగ్గనృపాలశేఖరుఁడు శాత్రవజైత్రచరిత్రుఁ డుల్లస
ద్వాగ్గరిమాభిభూతఫణివల్లభుఁ డాత్మపటుప్రభాజిత
ప్రాగ్గిరికూటభాగహిమభానుఁడు భూసురపోషణైకస
మ్యగ్గుణశాలి బంధుభరణాభరణుండు దగున్నుతింపఁగన్. 86

చ. సమరకిరీటి జగ్గనృపచంద్రుఁడు సాంద్రతరప్రభావమం
జిమఁ దగునోరుగంటినరసింగనృపాలవరేణ్యపుత్త్రి నో
బమను వరించి యందుఁ గులపావనులన్ గిరియప్పబాపభూ
రమణునిఁ గాంచెఁ బుత్త్రుల నిరంతరకీర్తిరమాకళత్త్రులన్. 87

చ. తరుణతనూవిలాససముదగ్రకళాపరిభూతశంబరా
సురహరుఁ డర్థిరక్షణయశోధనపుంగవుఁ డష్టదిగ్ధరా
వరపటలీభయంకరుఁ డవారితశౌర్యుఁడు ధైర్యశాలి గొ
బ్బురిగిరియప్పరాజతనిఁ బోల నృపాలురు గల్గనేర్తురే. 88

క. సరి యప్పతి గంభీరత, హరి యప్పతి యతులకరుణ నతిధృతి దివిష
ద్గిరి యప్పావని శూరత, గిరియప్పావనిపుఁ డలరుఁ గీర్తిస్ఫూర్తిన్. 89

క. ధర బాపిరాజు రిపుభీ, కరమూర్తి లసత్కృపాపగాభర్త కవీ
శ్వరదైన్యపాపసంహార, నిరుపమదాతృత్వశాలి నృపమాత్రుండే. 90

వ. అజ్జగ్గరాజాగ్రజుండును గృతినాయకుండును నోబమాంబాగర్భశుక్తిముక్తాఫలం
బును దిమ్మరాజతపఃఫలంబును నగుగొబ్బూరినారసింహరాజసింహుని ప్రభావం
బెట్టిదనిన. 91

మ. దయకుం గందువ దానకేలి కిర వంతశ్శుద్ధికిన్ జన్మభూ
మి యుదారత్వమురచ్చపట్టు జయలక్ష్మీలీలకుం బట్టుఁ గొ

మ్మయ విస్ఫూర్తికి నాస్పదం బఖిలవిద్యాతారతమ్యజ్ఞతా
శ్రయ మీఁగొబ్బురినారసింహమనుజేంద్రస్వామి సామాన్యుఁడే. 92

ఉ. కోనెటితిమ్మభూవిభునికూఁతురు రంగమఁ బుణ్య గొబ్బురీ
శ్రీనరసింహుఁ డాహరి సిరింబలెఁ బ్రేమ వరించి కాంచె స
త్సూనులఁ బెద్దతిమ్మవిభు శూరమణిం జినతిమ్మరాజు సం
ధానిధిఁ గృష్ణు ధీరు రఘునాథునిఁ బాపనృపాలు రంగపన్. 93

సీ. అప్రతీపప్రతాపాటోపనైపుణీ దినసాయకుఁడు పెద్దతిమ్మవిభుఁడు
వైరివీరవిహారదూరకృద్దుర్వార ధీరతాసిధి చిన్నతిమ్మఘనుఁడు
విష్ణుపాదాబ్జవర్థిష్ణుభక్తివ్యక్తి జిష్ణుసుమారుండు కృష్ణశౌరి
శరణాగతహితార్థభరణాదరణకరుణాసనాథుఁడు రఘునాథనృపుఁడు

తే. రూపనిర్జితరతిరాజు పాపరాజు, రత్నసానుస్థిరాకృతి రంగనృపతి
మనిరి గొబ్బూరినరసేంద్రు ననుఁగుఁదనయుం, లతిపవిత్రత ధరణి వేదాంతసరణి. 94

చ. పలుకు శిలాక్షరంబు నయపాలనరూపము లానిరూపముల్
నిలువు దయామయంబు మహనీయము లానడకల్ తలంపఁగాఁ
దలఁపు మురారినిర్మలపదప్రవణం బితరు ల్సమానులే
యలనరసక్షితీంద్రతనయాగ్రణికిన్ బెదతిమ్మశౌరికిన్? 95

ఉ. ఆపెదతిమ్మభూవరకులాగ్రణి కందనవోలిభర్త సం
తాపితశాత్రవుండు తనతమ్ముఁడు ధర్మయుతుండు కొండవీ
టీపురదుర్గరక్షణపటిష్ఠమతిం జినతిమ్మశౌరి యా
జ్ఞాపరిపాలనప్రథిమ సంధిల రాజ్యము చేయ రంజిలున్. 96

ఉ. మూపు వసుంధరాభరణముద్రకుఁ బ్రాపు సిరు ల్గడింపఁగా
నోపు మెఱుంగుఁజూపు వినయోదయమాధురి గుల్కుఁ బల్కు ల
క్ష్మీపరిణామవైఖరికి మేలగునవ్వుల మోసుహో! ధరి
త్రీపతు లెవ్వ రీడు జగతిం జినతిమ్మనృపాలశౌరికిన్? 97

సీ. ఘోటీపరంపరాధాటీపలాయితవైరివర్గమునకు వనద మగుచుఁ
గదనరంగంబున నెదిరించుపగతురసతులకన్నులకును జలద మగుచు
శరణాగతాహితధరణీతలాధీశవరులకు నిత్యజీవనద మగుచు
హతులకు ముక్తికన్యాదాన మిచ్చుచో నలరి ధారాధరం బగుచు మించు

తే. బహువిధఘనాకృతులు చూపి రహివహించు, శాత్రవలలాటపట్టికాంచత్కురంగ
నాభికలితాంఘ్రి నరసభూనాథుపట్టి, చిన్నతిమ్మనృపాలుకౌక్షేయకంబు. 98

సీ. చోటీతనుస్నిగ్ధపాటీరచర్చామచర్చికాహరణప్రశస్తి నలరి
కోసలీపేశలహాసలీలాసముల్లాసాపనయజయశ్లాఘ మెఱసి
యాంధ్రీవినీలసీరంధ్రీభవత్కేశపాశప్రసవకాంతిఁ బరిభవించి
చోళీపయోధరపాళీమనోహరహారప్రభాస్ఫూర్తి నపహరించి
తే. పరఁగెఁ జెలువొంది గొబ్బూరి నరసరాజ, కృతతపఃఫలరూపమై యతిశయిల్లు
కృష్ణపాదాబ్జభజనరోచిష్ణుమూర్తి, కృష్ణవిభుదోఃప్రతాపవర్ధిష్ణుకీర్తి. 99

ఉ. ఆదర మొప్ప నిత్యమహిమాఢ్యతఁ జక్రము వంపుచేయ స
త్త్వోదితహర్ష కేళివిజయోత్సుకబుద్ధిఁ జెలంగుచున్ బుధా
హ్లాదకరప్రసన్నహృదయాంబుజుఁడై పొగడొందు సంతత
శ్రీదళుకొత్తుగొబ్బురినృసింహుని కృష్ణుఁడు కృష్ణుఁడే కదా! 100

చ. నరసనృపాలచంద్రురఘునాథుఁడు తారఘునాథుఁడే యగున్
భరతశుభాగమోత్సుకత బంధురభూతనయాదరంబునం
దరు దొనరించునీలలలితాంగదశోభితబాహువిక్రమ
స్ఫురణను మిత్రవంశపరిపోషణశక్తిని సామ్య మొందుటన్. 101

ఉ. కోపము చూపినం బగఱకుం దల చూపఁగరాదు సుప్రసా
దోపగతిం గనుంగొనిన నొందు సిరు ల్శరణార్థికోటికిన్
గోపమునం బ్రసాదము నకుంఠితముల్ నృపు లీడువత్తురే
పాపనృపాలచంద్రునకుఁ బాపవిదూరునికిం గళాధృతిన్. 102

క. ఆపన్నగనాథుఁడు మతి, నాపన్నగణాదరమున హారికిం బ్రతియై
పాప న్నగపతిధృతి యా, పాపన్నగరిష్ఠకీర్తిఁ బ్రబలున్ జగతిన్. 103

ఉ. రంగనవద్యమై సుధ తెఱంగన శోభిలి విన్గొలంకుచే
రంగనదిందుదీప్తినెదురం గనకోదరుకంబుకంఠిదూ
ఱంగ ననంగుజాతిపగఱం గనలం గమికించి తీవి మీ
ఱంగ నటించుగొబ్బురిపురప్రభురంగనకీర్తి రంజిలున్. 104

క. ఇట్టికుమారులఁ గని చేపట్టె జయేందిర నృసింహపార్థివుఁ డాజి
న్నట్టించె వైరిశిరములు, ఘోట్టాణకఠోరఘోరఖురపుటపటలిన్. 105

మ. తన చేయించు ననంతయాగములచేతం దేవతల్ దృప్తులై
వనజాతాహితుత్రోవఁ బోవమిఁ గృశత్వం బేది యారాజు వ
ర్ధన మొందం గని దానవార్ధి యభివృద్ధం బై నిజాక్షీణదా
ననిధానాంబు నగున్ వితీర్ణిఁ దగు నెన్నన్నారసింహాధిపున్. 106

సీ. ఉప్పుతోఁ దొమ్మిదియును బెట్టి కృపణరక్షణము గావించు నేగుణసముద్రుఁ
డడుగుమాత్రనె పెక్కువడుగుల కిచ్చికీర్తనఁ బొందు నేపుణ్యజననిభుండు
నెలకట్టడలు చేసి నిఖిలబుధత్రాణ మొనరించు నేపురుషోత్తముండు
వర్షాశనంబు లవ్వారిగా నొసఁగు యోగ్యద్విజశ్రేణి కేఘనుఁడు కరుణ
తే. నరుణకిరణప్రతాపుఁ డేధరణివిభుఁడు, సనయవినయప్రభావుఁ డేయనఘమూర్తి
యతఁడు గొబ్బూరితిమ్మరాజాగ్రసుతుఁడు, సరసగుణహారి గొబ్బూరినరసశౌరి. 107

సీ. మరలఁ దేసీ వజ్రమాతంగహయములఁ గలయనీ పదిమాఱుకళలకొడుకు
నూర్మికాచకచక్రద్యుతుల మిన్నందనీ చెలఁగనీ గంగతో గలసిమెలసి
సవ ధరింపంగనీ శంఖసంఘంబుల ముఱియనీ మౌక్తికంబులు ధరించి
మగుడంగ నీననీ తేగుదారి మ్రాఁకుల బ్రబలనీ వెన్నునిపాన్పు చెలిమిఁ
తే. బ్రతిఘటింపంగఁజాలునే పాలకడలి, శూరమణి యైనగొబ్బూరిసారసింహ
రాజసింహభుజాబలప్రభవ మైన, గీర్తిరోచిఃప్రవాహవిస్ఫూర్తితోడ. 108

ఉ. సంగరభూమి శత్రునృపసంఘము గెల్చి ధృతిం దదీయస
ప్తాంగములన్ హరించి సరసాగ్రణి యై నరసక్ష్మాధిపుం
డంగమనోజ్ఞకుంతలసమంచితమంజులలాటభూమియో
షం గదియించెఁ దా భుజభుజంగనిరంతరభోగకేళికిన్. 109

సీ. ఒకనిపైనొక్కఁ డోర్వక చాడి చెప్పిన మనవిగాఁ దలపోసి మనుపనేర్చు
నన్యనిందాధృతి యాత్మగుణస్తుతి కలనైనఁ గలుగుట కానివాని
పలికినచో బొంకు పగతురయెడఁ గొంకు మఱచియుఁ దనయందుఁ బొరయనీయఁ
డనుచితోక్తియు నితరాంగనాసక్తియు నాచరింపఁడు నవ్వులాటకైనఁ
తే. బుత్రకులఁ గాంచె నిధులుంచె బుధులయిండ్లు, నిలిపె నల్లిండ్లు దేవళంబులు నమర్చెఁ
గావ్యపతియయ్యె వనతటాకము లొనర్చె, నెవరొ గొబ్బూరిసారసింహునకు నృపులు

ఉ. శ్రీమణీయగొబ్బురినృసింహునిశత్రులశోణితంబుఁ ద
ద్భూరినిరూఢదానజలముల్ దదరిప్రమదాంజనాశ్రులున్
నీరధిసంగసౌఖ్యమున నిచ్చలు వర్తిలు శోణజహ్నుక
న్యారవిజానదీమిషమునం జని యౌర! విచిత్ర మెయ్యెడన్. 111

క. పోరను గొబ్బురినరసని, ధారాక్రూర మగు నేకతరవారి యరి
స్త్రీరాజీనేత్రములసును, ధారాక్రియ నిడు ననేకతరవారి యహో! 112

మ. హరికిం బ్రీతి ఘటిల్ల గొబ్బురినృసింహక్ష్మాతలాధీశుఁ డా
దర మొప్పం దనచేయుఁ సంతతమహోదాసాంబుధారల్ నిరం

తరవృత్తిం బ్రవహించి పెన్నదులచందం బొంది వర్తిల్లఁ గూ
ర్చి రసజ్ఞస్థితి నిచ్చుఁ బెండ్లికొడుకుం జేయుంగదా వారిధిన్. 113

పంచచామరము.—

హరిన్ హరిత్తురంగునిన్ దయామహాస్సమృద్ధిఁ గే
సరిన్ సరిత్కళత్రు శౌర్యచారిమన్ గభీరిమన్
మరున్ మరుద్గురుం దనూరమ న్మతిం జయించి గొ
బ్బురిపురీనృసింహశౌరి పొల్చు శౌర్యహారి యై. 114

## షష్ఠ్యంతములు.

క. ఏతాదృశగుణమణికిన్, శాతాసినివారితారిజనపరఘృణికిన్
సీతాపతిసేవాకృతి, శాతతనయవినయశుభగుణాలంకృతికిన్. 115

క. లాటీకుచహారత్క, ర్ణాటీవక్షోజచంద్రనత్కరహాటీ
చోటీకబరీభరపరి, పాటీసుమదసమకీర్తిపరిణాహునకున్. 116

క. ఓబాంబాపుత్త్రునకు భు,జాబలవిధ్వస్తసకలశత్రునకు న్నా
నాబంధుసింధుశరధికి, నాబుధగురుభాస్కరాయురయజయనిధికిన్. 117



# ప్రథమాశ్వాసము.



## కథాప్రారంభము.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన రామాభ్యుదయప్రబంధంబు
నకుఁ గథాక్రమం బెట్టిదనిన. 118

### అయోధ్యాపురవర్ణనము.

క. మనుకులమురాచవారల, మనుకుల కిరవగుచుఁ గలిమిమగువకు నెలవై
తనరు నయోధ్యానగరము, తనరుచిరశ్రీ రసజ్ఞతతి నుతియింపన్. 119

క. ఘనజాలంబును మించిన, ఘనసాలము మణులఘృణులు కమలాప్తునకున్
దినమును నప్పురి మధ్యం, దినమునఁ బరివేషలక్ష్మిఁ దిరముగఁ జేయున్. 120

క. పురిపరిఘాసాలము లం, బురుహభవాండము గడిచి పోవఁగఁ జాలున్
దెరువునఁ బామద్దంబును, నొరయిక గా నెదురుచుక్కయును గాకున్నన్. 121

సీ. ఖరకరహరిఖురాగతసింధుపంకంబు గంగాతరంగశీకరము లుడుపఁ
గరికర్ణపుటమరుద్గతి వీఁక విసువాఁక పూవుపుప్పొడిధూళిఁ బోవఁ ద్రోయ
దగ్గఱి పెంపెక్కునగ్గలపుంజాళ్కనిగ్గులు ముత్యాలముగ్గు గాఁగ
వాలుగాఁ గైవ్రాలువేలుపుపూఁబంతిచాలు మేలైనవాసనలు గుప్ప
తే. నెపుడుఁజేయనిశృంగార మెనయుచుండఁ, గోమరు మీఱినరత్నశృంగములయొప్పు
నెట్టుకొని మించుజాళువాగట్టుతోడి, జోడుకోడియ లవ్వీటిమేడగములు. 122

ఉ. సోరనగండ్లకన్నములు సొచ్చి లతాంగులకన్నుఁ బ్రామి బం
గారమువంటియంగలతికాతతికాంతులు దొంగిలించె నాఁ
గారుమెఱుంగురంగు లెసఁగన్ దమిఁ జోరులతీరునం జనున్
వారిదముల్ నిశోగ్రతరవారి నెదిర్చినవారి నొందుచున్. 123

సీ. నెలతాలిచాలునిగ్గులలోని మిన్నేటి రాయంచగముల నార్భటులవలన
హీరకాంతులలోని యింద్రకరీంద్రంబుఁ బ్రకటదానాంబుసౌరభమువలనఁ
బచ్చనిడాలులోపలిప్రొద్దుబాబాల రత్నకింకిణులయారవమువలన
ముత్యాలముగ్గులో మొనయుసప్తర్షులఁ దమయంగసంగసౌఖ్యములవలన

తే. సమరులాధోరణుఁడు సూతుఁ డల్లతపసి, యింతులను నేర్పుమై నేర్పరింతురన్న
నన్నగరి నున్న మేడలయున్నతత్వ, మచట మణులున్నతత్త్వంబు నడుగనేల? 124

క. పురిసౌధరాజు లొఱయక, శరదంబు లమిత్రవృత్తి సంధిలఁ దటిదు
త్కరకోపాగ్నికణంబులఁ, బురికొని గర్జిల్లుఁ జాపములు గైకొనుచున్. 125

మ. అనిశంబుం బురిహాలికుల్ పయిరు సేయం గొండ్ర వేల్పంచునూ
తనధాన్యంబులు రాశి కెక్క తనుఁ జెందం గందబ్బృందంబు దా
రొక్కని యూరియొప్పులకుప్పలం గని చెలంగు న్నింగి ముట్టన్ ఘనుల్
మును దార్ వెంచినవారివంగడముపై మోహంబు వాటింపరే? 126

క. చెఱకొకటి గలుగఁ గా మరు, చెఱకుల్ లోనైతి మనుచుఁ జెఱకులగమి నే
తఱిఁ గన గానుఁగులాడుదు, రెఱఁగి ప్రజల్ సుగుణు లన్నరేంద్రు నివీటన్. 127

మ. పొలుపొందం బురి సింహమధ్యలు ధనుర్భ్రూవిభ్రమల్ మీననే
త్రలు కుంభస్తనపాళికల్ మకరచిత్రశ్రీలసద్గండభా
గలు నైమించినవారకన్యలు త్రిలోకఖ్యాతసౌభాగ్యరా
సులు దారై యతులాకృతిన్మెఱయుటల్ చోద్యంబుగాదే మహిన్? 128

క. లతకూనలకౌనులసం, గతి గైకొని రోమరాజి ఖడ్గలతల్ పాం
థతతి గెలువ మీనాంకుని, కత యప్పురి నప్రయోజకతఁ జూపట్టెన్. 129

మ. ప్రకటేందిందిరవేణి వెన్నుబలమై భాసిల్లుభ్రూవల్లిడివా
లికచూపుల్ విరిదూపులై బొమలు కేళీశార్ఙ్గరీతిన్ దగన్
మకరాంకస్థితిఁ జెక్కుటద్దముల విన్నాణంబుగాఁ జూపి పాం
థులస్వాంతముఁ గుందఁ జేయుదురు కాంతల్ వీట నశ్రాంతమున్. 130

మ. అల తారాపతి తారకాసతుల నిత్యం బందఱం బొందులన్
గలయం గానమిఁ గుంది కుంది బహుళాకారంబుల న్వారి ని
చ్చలు నవ్వారిఁ గూడె నాఁగ నవనాసామౌక్తికాసక్తిచే
నలువొప్పున్ బురి రమ్యహర్మ్యవిహరన్నారీముఖాంభోజముల్. 131

క. నెలతాలయిండ్లఁ బురి వె, న్నెలరేలం గరఁగి తొరఁగు నీరలవంబుల్
చలదేతత్కేతుపటాం, చలచాలిత మైన చుక్కచా లనఁ జాలున్. 132

క. కరికలభంబులు నిర్ఝర, సరిదంబులు పీల్చి చిమ్మి శ్రమ మఱఁ జేయం
గ రథంబు నిలిపి యప్పురి, తెరువున నడిప్రొద్దు ప్రొద్దు తిరమై నిలుచున్. 133

క. పరిఘాతరంగడోలలఁ, బరఁగఁగ సమకట్టుపట్టుపగ్గము లన న
ప్పురవరణమణికిరణో, త్కరములు ఫణిరాజకన్యకల నలరించున్. 134

చ. మెలఁతలు మిన్నుఁ దన్ను తెలిమేడలఁ గ్రీడలు సల్పుచుండి క్రొ
న్నెల విలుగా నమర్చి హరినీలపుఁ బేరున నారి గూర్చి రం
జిలుచెవినల్లగల్వవిరి చేకొని తూపుఁగ దార్చి కూర్చు నె
చ్చెలులకుఁ గంతుపువ్వవిలుచెల్వముఁ దెల్పుదు రప్పురంబునన్. 135

మ. జిలుఁగుంజీఁకటి నీలకుట్టిమరుచిశ్రీ దొట్టి కట్టింప జా
రలతాంగు ల్కుహూసారతిం బతుల నిద్ర ల్పుచ్చి ప్రాపింతు రా
వలరాజాత్మసహాయుఁడున్ జరణము ల్వాల్గన్నులున్ రాగ ము
జ్జ్వలదీపంబును రేయి నెచ్చెలియుఁగా సంకేతభూభాగముల్. 136

చ. అలహరియానసాంబుజమునందు జనించుటఁ జేసి మేము ము
ఖ్యులము తదీయనాభికమలోద్భవుఁ డావిధి మాకు నెవ్విధిన్
దెలిసిన నీడుగాఁ గలఁడె దిగ్గుడుమా కని గ్రేణి నేయుచుం
బొలుతురు విప్రపుంగవులు ప్రోలున వేదరహస్యవేదులై. 137

క. అనయము నిజప్రచారం, బనయము గాకుండ నచట నతిశౌర్యమునన్
మనసరియే కేసరి యని, మనసరి రాకొమరుమూఁక మను మనురీతిన్. 138

సీ. అరయ రాజానుగ్రహము గల్గుఁ గాకేమి కలువలదళముల గెలువనోపు
మిత్రబలంబునమ్మిక గల్గుఁ గాకేమి తమ్మితావు లెదిర్చి క్రమ్మనోపు
ఘనపరిగ్రహసమగ్రత గల్గుఁ గాకేమి యలకలాపికలావు లడఁపనోపుఁ
దనవారిప్రాపు దాపును గల్గుఁ గాకేమి యంచలగతి మాన్చి మించనోపు
తే. నక్షముఖగంధకచబంధయానవిభవ, గరిమలౌరౌర! యని విటాగ్రణులు సారెఁ
బొగడఁ బొగడొందు నెందు నప్పురమునందు, నంగజానిదండు నా వెలయాండ్రపిండు.

క. అన్నగరి న్వెలనవలా, చన్నుఁగవల్ సదృశవస్తుసంఘము లిలలో
నెన్ని కల వెన్ని చూడఁగ, నన్నిటికిని మేలిబంతులై చూపట్టున్. 140

చ. ధను లగుకోడెకాండ్రకును దంగెటిజున్నులు కోరి నిండుజ
వ్వనమునఁ జేరు పేదతెరువర్లకు నందనిమ్రానిపండ్లు డా
సినగతి దక్కి యేరికిని జిక్కనిచక్కనిమాయలేళ్లు మో
హనమధురాధరస్తనదృగంచలభాసిను లవ్విలాసినుల్. 141

క. దళపత్రంబులు గలవని, యలరుచుఁ దమకన్నఁ బెద్ద లాయన్నులక
న్నులనళ పగలూనెం ద, మ్ములయో! కడపటఁ బ్రదోషములఁ గుందవొకో?

ఆ. విరహిణీజనంబు వీఁడె పో నొప్పించు, వసులమూట యిట్టివానిఁ బట్టి
పగలు తీర్తమంచుఁ దొగఱేనిఁ బొంతురు, నగరసౌధశృంగనలినముఖులు. 143

తే. సారదాకృతిఁ గుంభజచారిమంబు, నాశుక ప్రౌఢిమముఁ దాల్చి యతిశయిల్లి
యతులగతిఁ బోల్చు నవ్వరి నబ్జముఖుల, కచకుచాభోగములు సూక్తికలకలములు.
తే. తఱి యెఱిఁగి యన్యవాహినీతతులఁ గ్రమ్మి, దేవమణిజన్మభూములై తేజరిల్లి
భువనవిదితఘనావర్తములఁ దనర్చి, సైంధవాకృతిఁ దెల్పు నా సైంధవములు. 145
క. ఆకర్షింతురు నారుల, నాకుంచితధర్ము లగుచు నసమశరశ్రీ
డాకాశలం బెలర్పఁగఁ, బ్రాకటముగ వీటిమేటిభటులుఁ విటులున్. 146

పుష్పలావికాదివర్ణనము.

సీ. బాల! నీ మోమున వ్రేలక యున్నె యీ పద్మముల్ దునిమిన పాతకంబు?
కలకంఠి! నీకన్నుఁగవ గప్పకున్నె యీ కువలయసంతతి కోయుంనఘము?
కొమ్మ! నీమెడఁ జుట్టుకొనకున్నె యీపోక పూఁబోత్తి చిదిమినభూరికలుష
మెలనాగ నీపదంబులఁ బెన్గకున్నె యీ పల్లవంబులు గిల్లుపాప మొకట
తే. నని విటాలి నిజాంగమోహానతలెంచి,మరులుకొని త్రస్తరులు పల్కు విరులుకొనఁగ
మొలకనవ్వులతళుకులు దొలకఁ గలిగి, పుష్పలావిక లప్పరిఁ బొల్తు రెపుడు. 147
సీ. గోప్యంబుగా నేను గోరంట వలె నన్న జాతులే పచరింపఁ జనునె నాతి?
మరువమ్ము నొందించుమా నన్నుఁ జేపట్టి వట్టివే రేటికి వనరుహాక్షి?
పొగడ వలతు నన్నుఁ బోరచి నేయకే కుముదంబు చూపి యోకోమలాంగి!
దండఁ గోరితి నింతె దయనేయం మిప్పుడీనన వద్దు నాకుఁ గన్యాలలామ!
తే. యనుచు నీగతి నర్మోక్తు లాడ వినుచు, హావభావవిలాసంబు లలరఁ గనుచు
నాత్మవిటకోటిఁ దేలింప నగుచు నగుచు, నలరులమ్ముదు రవ్వీట నలరుఁబోండ్లు.
ఉ. ఈయెలదోఁటకెంజిగురు లీయెలయింపులచిల్కుబోద లీ
కోయిలపిండు లీతళుకుఁగ్రొవ్విరు లీయెలదేఁటినూఁక ము
న్నాయిగురుంగటారిదొర కబ్బినఁ దాఁ గను విచ్చి చూడఁగా
నాయళి కాఘ్రుఁ డోపఁగలఁడా? యనఁగాఁ దగి యొప్పు నప్పురిన్. 149
సీ. సరసులా యివి కవి జాలంబుఁ బోషించు సరసులు గాక యో సరసిజాక్షి?
మల్లులా యివి చైత్రమహీభర్త యేలిన మల్లులు గాక యో మందగమన?
చిగురులా యివి వనశ్రీహస్తమణిమరీచిగురులు గాక యో యిగురుఁబోఁడి?
మంజరులా యివి మధుపగీతము లైన మంజరుల్ గాక యో మంజులాంగి?
తే. యనుచుఁ గుచములు లికుచములనుజయింపఁ,గచములోడింప నలిశాబకచయములను
లతలఁ దనుకోమలతలు గెల్వఁగ వినోదవనుల మింతురు వీటిజవ్వనులు మెఱసి.150
చ. వలపులవింటివానిదళవాయి వసంతునిజోడుకోడె పా

టులఁ బడకుండఁ గుండలికుటుంబము శాఁకలిఁ దీర్చు చందనా
చలగృహమేధి యొప్పు వడ చల్లనిచల్లనిగాడ్పు పీటఁ జె
ల్వలరతితాంత కాంతులయలంతలు మానుచుఁ బ్రాణబంధుఁ డై. 151

చ. రుచిరవిలాసహాలికసరోజముఖీపరిపాలితంబులై
ప్రచురతరప్రసూనరసపాండురసాలరసాపగాఝర
ప్రచయములన్మనోరథము పండఁగఁ బండినపుష్పమంజరుల్
రుచి దళుకొత్త ముత్తెపుసరుల్గనుపట్టు విచిత్రవైఖరిన్. 152

వ. మఱియు నప్పురంబు కప్పురంబులప్పు లుప్పతిలు తెలియిసుకతిప్పలును నిస్తంద్రచంద్రకాంతకృతసౌధసోపానమార్గచ్ఛవిచ్ఛటలు తరంగమాలికాచకచకలును వివిధవిహరణోద్భటవీరభటహస్తవిన్యస్తఖేటకఖడ్గసందోహంబులు జరఠకమఠపాఠీనగ్రాహంబులునై విజయలక్ష్మీజన్మవాసంబును విస్ఫురద్వాహినీవిలాసంబును నగుచు సముద్రంబు ననుకరించియసమవసుధాసుధాశనానవరతాచరితాధ్వరహవిర్భుగావిర్భవద్ధూమసముదయంబు ఘనాఘనోదయంబును దివ్యదేవాలయవిచిత్రవాదిత్రోర్జితారవంబులు గర్జితారవంబులును విపణివిరచితాబ్జరాగమణిగణంబు లింద్రగోపకలాపంబులును విహరమాణహరిణలోచనాకటాక్షవీక్షావిలాసంబులు తళుకారుతొలుకాఱుమెఱుపుల రొుఱపులును నగుచు నచ్చో నృపకుమారకదానధారావృష్టికి ననుగుణంబగుటకుంబరె రంజిల్లునత్తెఱంగునుం గాక కోకబంధుసైంధవంబులులాయంబులకుం బాసిన వనియంను వన్నుఁ డెక్కు టెక్కుపక్కెరయొక్కరింత పెద్దవయ సనియంను హేషామిషంబునం గ్రేణించు వదననిర్యదచ్ఛఫేనచ్ఛలంబున నెలవిఁబాఱ నవ్వి నటియించు శత్రుజిత్వరాపరాభూతమాతరిశ్వంబులగునశ్వంబులవలనను గ్రీడాలంపటత్వంబునని తాంతదీర్ఘశుండాదండంబులు సాఁచి సాఁచి తుహినరోచికి ననేకరాహుశంకాతంకంబు నంకురింపం జేయుచున్న యుద్దండవేదండంబులవలనను బంధురగంధసింధురగండమండలీనిరర్గళగళద్దానధారాబహుపరిచయంబున నరుచి వొడమి వింతవింతవలపు గొలుపు పొలుపు గలకళావతీవిమలవదనకమలంబులఁ జేరం జని తదీయనాసాచంపకప్రసూనవాసనానిలంబు లొయ్యనం బొరయ వెఱచి యసమకుసుమరసవిసరంబులు వెస మెసవి విసవిస నగుచుఁ బ్రసవసాయకధనుష్టంకారశంకాకారిసాహంకారఝంకారంబులఁ బాంథహృదయంబులవియించి మించుదర్పాంధపుష్పంధయంబులకుభవనంబులగునుపవనంబులవలనను వరణశిఖరసరణిపరిణద్ధనానామణికిరణజాలంబులుశక్రధనువనియం గోపురాగ్రసముదగ్రరుచిజాగ్రన్నీలమణిఘృణిప్రచారంబు కాలమేఘమాలికావిభవం బనియుఁ బ్రమోదస్ఫూర్తి నర్తించు క్రీడామయూరంబులవిహారంబులం

ప్రకాశించుచుట్టిమప్రదేశంబుల వలనను నితాంతసురతాంతతాంతకృతాంతశుద్ధాంత
కాంతాకాంతస్తనాంతస్వేదసలిలార్ద్రీమృగమదామోదసారంబులు చూఱఁగొని పటీర
కోటరకుటీరతటీరమ్యభోగినీనివితానానుభూతంబు లగుచు నారామతరులతాలతాంగు
లకు నట్టువునిచందంబున నర్తనంబులు గఱపుచు సజ్జనువిధంబున సుమనస్సంగంబునం
బరాగంబులు సహించి యుల్లసిల్లి యెల్లతావులం దావులు వెదచల్లుశీతవాతపోతం
బులవలనను మిగిలి యనవరతబుధప్రకాశం బయ్యును సుభిక్షాకారణం బయి
సంపూర్ణరాజమండలం బయ్యును బ్రకటపద్మాకరం బయి సౌభాగ్యంబులకు యో
గ్యధామంబును సౌఖ్యంబులకు ముఖ్యస్థలంబును సకలవిద్యావిలాసంబులకు జన్మా
వాసంబును బుణ్యంబులకు శరణ్యంబును బుధులకు నవనిధులదాఁపురంబును విపుల
విజయలక్ష్మికిఁ గాఁపురంబును నుదగ్రగోపురశ్రీచుంబితగోపురంబును ధరాపురంధ్రీ
రత్ననూపురంబును నగునాపురంబున కధీశ్వరుండు. 153

## అయోధ్యాధిపదశరథవర్ణనము.

సీ. తనయాజ్ఞ యాదిత్యతనయాగమారూఢి ఖలశిక్ష సుజనరక్షయు నొనర్పఁ
దనవాసి నిజనిశాతనవాసిఁ గని గాసి విపులదైన్యముఁ బొందు రిపుల మనుపఁ
దనమతి ధర్మచింతన మతిస్థైర్యచాతుర్యధుర్యతకల్మి దూఁకొనంగఁ
దనభోగగతి పురాతనభోగధరతల్పకల్పితానల్పసౌఖ్యములఁ బ్రబల

తే. నీతి పారగ భూతినిరీతి రీతి, నేకహేళిని సామ్రాజ్య మేలు మేలు
పంక్తిరథుఁ డాత్మధాటికాపటుతురంగ, పటలఖురటంకదళితారిపంక్తిరథుఁడు. 154

మ. సుకృతుల్ దుష్టియు మంత్రపాలవిజయాశోకుల్ జయంతార్థసా
ధకసిద్ధార్థసుమంత్రు లాత్మసచివాధ్యక్షుల్ నిజాంగంబుఁ బా
యక కొల్వం దగి యష్టమూర్తియుతుఁ డౌనాశంభుఁడో నాఁగ న
వ్యకళాధుర్యుఁడు మించుఁ బంక్తిరథుఁడైశ్వర్యం బవార్యంబుగన్. 155

క. ఆలోకనిరస్తతమో, జాలుఁడు వసునందితార్యచక్రుఁడు నైభూ
పాలుఁడు ద్వాదశమండల, పాలనమున నాత్మవంశపతిగతి నమరెన్. 156

తే. అలదశస్యందనుఁడు త్రిశక్తులను బోలెఁ, బరమసౌశీల్యఁ గౌసల్య భవ్యచరితఁ
గైకయీదేవి యువతిలోకైకమాన్యఁ, గులపవిత్ర సుమిత్రఁ జేకొనియెఁ బ్రేమ. 157

క. తరుణుల నకృత్రిమోక్తి, స్వరసరసపదక్రమప్రసన్నత గలము
వ్వురఁ గూడి త్రయీయుంతటం, ధురధర్మములీల దశరథుఁడు రంజిల్లెన్. 158

క. దిక్చయజయశీలుండై, స్వచ్ఛందనభోగయుంతనిజశ్రీసుఖన
మ్యక్చర్య నిట్టు లాభూ, భుక్చంద్రుఁడు ప్రాజ్యరాజ్యమునఁ బొల్చెతఱిన్. 159

వ. అంత. 160

## వసంతర్తువర్ణనము.

మ. జనితాశేషవియోగినీనిచయనిశ్వాసంబు సంసూచితా
వనిజోదగ్రవిలాసమత్తమధుపవ్రాతక్షుధాయాస మా
ర్తినితాంతాకులకీరకోకిలకులార్థిస్తోమసుగ్రాస మిం
పొనరించె న్మధుమాస మష్టకకుబంతోల్లాస మై యయ్యెడన్. 161

తే. కాలకంఠసమిద్ధసఖ్యంబు మెఱయ, నతులతరవైఖరి సువర్ణగతులు దొరయ
నలశుకాదుల కక్షయఫలదుఁ డగుచుఁ, జేరె మాధవుఁ డుపవనశ్రీ దలిర్ప. 162

తే. మాధవవరప్రసాదసామగ్రి వలన, యామ్యదిక్కాంత నికటవశాగజీర్ణ
పర్ణచిత్రపరిష్కారపటలిసడలి, యనిలడింభకగర్భిణి యగుట దెలిపె. 163

సీ. దక్షిణాశావధూతనయుఁడై వనలక్ష్మి పెంపునఁ బొదరిండ్లఁ బెరిగి పెరిగి
తేఁటిబోటులజోలపాటలఁ బాటిల్లి తీఁగెయుయ్యాలలఁ దూఁగి తూఁగి
కమలాకరంబులకమ్మపూఁదేనియ యానుచుఁ జల్లుపోరాడి యాడి
కమలధూళీపాళికాకేళికలఁ బొల్చి మందమందవిహార మొంది యొంది

తే. యాగమస్థితి యెఱిఁగి బాల్యంబు తఱిని, మల్లులఁ బెనంగి పాంథులచర్మ మెఱిఁగి
సాము చేయుచు మాధవస్వామియాజ్ఞఁ, గంతుజోడై మెలంగు లేఁగాడ్పుఁగుఱ్ఱ.

క. బలుమంచుమించుదొర వో, నలయరుణాంశువులు పర్వ నాకృతితోఁ బెన్
జలితతఱిచనుతఱిఁ దరువులఁ, దలిరులజొంపములకెంపు దగదగ లెసఁగన్. 165

చ. అలరె వనీవధూటి మధుఁ డన్ పతిఁ జేరి తుషారబాష్పధా
ర లుడిపి పద్మరాగహరిరత్నవిభూషణముల్ ధరించు బా
గొలయఁగఁ బల్లవాళికులయోగమునం గడు నుల్లసిల్లును
త్కలికల మించె హర్షపులకంబులు దాల్చినభాతి సంతటన్. 166

క. పసగలరాగాంకురములు, పసిగొన మాధవగృహీతసాధ్వీవనశ్రీ
యసమాశుగశిశుగర్భిణి, ప్రసవావసరంబు గానఁబడఁగా నమరెన్. 167

సీ. భూరికాంతారకేదారముల్ సమకట్టి కోడెగాడ్పులజంట గూడఁ గట్టి
వెలుచఁ గాఁ దాఁకబెల్లులు వెల్లగిల దున్ని తలిరాకుడాలునీ రలవరించి
కలికాంకురంబులమొలకదారులు నాటి వెలిగ జాదులసొంపుకలుపు తిగిచి
కాపుగాఁ సుకుమారకలకంఠి నియమించి యాయాతరులఁ బ్రోది సేయ నేర్చి

తే. నమ్మిక వసంతుఁ డను పేరికమ్మతీఁడు, నెఱసు నెల్లెడ వలరాజుకఱవు దీఱ
నౌర! యామని వచ్చె నాహా! యటంచు, జగముతనియఁగఁబువ్వుమంజరులుపండె.

తే. అలవసంతధరాకాంతు డరుగుదేర, రాచిలుకచాలుపచ్చతోరణము లమర
సాంద్రగతిఁ గట్టుమేల్కట్టుచంద్రకాని, యంశుకంబులునాఁబూచెఁ గింశుకములు.
క. తలఁప సుదాహరణాకృతిఁ, గళికల రంజిల్లి సరసకవికావ్యముచుం
బలె నెడల మత్తకోకిల, కలన న్మధువేళ వనని కాయం బలరెన్. 170
క. తరుణీమానమదాంధ, ద్విరదమణీఘృణులు విరహిదేహాస్రవహా
స్మరదైత్యదంష్ట్రలోయన, నరుణాంశుకకింశుకంబు లామని నమరెన్. 171
ఉ. అక్రమ మొప్పఁజైత్రుఁడు మదాళిమదావళిపంక్తి మీఱ హే
తక్రియ నూత్నపల్లవతతిన్ ధరియించి యుదగ్రవైఖరిన్
విక్రమశాలులైనతరువీరులపాళులు దీర్చి పాంథజై
త్రక్రమయాత్ర పూనె వలరాయనికిం దళవాయిచందమై. 172
సీ. కేళికామణిసౌధజాలయాతాయాత వాతపోతములుమై వ్రాలఁ గోరి
యలరారు నెలతాలనెలవుల నెత్తావి సావిపూఁబాన్పులచక్కిఁజేరి
రణితముహుర్ముహుర్మణితసంగతబంధ సాతత్యవైయాత్యసరణి మీఱి
తలిరాకుఁగొఱుకుపుల్గులకీవి కెమ్మోవి పలు సోఁకు గొలుకుఁ బలుకులను దేఱి
తే. ప్రమదజలరాశిఁ దేలి పుంభావకేళి
మగల డాసి కళామర్మ మగలఁ జేసి
రాహిమాత్యయమందుఁ జోద్యంబు గాఁగఁ
బ్రియలు బహుకంపపులకసీత్క్రియలఁ దగిలి. 173

దశరథుఁడు భార్యలతో వనవిహారము సల్పుట.

వ. ఇట్టి యఖిలాశాదేశ ప్రకాశకరవాసనావిలాసమయం బగువసంతసమయంబునం బ్రచురరుచిరరేఖా కళావిదగ్ధముగ్ధమోహనాళీసహస్ర సహితజాయాత్రయసమన్వితంబుగా దశరథావనీపతిలకంబు నీపతిలకాశోకామ్రసరళామ్రాతకవకుళవంజుల ఖర్జూరభూర్జముఖనిఖిలోర్వ రాజరాజరాజివిరాజితంబును బింజరీభూతమంజరీపుంజ గుంజాకుంజగుంజదళినీ సంజాతమంజులానూన గానమాధురీసుధారంజితాశాంగనాజనంబును నిజసరోవరారవిందకందళస్యందిమకరందధారా సందోహసంవర్ధితా పారకేదారంబును నభ్రంలిహాదభ్రతరసాలబాలరసాల శాఖిశాఖోపరిపరిభ్రమ ద్భ్రమరజాలనవాభ్రవిభ్రమాయత్తసమ్మదోదాత్తచిత్తమయూర శాబన్నృత్తంబును సరసకిసలయచయఫలాది కాస్వాదికమ్రకలకంఠకీరశారీసుధామాధురీవికస్వరస్వరాలాపలీలాకోలాహలాకులంబును నగుచుం బ్రత్యక్షసురభిప్రభావంబుకలిమి నానాగమాధూఢద్విజవ్రజంబులకు నభీష్టఫలాహారంబులం దుష్టి గావింపుచు నిలింపతరువితా

నంబు నిజావనీజసంతానంబు గావున సంతానంబు లయ్యెనని శకుంతరవకైతవంబున గ్రేణింపుచుఁ బ్రశస్తవస్తునిరస్తచైత్రరథంబును నామోదరసమోదితాఖిలజనమనోరథంబును నయి దర్పాంధపాంథజిగీషాధురీణమన్మథరథంబులచందంబున విక్రమంబులతీవులు గలమావులును బ్రకటబాణాసనశిలీముఖంబులును మొదలుగు తదనుగుణపరికరంబులం బొదలుచుఁ గోటులసంఖ్య లగు తేటితెరువరులతృష్ణ వాపం బానీయశాలిక లగునక్షుద్రరసలసద్ద్రాక్షాఫలగుళుచ్ఛమాలికలం బ్రబలి సంతతాధిష్ఠితమలయపవనం బగునుపవనంబు చొచ్చి నెచ్చెలులకు విచ్చలవిడిఁ బుష్పాపచయవినోదంబు ప్రోదినొందింపుచుఁ దత్తద్విశేషంబు లాత్మయోషామణులకుం దెలుపుచు విహారింపందొడంగె నవ్విధంబున. 174

క. ప్రియ యిందు ధూమగతిఁ జెం,దు యథావిధిఁ దేంట్లు యత్ర ధూమస్తత్రా
గ్నియన న్వినుటకు నిచ్చో, నె యుగంబుల ననలరుచులు నిగిడెం గంటే! 175

క. ఇనుఁడు ప్రతిబింబమిషమున, వనితా! తనుఁ గోలఁకు మేడవాడం గూడన్
వనజిని యామోదస్థితి, ననుదినమును నలరుఁ జూడ నది సరవి గదా! 176

క. ఈచంచరీక మిందుము,ఖీ! చూచితె తమ్మికంటికిని జెప్పవలెన్
గాచుకొని యున్నయది లీ, లాచలనీలగరుదంచలక్షేపమునన్. 177

తే. హరిణచరణావాతిస్రవదరుణకిరణ, లవము లభ్రంకషామ్రపల్లవమునందు
జాఱిపడి వచ్చి చంపకచ్ఛటల నీల్లు, నళుల జీవింపఁ జేయు లతాంగి! కంటె? 178

మ. కమలం బొక్కటి త్రిప్పఁ గేలఁ గొని శృంగారార్థమై నామవ
క్త్రమునుం బోలునె యంచు వే బడిసి పోఁగా వైచు భామి న్నిజా
గ్రమునం దత్తఱి నోర్తు కంట రజ మొల్కం గిన్కఁ బల్కం బరా
గము నైఁపం దగుఁ బద్మనేత్రయును నాక్రాల్గంటి కన్నూఁదుచున్. 179

మ. స్మరదంతావళరీతి బృంహితగతిన్ ఝంకారము ల్మీఱ నీ
సరసీవాటి విశృంఖలక్రమము మించం జొచ్చి తేఁటు ల్వారిం
బొరిఁ గ్రీడాగతిఁ బుష్కరంబులరసంబుల్ చల్లుఁ బోరాడుఁ బ
ల్మరు నాకంఠము గాఁగఁ గ్రోలు మధురాలాపా! విలోకించితే? 180

చ. సలిపిరి డోలికావిహృతి సాటికి జేటికి నింతు లిద్ద ఱం
దుల నొకకన్నె తన్నె నొకతొయ్యలి యొయ్యెలతీఁగపగ్గ మ
వ్వెలఁదియుఁ దన్నె నన్నెలఁత వేనలిఁ జూడక త్రాసు దన్ను వా
రలతలఁ దన్ను వారలదిరా మదిరాక్షి చెలంగి రత్తఱిన్. 181

తే. కాన మున్నెందు నివ్వ డీకానయందు, సకియ! కనుఁగొంటె యీమహాశ్చర్యచర్య?

తావిగ్రమ్మించు నీయెలమావి యొక్కటఁ, కలికి చే నంటఁ దానును గలికి యయ్యె.
క. వనితామణి! యొకచోద్యము, కనుఁగొంటే షట్పదములు గలమంజరు లిం
దు నవీనాగమరూఢిన్, ఘనపద్యాన్వితము లగుచుఁ గానంబడియెన్. 183
మ. వనితా! చూచితె కొన్నిభూరుహము లీవామేక్షణ ల్వింతఁగాఁ
గనిన న్నవ్వినఁ దన్నఁ బై నుమిసినన్ గద్దించినం గూర్చి పా
డిన మూర్కొన్నను ముట్టిన న్సరసగోష్ఠిం బల్కినన్ గౌఁగిలిం
చిన నంతంతఁ దలిర్చుఁ గేవలతపస్విశ్రేణిచందంబునన్. 184
చ. అలయెలదోఁట చేరి విభుఁ డందలిచంద్రశిలావిశాలశా
లల వలిగాడ్పుకందునకొలంకుకెలంకుల సావిమావిక్రే
వల వలమానగుంజదళివారనితాంతలతాంతకుంజశీ
తలసముభూతలంబుల ముదం బొదవ న్విహరించుమించుగన్. 185
వ. ఇత్తెఱంగున. 186
క. ప్రీడావతులుం దానును, గ్రీడాగతి నిట్లు వనిఁ జరించెడుసమా
ట్చూడామణికడఁ దగి యీ, జాడం జేడెలు విహారసరసత్వమునన్. 187

## పుష్పాపచయకేళీవర్ణనము.

సీ. సుదతి! మొల్లలు దెచ్చి సూడిదె యిచ్చినఁ బలుదెఱంగుల నవ్వఁ బాడి యగునె
కొమ్మ! సంపఁగిమొగ్గ గొమ్ము రమ్మని పిల్చి న్యాయంబె యిది నాకు నాసఁ జూపఁ
బూఁబోఁడి! యిపుడు నాపూబంతులింక నీపాలింటివనుచు డాపంగఁ దగునె
కమల మొక్కటి నేను గానుకఁగా నిచ్చినఁ గనుసన్న గ్రేణింపఁ జనునె సకియ!
తే. యనుచు విభుమ్రోల మేలంబు లాడుకొనుచు, నంగసౌందర్యసంభూచనాభిరామ
చాటువాచాచమత్క్రియాసరణి మీఱ, గిల్లి రవ్వుడు సతులు రాగిల్లి విరులు. 188
క. మనసిజునితూపు లయి మన, మనములు నొగిలించుఁ గాన మాటికి నివి గో
మనగోళ్లు దాఁకె విరులకు, నని పువ్వులు కోయఁ దొడఁగి రలరుంబోఁడుల్. 189
మ. వనిత ల్నవ్వఁగఁ గౌఁగిలింపఁ గన నిశ్వాసింప గానం బొన
ర్ప నదల్పం బలుక న్ముఖాసవము గూర్పం దన్ను నంట న్ననల్
మెనపుం బొన్న కురంటకంబు తిలకంబు న్సిందువారంబు స్రేం
కణము న్సంపఁగి గోఁగును న్వకుళముం గంకేళియుం న్నావియున్. 190
ఉ. క్రొవ్విరి లేనిలేఁబొగడకొమ్మ యొకానొకకొమ్మకేలిచేఁ
జివ్వున వంచి యందు రుచి చిందగఁ నవ్వుచు సూనశాఖయో
జవ్వని యున్న డాయఁ జని ఛాయకు భోంకితి వీవు నీ కిటన్

బువ్వక పూచెనంట తగఁ బొమ్మని యొక్కతె వల్కె నల్కతోన్. 191

క. వనితా ! సమేరునగమ, య్యనుసుమనశ్శ్రేణి గలిగి యుజ్జ్వలరుచులన్
దనరఁగ సారెకు నవ్వఁగ, జను నే ? యిటువంటిదివ్యసాలము కంటే ? 192

క. వకుళము రాగిల్లఁగఁ బ్రస, వకులం బొసఁగె న్ముఖాసవం బీయ నొక
ర్తెకు నిట్లని విని యొక,న్యక ! యిది పుక్కిటిపురాణ మయి తోఁచెఁ జుమీ. 193

తే. పొగడకయి నిక్కితమి నోర్తు పూలు గోయఁ, బోకముడి వీడఁ గనినెపంబున నెబోటి
యడుగువిడిముడి గలదాన వనుచు విరులు, తెలిసి తానీవి గల దౌట తెలిపె నదియుం.

తే. ప్రబలె నీపాదపంబు నీపాదమాన, సాంద్రసుమనః ప్రసాదంబు సంఘటిల్లఁ
దన్నెఱుంగుచు యోగిచందంబు దాల్చె, నిది యశోకంబె యగు నిందు నిందువదన.

క. అలరువిలుకానితో డిపు, డెలమి న్నాపొగడదండ యిమ్మా వైతే
వలరాజునాన మీఱిన, వెలఁదీ ! నినుఁ బొగడదండ వేయింతుఁ జుమీ ! 196

ఉ. కూయిడఁ జొచ్చె మన్మథునకుం గలగంఠమదాళిదంపతుల్
కో యని కోయకుం డిగురు క్రొన్నన లాఁకటిపంటవాని కా
కాయజుసాధనంబు లటు గాక విరు ల్తలమీఁద నున్న వీ
చాయఁ జరింప వద్దు పద చాలుఁ ననుం జెలియోర్తు బోటితోన్. 197

వ. ఇట్లు పుష్పాపచయవిహారంబు చాలించి తదనంతరంబున. 198

## జలక్రీడావర్ణనము.

లయగ్రాహి.—
స్థూలకటిమండలుల కీలునిడు క్రొమ్ముడులు వ్రేలఁ దనువల్లికలు సోల నునుఁగొనుల్
తూలఁగ శ్రమాంబువులు ఫాలములనూల్కొనికపోలములమీఱఁగుచ చేలములుజాఱన్
బాల లపుడొండొరులకేలు నెఱయూఁతఁగొని మ్రోల నలరాచనవలాలఁగదియంగా
లీలఁ జని క్రొవ్విరులు చాలఁ గయికానుకలు మేలిమిగ నిచ్చిరి యవేలతరభక్తిన్.

క. తదనంతరంబ యొయ్యనఁ, దదనుజ్ఞ వహించి సమ్మదసమన్వితలై
మదనశరాకృతులై శశి,వదనలు చని రంబుకేళివాంఛాపరతన్. 200

వ. చనిచని తత్కాంతారంబున. 201

క. అలినీగరుదంచలరుచి, మలినీభవదమలకమలమండలనీలో
త్పలినీశంకాకరనవ, నలినీవనిఁ గాంచి రపుడు నారీజనముల్. 202

సీ. మలయానిలోత్తాలకలహంసపక్షవిక్షేపముల్ చామరశ్రీలు గాఁగ
నీరశీకరసిక్తనిర్మలనీరేజపత్త్రముల్ ముక్తాతపత్త్రములుగ
భృంగీపరంపరాభంగురారావంబు బహుగాత్రసంగీతభంగి గాఁగ
నికటవనీజాతశుకపికాలాపముల్ కంచుకిహుంక్రియాకలన గాఁగ

తే. సతతభువనైకనుతరాజసప్రశస్తి, చెలఁగఁ గొలువున్న నెత్తమ్మికొలఁకులచ్చిఁ
జేరి రిచ్చ దలిర్ప నెచ్చెలులువోలె, నబ్జలోచన లామోద మతిశయిల్ల. 203

క. ఇంతులు ప్రసవప్రాప్తియ,నంతరమునఁ గొలను సొచ్చి రామోదముపై
నింతులు ప్రసవప్రాప్తియ,నంతరమునఁ గొలను సొచ్చు టర్హమకాదే ? 204

ఉ. లాలన మంద మందగతులన్ ఘలుఘల్లని మ్రోయ నందియల్
వ్రేలునొయారిక్రొమ్ముసులు వెన్నుకెలంకుల వే ముహుర్ముహు
ర్లీల నటింపఁ గొనులు చలింపఁగ ఘర్మకణాలకాలిక
శ్రీ లలరింప నక్కొలను చేరిరి రాజమరాళగామినుల్. 205

ఉ. కూడిరి యొండొరుల్ దొరసి కుంతలకాంతు లొసంగి పీడుజో
డాడిరి క్రేళ్లు దాఁటెడుమదాళులతోఁ దెలిదమ్మిధూళి గో
రాడిరి కంతుదంతు లన హస్తపుటంబుల వారిచల్లుఁబో
రాడిరి యోలలాడిరి లతాంగులు రాగరసైకమగ్నలై. 206

ఉ. కోమలి యోర్తు వేఱొకతె గుబ్బచనుంగవమిట్టలందుఁ గే
ల్దామర నాసరోవరజలంబులు చల్లఁ దదంబుశీకర
స్తోమనిపాత మమ్ముగుద చూచి నిజోజ్జ్వలహారముక్తమౌ
క్తామణిశంక నొంది నెమకం దమకించు సఖీమణుల్నగన్. 207

క. పద్మిను లగుతమముందటఁ, బద్మిని వేఱొకటి కానఁబడు టెట్లని యో !
పద్మిను లవుటనో ! నదుపులఁ, బద్మినుల నలంచి రపుడు పద్మదళాక్షుల్. 208

ఆ. సలిలసేకశైత్యపులకితకుచపాళు, లనుపమాంబువర్షిఘనకచాళు
లగుచు నంగకాంతు లంతంత వెలిఁ జిమ్మఁ, గొలను వెడలి రపుడు నలినముఖులు. 209

మ. కొలఁకుంజెంత మెఱుంగుముత్తియపుఁదప్కల్ గుల్క మైఁదీఁగె లిం
ఘాలయన్ హారిపయోధరద్వయ లహీనోద్దామవేణీకలా
పలు రత్నాకరమేఖలాంచితనితంబల్ చిత్రశోభాకపా
లలు సైరింతు లలంకరించుకొని యుల్లాసంబు సంధిల్లఁగన్. 210

క. కాంతలు సలిలక్రీడా, నంతరమున వస్త్రభూషణాన్వితలై రా
నంతట భూకాంతుఁడు శుద్ధాంతము ప్రాపించె వాసరాంతం బగుటన్. 211

ఆశ్వాసాంతము.

మ. నరకార్యున్నత ! నాగజిజ్జపనసాసాదానపారీణ ! సా
గరికోక్తిప్రియ ! నవ్యభోగనయమార్గప్రౌఢ ! నారాయణ

స్మరకైకాగ్రమనస్క ! నందితసుధీసందోహ ! సమ్మావనా
దర ! నారీస్వర ! నామసంశ్రవణమాత్రధ్వస్తవీరాహితా ! 212

మ. విధుకల్ప ద్రుమకల్ప ! దానమునితోర్వీదేవతాచక్ర ! చ
క్రధరారాధనదక్ష ! దక్షరిపువీక్షాపావకాక్షేపకా
భ్యదికౌజఃపరిపాక ! పాకదమనస్పర్ధాఘసౌభాగ్య ! భా
గ్యధురాబంధుర ! బంధురక్షణలితిక్షాజాగరూకేక్షణా. 213

మ. మనువంశోత్తమ ! మత్తవారణఘటామాద్యద్భటానీకని
స్వనహేరాబధిరీకృతాఖిలదిశాస్తంబేరమోదీర్ణక
ర్ణ ! నయజ్ఞా ! చినకొట్లధర్మవరనానారాజ్యధౌరేయ ! కం
దనవోలీముఖదుర్గరక్షణచణోదగ్రప్రభావోదయా ! 214

గద్యము. ఇది శ్రీమదొంటిమెట్టరఘువీరశతకనిర్మాణకర్తజగదేకఖ్యాతిధుర్యాయ్యల రాజులిప్పయమనీషిపర్వతాభిధానపౌత్రాకస్యార్యపుత్రపరిశీలితసమిద్ధరామానుజమతసిద్ధాంతమర్మ ముమ్మడివరదాచార్యకటాక్షవీక్షాపాత్ర హృదయపద్మాధిష్ఠిత శ్రీరామభద్ర రామభద్రకవిప్రణీతం బయినరామాభ్యుదయమహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.






# ద్వితీయాశ్వాసము.



రమ్యసదన ! మదనా
కార ! మహోదార ! నిర్వికార ! రిపుక్ష్మా
దారకిరీటాంకితమం
జీరా ! గొబ్బూరి నారసింహనృపాలా ! 1

వ. అవధరింపుము తదనంతరకథావిధానం బెట్టిదనిన. 2

## దశరథుకడకుఁ జెంచు లేతెంచుట.

క. ఆరాత్రి గడపి విభుఁడు ది, నారంభక్రియలఁ దీర్చి యానతరిపుకో
టీరస్థగితఘృణీమణి, నీరాజితరాజితాంఘ్రినీరేజుండై. 3

మ. ఒకచక్కన్ నిరవద్యహృద్యకవితాసూక్తిప్రసంగంబు లొం
డొకచోఁ దార్కికతర్కశాస్త్రబహుధాయుక్త్యుక్తివాదంబు లొ
క్కకడన్ వైణికపాణికంజముఖరైకశ్రావ్యవీణారవం
బొకటన్ ఘూర్ణిల తీవి నాదశరథుం డొడ్డోలగం బుండఁగన్. 4

మ. పులిగోరుల్ పెరతేనె కస్తురిమెకంబుల్ పున్గుజవ్వాజిపి
ల్లులు గోరోచనమిఱ్ఱులున్ బికిలిపూలున్ జిల్లులున్ మావిపం
డులుఁ గుందేళ్లను జాఁబపప్పు నెలవిండ్లున్ బారవాతంపక
ట్టలుఁ గైకానుక లిచ్చి బోయదొరబిడ్డల్ గాంచి రాభూవిభున్. 5

తే. కాంచి సాగిలఁబడి మ్రొక్కి కడనుజంకఁ, జేతులిడి నిల్చి రందఱు చెంచుజోదు
లందుఁ జావడిసంచు గన్నట్టిదిట్ట, మాటనేర్పరి యిట్లను మనుజపతికి. 6

క. మ్రొక్కెదము సామి ! నీదయ, నెక్కడనుం బ్రొద్దుపొడుచు టెఱుఁగక నీవే
దిక్కని యుందుము దాయలు, గ్రక్కతిలన్ గడుపుచల్ల గదలక యుండన్. 7

క. పడుచులు పైదలు మేమున్, బడివాయక వేఁటతోఁటపనులను మీ వెం
బడిఁ దిరుగుచు గీముల నే, యిషుమలు లేకుండ నుందు మేరొండలందున్. 8

క. అవసర మక్కఱలం గై, దువుకర్జములందు వేఁటతోఁటలయందున్

దవులైన పాతలెంకల, నవుడన్ మముఁ జూఁడు మోపినపు డెవ్వఁడైనన్. 9

తే. కాన వేడుక చూతువుగాని దేవ!, నేఁట వెడలంగరాదె మామాటమీఁదఁ?
జెలఁగి మాయింటి నేర్పును జేతిసూటి, నీవు చూచినఁ జాలు నన్నింటిఫలము. 10

క. అదిగాక దేవ! వేఁటకు, నదరుం బదనైన దిప్పఁ దడవులఁ బందుల్
కదుపులుకదుపులు గొని చనుఁ, బోద లీఁగుచుఁ జొప్పఁ దెలిసి పోరిగొనవచ్చున్. 11

క. దేవర! దయాళులకు నై, కావించినతోఁటదొడ్లు కలఁచుం బందుల్
రేవగలు చేలచెట్లన్, గావలిపజఁ దోడరి పులులు కసివెస మెసవున్. 12

తే. పసిగొనుచు మేయవచ్చిన, పసిఁ గొనుచుం గోలుపులులు బలిసెన్ నృప! నీ
యసి యూడునేని యచ్చట, నసియూడం దఱచు వెఱచు నఱచుం బఱచున్. 13

వ. మఱియును. 14

చ. కలదొక కాన దేవ! సరి గానఁ దదుగ్రమహావరాహకో
టులకును దల్లతాగ్రహతదుంగములన్ దళుకొత్తు తేటిదాఁ
టులకుఁ దదీయచందనపటోలతమాలరసాలవృక్షవా
టులకుఁ దదంతరస్థసకుటుంబవనాటుల కెల్లఁ జోటులన్. 15

క. ఓడక చిఱుపులిమొత్తము, నేడికపొట్టేళ్ల రీతి నెగిరినిరూఢిన్
గ్రీడింతు రెక్కు డూడుచుఁ, జూడం గలయుచటి పెంచుచుం చుంగొమరుల్. 16

ఉ. హాళిఁ గురంగపాళి శరభాళి నదల్చి కదల్చి కేసరి
శ్రీలఁ దృణీకరించి చమరిం బులి నమ్ముల నొత్తి మత్తశుం
డాలఘటోపకారకలనం దగి యందుఁ జరింతు రెంతయుం
జాలరు వీరవిభ్రమరసంబు లెసంగు మిటారిబోయతల్. 17

ఉ. నావుడు వానివాక్యరచనల్ విని ధర్మను యుగ్రజంతుశి
క్షావిధి యంచు వేఁటఁ జన గాంక్షమెయిన్ ధనురస్త్రశస్త్రశీ
లావిధివేత్తలన్ మృగయులన్ జనుదేరఁగఁ జాటఁ బంచి ధా
త్రీవిభుఁ డానిశీథి నిదురించి నిశాంతమునందు వెల్వడన్. 18

సంవరణుని మృగయావిహారము.

చ. సమధికహర్ష మెచ్చ నొకసాహిణి దెచ్చె జవానవహప్రశ
స్తిమదనిలత్వరాతిశయజిత్వరగత్వరతాలఘుత్వరాం
గము ఘనదీర్ఘ సన్నసానకమ్రతరాంగము చిత్రచారుచం
క్రమణవిధావధీరితకురంగము నొక్కతురంగమున్ వెసన్. 19

ఉ. చక్కనిమోముమట్టు మణిశాలిఖలీనము మేలుజాళువా

పక్కెరపేలికుచ్చు లిరుప్రక్కల నెక్కిడి చేర్చిసింగిణుల్
చొక్కపుడాలుఁ గైదువయుఁ శోభిలునొక్కహయంబు నెక్కి రా
జొక్కట నేఁగెఁ గొల్చి మృగయుల్ చన హీంకృతి సల్పఁ గంచుకుల్. 20

మ. బిగువట్టై శ్శ్రమరించి వేఁటకు భటుల్ వేర్వేఱ నంకించి ము
ద్దుగఁ బిల్వన్ మురియున్ బయల్ పసిగొనన్ దూఁటున్ దెస ల్నిక్కి నీ
లిగి కాల్ద్రివ్వ నెలుంగిడున్ జెవికవల్ అక్కించు మైవ్రాఁకుఁబో
ల్వుగడలొక్కల్వుచుఁ బోవు దిస్స మొలవేల్పుం దత్తడుల్ మొత్తమై. 21

మ. వలలుం బోనులు చిక్కములు ల్చలుదులుం వాకట్టుమందుల్ తెరల్
సెలగట్టెల్ తడవిండ్లు నమ్ములపొదుల్ చేకత్తులుం బల్లియుం
బులు పందిటెలు నీలిదట్లు పిడియంబు లూవ్వని లీలన్ విశ్వం
భులవృత్తిన్ దెరవేఁటకాండ్రు గొలువంగా వచ్చె రా జున్నతిన్. 22

తే. భైరవున కశ్వరూఢి చొప్పడినఁ దమకు, నశ్వశబ్దాదివర్ణహైన్యంబు చనునొ
యనుచు హయముల నూటికి నాక్రమించుఁ, గనక పాళాన్వితోన్నతశునకతతులు. 23

సీ. పులిపులి గాఁగఁ బెబ్బులిపింపు నొకనాఁడు చెదరఁగా నూఁటె నా చేతియీటె
జముదాడిగెల్చె నాజముదాడియల్ప మే సింగపుమిత్తి నా చేతికత్తి
యసిఁబోవు టెట్లు నాయసి బోవు మెకముల జించు నాయమ్ము నాచిలుకుటమ్ము
గులగులల్ గా నేనుఁగులఁ గలంగఁగఁజేసి చిక్కించుకొంకి నా చేతివంకి
తే. యనుచు వీరానులాపంబులాడ వినుచు
ననుచు మదిఁ బత్త్రిరథుఁ డొయ్య జనుచుఁ గాంచె
నినుము చల్లిన రాలని బిసరుహాప్త
కరనితాంతదురంకభీకరవనంబు. 24

సీ. సింహనఖాంకురచ్ఛిన్నవారణకుంభజనితముక్తాఫలశర్కరిలము
సమదహూకరపరస్పరభీకరాఘాతశిథిలదంష్ట్రాచూర్ణసికతిలంబు
గంధసింధురఘటాకటకటాహస్రవద్బంధురదానాంబుపంకిలంబు
దవగంధవహబంధుదహ్యమానానేకకాళికాగురుధూపగంధిలంబు
తే. పృథులషడ్జస్వరోద్గీతభిల్లపల్లి, వాధరాగీతికాకర్ణనాతిభీతి
పరవశాత్మపటీరకోటరకుటీర, లీనఫణి యగు నక్కాన కాననయ్యె. 25

క. ఆకాంతారముఁ జేరె ధ, రాకాంతుఁడు నిజభుజాపరాక్రమసంప
ద్భీకరసేనాహళహళి, కోలాహలరవంబు కడలుకొనంగన్, 26

మ. క్షితిపాలాగ్రణి చేర ఘూర్ణిలఁగఁ జొచ్చెం గాననంబెల్ల టం
కృతిమచ్చాపకిరాతజాతము లతాగేహాంతరభ్రాంతఘీం
కృతిమత్కోలకులంబు హుంకృతిమదుద్గ్రీవోగ్రసింహంబు ఘాం
కృతివత్క్రూరతరక్షుకంబు నగుచున్ ఖేలచ్చమూక్షుబ్ధమై. 27

వ. అయ్యవసరంబున శారాచమేటి తాను నాఖేట సమయసముచిత సన్నాహసంపన్నుం
డగుచు నచ్చట. 28

సీ. ఓదముల్ ద్రవ్వించి యురులొడ్డ నియమించి యివ్వలవ్వలవల లిడఁగఁబంచి
యడుగులెత్తించి చొప్పడ జాడ వేయించి యాయాయి టెంకిపట్లరయఁ బంచి
పోఁగువారించి గొబ్బున జోఁపు వెట్టించి కొండలేఁజిగురాకుగూండ్లు నించి
యక్కడక్కడఁ ద్రోవ లరికట్టఁ జెప్పించి వాకట్టు గట్టించి పైపు లెంచి
తే. యెచ్చరిక మించి తెరవేఁట యొద్దువేఁట, గంటవేఁటయుం మొదలుగాఁ గలుగువేఁట
లెన్నిగలవన్నియుంఘటించి యన్నరేంద్రుఁ, డుగ్రమృగభంజనక్రియోద్యుక్తుఁడయ్యె.

క. ఆ రాజచంద్రుఁ డగుటకు, సారంగముఁ బట్టఁ గదియుశార్దూలంబున్
గారించి రాజశేఖరుఁ, డై రూఢి వహించెఁ గాన నవ్విభుఁ డచటన్. 30

క. నృపవరుఁడు నిజగజాంఘ్రి, వ్యపగతవ్యాఘ్రతతులఁ గాంచి 'యలసర్వం హ
స్తిపదే మగ్నం' బనుపలు, కపుడు వనిన్ సార్థ మయ్యె నని హర్షించెన్. 31

ఉ. భల్లతరక్షుసింహమృగపఙ్క్తులఁ ద్రుంపఁగఁ గొంద ఱాత్మ వెం
పుల్లసిలంగఁ బొల్పడిరి యొక్కొకరంతట నొక్కొకవంచకం
బల్లన పొంచిపోఁ గదిమి రం దొకకొందఱు నక్కఁ గన్నవాఁ
డెల్లను వేఁటకాఁ డనుట యిట్టిద యంచు నరేంద్రుఁడున్. 32

క. ఇలఁ దమకే సరి కేసరి, యలఘుపరాక్రమనిరూఢి నని యుద్భటులై
యెలుఁగుల బోవఁగ నీయక, యలుఁగుల పాల్పడి రప్పు డవ్వీరభటుల్. 33

చ. నరవరచాపముక్త మయి నాటక కాచె సమీపవర్తియా
హరిణముఁ గూడి యున్నప్రణయంబున దప్పులపుండరీకమున్
బొరిగొనెఁ బక్షపాతగతిఁ బొంచి తదుత్పలరాగయోగమై
ఖరి దగ నర్ధచంద్రవిశిఖంబు సమస్తజనాద్భుతంబుగన్. 34

క. కాసరికేసరికిరికరి, శాసనచణుఁ డగుచు శిశువశంవదఘూస
గ్రాసోన్ముఖబహుముఖహారి, దీనసంతానంబుఁ గాచె నృపుఁ డతికృపుఁడై. 35

దశరథుఁడు గజభ్రాంతిచే ఋషిపుత్త్రుం గూల్చుట.

ఉ. ఆసమయంబునందుఁ దమసాపగఁ దాపసపుత్త్రుఁ డాత్మవి

ద్యాసముదగ్రులైనతలిదండ్రులు దూపిలియుండ వారలన్
గాసిలకుండఁ గుండ నుదకంబుల ముంపఁగ నాథరావరా
గ్రేసరుఁ డేసె నాధ్వని కరిధ్వని యంచు విచారశూన్యుఁడై. 36

క. కుంభధ్వని విని యేసెన్, గుంభిధ్వని యని విభుండు గురుభక్తు నరో!
యంభములు ముంపఁగొనెఁ బో, కుంభజశబ్దము వివేకగుణవిధ్వంబున్. 37

క. ఆతఱి నాకర్ణించెఁ బు, రాతనవిభువిభుఁడు పఙ్క్తిరథుఁడు నిజాస్త్రా
ఘాతముఁ గనుమునికొమరుని, హా! తాతా! యన్న యున్నతార్తరవంబున్. 38

క. విని యనివారితరయమునఁ, జని జనితనితాంతనిశితశరవేదను న
మ్మునితనయచంద్రముని గని, కనికరమునఁ బాపభయము గనికొన మదిలోన్. 39

చ. ప్రమద మెలర్ప నుగ్రమృగబాధ హరింపఁగ వేఁటమై నర
ణ్యమునకు రా నఘం బొదవె నక్కట! ధర్మము చాలుఁ గుక్కఁ బ
ట్టు మనుట యెంచి విల్లటు తటుక్కున ధారుణి వైచి సారమే
యముల మరల్పఁ బంచె మృగయాక్రియ మాని విభుండు ఖిన్నుఁడై. 40

ఉ. అన్న! మునీంద్రపుత్ర! మృగయాక్రియ యింతకుఁ దెచ్చె నన్ను ము
న్నెన్నిట నోమి కాంచిరొ సమిద్ధతపఃఫలసార మైన యం
ద్యన్నయశీలు నిన్నుఁ దలిదండ్రులు వా రెట నున్నవారొ యీ
కన్నడ చూడఁ బాలయితిఁగా విధి నేవిధి దూఱ నేరుతున్. 41

తే. ఎచట నున్నారు తలిదండ్రు? లెవ్వ? రీవు, వచ్చితిట కేల యిప్పు డీవారి వారి
దప్పిఁ దప్పింప నొక్కొ? నాతప్పు సైఁచి, చూపు మొకత్రోవ పావనిష్ఠనకునాకు.

క. నావుడు జననీజనకుల, యావాసము తజ్జరాభరాయాసపిపా
సావస్థ వారికొఱకై, తా వచ్చుట యాత్మవర్ణధర్మముఁ దెలిపెన్. 43

వ. తెలిపి మఱియును. 44

క. కృతపుణ్యపాపఫలములు, వితథములై చనునె యనుభవింపక? యేలా
మతి నాకు వగవనీ మాను మ, న్పితృజనులపిపాస మాన్ప పృథుతరకీర్తిన్. 45

చ. అనుమునిసూతిసూక్తి విని యాత్మఁ గలంగి దురంతచింత నా
తనిఁ గొనిపోయి వానితలిదండ్రులసూరెల నిల్పి యజ్ఞతన్
దనయొనరించు నేరమివిధంబును నీటఁ దదీయదాహ మా
ర్చినతుదఁ దెల్పి బాలునెదఁ జిక్కినతూఁపు వెకల్చె నవ్వఁగన్. 46

క. ఆశుగము వెంటఁ దన్ప్రా,ణాశుగముల్ పోయెఁ బోయ కర్హాంబగుచా
పీకుం డీఁదగునె దయా, లేశము లేకనుచుఁ జింతిలిరి తలిదండ్రుల్. 47

వ. అప్పుడు విభుండు వారిం గనుంగొని. 48

ఉ. నే నపరాధి నీచుఁడను నింద్యుఁడ నీతివివేకశూన్యతా
దీనమనస్కుఁడన్ జడమతిన్ గలుషాత్ముఁడ నిగ్రహార్హుఁడన్
గాని యనుగ్రహార్హుఁడను గాను దపోధన! యాజ్ఞ పెట్టుకో
మ్మా ననుఁ గ్రూరకర్ము నని మానిపదంబుల వ్రాలి పల్కినన్. 49

క. ఆట విని మునిదంపతు లని, రటవినిఁ బర్ణాంబుభోక్త లగుతాపసులన్
గటకట! నొంతురె నృపు లు, త్కటకటకాధిపులు లేరె గర్వాఖర్వుల్? 50

## దశరథునిశాపప్రాప్తి.

క. మానుఁ దెగటార్చి మమ్మున, సూనులఁ జేసితివి యిట్టిసూక్తులు చాలున్
వీనులకు ములుకు లయినవి, బో నీవున్ బుత్రశోకమున మారితిన్. 51

ఉ. భానుకులప్రసూతులు కృపాపరులంట యవధ్యహింసకున్
బూననిపుణ్యులంట గుణభూషణులంట యథాపరాధ దం
డానుపమానశౌర్యనిధులంట మునిప్రియులంట నేఁ డయో!
కానక కన్న మాసుతుఁ బొకారిచి యిన్నియు మిథ్యచేసితే? 52

మ. మునిజీవాతువు లబ్జబంధుకులసంభూతుల్ నయోపేతు ల
త్యనుకంపాపరులంచు నమ్మితిమిగా కయ్యో! జిఘాంసన్ గిరా
తునిచందంబున నొంచి తీ వనపరాధున్ సాధుమత్పుత్రుఁ బం
డెనె కోర్కుల్? ఫలియించెనే విశిఖపాండిత్యంబు నీ కింతటన్. 53

వ. అని పలవరించి విరించి గుఱించి దూఱిదూఱి యామ్రేడితోదీరితనిజకుమారగుణ
కథనం బగుమానిమిథునంబు పంచత్వంబునొందినం గనుంగొని మూర్ఛిల్లి లేచి యు
ల్లంబు దల్లడిల్ల బెల్లువగల వగచి యథావిధిఁ దదీయాగ్నిసంస్కారవిధులు నిర్వ
ర్తించి పుత్రసంతానకారణం బగుతాపసశాపం బమోఘం బని యంతరంగంబున
శోకంబు లెక్కింపక పరమసంతోషభరమగ్నుండయి మరలి పోవుచు నలరి మఱియుం
బేఁటాడుచుం జనియె నివ్విధంబున. 54

తే. నాయెదుట మీకు భూమిభృన్నామ మూనఁ, జెల్లునే యనిపండ్లు దుల్చెనో యనంగ
గిరిగుహాముఖచండకేసరులు వెడలఁ, జెండెఁ గడికండలుగ నృపాఖండలుండు. 55

తే. పంచముఖసంజ్ఞ పార్వతీపతికిఁ గాక, హరి యనుశుభాహ్వయంబు శ్రీహరికిఁ గాక
యిట్టితెఱనోరిమెకముల కేల యనుచుఁ, గనలి యుగ్రము లైనసింగములఁ గెడపె. 56

క. ఉరుసింహశాదకదళీ, కరిగంధర్వాచ్ఛభల్లఖడ్గోద్ధురమై
దురముక్రియ దొరయ నానృప,వరుఁడు మహాఖేటకరుఁడు వనము గలంచెన్. 57

సీ. కల్వపూసెచ్చెలికానియంకస్థితి రంజిల్లుశశకిశోరంబుదక్కఁ
జలిమలచూలిచూపులమరుల్ గొని చూచు శివుచేతిముద్దులజింకదక్క
రేవెలుంగులతాల్పుదేవేరి యగుదుర్గ కెకిరింతయై మించుమెకముదక్క
దనపంగడంపుఁబెద్దకనుంగుఁబట్టియౌ జమునిలులాయరాజంబుదక్క
తే. నితరదృగ్గోచరమృగంబు లెన్నిగలిగె, నన్నిమృగములఁ బరిమార్చి యన్నరేంద్రుఁ
డాత్మధనురస్త్రపాండిత్య మతిశయిల్లఁ, బ్రబలె మృగయులు పొగడ దోర్బలముకలిమి.
మ. సరసైకద్విరదక్షతాంకధరయున్ సంకీర్ణభృంగాలుకో
త్కరయున్ విశ్లథపత్రవల్లియుఁ గనత్కుచార్ధచంద్రప్రసూ
నరసస్వేదయునై వనావనిరతాంతక్లాంతకాంతాకృతిన్
దరమై బిత్తరమై దలర్చె మృగయాంతంబందు నందంబుగన్. 59
వ. అంత. 60
క. మృగయాక్రియ మాని వడిన్, మగిడి యయోధ్యాపురి క్షమారాజ్యరమా
నుగుణమహిమ నానృపమణి, విగతాఘుఁడు విభుఁడు పెక్కు వేలేం డ్లుండెన్. 61

దశరథుఁడు సంతానములేమిం జింతిల్లుట.

వ. ఇవ్విధంబున దశరథుండు ప్రాజ్యసామ్రాజ్యభోగానుభవవిభవయుక్తుం డయ్యు నాత్మ
గతంబున. 62
క. నిస్తులరాజ్యశ్రీలం, భూస్తుతిఁ గన నేమిఫల? 'మపుత్రస్య గతి
ర్నాస్తి' యని పలుకఁ గాదె స, మస్తాగమచయము ననుచు మదిఁ దలపోయున్. 63
క. చింతితఫలదాయకము ని, రంతరసుమనోమనోహరము నగు నాహా!
యెంతటివారికి నాత్మజ, సంతానము సన్నిధానసంతానముగా. 64
క. ధాత్రిన్ బున్నామ్నోనర, కాత్త్రాయతఇతి యనంగఁ గలిగిన తాదృ
క్పుత్త్రుని గాంచుటయే కదా, గాత్రం బూనుటకు ఫలము గణుతింపంగన్! 65
ఉ. ఎందుఁ గొఱంత సంతతివిహీనునిజన్మము వమ్ముగాఁ దలం
పందగు సజ్జనంబు పుమపత్యము ముక్తినిధానలబ్ధికిన్
గందళి వంశవల్లికి నఖర్వజరాభరవేళ యూఁతగా
నం దనయుం న్నితాంతనయు నా కిఁక నెన్నఁడు గాంచఁగల్గునో? 66
ఉ. నీరవిమండలం బయిననింగియుం దక్షిణలేనియాగ మం
భోరుహశూన్యమైనజలమున్ ధ్వనిచాలనికావ్యమున్ సదా
చారముఁ బాయుబ్రాహ్మ్యము నశాంతితపంబు నపత్యదూరసం
సారము నొక్కతీరని విచారము సేయు విభుండు వేమఱున్. 67

క. నే నేల నేల చాలఁగ, నీ నేల తనూజరహిత హిత సామ్రాజ్యం
బీ నేలా యీలాగునఁ, దా నాలక్ష్మీధవుండు దయఁదలఁపఁడొకో? 68

క. అని తలఁచి తలఁచి వెనుకటి, మునిశాపము తప్పలే దమోఘం బది యై
ననుఁ దలకూడ దొకో యని, జనవరుఁడు దురంతచింత సంధిలఁ బొగులన్. 69

వ. ఇవ్విధంబున నాదశరథుండు తనయసంతానచింతానవధివ్యథాడోలాయమానమాన
సుండై యుండ నొకనాఁడు వసిష్ఠవామదేవాదివాచంయమసముదయం జేతెంచి
భూకళత్రునకుం బుత్రకామక్రమచికీర్షాప్రకర్షంబు వొడమ నిట్లనిరి. 70

చ. పులులకు బుద్ధి చెప్పుకొని పూరియుం గిరియుం మేటిలేటిలేఁ
బిలుకల వెంటఁ ద్రిప్పుకొని పెంచుచుఁ గానల సంచరించునా
కలయికలంటి మాయపుమృగంబులఁ దా నొకమానవుండునై
మెలఁగుట గానరా దతని మెచ్చఁగ నేర్తుమె ఋశ్యశృంగునిన్? 71

క. పుట్టినది మొదలు మెకముల, చుట్టఱికం బెఱుఁగుఁగాని సుదతులు సుతులున్
జుట్టలు నని యీవెతలన్, గట్టువడి యెఱుంగఁ డతఁ డొకఁడు ధాత్రీశా! 72

క. ఆయాసపడక రాఁడు మ,హాయత్నము సేయవలయుఁ నని కాని నిజం
బాయన వచ్చినయప్పుడ, యూరైన యాసవనకర్మ మవనీనాథా! 73

క. వాపుడు నంకటివారట, రేవారని యటు నమస్కరించినవాఁడై
కోవిదుఁ డుత్తరకోసల, దేవేంద్రుఁడు వలికె మంత్రిదిక్కు మొగంబై. 74

ఉత్సాహ. పీర లానతిచ్చినట్టివింత వింటివేకదా?
యూరుగీరుఁ జేరఁ డంట యుండునంట కానలోఁ
జేర ఋశ్యశృంగుఁ డంట పిల్వఁ బంపు పంపఁగా
నాఋషీశ్వరుండు వచ్చెనా ఫలించుఁ గర్జముల్. 75

ఉత్సాహ. కానలో మృగంబు లోలగంబు సేయ నుండున
మ్మౌనిమండలేశ్వరుండు మనలఁ గూడుజాడ లే
దైన నొక్కత్రోవ ద్రొక్క కతనిమానరాదుగా
పూని చూడు మెవ్వఁ డెఱుఁగుఁ బుణ్య మున్న నయ్యెడున్. 76

క. రోజింపు మనుచుఁ జెప్పిన, హోజారంబునకు వచ్చి యమ్మంత్రివరుం
డేజాడఁ ద్రియ మొనర్చెద, రాజున కని తలఁచు నవసరంబునకుఁ దగన్. 77

దశరథుఁడు ఋష్యశృంగుఁ దోడ్తేర వేశ్యలఁ బంపుట.

సీ. నీలంపుజడలకుఁ బిలిబిల్లులుగాదె నిగుడునిగ్గులలోనిపొగరుఁదగలు ?
చిలుకుఁజూపులకు మెచ్చులసీవిరుల్ గాదె సొలపుఁద్రిప్పులలోనితళుకుఁగురులు?

పలుకఁదియ్యములకు వెలిగొడుగులు గావె నయగారములలోనినగవుపసలు?
కలికిచెయ్వులకు బంగరుటెక్కెములు గావె మేమెఱుంగులలోనిమిసిమితేట?
తే. ఇట్టిబిరుదులు గలిగియుఁ బెట్టుబిరుదు, లాసపడి రంచుఁ దముఁ బ్రోడలాడ వీణ
మలహరులు మ్రోయ నాందోళికలను వచ్చి, డిగ్గి పొడగన్న వెలయాండ్ర శివిఁ జూచి.
క. వెరవరు లీహరువుల కీ, గురుకుచ లని తలఁచి రాజు కొలువై యున్నాఁ
డరుదెం దని తాముందర, నరిగి యెఱింగించి రుండె నతఁ డధిపతికిన్. 79
మ. అరవిందానన లెల్ల నల్ల నపు డయ్యాస్థానముం జేరి బం
గరుబెత్తంబులవారు పేరుబడి వక్కాణించి చూపం దమున్
దొరక్రీఁగంటఁ గనుంగొనంగ నొకసందోహంబుగా వచ్చి మ్రొ
క్కిరి పయ్యంటచెఱంగు ముంగొనలతోఁ గెంగేలుతో డెత్తుచున్. 80
క. అత్తఱి నత్తెఱవలతో, మత్తమరాళీసమాగమనలీలలతో
వృత్తస్తనభారలతో, నుత్తరకోసలునిమంత్రి యొకమా టనియెన్. 81
ఉ. కానల ఋశ్యశృంగుఁ డనఁగా నొకమౌనికుమారుఁ డున్నవాఁ
డే నన నేటికిన్ మునిమృగేతరకృత్య మెఱుంగఁ డిందుబిం
బాననలార నేఁ డెఱుఁగ నయ్యెడు మీపస లెల్ల రాజుగా
రానతి యిచ్చినారు కలరా చని యమ్మునిఁ దోడితేరఁగన్? 82
క. ఉన్నారు మంచియేర్పున, మిన్నల వలె రాజుపంపు మేకొనకిఁక మీ
రెన్నటికి మీవిలాసము, లిన్నియుఁ జెప్పటికిఁ జెప్పరే చెలులారా! 83
క. కన్నార మీకుచంబులు, కన్నారతి మరునితోడఁ గళవళపడునా
పన్నారు దొంతు లిలఁ గై, కొన్నారో యీపసిండికుండ లటంచున్. 84
క. అనిన నొకపల్లవాధర, తనుమధ్యలమ్రోల నిలిచి తనవిలసనముల్
చనుఁగవపై మొనయింపుచు, వినయాంజలి మీఱ విఱ్ఱవీఁగుచుఁ బలికెన్. 85
క. ఎన్నిదినంబులు మితి? యే, కన్నియఁ బంచెదరు మౌనికడకు? కనవలెనా?
మన్నించి మీరు నడపఁగ, నున్నారమె యుండఁ గలసమున్నతిసెల్లన్. 86
చ. పొలఁతుక లెందుఁ గొప్పులకుఁ బువ్వులు పైతురు గాని వాఁడిచూ
పులకును గల్కిపల్కులకుఁ బువ్వులు పైచినవార మేము పో
బెళుకులలోనివెన్నెలలపేర మెఱుంగులలోనినవ్వులే
మొలకలపేర దేవర మముం గొనియాడుదు రెల్లప్రోడలున్. 87
చ. మలఁచినఁ జాలుఁగాక మగమానిసిరూపులు తాలకైనఁ జె
క్కులు పులకింపఁ జేసి యదిగో వలపింతు మనన్ వినం గనం

గల మగరూపు మాయెదురుకట్లకు వచ్చిన నెంతగాదు ప్రే
మల వలరాచమో మెఱుక మానిసిఁ జేసిటఁ దెత్తు మమ్ములన్. 88
చ. అన విని మెచ్చిరాజు వివిధాభరణార్ద్రకురంగనాభిచం
దనములు దానటంటెనఁ బ్రధానుఁ డొసంగినఁ బట్టి భామ ల
య్యనుమతి గాంచి దండియు లుపాంగము మద్దెల తాళ మావజం
బునుఁ గొని మేళమై మునితపోవనికిం జని నిల్చి రొక్కెడన్. 89
వ. అయ్యెడ. 90
తే. కలువచెలి దొంగరాయిడి గలుగు నింక, ననుచు మునుమున్న పద్మిని దనవికాస
ధన మునిచి నీటనిడురాగి తార్చువోలెఁ, బడియెఁ బడమటికడలిలోఁ బద్మహితుఁడు.
క. తొట్టుకొని సంజ కెంప, ప్పట్టున రవిఁ బాసి సితగభస్తి సెదురుకో
నట్టె సిరివచ్చుటకు నై, పట్టిన కెంబట్టుదిడ్డి పాలికఁ బోలెన్. 92
క. కలయిక లెడసిన జక్కవ, చెలువలకన్నీటిప దనుచే నెల్లెడలన్
మొలచె ననఁగ నలుఁగడలన్, బలిసి తమోలతలు బయలుపందిరి ప్రాఁకెన్. 93
చ. అలమరునాజ్ఞ శీతకరు నవ్వల రమ్మని చెప్పి గుంపులై
యలిబలముల్ వియోగిహృదయంబులు చూడఁగఁ దెచ్చినట్టివె
న్నెలకొఱకంచుఁజో యనఁగ నిండినచీఁకటిమీఁద నింగిఁ జు
క్కలు గనుపట్టె వచ్చిపొడకట్టె శశాంకుఁడు నంతఁ దూర్పునన్. 94
చ. చలువవెలుంగు రేమగఁడు జక్కవనెచ్చెలిజోడుకోడె చు
క్కలజవరాండ్రలో ననుపుకాఁడు జగంబులచూడ్కివిందు చెం
గలువలకోరిదారి విలుకానికిఁ గూర్చినమామ పండువె
న్నెల గని చందమామ కడు నింగిఁ జెలంగి వెలింగె నెంతయున్. 95

వేశ్యావనవిహారవర్ణనము.

వ. అప్పుడ వ్వారచకోరలోచనలు లోచనగ్లానిమోచనంబు లగునమృతమరీచిరోచిర్వీచి
కాసేచనంబులకు నోచి పూచిన పొదరిండ్లముంగిళ్ల నభంగురస్వాదురసావలంబంబు
లగుఫలంబులుం బ్రాసవంబు లగు నాసవంబులుం గూర్చి కూర్చుండి యొండొరులు
పంచి యుపయోగించు నవసరంబున. 96
చ. జరఠ యొకర్తు కుంజగృహచంద్రశిలం గనుకూర్కుచుండఁ గ్రొ
వ్విరికలు ద్రావ లేవదటవే ముదిచిల్కలకొల్కి! యంచుఁ జె
చ్చెర నొకకల్కిపోయి పొదచించినఁ బాన్పుఁ గరంచె వెన్నెలల్
చోరఁబడి నిద్ర నీ రగుట చోద్యమె దానికి నట్టిపట్టునన్? 97

క. నవ్వుచుఁ బసిండిగిన్నెలఁ, గ్రొవ్విరితేనియలు చెలులు గ్రోలిరి రావో!
యువ్విళ్లూరక తుమ్మెద, జవ్వని! నీవును నొకింత చవిఁగొను దనుచున్. 98

చ. తెలి నును సోఁగవెన్నెలలఁ దేఁటిఁగొనం దనసీడఁ జూచి మ
త్తిలి మధుపాని చొక్కి సుదతీమణి యొక్కతె నీవు నింత సౌ
చ్చెలి చవి చూడవే యనినఁ జేకొనమిం గని యాసవమ్ముపైఁ
జెలియరొ! యాస వమ్మగుట చిత్రము నీకని పల్కె నల్కతోన్. 99

సీ. గుజ్జుమామిడిబావ! గోరొత్త నీవుగా? యని చేతఁ జెనకె గయాళి యొకతె
లేఁబొన్నమనమండ! లెస్స గానగ నేర్తుఁ జూడుమా యని నవ్వెఁ బ్రోడ యొకతె
గోరంటసుఱఁది! యక్కునఁ జేర్తు నిన్నంచుఁ గులుకుగుబ్బల నొత్తెఁ గలికి యొకతె
కంకేళితాత! నీకాలు ద్రొక్కెదనంచు బాదంబుపైఁ బెట్టె బాల యొకతె

తే. యారమధుమద మమరఁ బుష్పాసవంబు, గ్రోలిన సుమాళ మప్పుడు తత్కళికలకుఁ
జాతపున్నాగకురవకాశోకతరులు, నవ్వె నవ్వులు పువ్వులై నివ్వటిల్ల. 100

క. వెండియు బహువిధవిహరణ, పాండిత్యము నెఱపి నెఱసి బడలిక నవలా
పిండు తలిరాకుఁబానుపుఁ, దండంబున నిదురసలుపుతదవసరమునన్. 101

క. ఇనరథతురంగహేషలు, వినవచ్చినఁ గెరలి గగనవీథికి లంఘిం
చెనొ పొడుపుఁగొండకేసరి, యనవేఁగురుచుక్క తోఁచె నంతం బ్రాచిన్. 102

క. ఇక్కువగతిపతిపాలికి, జక్కవ జవరాలు చేర సంకేతరవం
బొక్కటి యొసంగెనో యనఁ, గుక్కుటములు పక్కణములఁగొంక్కృతి సలిపెన్.

ఉ. ఘాంకృతి దేవతానిలయపంక్తిరటత్పటహాదికంబుచేఁ
గొంకృతి పట్టణాంగణనికుంజకుటీకృకవాకురాజిచే
ఝుంకృతి నిర్దళత్కమలషండమదాళులచేఁ గలారవ
క్రేంకృతి శారికాపికశుకీవిహగాదులచే వినంబడెన్. 104

క. చపలఁ దొలుసంజకెంపులు, పొదలెం బ్రాభాతవాతపోతంబులచే
నుదయాచలవకుళవనీ, మృదులపరాగములు నెఱసి మెఱసినభంగిన్. 105

సీ. కని ప్రాచి గొడ్డు వీఁగంగ రత్నమువంటి పుత్త్రసంతానంబు పుట్టె ననఁగ
బలభేది యర్చింప బ్రహ్మదేవునివంటి యతిథియభ్యాగతుం డయ్యె ననఁగ
నుదయాద్రితలమీఁద నుంచుకో మేరువువంటిచుట్టము చేరవచ్చె ననఁగ
మందేహజయలక్ష్మి మనువొందఁ బంగారుకుండవంటివరుండు గూడె ననఁగఁ

తే. కోమలారుణకిరణముల్ గుదురుకొనుట, సులభమై యెల్లరకుఁ దేఱి చూడవచ్చు
ననఁగ సుకుమారమండలం బనఁ దనర్చు, భువననయనంబు లోకబాంధవుఁడుమించె.

ఉ. ఎల్లరు నంత మేలుకొని యిందుముఖుల్ ముఖమజ్జనాదికం
బల్లనఁ దీర్చి కైపుగఁ దులాంబరముల్ మణిభూషణావళుల్
మల్లెసరంబులుం బరిమళంబులు దాలిచి ఋశ్యశృంగునిం
జెల్లముగాఁగఁ జూచి చనుదెమ్మని దూతిక నంపి రంపినన్. 107

చ. అది చని చూచివచ్చి వినుఁ డమ్మునితండ్రి విభాండకాఖ్యుఁ డ
మ్ముదుసలి బాపనయ్య ఫలమూలకుశాహరణార్థ మేఁగినాఁ
డుదయము గాకయుండ నిపు డొంటిగఁ జిక్కెఁ జనుండు రాఁగ న
మ్మదనుఁ దలంచి కేల్మొగిచి మందరయానలు పోయి దవ్వులన్. 108

వేశ్యలు దమచాతుర్యంబున ఋశ్యశృంగుని వశపఱచుకొనుట.

వ. పర్ణశాలాప్రాంగణంబున నున్న ఋశ్యశృంగునిం జూచి తమలోన. 109

సీ. ఎంతగడ్డంబైన వింతలే దొసపరి తీరుగా బవిరి దిద్దింపవచ్చు
నొసలి వెలిమిబొట్టు మసిమీఁద మృగనాభితిలకంబు బటువుగాఁ దీర్పవచ్చు
ధవళంబులైన దంతములపై వీడెంపుఁ గెంపు పెందళుకు గల్పింపవచ్చుఁ
బులితోలు విడిపించి జిలుఁగు దుప్పటపు రింగుల వల్లెవాటు మేకొలుపవచ్చుఁ

తే. గొఱసిగ వేయుచోట నే కొమ్ముపుట్టి, చెఱచినది గాని యెంతైనఁ జేయవచ్చుఁ
గడపట భుజంగవేషంబు వడసినప్పు, డుండుఁ బో గందుమీఱి యిమ్మిండతపసి. 110

క. అని నగుచుఁ జనఁగ ముని కని, యనుసరదేణీమృగాదసార్భకుఁడై మో
డ్చినకేలుఁ దాను రాఁగా, మనల స్మనులనుచుఁ దలఁచె మది నితఁ డనుచున్. 111

వ. అవ్విలాసినులు వెఱఁగంది. 112

క. మగువలు మత లని యెఱుఁగఁడు, మృగముల కొరసిలఁ డేమి మిడిమేల ? మితం
డగపడునని తలఁచితి మే, నుఁగుఁగంబంబునకుఁ దివియ నుసిలితిమి సుమీ ! 113

తే. ఐన నగఁ గాక విడుతుమే పూనినట్టి, కెలస మున్నాఁడుగా మానకేతనుండు
మదనుఁ డని చేరి ఘృతపక్వమరిచశకల, శర్కరాదికమిళితభక్ష్యములు కొన్ని. 114

మ. ఇడి రమ్మాని యుపాయనంబులు మనోభీష్టంబుగాఁ బూరియల్
వడలుం జక్కెర కజ్జకాయలును లాడ్వాలు చక్కెరల్ పూర్ణపుం
గుడుముల్ గారెలు బెల్లమండెగలు నొఁగుల్ కమ్మచాఁపట్లు నూ
టిడులుం దోసెలు నప్పముల్ సుకియలుం హేరాళమై కన్పడన్. 115

క. ఫలములు జిహ్వాగ్ర తపగ, ఫలములు కొని వచ్చి సరసభాషాప్రౌఢిం
బలికిరి చిలుకలకొలుకులు, పలుకులఁ గప్రంపుఁదళుకుపలుకులు గులుకన్. 116

ఉ. చాయలు నేరుమంజులకుచంబులు హృద్యము లిందుముఖ్యముల్

పాయని సౌఖ్యమీఁ గలుగు పాటిరుచుల్ దళుకొత్తు మోవి పం
డ్లేయెడ లేని ద్రవ్యము లభీష్టము లైనవి యిందు నందుఁ గో
ష్ఠాయి మునీంద్రచంద్ర ! యని యుత్పలగంధు లొసంగి రయ్యెడన్. 117

క. ఇచ్చిన నవి మదిఁ గైకొని, మెచ్చి తదీయామృతోపమేయోక్తులకున్
మచ్చిక సేయుచు డగ్గఱి, వచ్చి లతాంగులకు మౌనివరుఁ డిట్లనియెన్. 118

క. ఏమునిపుత్త్రులు మీశుభ, నామము లెయ్యవియొ మీవనము లెచ్చటనో
మీ మేనులసౌభాగ్యము, లేమని వర్ణింతు నెవ్వ రిందఱుఁ జెపుఁడా !. 119

వ. అని మఱియును. 120

సీ. స్ఫటికాక్షమాలికల్ చక్కని వివి యంచు హారలతాపంక్తు లంటి చూచు
హృద్యముల్ చోద్యంబు లీకమండలులంచుఁ దమిఁ బయోధరములు నిమిరి చూచు
భసితాంగరాగసంపద బాపురే ! యంచు నొడలిగంధపుఁబూఁత తడవి చూచు
నివి యపూర్వంబు లైనవి వల్కలములంచుఁ బట్టుఁబుట్టంబులు ముట్టి చూచు

తే. మణితము ల్వీని యాశ్చర్యమగ్నబుద్ధి, గాయసిద్ధిప్రభావంబు గాంచు దివ్య
తాపసులు వీరు వీరిమంత్రములు నేర్వ, వలయు నని చేరి ప్రార్థించి పలుకఁ జూచు.

తే. వెలఁది నవ్వులు మించు క్రొవ్విరు లటంచు, నలకపంక్తులు షట్పదకులమటంచు
హారికుచములు లికుచములంచు నెంచి, సతులు వనదేవతలటంచు మతిఁదలంచు.

సీ. బెళుకుఁజూపులమించు కలికికన్నులు గాంచి యందుటుజింకలటంచు మదిఁ దలంచుఁ
దిన్ననినన్నంపు నెన్నడుములు చూచి కొదమసింగములంచు మదిఁదలంచు
జికురబంధాభోగచకచకల్ వీక్షించి మవవచ్ఛురులంచు మదిఁదలంచు
మందయానంబులయంద మాలోకించి మాతంగఘటలంచు మదిఁదలంచుఁ

తే. గాని యమ్మానిరూపరేఖానితాంత, కాంతకాంతావయవచింత యింత యైనఁ
బూనఁ డాజన్మమృగచయానూనపరిచ,యక్రియాధీనమానసుం డగుటఁ జేసి. 123

వ. ఇత్తెఱంగునం గురంగనయనాస్వరూపం బెఱుంగక మెలఁగుసహజముగ్ధస్నిగ్ధహృద
యుం డగుతపోధనుని ధైర్యంబుఁ గనుంగొని. 124

సీ. మగలు మాభ్రూవిభ్రమముఁ గాంచినపుడెల్ల మరుఁడు సింగిణివిల్లమర్చి యార్చుఁ
జూపఱు మాయూరుసొబగు గన్నపుడెల్ల మారుఁడెక్కుడుఁ దేఁటినారి మీఱి
రసికులు మా మూపు వన గాంచినపుడెల్ల దర్పకుం డరిఁ గూర్చుఁ దళుకుఁదూపు
సుగుణులు మా మోముజిగి గనునపుడెల్ల వలరాజు జళిపించుఁ దలిరువాలు

తే. మున్ను మాకు సహాయుఁడై యున్నవాఁడు, మించుమదనుండు నేఁడాక్రమించ వెఱచు
నితఁడు మమ్ముఁజూడఁ దాల్మి పేడెత్తఁ డితఁ, డెంతవాఁడని చింతిల్లి రింతులాత్మ.

సీ. శ్రుతియోగ్యశబ్దసంహతు లుచ్చరింతుము మారసంజ్ఞారూఢి ధీర ! చూడు
మతనుశాస్త్రాయాసగతి యెఱింగింతుము మముఁ గటాక్షించు సంయమివరేణ్య !
యనురక్తి గూడుమా యష్టాంగయోగవైఖరి గాఢముగఁ జూపఁగలము ధన్య !
ప్రౌఢిఁ బరీక్షించు పంచాంగుళిన్యాసరచనావిధానమో యచలహృదయ !
తే. చదివితిమి పెక్కువిటయోగచర్యలెల్లఁ, దెలియుమీ మాకు నాగమకళలయందుఁ
గలుగు భేదంబులెన్నైనఁ దెలుపఁగలము, మీరహస్యంబు లెఱిఁగింపుమీ మునీంద్ర !

మ. ఆసనబంధబంధురసమాధియు నింద్రియనిగ్రహైకని
ధ్యానముఖత్వమున్ బవనధారణశక్తియుఁ మాకు నేర్పరా ?
దాసకలంబు మీ రతిరహస్యముగా భవదంఘ్రిసేవ ని
చ్ఛానసముదగ్రతం బరమసౌఖ్యము గాంచెద మోశపోధనా ! 127

క. అని పాడి రపుడు నృత్య, ధ్ధ్వని కేకి ఫణీంద్రమున్ ద్రవత్పాషాణం
బును నిశ్చేష్టకురంగం,బును మూకీకృతపతంగమును గా నచటన్. 128

మ. అకళంకేందుముఖీశిఖామణి యొకర్తాలాపముల్ చేసెఁ గా
నకళాదేవతవోలెఁ బల్లవితవీణాదండకాండంబుఁ గో
రకితస్థాణువుగాఁ జగత్త్రితయమున్ రాగాబ్ధి నోలాడ గా
యకవేళాదిసమస్తదోషపరిహారాకుంఠకంఠధ్వనిన్. 129

ఉత్సాహ.—

భామ లిట్లు పాడ నాతపస్వి యమ్మునీశ్వరుల్
సామవేదపాఠగాఢచాతురీధురీణు లా
రా! మహాత్ము లంచు వీరిరమ్యవిద్య నేర్చెదం
బ్రేమ నంచు సఖ్య మాచరించ నెంచు నంతటన్. 130

చ. అణునిభమధ్య లా క్రియలు నాపరిభాషలు నొప్పఁ జిందు జ
క్కిణికొరవంజి మేళములఁ జీలిక సల్పిరి దేవతానటీ
మణులకుఁ బొమ్మవెట్టుక్రియ మర్దళతాళనినాదపద్ధతిన్
రణదురురత్ననూపురఝణంఝణముల్ మెఱయం బదాహతిన్. 131

క. ఆకమలాస్యల లాస్యల, లాకలనావేశకౌశలవిలాసములా
లోకించి యాతపోధన, లోకాగ్రణి యిట్టు లాత్మలోనం దలఁచెన్. 132

శా. బాలోన్మత్తపిశాచలీలలఁ బరబ్రహ్మానుసంధానవి
ద్యాలబ్ధిన్ హరిభక్తు లౌమును లమందానందనిర్మగ్నులై

హేలావర్తనగీతులన్ మెలఁగుచుం ద్రిలోగునన్ వారె కాఁ
బోలున్ వీరని యమ్మహామహుఁడు సమ్మోదంబు నొందెన్ మదిన్. 133

వ. అని తలంచునమ్మునిముఖ్యునకు నాత్మసఖ్యాభిముఖ్యంబు కలుగుట గనుంగొని
లతాంగు లిట్లనిరి. 134

క. మాయాశ్రమమ్ము లంగజ, మాయాశ్రమముల్ హరించుమా బడిరమ్మా
మాయూరు లింతడాసినఁ, బాయక యుండెదవు నీతపం బీడేరున్. 135

క. విందారగింప విచ్చే,యం దగు మాగీములందునని మునిజనకుం
డందులకు రాకమును పే, యిందుముఖుల్ వానిఁ గొంచు నేఁగిరి వేగన్. 136

క. చని రోమపాదురాజ్యం,బునకు ననావృష్టిదోషముఁ దొలంగఁ గరం
బనుకూలవర్ష మొదవం,గ నొనర్చెన్ మార్గవశముగ న్నిల్చి యటన్. 137

తే. ఇట్లనావృష్టి మాన్పమునీంద్రు రాక, రోమపాదధరిత్రీశ్వరుండు మెచ్చి
తనతనయ శాంత పేరి కాంతాలలామఁ, బరిణయ మొనర్చె నాలోకపావనునకు. 138

ఆశ్వాసాంతము.

మ. క్షణదాధ్యక్షసుపర్వవృక్షబలిశిక్షాదక్షదాసాధ్య! దా
క్షిణదర్పప్రతిపక్షభూభృదటవీరూక్షాతిఘోరాశుశు
క్షణి! భూరక్షణదక్షిణస్ఫుటకటాక్షా! నిత్యసత్యక్షమా
గుణ! హార్యక్షసదృక్షశౌర్యసమరక్షోదక్షమప్రాభవా! 139

క. పూర్వాదిపుణ్యరాజా, ఖర్వకథాగతివిబోధకవిహారసగ
ర్వార్వఖురటంకమార్జిత, సర్వాహితవీరముకుటచయఘటితమణీ! 140

మాలిని.—

తరణిసదృశతేజా! దాతృతారాజరాజా!
గురుబుధసురభూజా! కుంభినీరాజరాజా!
సరసగుణసమాజా! శాత్రవాంభోజరాజా!
నరవరవినుతౌజా! నైపుణీభోజరాజా! 141

గద్యము. ఇది శ్రీమదొంటిమెట్ట రఘువీరశతకనిర్మాణకర్త జగదేకఖ్యాతిధుర్యాయ్యల
రాజు తిప్పయమనీషిపర్వతాభిధాన పౌత్రాక్కయార్యపుత్ర పరిశీలితసమిద్ధ
రామానుజమతసిద్ధాంత మర్మ ముమ్మిడివరదాచార్యకటాక్షవీక్షాపాత్ర హృదయపద్మా
ధిష్ఠిత శ్రీరామభద్ర రామభద్రకవిప్రణీతంబైన రామాభ్యుదయమహాప్రబంధం
బునందు ద్వితీయాశ్వాసము.






# తృతీయాశ్వాసము.

రఘునాయకచరణాం
భోరుహరసపరవశైకపుష్పంధయ! గం
భీరగుణోదధి! నిజయ
శ్శ్రీరత! గోబ్బూరి నారసింహనృపాలా! 1

వ. అవధరింపుము తదనంతరకథావిధం బెట్టిదనిన. 2

## వేశ్యలు ఋశ్యశృంగు నయోధ్యకుఁ దోడ్తెచ్చుట.

మ. రమణుల్ సంభ్రమమూని మానిఁ గొని తేరం గాంచి రేతెంచి చూ
పు మెఱుంగుల్ కచమేఘముల్ దడబడం భ్రూమండలీశక్రచా
పము లేకాకృతి మీఱ హారకరకాపాతం బురోజాద్రిపా
ర్శ్వములన్ సామ్యము నొంద నప్పటికి వర్షాలక్ష్మితోఁ బుట్టువై. 3

చ. ఇతఁడు తపస్వివేషదివిజేంద్రుఁడ తప్పదు గాక యున్న నాఁ
డితఁ డరుదేరఁ దోరణము లెల్లెడలందు నమర్చి పేర్చిన
ట్లతులసుపర్వకార్ముకచయప్రభ నింగి నలంకరించునో?
యితనిప్రయాణభేరులయి యెంతయుం మ్రోయునో మేఘమాలికల్? 4

మ. అని పైపైఁ బ్రమదంబునన్ బురమువా రాబాలగోపాలమున్
గనుఁగో నమ్మునిలోకచంద్రముని దృక్పర్వంబుసంధిల్లఁ జే
యం నజేయన్ నిఖిలాఘమోఘకరణోద్యుక్తప్రభావాధికుం
జనపాలాగ్రణి తెచ్చె నచ్చెరువుగా శాంతాసమేతంబుగన్. 5

మ. జలబిందుచ్యుతికల్మి జల్లెడలయోజన్ బోల్చెఁ గార్మొగుల్
బలుగమ్మచ్చుల సాఁగఁగా దిగిచి కాలస్వర్ణకారుండు వె
గ్గలమై యంబరలక్ష్మి కాభరణముల్ గావించెనో నా నిర
గ్గళదీప్తిన్ గనుపట్టె నప్డు మెఱుఁగుఁదీఁగెల్ కంకణవ్రాతముల్. 6

క. ఈపగిదిఁ భీకరకర, కాపాదస్తనితవిద్యుదాటోపమరు
చ్చాపలతా శ్రీకరమై, యాపుణ్యఘనాగమము ఘనాగమ మయ్యెన్. 7

—దశరథుఁడు శాంతాయుతుఁ డగుఋశ్యశృంగుఁ బూజించుట.—

క. ఆదంపతులం గొనిచని, పూజించెన్ వినయపూర్వముగ మగువలతో
రాజిల్లఁ జేర్చి దీప్తిన్, రాజిల్లుమణీమయాసనం బిడి కూర్మిన్. 8

క. సుతజనికారణ మగునన, య్యతి యతిథివ్యాగతిం బ్రహర్షోత్కర్షా
న్వితలైరి దశరథక్షితి, పతికులశేఖరుని ధర్మపత్నులు కోర్కిన్. 9

క. మునిచంద్రునియకలంకా, భినవద్యుతి మీఁద మీఁదఁ బ్రేమం గ్రోలెన్
దనివి సన కపుడు నృపము, ఖ్యునికులపాలికల దృక్చకోరశ్రేణుల్. 10

క. పరమతపోనిధి నమ్ముని, నరపతి యీగతి పునఃపునఃపూజాసం
స్కరణంబుల నతిసంతో,షరసాంబుధిఁ దేల్చి సూక్తిచాతురిఁ బలికెన్. 11

క. ఈశుద్ధసత్త్వరీతి మ,హాశార్ఙ్గశ్రీవిభూతి నాశారివి గా
కో శాంతాధిప! పరమద,యాశాలీ! ఋశ్యశృంగ! యతిమాత్రుఁడవే? 12

—పుత్త్రకామేష్టి—

చ. అని కొనియాడి యాత్మనిలయంబున నొక్కెడ మౌని నుంచి మం
తనమునఁ బుత్త్రకామసవనక్రియకున్ దగుయత్నము ల్విధా
నున కటఁ దెల్పి యమ్మునియనుజ్ఞ నయజ్ఞుఁడు యజ్ఞకర్మక
ల్పనమతి నమ్మహీపతిలలాముఁడు పొల్చె మహోత్సవంబునన్. 13

క. ముష్టింపచచరితామృత, వృష్టిన్ నిజదారసస్యవిసరంబునకున్
బుష్టి ఘటియించె నతిసం,తుష్టమనోరథుఁడు దశరథుఁడు భూవిభుఁడై. 14

మ. అలఘుశ్రీనిధి విశ్వభూతలవరుం డాఋశ్యశృంగర్షి ము
ఖ్యుల ఋత్విక్కుల నప్డు దేర్పఱిచి యాగోద్యోగరాగాంతరం
బులు సందీక మదిన్ బెనంగ నుచితంబుల్ ద్రవ్యముల్ తోరహ
త్తులుగాఁ గూర్చి నిజాంగనాజనసమేతుం డై ప్రమోదంబునన్. 15

క. హారిసరయూసరిజ్జల, పూరంబులఁ గ్రుంకి యాగభూస్థలి చేరన్
బ్రారంభించిరి నిగమా, కారులు యాజకులు పుత్త్రకామాధ్వరమున్. 16

చ. అలనృపయాగభాగఫల మాన దివిన్ బలభేదియాదిగాఁ
గలసుర లేగుదెంచి కుతుకంబున నుండఁగ వారి వారిజా
క్షులతుద వాఁడికో డెవలిగుబ్బల జొబ్బిలునమ్మృగీమదో
జ్జ్వలతరగంధసారము లసారము లయ్యె నిరర్థకస్థితిన్. 17

క. ఆవర్తధూమచికురము, రావహముక్ శ్రుతిమనోహరస్వరము శుభాం
గావిష్కృతంబు నై భా,షావేశము దాల్చె నపుడు మఖవాటి తగన్. 18

క. చుట్టు నపరంజిబంగరు, టిట్టికపనిహోమకుండ మింపొందఁ గటిన్
గట్టినపీతాంబరమై, తొట్టినపొగచాలు లచ్చిదోరమైడాలా. 19

తే. వ్యంజనవిభక్తిచాతురి నంక మొంది, కర్మకారకగుణవృద్ధి గరిమ నొంది
యుత్తమాగమపురుషాగమాత్తమగుచుఁ, గ్రతుభుజక్రియ మించె వ్యాకరణసరణి.

క. పాకవిధానం చిత్రం, శాకరుచిం కిం వదామి సమతా నాస్త్య
స్తోకదధిఘృతానాం నా,నాకల్పితఫలరసాయనానా మనుచున్. 21

క. పలుమాఱు మెచ్చి పరికర,ములఁ గులికెడుభక్ష్యలేహ్యములఁ బానీయం
బులఁ జోష్యములఁ జతుర్విధ, కలితాహారములఁ దృప్తి గాంచిరి విప్రుల్. 22

క. అమృతముకంటెను మధురము, నమలము నతిరుచియుఁ శుచియుఁ నని యమ్మఖహ
వ్యము చవులఁ దవిలికా క,వ్యమరులు దివినుండి నేల కరుదే నేలా? 23

తే. తాను బశుపతి యయ్యు సంతసమునొందె, ఖండపరశుండు పశుబంధకర్మమునకు
సోమభూషణుఁ డయ్యును శ్రమఁ జెందె, సోమశోషణవిధికిది చోద్యమెందు. 24

క. ఘనధూమోదయ మంబర,మునఁ దార్కొని శ్రుతిమనోజ్ఞభూరినినాదం
బున గర్జిల్లఁగ దాండవ, మొనరించెన్ సవనశిఖి సముత్సాహమునన్. 25

తే. ఆత్తసోమంబు నజహన్మృగాజినంబుఁ, బరిచితశ్రుతిపదముఁ గపాలయుతము
హవ్యవాహనధరమునై హరునివిగ్ర, హంబుఁదలపించె నయ్యధ్వరాలయంబు. 26

తే. విమలశిఖిహూయమానహవిర్వితతులు, గీయమానశ్రుతిధ్వనుల్ లీయమాన
మధురపరమాన్నములు సూయమానసోమ,లతలునై యాక్రతుక్రియాగతులుమించె.

క. కీలాకరములఁ గ్రతుభు,గ్జాలములకు హవ్య మియ్యఁ జనులీల సము
ద్వేలప్రవర్గ్యవేళా, లోలహుతాశనుఁడు వర్తిలు మహోన్నతుఁడై. 28

క. పావనహవిర్వికస్వర, పావకు లన సత్త్రమునులు భాసిల్లిరి నా
నావిధమణిభూషణవ,స్త్రావళులం బూని యుజ్జ్వలాకారములన్. 29

## సురలు వైకుంఠమున కేగుట.

క. ఈగతి గతాఘయోగము, యాగము వర్తిల్ల రావణార్దితమతులై
వాగీశ్వరానుమతులై, సాగరవరశయనుఁ గానఁ జనిరి సుపర్వుల్. 30

ఉ. అప్పుడ యప్పయోనిధిశయానుఁడు మేల్కనె గర్భయుక్తమై
యొప్పు జగత్త్రయంబు తనయొప్పమి గానఁ బరస్పరవ్యథన్
నొప్పరి పద్మపత్త్రయుతనీరగలిం జలనంబు నొంద శా

చప్పుడులోన నెచ్చరిక సల్పఁ బ్రబోధము నొందెనో యనన్. 31

తే. నెవ్వఁ డెరువరి చల్లనిసేద మ్రాఁకు, రోగి వెజ్జునుఁ బోలె మరుద్గణంబు
కోరి తాపత్రయవిదూరకారి శౌరి, నాద్యు భవరోగవైద్యు డాయంగఁ జనిరి. 32

వ. చనిచని. 33

క. ఆలోకించిరి వేల్పులు, వేలావేలానిరోధవిచలద్వీచీ
డోలాలీలాలోలము, రాళ్శ్రీకరము దుగ్ధరత్నాకరమున్. 34

క. హారికి మణిపేటి గౌరీ, శ్వరునకు నవతంసపుష్పవాటియు నగు నా
శరనిధులమేటిఁ గనె నా, తురత మరుత్కోటి భూవధూటీశాటిన్. 35

క. అని కలశజలధి నివ్విధి, ననిమిషులు నుతించి రప్పుడు యూతాయాతా
భినవాయతోర్మిఘుమఘుమ, నినదజిగీషోత్థపటిమ నిహతశ్రములై. 36

క. నెత్తమ్మిబొమ్మరిండ్లన్, బుత్తడిబొమ్మవలె మెలఁగుపుత్త్రి న్హరిలో
కోత్తరవరుఁ డౌ టెఱిఁగి యుం, దాత్తమతిన్ దారవోసి తలరి పయోధీ. 37

మ. సరయూజహ్నుసుతాసరస్వతులఁ గృష్ణా గౌతమీ సింధు భీ
మరథీవేత్రవతీ కవేరతనయా మార్తాండజా గండకీ
వరుణా మేఖలకన్యలం గలసి తేవ స్వైరతో వారిఁ ద
త్పరయుక్తిన్ సమబుద్ధి నేలితి గదా పాథోనిధానాగ్రణీ! 38

క. బంగారుమగువమగఁడీ, యంగజగురుఁ డల్లుఁ డఁట కృతార్థంబై యొ
ప్పుం గద నీజీవనమో, గంగాముఖనిఖిలనిమ్నగాగృహమేధీ! 39

క. పరమామృతమిడి చావున్, జర మానిపి మమ్ము మనుపఁ జాలినకరుణా
పర! మాదృశు లగువారికిఁ, దరమా నినుఁ బొగడఁగా సుధాసాగరమా! 40

క. అల్లుఁడు నీ కాహరి నీ, వల్లుఁడవై తతనికిన్ దదంఘ్రికుమారీ
వల్లభుఁడ వైతి చిత్రము, కల్లోలవతీకళత్ర! కల్మషజైత్రా! 41

వ. అని పొగడి మగుడమగుడ నిచ్చ మెచ్చి యచ్చెరువడి వియచ్చరుల కమృతాన్నదా
తయుం నచ్చరులకుఁదాతయుం నగునానిగనిగరత్నంబులగనింగని యంతరాంతరసహజ
ముక్తాఫలగుళుచ్ఛాచ్ఛాదితంబును విమలకమలరాగమఘవమణీ రమణీయంబునునగు
కలశపాథోధిసౌధప్రదేశంబులఁ బలువగలచలువగలకమ్మతెమ్మెరల శ్రమభరమ్ముదీఱ
నరుదేర మఱుంగులంగలిమిచెలువంగలసిమెలసి యలసియోగనిద్రం గూరితేరి కొలువు
ఠీవిం దెల్లదీవి భువనేశ్వరంబుగా నచ్చటం బలుకుచిలుకలకొలికిసంగడీఁడును జడల
నొడల నెలంతలన్నిలుపు వలపుబూదిపూఁతయొడయండును రెండుగ్రేవలం జెందివంది
వైఖరుల శ్రుతిమనోహరవచనరచనాచమత్కారంబులఁ గైవారంబుల దొరయుగరుడ

గంధర్వకిన్నరకింపురుషయక్షగానంబు లనూనంబులై చెరయ నిర్యత్ననిర్యన్నారా
యణాతిమధురనాదానువాదకరాగ్రజాగ్రన్మహితమహతీవికస్వరస్వరంబులు మెఱ
యు నెఱయం బ్రమదంబు మీఱి శౌరి పేరోలగం బున్నయవసరంబున. 42

క. వచ్చిరి సురలు సుమాంజలు, లిచ్చిరి హరి యున్న నెలవు నిం పగు చెలువున్
మెచ్చిరి యాశౌరికిఁ గృపఁ, దెచ్చిరి పొడగాంచి తమదు దెస గన్నంతన్. 43

## సురలు శ్రీమన్నారాయణు సేవించి స్తుతించుట.

ఉ. తెల్లనిదీవితమ్మినెలదేఁటివలెన్ దగునొక్కబాగరిన్
నల్లనివాని లచ్చి రతనంబును మచ్చ యెదం దలిర్ప రం
జిల్లెడువానిఁ జుట్టలుగుఁజెందము నందినవానిఁ బెంపు సొం
పెల్లెడఁ గల్గుపాల్కడలియిల్లటనల్లునిఁ గాంచి రయ్యెడన్. 44

సీ. తొవతమ్మివిందుగన్దోయి మించినవాఁడు జాళువామిసిమిపచ్చడమువాఁడు
కన్నువీనులసెజ్జనున్నవన్నియవాఁడు తపసిడెందపుటిండ్లఁ దనరువాఁడు
కలిమిచేడియఁ బంటవలఁతి నేలినవాఁడు పుడమివేల్పులకుఁ జేపడినవాఁడు
తొంటిజేజేమూఁకఁ దూలింపఁగలవాఁడు ముజ్జగంబులమూలుబొడ్డువాఁడు
తే. సొగసి నవ్వక నవ్వునెమ్మొగమువాఁడు, కలుములీనెడుతళుకుఁగ్రేగంటివాఁడు
పేదసాదల బ్రదికించు పెంపువాఁడు, పాలమున్నీటిలోనఁ జూపట్టెనపుడు. 45

ఉ. నిస్తులబాహుమధ్యమున నీరధిముద్దులపట్టియింటిలోఁ
గౌస్తుభరత్నదీపకలికానవకజ్జలరేఖవోలె రో
చిస్సవనీయనీలతులసీదళశీతలదామ మొప్ప గ
ర్భస్తిమితత్రిలోకుఁ డలపన్నగశాయి దలిర్చె నచ్చటన్. 46

క. నీలమణివిద్రుమోల్బణ, లోలోర్ములఁ దెగడు నాపిలోచనరోచి
ర్మాలికలు త్రివిధవర్ణ, శ్రీలం దళుకొత్తు నుల్లసిలు హరి యచటన్. 47

చ. కడు నపరంజిచాయ లొలుకం గలపొక్కిటితమ్మికమ్మ పు
ప్పొడిసుడిగాలిఁ జుట్టుకొనఁ బోలు ననన్ మొలఁ గ్రొంబసిండిప
చ్చడము దలిర్ప నాజలధిజాపదయావకబిందులీల యే
ర్పడి యెదఁ గౌస్తుభం బమర రంజిలుఁ గంజదళాక్షుఁ డయ్యెడన్. 48

తే. నాభిపద్మాంతరావర్తనద్విరేఫ, మాలికాకృతనిజభుజామధ్యసీమ
వ్రేలువనమాలిక దలిర్పఁ బాలకడలి, నాత్రిలోకీగృహస్థుఁ డొప్పారుశౌరి. 49

తే. శైరవాబ్జసుహృత్తులై కాంతిమహిమ, నలరునీరెండు రెంపుగన్నులని తెల్పు
కరణిఁ గరముల శంఖచక్రములు దాల్చి, పెల్లురాగిల్లు మున్నీటియిల్లుఁ దచట. 50

తే. చామనపుమేనిమొగులుపై సంజకెంపు, లోఁతుపొక్కిటితమ్మికి లేఁతయెండ
దొరయఁ జేయుఁ బ్రశస్తకౌస్తుభగభస్తి, నలరు హరి ధాతుమయకజ్జలాద్రి వోలె. 51

క. చుక్కలరా జొక్కఁడె కాఁ, డక్కఁక వెలుంగు హృదయమందు జనించెన్
నిక్కమని తెల్పుక్రియ నెదఁ, జక్కన్ గౌస్తుభముఁ దాల్చె శౌరి దలిర్పన్. 52

క. డెందంపుమానికంపుం, గెందామర క్రేవఁ దేఁటిక్రియ సిరి బిగిచం
టం దార్చె నంటుకస్తురి, చందంబున మచ్చ మీఱ శౌరి దలిర్పన్. 53

శా. చుట్టుంగైదువజోదు ప్రామినుకుటంచుల్ మెట్టుపెన్ బ్రోడ పొం
బుట్టం బూనినవన్నె వేల్పు దొరవేల్పుం జెట్టరాకాసులన్
జట్టల్ చీఱెడిదిట్ట పంటవలఁతిన్ జాబిల్లితోఁబుట్టుఁ జే
పట్టంగల్గినభాగ్యశాలి యటులం బాటిల్లె జేజేగముల్. 54

క. చేరి భువనత్రయీసం, సారి నృశంసారి శౌరి సముదీర్ణకృపా
హారిం దాపసహృదయవి, హారిన్ గొనియాడి రీక్రియన్ మధువైరిన్. 55

క. హరయే జితమురదరయే, తరయే భవవారిధేశ్చ ధన్యజనానాం
సురతరవే స్మరగురవే, స్థిరవేదమయాయ దేవదేవాయ నమః. 56

స్రగ్ధర.—
శ్రీమన్నేత్రాంచలాయ శ్రితభరణ! నమస్సింధుకన్యావరాయ
క్షేమారామాయ మాయాకితవదితిభవక్లేశకృత్ప్రాభవాయ
శ్యామాయ క్ష్మాపతే! తే జటిహృదయగృహస్థ! ప్రసీద ప్రసీద
స్వామి! న్త్వాం పాహి పాహీశ్వర! వరద హరే! శార్ఙ్గపాణే! కృపాళో! 57

వ. అని మఱియును. 58

క. అనుపమ మజేయ మాద్యం, బనవద్య మమేయ మవ్యయం బనపాయం
బనవధి నీచరితం బో, వననిధిపర్యంక! పొగడ వశమా నిన్నున్? 59

క. ఓడవు సురాసురాదుల, కోడవు భవజలధి గడవ నొం డెవ్వఁడు నీ
జోడుజగంబుల మాకున్, జోడు భవత్కరుణ మనుపఁ జూడు మహాత్మా! 60

క. విడఁ గంటిమి భవబంధము, పొడగంటిమి కోర్కె సఫలముగ నిన్నిట నీ
కడకంటిమిసిమి పొలయం, గడగంటిమి నేఁడు విపదగాధాంబుధికిన్. 61

ఉ. ఆర్తుల నీవ నేర్తు వరయంగఁ ద్రిమూర్తివిలాసవర్తివై
కర్తవు భర్తవుం దలఁపఁగాఁ బరిహర్తవు నీవ నీవ చి
న్మూర్తివి నీవ పోషణచణుండవు కర్తు మకర్తు మన్యథా
కర్తు ముదారశక్తియుఁ జగంబుల నీవ కదా గదాధరా! 62

చ. అణునిభమధ్య నీగృహిణి యార్తశరణ్య త్రిలోకమాత వీ
క్షణములు తద్దివాకరనిశాకరమూర్తులు పద్మగర్భగ
ర్భిణి నతనాభి యామరసరిజ్జనయిత్రి భవత్పదాంగుళీ
మణి తగు నీకు నిట్టియసమానమహత్త్వము కైటభాంతకా! 63

తే. నీవ గుణాకృతి వహించు నిర్గుణుండ, వీవ జననీజనకరీతి నిజ్జగంబు
మనుప దుష్టాసురకులంబు మడియ లడఁప, సగుణధర్మంబు చేకొన్న శార్ఙ్గి వీవ. 64

తే. క్రొవ్వి కయ్యంబునకుఁ గాలుద్రవ్వి నొక్క, పదితలలరక్కసుని చేతఁ బడని పాట్లఁ
బడితి మార్తశరణ్య! నీప్రాపు గలిగి, యుండఁగా నిట్టికొదవ మాకొదవ నేల? 65

ఉ. ఏమని విన్నవింతు మఖిలేశ్వర! రావణబాధ? బ్రహ్మరు
ద్రామరయక్షరాక్షసుల కద్దనుజేంద్రుఁ డజేయవర్తనుం
డై మెఱయన్ విశిష్టమునియజ్ఞతపోజపనిత్యకృత్యని
ష్ఠామహనీయధర్మములు సాఁగఁగనీఁడు మహోగ్రకర్ముఁడై. 66

క. మాయాపదఁ బాపుము వా,లాయ మశక్తులము 'దుర్బలస్య బలం రా
జా' యని యజేయుఁ ద్రిజగ,న్నాయకుఁ జక్రధరు నిన్నె నమ్మితిమి హరీ! 67

క. కింకరత నన్యభజనా, తకంబులఁ బడక నిన్నె తలఁపుదుము 'నదై
వం కేశవాత్పరం' బని, పంకేరుహనాభ! దనుజభయ ముడుపఁగదే. 68

క. జలచరయుంగకిటినరమృగ, బలిభిద్భృగురామలీలఁ బాటిలి సురవై
రులఁ జెండాడితి వీక నొక, విలసద్వేషమునఁ దునుమవే దశకంఠున్. 69

శ్రీమన్నారాయణుఁడు ప్రసన్నుఁడై రావణుఁ ద్రుంతుననుట.

క. నావుఁడు గృపతో నాసుమ, నోవర్గముఁ జూచి యిట్లనున్ వెఱవకుఁడీ
దైవతములార! త్రిజగ,ద్రావణు రావణుని దాశరథినై త్రుంతున్. 70

చ. సురవరులార! నాప్రతిన చూడుఁడు నేఁ డుడుగుండు సాధ్వసం
బరమర లేక వింటి భవదాపదవస్థలు నాశిలీముఖో
త్కరముల కెంతయున్ దనివిగా నతిమాంసలపఙ్క్తికంఠని
ర్భరతరకంఠనాళనవరక్తమరందము విందు చేసెదన్. 71

క. వసుమతి జనించి దశరథ, వసుధాధిపసూతినై యవశ్యము నిపు డ
య్యసురహితుఁ బఙ్క్తికంధరు, నసురహితున్ జేయుదున్ భయంపడ నేలా? 72

క. అని యనునయించి వేల్పుల, ననిచి రమారమణుఁ డపుడ యంతర్ధానం
బొనరించెఁ బఙ్క్తికంధర, దనుజవధార్థము నృపావతారం బొందన్. 73

క. సురలు నిజాంశంబుల శ్రీ, ధరునిన్ దశరథసుతావతారోద్యుక్తున్
హరి నాద్యు ననుసరించిరి, ఝురలహరులచేత గిరులు జలధిం బోలెన్. 74

దశరథునకు దివ్యపురుషుఁడు పాయసపాత్ర మిచ్చుట.

తే. అంత యాగాంతమునను హోమాగ్నినుండి, దివ్యపూరుషుఁ డొకరుఁడే తెంచినిలిచి
చారుచరుపూర్ణకనకభాజనముఁ దెచ్చి, సదయుఁడై యిచ్చె నాదశస్యందనునకు. 75
తే. శ్రుతులు తలమోచితెచ్చినయతులరుచిర, చరుమయామేయవిష్ణుతేజంబు విభుఁడు
జలజరాగైకకరములసంగ్రహించె, రవిసుధాకరకిరణసారంబువోలె. 76

దశరథుఁడు పత్నులకుఁ బాయస మొసంగుట.

తే. చరువు గైకొని నృపతి యచ్చెరువునొంది, యిది మదీయతపఃఫలంబిది యఖర్వ
పూర్వజన్మకృతాగణ్యపుణ్యసార, మార నేఁ డిట్లు గోచరంబయ్యె ననుచు. 77
క. ఆలకోసలకేకయతన, యల కిడియెన్ బంచి పాయసాన్నము నీలో
త్పలనీకముద్వతీక, న్యల కన్నెల కరసుధాంశ మందిచ్చుగతిన్. 78
క. ఇచ్చినఁ గని యిరువురుఁ బోర, బొచ్చెము లేకపుడు సవతిపోలఁతి సుమిత్రన్
మచ్చికఁ బిలిచి కృపామతి, నిచ్చిరి చెఱుసగము తమకు నిడినందులలోన్. 79
క. తమతమభాగము లుత్తమ, తమచారిత్రలు తటిల్లతానేత్రలు భూ
రమణురమణుల్ భుజించిరి, క్రమమున ధరియించి రలఘుగర్భోదయముల్. 80

కౌసల్యాదులు గర్భిణు లగుట.

క. వారలలోఁ గౌసల్యా, నారీమణి యఖిలపావన శ్రీమద్గ
ర్భారూఢలక్షణంబులఁ, గారాబముఁ జెందె విభుఁడు కడు రంజిల్లన్. 81
ఉ. వారిదఖండముల్ తుదల వ్రాలె ననన్ మొదలందుఁ గప్పు చే
కూరఁగ నొప్పరెండుచనుఁగొండలనుండి జనించి పొల్చుశృం
గారరసప్రవాహ మనఁగాఁ గనుపట్టిమెఱుంగుబోఁడి నూఁ
గారు దలిర్చు నాభివివరాగతకృష్ణభుజంగమాకృతిన్. 82
ఉ. బాలకురంగలోచనకుఁ బాటిలుమోహననాభిమండలా
వాలమునన్ జనించి పరువంబున మీఁదికిఁ బ్రాఁకురోమరా
జీలత నుద్భవిల్లి విలసిల్లుకుచస్తబకద్వయంబునన్
వ్రాలినగండుఁదేఁటు లన వర్తిలుఁ జూచుకమేచకప్రభల్. 83
క. ప్రతిబింబించెనొ గర్భ, స్థితుఁ డగునానీలవర్ణుదేహద్యుతి నా
సతిరోమరాజిరాజిలు, నతులతరశ్లాఘ నీలిమాయతరేఖన్. 84

క. వేణీభరకుచకుంభ, శ్రోణీభారములఁ గౌను సుడివడఁగ గదా
పాణిఁ గరుణించి పల్లవ,పాణికి గర్భంబునందుఁ బ్రాపై నిలిచెన్. 85

క. హరిమధ్య యనుట పరమం, ధరగామినులందు వర్ణనామాత్ర మగున్
బరమార్థము కౌసల్యాం, బురుహాక్షికి విష్ణుగర్భమునఁ బూనుటచేన్. 86

క. భూమానిని యాభూవర, భామామణియాశయంబుఁ బ్రాపించెను మృ
త్స్నామయరీతి భవిష్య, జ్జామాతృవిలోకనప్రసక్తయుఁ బోలెన్. 87

క. తామరసకుట్మలాగ్రశి, లీముఖ మేచకము లయ్యె లికుచకుచాచూ
డామణిచూచుకము లతి, శ్యామలకోమలకుమారజనిసూచకముల్. 88

క. నెలమసల మెఱసె నానృప, కులసతి శేఁగౌను మిన్న కుచకోకముఖం
బులు నల్లనయ్యెఁ గ్రమ్మర, నలఁతంబడె మందగతుల నడుగుందమ్ముల్. 89

తే. ఉదరగతపద్మనాభనల్పోరగేంద్ర, జనితఫూత్క్రియలో నాఁగ నినుమడించె
నొడలియలసత నకనకలొదవఁ బొదలు, బెట్టునిట్టూర్పు లాచంద్రబింబముఖికి. 90

తే. నిగిడి పొక్కిలివిరినుండి నిర్గమించు, నట్టిషట్పదరేఖ దా నగుటఁ జేసి
యారు పేరెన్నికకు నెక్కె యతిశయిల్లుఁ, గప్పునుఁ జాయజిగికల్మిఁ గంజముఖికి.

క. మన్నించునుడిగ మోపక, యున్నం బతి సతిని దౌహృదోదయశుభసం
పన్నత వర్తిల్లెడునెడ, మన్నించుట సిద్ధ మెందు మానినులందున్. 92

మ. బలిసెం గౌను నడ తడంబడియెఁ గన్పట్టెన్ దనుగ్లాని చె
క్కులఁ జన్మొక్కులఁ దెల్పు నల్పొదవెఁ గూర్కుల్ గూర్కొనెంగంట వె
ల్వలఁ బాఱెన్ ముఖచంద్రమండలము పొల్చెన్ నోరు మృద్గంధగం
ధిలమై కోసలకన్యకున్ నృపపురంధ్రీమాన్యకున్ ధన్యకున్. 93

చ. కులమణి యైన యన్నెలఁతకున్ మసలె న్నెల చీరచిక్కె మా
టలఁ దగె మ్రానుపా టెడ నెడన్ వెడగూర్కు జనించె మించె నూ
ర్పులు మనసయ్యె వెల్లిడికిఁ బుట్టెను జాల నరోచకంబు మై
నలఁతయుఁ దొట్టె నోరఁ దఱు చయ్యెను జిట్టుము లోకిరింతలున్. 94

క. సుదతి యతిబోధనిధియై, యుదరస్థితచిన్మయాంబుజోదరతేజో
భ్యుదితరఘువీరగుణసం, పదఁ దెల్పెడుకరణి నిట్లు భావించె మదిన్. 95

చ. అనుపమగర్భభారమున నంగన చంక్రమకేళికిన్ సహిం
పనియలమందగామిని యభంగపతంగమతంగజోగ్రకా
ననసరసీసముద్రభువనంబులు దాఁటి చనంగఁ గోరు నే
మని కొనియాడవచ్చు నుదరార్భకజన్మధురీణవాసనల్. 96

ఉ. కోమలి ప్రోది రాచిలుకకున్ ఫల మర్మిలి నందియియ్య మే
నోమనిదయ్యు నయ్యెడఁ గృపోజ్జ్వలయై సకలార్థితార్థగో
త్రామరుదీప్సితార్థఫలదానమె సేయఁదలంచుఁ గంటక
స్తోమజిగీషమై హరికిశోరము గర్భమునందుఁ బూనుటన్. 97

క. కేళీసరోజదళపుట, నాలసమతి యయ్యు నవ్వ డాత్మఁ దలంచున్
బాలిక పరదళముల నను, కూలప్రతికూలలీలఁ గూర్పన్ విప్పన్. 98

ఉ. పూనిక నాటతోఁటవలపు ల్గలకప్రపుఁగమ్మదూళిపూఁ
దేనియ యేటికాలువలు దీర్పఁగ నోపిక లేనిదౌహృద
శ్రీనిధి యాధరాధిపతిచేడియ సింధునిబంధనక్రియా
నూనచమత్క్రియల్ దలఁచు నుల్లమునందు నహర్నిశంబులున్. 99

క. అతులజలకేలివేళన్, సతి సరసిజబిసము లూడ్వ సైఁపనిదయ్యెన్
శతధా సహస్రధాగతిఁ, బ్రతిభటరిపుకంఠనాళభంగమె తలఁచున్. 100

క. వివిధరిపుజైత్రమతి మిం, చువిధ మెఱిఁగి సురలు గురియుసుమవర్షంబుల్
నవలా ధరింపఁ దలఁకొను, నవతంసశిరీషకోరకాసహ యయ్యెన్. 101

తే. అంతఁ గేకయరాజకన్యకయుం నట్లు, విష్ణుతేజోవిలాసవర్ధిష్ణుగర్భ
గౌరవోదయభద్రలక్షణము దాల్చె, నంగలతఁ బూనుటకు ఫలం బదియకాదె?

క. శ్రీవైష్ణవాంశధూర్వహ, మై విభునకుఁ జూడ్కిపండు వగు గర్భాని
ర్భావద్విగుణితచిహ్న, శ్రీవిధము సుమిత్ర శుభచరిత్ర వహించెన్. 103

క. నవమాసావధిగా ని, ట్లవనీశప్రేయసీత్రయంబు సమస్త
స్తవనీయ గర్భభారము, లవలీల ధరించి మించి రసదృశమహిమన్. 104

వ. అయ్యవసరంబునం గ్రమంబున. 105

## శ్రీరామావతారము.

క. అతిశుభవేళం గనియెన్, సతి కోసలకన్య ధన్య సనయున్ దనయున్
గృతసుకృతి ప్రకృతిసత్త్వము, నతులతరప్రతిభ దుర్లభార్థము పోలెన్. 106

క. ముద్దియ మునిహృత్కమలము, లుద్దామశ్రీసమృద్ధి నొందం గనియెన్
ప్రొద్దులు నిండుటఁ జేసి ల, సద్దీప్తి సహస్రభానుశతకోటినిభున్. 107

క. ఆహరిదశ్వకులంబున, శ్రీహరి దైత్యారి యవతరించెన్ లీలా
బాహుజుఁడై కౌసల్యా, మోహనతరగర్భశుక్తిముక్తాఫలమై. 108

శా. ఉల్లాసాతిశయంబు నొందెఁ జదలే నుల్లోలకల్లోలమై
ముల్లోకంబులు నోలలాడెఁ బ్రమదాంభోధిన్ దిశల్ వొల్చె రా

జిల్లెన్ మానులజన్నముల్ జపతపశ్శీలంబు లారాజయో
షిల్లోకాగ్రణి యప్పు డప్రతిహతశ్రీధాము రాముం గనన్. 109

క. సవనోపభుక్కులాధిప, భవనోపవనోపయుక్తపవనోపకృతా
ర్జవనోపమసుమవర్ష, చ్యవనోపాయనము లబ్బె నబ్బాలునకున్. 110

తే. నెలలు తొమ్మిది మోచి నిర్నిద్రధాము, రామచంద్రునిఁ గన్న యారామతోడ
నొక్కనెల మోచి పతిమేన నోరగుగారి, తారకారాతిజనయిత్రి ధాత్రిసరియొ?

వ. అంత. 112

## భరతలక్ష్మణశత్రుఘ్నావతారము.

చ. వనధిపరీతభూమి యనవగ్రహసౌఖ్యము గాంచఁ గేకయీ
వనరుహపత్రనేత్రయుం నవగ్రహముల్ సదనుగ్రహంబులై
గొనకొని యొక్కటం బదునొకొండవచోటిఫలంబు లియ్యఁగాఁ
గనియె ఘనున్ మనోజగురుకల్పు ననూనజయున్ దనూజునిన్. 113

ఉ. అంత సుమిత్రయుం గనె వసంతవిలాసుల ధర్మశాస్త్రసి
ద్ధాంతరహస్యకోవిదుల నప్రతిమప్రతిభాప్రభావదు
ర్దాంతుల శ్రీనిశాంతుల సుదగ్రగభీరిమచాతురీసర
స్వంతుల నిర్వరన్ విమలచిత్రులఁ బుత్త్రుల సచ్చరిత్రులన్. 114

తే. రాము నభిరాముఁ గోసలేంద్రజయుం భరతు, నిద్ధనయలాభరతుఁ గేకయీపురంధ్రి
యతులబుధమైత్రి సౌమిత్రి ననఘునిఘ్నుఁ, డయినశత్రుఘ్ను నాసుమిత్రయునుఁ గనిరి.

వ. అప్పుడు. 116

క. కురిసె విరిసోనవానలు, దొరసె సుధాంధోవధూమధురగానంబుల్
మొరసె దివిఁ దూర్యరవములు, విరిసెన్ మునిమానసారవిందము లంతన్. 117

క. ప్రతియాయజూకగృహసం, హతుల నటించెన్ బ్రదక్షిణాకృతుల శిఖా
తతు లతులగతుల మెఱయఁగ, హుతవహుఁడు శుభావహోదయోన్నిద్రుండై. 118

చ. అమరతరుప్రసూననిచయంబులవర్షము హర్షమగ్నసం
యములపునఃపునర్జయజయధ్వని కిన్నరసిద్ధసాధ్యగా
నములు వియచ్చరాంగనలనాట్యము మంగళతూర్యనాదముల్
సమసమయప్రయుక్తములు సాగె రఘూత్తము లుద్భవించినన్. 119

తే. హరిచతుర్భుజపౌరుషవ్యక్తులొక్కొ!, యలచతుర్విధపురుషార్థములు వహించు
పుంస్త్వములొ కాక యంగములూని పొలుచు, శ్రుతులొ యననల్గు రారాజసుతులు దగిరి

క. నలుగురుకొమరుల ముగ్గురు, కులసతులున్ గన్నవార్తకున్ దశరథుఁడు

జ్వలమోదచిత్తుఁడై వి, ప్రులకున్ మది దనియ నిడియెఁ బుత్రోత్సవమున్. 121

క. విశ్వప్రియులఁ గుమారుల, శాశ్వతులను నల్గురన్ బ్రసన్నులఁ గనియ
యీశ్వరునికంటె మున్నడి, యైశ్వర్యము గాంచి దశరథాధిపుఁ డలరెన్. 122

ఉ. దైవతమాని కార్యపరతంత్రులఁ బుత్త్రులఁ గాంచెఁ గాన నా
నావిధపుణ్యదానకలనన్ బితృతృప్తినిధాయియై జగ
త్పావనుఁడై ఋణత్రయముఁ బాపుకొనెన్ భళి! మేదినీసుధాం
ధోవిభుమూర్తి యాదశరథుండు మనోరథసిద్ధి సంధిలన్. 123

తే. పదిదినంబులు చన్న భూపాలసతికిఁ, బురుడు వెడలెఁ ద్రయీగణ్యఁ బుణ్యరామ
యతిమనశపద్మమదమధువ్రతముఁ గన్న, పువ్వుఁబోఁడికి జగములఁ బురుడు గలదె?

వ. తదనంతరంబున. 125

## దశరథుఁడు రామాదులకు జాతకర్మాదిసంస్కారములొనర్చుట.

క. అలఘుల నరుంధతీశా, దుల మానులఁ గూర్చి సుతచతుష్టయమునకున్
జెలఁగి యొనరించె నారా, జలలాముఁడు జాతకర్మసంస్కరణాదుల్. 126

క. లీలాసౌధాంతరమణి, డోలాతల్పముల నిడి కడుం దత్పరతన్
బాలికలు పెంచి రానర, పాలకబాలకుల ధర్మపరిపాలకులన్. 127

చ. దొరసి ప్రభాధురంధరుఁ జతుర్దశలోకధరున్ మహాత్ము నే
కరణిని గోసలేంద్రసుత గాంచె నొకో? యని నాభిపంకజాం
తరమునఁ బెక్కు బ్రహ్మలఁ గనం గలవేల్పున కెట్టు బొడ్డు గో
సిరో? యని పల్కి రర్యమరుచిన్ రఘునందనుఁ జూచి చూపరుల్. 128

క. వేదాదుల నెడబాయఁడు, వేదాదుల మరగినాఁడు వీఁ డౌరా! కే
లీదశఁ బరవశుఁడై మే, లీదశరథరాజుభాగ్య మిందఱిలోనన్. 129

క. అని యాగతి నారఘునం, దనుసన్నిధి నున్నమహిమఁ దమమెడలి పురీ
జను లతులజ్ఞానశ్రీ, ఘనులై వచియించి రుక్తికౌశల మొప్పన్. 130

ఉ. ఆదట నీవు నాఁడు కలశాంబుధితుంగతరంగజాలడో
లాదరకేళికావిహరణాభిగతిం గుతుకంబు గాంచు న
య్యాదిభుజంగశాయివి ధరాధిపునింటఁ బసిండితొట్లలోఁ
దాదృశసౌఖ్యమందితిగదా కితవార్భక! యంచు నవ్వుచున్. 131

ఉ. పట్టెఁ బసిండితొట్ల నిడి పట్టికి లోచనగోచరంబుగాఁ
గట్టిరి రత్నకందుకము కస్తురిఁ బెట్టిరి చుక్కబొట్టు జో
కొట్టిరి జోలవాడి రెఢఁ గూర్కనఁ గంటికి ఱెప్పలీల జ

ట్టిట్టెడగాక కాచిరి మహీవరమందిరమందగామినుల్. 132

క. పాలింపు మిజ్జగంబులఁ, బాలింపుగ ద్రావి చలము వాటింపకు మా
పాలింటివాఁడవై రే, పాలింటికి వచ్చినప్పు డరయుము మమ్మున్. 133

వ. అని బహువిధంబుల నుపలాలించి. 134

క. కడుపునకుఁ బెట్టియొడయక, యొడనెడఁ జన్నిచ్చి పాడి యొద్దుపడిపి యొడల్
గడిగి తెలిమడుఁగుఁబొన్నున, నిడి యూగతి రఘుకుమారు నేదిరి దాదుల్. 135

శా. జోజో వారిజబాంధవాన్వయమణీ! జోజో కుమారాగ్రణీ!
జోజో దాశరథీ! దయాశరధి! జోజో కోటికందర్పలీ
లాజైత్రాంగ! శుభాంతరంగ! యని జోల ల్పాడి రింతుల్ త్రయీ
రాజీవాంతరటన్మధువ్రతకిశోరం బైనరామాలికిన్. 136

సీ. మీనంబు నయినాఁడ నేనని సూచించు తెఱఁగున ననిమిష దృష్టిఁజూచుఁ
గమఠరూపము నేన కైకొంటి ననెడు వైఖరి బోరగిలు పీఁపు గానరాఁగఁ
బోత్రివేషము నేన పూని మించితి నంచు నెఱిఁగించుక్రియ ధాత్రి నెత్తమరుగు
నృహరిభావంబును నేన తాల్చితి నన్న పోకఁ బ్రహ్లాదాభివృద్ధి నలరు
తే. వటుగువైపులు గని చూపు వడుగుబాగు, కరము గొడ్డలి నెఱపి భార్గవతఁ దెలుపు
దాశరథవంశశరధిసుధాకరుండు, కేశవవిలాసభాగాత్మశైశవమున. 137

సీ. అభవుఁ డిమ్మేదినీవిభుపురంధ్రీగర్భ శుక్తిముక్తాఫలవ్యక్తిఁ బొడమె
నలశేషశాయి యీయవనిపాలకు నింటి పసిఁడితూఁగుండొట్లఁ బవ్వళించె
వేదాంతవేద్యుఁ డీవిశ్వంభరాధీశు శుద్ధాంతకాంతల జోలఁ జొక్కె
నఖిలపోషకుఁ డీన్నృపావరోధము చక్కి సొంపుమై దాదులు పెంపఁ బెరిగె
తే. నితనిపుణ్యం బగణ్యమిం కితనితోడ, వాసవుఁడు గాఁడు ప్రతివాసి గీసవిలితి
తమ్ముఁ డతనికి శార్ఙ్గి యీతనికిఁ దనయుఁ, డగుట దశరథుఁడన్యుఁ డేయనిరి బుధులు.

క. రాకామరునిమాత్రంబె య, శోకికమసియతరకళానిధి యని యా
లోకించిరి పైపైఁ బ్రజ, లాకౌసల్యాస్తనంధయమణిన్ బ్రేమన్. 139

వ. అంత నక్కుమారుండు. 140

క. తానును రజోగుణాత్మకుఁ, డైన తెఱంగెఱుకపఱుచున ట్లాత్రిజగ
న్మానితశుభశైశవ ల, క్ష్మీనిధి వర్తిల్లుఁ బాంసుకేళీపరతన్. 141

క. కూర్చుండ నేర్చె నయ్యెడ, లార్చిన్నుఁడు రఘుకుమారుఁ డరివర్గముఁ బో
కార్చి తపోరతినియతిన్, గూర్చుండఁగఁ గలిగె మునులకున్ సుఖవసతిన్. 142

తే. ఇట్లు దశరథవసుధాతలేంద్రసూతి, భీతి పగఱకు నాత్మలోఁ బెరుగఁ బెరిగఁ

దొంగియాడంగ నేర్చె దైత్యులు కృశించి, తొంటిమంద మేది మేదినిఁ గుంటువడఁగ.

తే. అలన్నపాలకబాలకుఁ డల్లనల్ల, నడుగు పెట్టఁ గడంగిన నడుగువట్టి
రఖిలదైత్యులు నాఁడె యయ్యాదిదేవు, నడుగు వట్టినఁ గలదె నేఁ డకట నేఁగి.?

తే. దశరథకుమార ! నీ విడుతప్పటడుగు, లుల్లమున నమ్మఁ గాఁ జాల మొండు రెండు
తప్పటడుగుల మనుజగత్త్రయముఁ గొంటి, బలిఁ గికురువెట్టి యనిబుధుల్ పలికి రపుడు.

శా. అప్పా లంచును బారచాఁచి చనుదేరా యన్వయాకల్ప ! మా
యప్పా ! యొప్పులకుప్ప ! యానతకకుప్పా ! యన్నఁ గప్పం గురుల్
గప్పన్ మోమునఁ జిన్నిన వ్వొలయ బంగారందియల్ మ్రోయఁగా
నప్పాపం డరుదెంచుఁ దల్లి తను నూరార్పం దగన్ ముందటన్. 146

క. ఈరీతి మనిరి క్రమమున, నారఘుకులతిలకు లనుదినాభ్యుదయతనూ
చారిమఁ గూఁకటిప్రాయము, వారై గురుమాతృభక్తివశమానసులై. 147

క. ఆమహనీయులలోపల, రాముఁడు లోకత్రయాభిరాముఁడు సుగుణా
రాముఁడు నిఖిలాఘౌఘవి, రాముఁడు చూపఱఁ గరంబు రంజిలఁ జేయున్. 148

## రామాదులు శాస్త్రాభ్యాసము సేయుట.

క. వేదాదివిద్య లెఱిఁగెన్, వేదండవిరోధిచండవిక్రముఁడు బుధుల్
సాదనశాత్రవు లెల్ల హా, సాదన శెగజెట్టఁ దొడరి సాదన సేయున్. 149

క. నిసువుందనపుందఱి నా, ససువులు రాసుతులు సకలశాస్త్రకలాపా
భ్యసనవ్యసనాభిముఖో, ల్లసనశ్రీశాలు లైరి లలితప్రతిభన్. 150

క. సర్వజ్ఞశిఖామణులై, యుర్వర నాబాలచంద్రు లుత్తుంగశ్రీ
ధూర్వహులై కనుపట్టి ర, పూర్వోదయరేఖఁ బ్రబలి బుధపూజితులై. 151

క. రాఘవులు మించి రతిశర, లాఘవులై పటుధనుష్కలాపాండిత్య
శ్లాఘారేఖామోఘా, వ్యాఘాతభుజావిజృంభణారంభగణిన్. 152

క. పలుమరుల సొబగుచందము, పలుమఱు నగునంగపటిమఁ బాటిల్లుదు రా
నలుగు రరాసుతు లుగ్రా, నలుగురు లతులప్రతాపనైపుణికల్మిన్. 153

తే. ఇరువు రిరువురు కవఁగూడి దొరసి మెఱసి, యేకమై యలదశరథాధీశసుతులు
ప్రణుతి గాంచిరి రామలక్ష్మణు లనంగ, భరతశత్రుఘ్ను లన ననపాయమైత్రి. 154

క. ఎడ యెఱిఁగియుఁ దమలోపల, నెడ యెఱుఁగక ధర్మపథసమేతస్థితికిన్
నడిమింటివారలైరా, నడిమింటిరవిన్ హసించునవ్యప్రభలన్. 155

క. తనయుల నలువురచే న, జ్జనపతి వక్త్రముల విధి భుజంబులహరియున్
వనధుల వరుణుండును బ్రా, మినుకుల జన్నమును బోలు మిగులం బొలిచెన్. 156

వ. ఇవ్విధంబునం గుమారజనకుం డై కుమారజనకుండునుంబోలె శాశ్వతైశ్వర్యపోషితా శేషమిత్రుం డై మిత్రుండునుంబోలె నప్రతీపప్రతాపాటోప ప్రభావభావుకాపఘనుం డై ఘనుండునుంబోలె నతులవితరణనైపుణ్యుండును నగణ్యపుణ్యుండును నసమరాజన్యుండును నసంఖ్యవాన్యరాజన్యజన్యుండును నగుచు ఫలితమనోరథుండై దశరథుండు సుఖంబుండె నయ్యవసరంబున. 157

## ఆశ్వాసాంతము.

శా. ధాటీసంభ్రమదభ్రచుంబికరటిద్రాఘిష్ఠశుండాముఖ
త్రోటీకల్పితరాహుసంశయభయోద్భూతక్షపానాథక
ర్ణాటాధీశసభాసరోరుహవనాంతారాజహంసన్నిరా
ఘాటోదారయశఃకలాప ప్రతిభాకద్రూకుమారాగ్రణీ. 158

క. నైర్యతిశకుముదసూర్యా, సూర్యభయప్రద దయాభిశోభితశౌర్యా
శౌర్యంప్రికమలకలిత స, పర్యా పర్యటదపారపటుకీర్తినిధీ. 159

గద్యము. ఇది శ్రీమ దొంటిమెట్టరఘువీరశతకనిర్మాణకర్తృ జగదేకఖ్యాతిధుర్యాయ్యలరాజుతిప్పయమనీషిపర్వతాభిధానపౌత్రాక్కయార్యపుత్ర పరిశీలితసమిద్ధరామానుజమతసిద్ధాంతమర్మ ముమ్మిడిపరదాచార్యకటాక్షవీక్షాపాత్ర హృదయపద్మాధిష్ఠిత శ్రీరామభద్ర రామభద్రకవిప్రణీతం బైన రామాభ్యుదయమహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.






# చతుర్థాశ్వాసము.

ద్రాఘిష్ఠకటాక్ష స
ముద్రమరుద్ద్రుమ జయాభిముఖవితరణసం
పద్రమణీయనళా! ని
ర్నిద్రా! గొబ్బూరి నరసనృపవంశమణీ! 1

వ. అవధరింపుము తదనంతరకథావిధం బెట్టిదనిన. 2

## దశరథునికడకు విశ్వామిత్రుఁ డేతెంచుట.

క. కదలి మొలనూలినవలా, యొడయనిఁ బదితేరులయ్యు నొయ్యన చేరన్
జడదారిమేటి రావం, గడపుంబాఱుండు కోరికలు చేకూఱన్. 3

క. వచ్చినపు డర్ఘ్యపాద్యము, లిచ్చి సువర్ణకపీఠ మిడి మునివర! మీ
రిచ్చోటికి బడలికమై, విచ్చేయుట యేమి తెలుపవే పనివిందున్?.

క. నా విని విను నానావని, దేవతపోధనజనాతిథేయాగము నిన్
నే విశ్వసించి యాగము, గావింపఁ దలంచితిన్ జగన్నుతచరితా!.

క. అఘుదూరు నీకుమారున్, రఘువీరు నుదారు నుగ్రరణశూరుని ని
ష్మఘుటనఘుటకుని మన్మఖ, విఘుటనకరదనుజహారణవిహారణవిధికిన్. 6

వ. అని మునీంద్రుండు రాకుమారునిం దోడ్కొని చన వేఁడుకొనువార్త పురజనంబులు
విని యి ట్లనిరి. 7

క. అసురుల మాయోపాయంబులఁ, గసిమసఁగఁగ నట మఖంబు గావఁగ నఁట తా
పసుఁ డొకఁడఁట సిసువులక్రొ, న్నిసువుల నడిగెనఁట మునులు నిర్మోహులుగా. 8

ఉ. అక్కట! కోసలక్షితివరాత్మజ కానక కన్నముద్దులేఁ
జక్కని చంచురాకొమరుఁ జందురు లెక్కడ? యధ్వరావనం
బెక్కడ? దైత్యసంహరణ మెక్కడ? ఘోరవనాంతరాక్రమం
బెక్కడ? యెట్టు లంపు మనియెన్? మునినో కటు లాడె నింతకున్. 9

వ. అని పలికి రంత నిక్కడ మునీంద్రుండు మఱియుం బఙ్క్తిరథున కి ట్లనియె. 10

క. విను క్రతుకర్తయుం భోక్తయుం, వనజోదరమూర్తి యగుభవత్తనయుండ పో
జనవర! కర్తా భోక్తా, జనార్దన యటంచు శ్రుతులు చాటన్ వినవే?. 11

క. నలువ గలలోతుంబొక్కిలి, నలువగల భుజంబులుం దనర సిరి నంటున్
గలిమిదొర నీకుమారుఁడు, కలి మిహికామిహిరమూర్తిగా కన్యుండే?. 12

చ. మునివరు వెంట నీవరమముగ్ధుల బాలుర నంపవచ్చునే?
యని మదిసంశయింపకు నృపాగ్రణి! మానవమాత్రులే భవ
త్తనయులె? లమోఘవిక్రము లుదారులు కారణజన్ము లార్యవం
దనపరు లమ్మహామహుల ధార్మికులన్ దృఢబుద్ధి నంపవే?. 13

క. అనఁ దనయుం రామచంద్రుని, మునిపరమేశ్వరుని కిచ్చె మోహముతో న
జ్జననాథుఁడు జాబిల్లిన్, వననిధి వలిగట్టు నల్లువానికి బోలెన్. 14

క. బాలుర గతదుష్కృతజం, బాలుర మునిలోకహృదయపంకజనిధురుం
బాలుల నక్కునఁ జేర్చి నృపాలుఁడు దీవించె నతికృపాలుం డంతన్. 15

## శ్రీరామలక్ష్మణులు విశ్వామిత్రు వెంట నేగుట.

చ. నరవరసూను లంతఁ జరణంబుల వ్రాలిన వారిమీఁద ని
ర్భరతరబాష్పబిందువులు రాల్చెఁగరం బసురక్తిఁ గుంభినీ
శ్వరకులసార్వభౌముఁ డతిసత్త్వధురంధరమూర్తి యర్మిలిం
గరి కరశీకరంబులఁ దగం గలభంబులఁ దోఁచుకైవడిన్. 16

క. గురునాజ్ఞ నంత రాఘవు, లరిభీకరు లనుసరించి రాసంయమి శే
ఖరు శమదమములు యోగము, నిరుపమవిజయోదయములు నీతిం బోలెన్. 17

వ. అప్పుడు. 18

క. పదపద రాఘవ నిలునిలు, మదవదపడవలదు దశరథాధిప! నీకున్
ముదమొదవఁ జెత్తు మఖరిపు, మదవ దసురవధ యొనర్చి మగుడన్ సుతులన్. 19

వ. అనిన దశరథుం డి ట్లనియె. 20

చ. గురుతరపుణ్య! యీకుసుమకోమలమూర్తుల నీకుమారశే
ఖరులగుఱించి మీ రడుగఁగా నిపు డంపక మానరాదు భీ
కరకఠినాశ్మమార్గములఁ గానలఁ ద్రిమ్మర నేతదంఘ్రిపం
కరుహాయుగంబు లింకఁ గనుగందక కుందక యుండ్నె? నావుడున్. 21

క. విను మును బలివంచనవేళ నృపాగ్రణి! యబ్ధిమేఖలావలయుం బీ
తని శేకపదము గాదో?, కనుఁగొని నడుచు నని వగవఁగాఁ బని యేమీ. 22

ఉ. భూవర! పోయివత్తుమె? తపోధన! కంటికి ఱెప్పచందమై
కావవలెం జుమీ! యటులు కాక మఱేమి? యఘంబులంట వి
ప్రావను నీవె చూచెదవు పల్కులు వేయును నేటికేన్? గ్రియా
కేవల ముత్తరం బని యకిల్బిషుఁ డమ్ముని యేఁగె నవ్వలన్. 23

క. ముని వెనుకొని నృపు వీడ్కొని, చని రఘూత్తములు సవనసన్నాహనిరూ
ఢనిగాఢగమనవేగం,బున శరధిశరాసశరసముత్కరధరులై. 24

చ. కలనినదంబుచేత విహగంబుల నుష్ణకరాతపంబుచే
జలరుహమిత్రముల్ వలపు చల్లెడుక్రొవ్విరివానచే ఘనం
బులు గరుడాంకుడున్ స్వకులపూజ్యుఁ డుపేంద్రుఁడు గాన విక్రమో
జ్జ్వలునిఁ బ్రభానిధిన్ భువనవల్లభు రాము భజించెఁ ద్రోవలోన్. 25

క. గాధేయోక్తపురాతన, గాధానిరవద్యపద్యగద్యగ్రహణా
సాధారణానివారణ, మేధానిధు లగుచుఁ జనిరి మిత్రకులేంద్రుల్. 26

క. శీతలతాస్వీతలతా, జాతలతాంతాతిసురభిజంబీరజపా
చూతలవలీలవంగవ, నీతలముల నేద దేర్చి నృపసూనులకున్. 27

ఉ. గాసిలనీక రాసుతులఁ గౌశికుఁ డాఁకలి నీరుపట్టు నా
యాసము లేనిమంత్రము రణాభయవృత్తియమోఘబాణబా
ణాసనసాధనంబులు సురాసురదుర్జయశౌర్యమున్ జయ
శ్రీసహితోదయంబుఁ గృపచేసి కృతార్థులఁ జేసె నెంతయున్. 28

క. అంతటఁ గారుణ్యరస, స్వాంతుఁడు గాధేయుఁ డఖిలజటిజలరుహాభా
స్వంతుం దపు డటు చని యొక, కాంతారము చేరి వారిఁ గని యిట్లనియెన్. 29

## తాటకాసంహారము.

ఉత్సాహ. హాటకాచలేంద్ర! ధీరతాభిరామ! రామ! యి
చ్చోటఁ గాండకాండ మధ్వశూన్య మివ్వనిన్ నిరా
ఘాటకాలకాయకాంతికల్పితాంధకారయై
తాటకానిశాటకాంత దర్ప మొప్పఁ ద్రిమ్మరున్. 30

క. కసిమసఁగుము వెస నీర,క్కసి నిపు డిటఁ బ్రథమభిక్ష గావించెద నీ
యసమశితవిశిఖయోగికి, నసురాంతక! రఘుకుమార! యన నుత్సుకుఁ డై. 31

క. మానవుల మెసవుజాడలు, మానవుమునిపుంగవాశ్రమస్థలములనుం
దానవు నిర్భయవృత్తిన్, దానవురాలవు వధింపఁ దగు నిన్నను చున్. 32

తే. అపుడు వీణెకు పెట్టి వాటారుఁదూపు, నారిఁ గూర్చి నిశాచరనారిఁ గూర్చి

కాఁడనేసెఁ దదీయవక్షఃస్థలంబు, రాఘవుఁ డమోఘతరశరలాఘవుండు. 33

తే. అసురజయలక్ష్మి రాఁ ద్రోవ యనువుపడఁగఁ, దాటకాఖిలవక్షఃకవాటదళన
మాచరించినకుంచికయై వెలింగె, రామబాణంబు దోషనిర్వాపణంబు. 34

తే. అసురశోణిత మపవిత్ర మంటఁ జెల్లదనుచు నో కా! తాటకాహృదయంబు గ్రుచ్చి
యవ్వలికిఁ బాఱె రఘువీరు నారసంబు, ధర్మపరిచితి కది ఫలోదయము గాదె. 35

క. ఖలుఁడై నరావణాసురు, నలఘుతరాన్వయతటాక మలుగుల పాలై
పలువగలఁ బొగిలె నన ని, వ్వల రక్కసి హృదయరక్తవాహిని వెడలెన్. 36

చ. ఉరుపడిఁ జాపముక్త మయి యొక్కశరం బెద నాట దిర్దిరన్
దిరిగెడుతాటకాంగనయుదీర్ణతరారుణఘూర్ణితాక్షితా
మరసమరీచిపంక్తు లసమానజయేందిర నొందురాఘవే
శ్వరునకు నాచరించిననివాళిరుచుల్ పొలెఁ దలిర్చె నయ్యెడన్. 37

శా. ఆనక్తంచరి నొక్కకోలఁ బడనేయన్ గాంచి యక్కౌశికుం
డానందాతిశయంబునన్ రఘుకుమారా! రమ్ము! నీయంతవి
ల్కాని గానము దైత్యకాంత యొకలక్ష్యంబే భవద్బాణసం
ధానప్రౌఢికి? నంచు నాశ్రమముచెంతం జేర్చి కీర్తింపుచున్. 38

క. తనయాశ్రమంబునకు నూ, తనయాగచికీర్ష రాచతపసి మహోదా
త్తనయాలంకారుల నృప, తనయాగ్రణులం బటుప్రతాపులఁ దెచ్చెన్. 39

తే. ద్యుమణికులమణి యగురఘూత్తముని మఘవ, మణివిడంబితనుప్రభామంజిమంబు
చూచి పరవశులైరి యచ్చోటిమునులు, క్రతుతపోవ్రతజపవిధుల్ గట్టిపెట్టి. 40

వ అంత గాధేయుండు దాశరథిం గనుఁగొని యిట్లనియె. 41

ఉ. రా చిరపుణ్యధామ! రఘురామ! వహింతునె యజ్ఞదీక్ష? మా
నాచరణంబె కాని యిఁక నర్హము కాదు వచింప నేగతిన్
గాచెదవోకదా మఖ మఖండపరాక్రమధూర్వహోగ్ర మా
రీచసుబాహు మాయలు తరించి! భవద్భుజశక్తి చూచెదన్. 42

క. విను మప్రమత్తమతివై, పనివడి యధ్వరసమాప్తిపర్యంతంబున్
గనుగలిగి ధైర్యసంపద, యొనరం గాపాడుమీ యహోరాత్రంబుల్. 43

వ. అని యిట దీక్ష పూని ముని యధ్వరకర్మ ముపక్రమించె న
ద్దినకరవంశచంద్రులు నధిజ్యశరాసను లౌచు సింహని
స్వనముఖరయుద్ధసన్నహనసంభ్రమమోహనమూర్తులై తపో
ధనజనరంజనస్థితులు దాల్చిరి నిల్చిరి యజ్ఞరక్షకున్. 44

ఉ. లోకశరణ్యుఁ డారఘుకులుం డఁట కాఁ డఖిలాస్త్రశస్త్రవి
ద్యాకుశలత్వదాయి కుశికాత్మభవుం డఁట రాచపల్లు తే
దేకద యిట్టివానికి సుదీర్ణ మఘాంధమరుద్విపక్షశి
క్షాకరణంబు శిష్టమునిసంఘముఖోద్ధరణంబుఁ జోద్యమే?. 45

వ. అని మునులు పలుకుసమయంబున. 46

## సుబాహుమారీచనిరాసము.

మ. చతురశ్రవ్యసమగ్రసామనిగమస్వాహాకృతుల్ మ్రోయ ను
న్నతహోమాగ్నిసముద్భవంబు లగుమంటల్ మింట నంటంగ నా
యతమై జన్నము సాఁగు బాగెఱిఁగి మాద్యద్దైత్యసైన్యంబు శో
ణితధారల్ గురిసెన్ మఖాలయమునన్ విస్ఫూర్తిఁ బెట్టార్చుచున్. 47

చ. అలదనుజేంద్రసైనికకృతాధ్వరవిఘ్ననిదానదుష్టచే
ష్టలు గని యారఘూద్వహుఁ డొడంబడఁ డయ్యెఁ దదీయశిక్ష య
బ్బలముల నేలు నేలికలఁ బైకొనసే తివురున్ మదావళం
బులఁ గబళించుఁగాక హరిపోతము గోరునె లేడిపిల్లలన్?. 48

క. మారీచసుబాహుమరు, ద్వైరిధనుర్ముక్తవిశిఖతమముల్ ముంచన్
వారించెన్ రఘువీరో, దారాశుగఖరకరాంశుధారలు వానిన్. 49

క. ఒకతూఁపున రఘువీరుఁడు, మకరాకరమధ్యసీమ మారీచసురాం
తకుఁ బడఁ గెడపి సుబాహున్, బ్రకటశిలీముఖముఖాగ్ని భస్మము చేసెన్. 50

చ. అమలచరిత్రుఁ డారఘుకులాగ్రణి యిట్లు మహోగ్రదైత్యయు
గ్మముఁ బొలియించినన్ సుఖసమాప్తిఁ గృతార్థమనస్కుఁడై యతి
ప్రమదరసైకమగ్నమతిఁ బాణితలంబున నక్కుమారుమై
నిమిరి శిరంబు మూర్కొని మునిప్రభుఁ డక్కునఁ జేర్చి యిట్లనున్. 51

క. క్రతువు సమాప్తం బయ్యెను, బ్రతిభటరాక్షసబలంబుఁ బరిమార్చితి విం
కితరులు నీసరియే? నీ, కతనన్ సుఖవసతి మాకుఁ గలిగెఁ గుమారా!. 52

క. అనుసమయంబున జనకా, వనికాంతుఁడు క్రతు వొనర్చువాఁడై పిలువన్
బనిచినఁ గాని మ్మనుచున్, మునిచంద్రుఁడు గదలె మదిఁ బ్రమోదం బొదవన్. 53

## అహల్యాశాపవిమోచనము.

క. జనపాలసుతులఁ దోడ్కొని, జనపదరంజనపదప్రచారుండై పా
వనవనభూములు గనుఁగొని, చని యక్షపదాశ్రమంబుచక్కి న్నిలిచెన్. 54

తే. రఘుకులేంద్రప్రసూతి యఘనఘవిఘాతి, రాక్షసారాతిచరణనీరజమురజము
రాతి రుచిరాతిరూపవిభ్రమగుణోత్క, రాతిరోహితవిఖ్యాతి నాతిఁ జేసె. 55

క. రాచందము గలరాముఁడు, రాచందము మాన్పెఁ దపసిరాచానకు నౌ
రా! చతురాస్యోపాస్య, శ్రీచతురపదాంబుజాణురేణువ్యాప్తిన్. 56

తే. శిలఁ జిగురుబోఁడియై యుల్లసిల నొనర్చి, యెత్తిపోయినగౌతమునిల్లు నిలిపె
నడుగుఁ గెందమ్మికమ్మపుప్పొడిన యింక, నేమని నుతింపవచ్చు శ్రీరాముమహిమ? 57

## మిథిలాప్రవేశము.

ఉ. ఆనళినాప్తవంశమణి యచ్చట గౌతమసంయమీంద్రస
న్మానము గాంచి యమ్మునిజనప్రభు వీడ్కొని పోయి గాధిపు
త్రానుగుఁడై నదీనదనగాదులు దాఁటి జయేందిరావశా
లానముఁ జేరవచ్చె మిథిలానగరంబుఁ గరంబు వేడుకన్. 58

వ. వచ్చి నికటప్రదేశంబునఁ గొంత ప్రొద్దు నిలిచి కౌశికమునీంద్రుం డమ్మిథిల కధినా
యకుం డగుజనకభూమండలేశ్వరునివంశాభిజాత్యసత్యసౌజన్యశమదమాదిగుణకలా
పంబు రామచంద్రునకుం బ్రసంగవశంబున నెఱిఁగింపుచు మఱియు ని ట్లనియె. 59

క. జనకుఁడు శశిమౌళిశరా, సన మెక్కిడినట్టిసత్త్వసంపన్నునకున్
దనుజాత సీత నిచ్చెద, ననియెన్ గొనియాడఁ దరమె యాలలితాంగిన్. 60

క. కావున నీయందలిశౌ, ర్యావిర్భావంబు మెఱయ నఖిలము పొగడన్
శైవశరాసన మెక్కిడి, యావెలఁదిన్ బెండ్లియాడుమా రఘురామా! 61

క. ఓరామ నీకె తగుఁ దగు, నారామ సమస్తయోషిదభిరామవిలా
సారామసీమ యభినవ, తారుణ్యోద్దామ నీవె తగు దాయమకున్. 62

తే. గుణము గలిగినచో రూపు కొదవ యొందు, గుణము రూపులు గలిగినఁ గులము కొదవ
కులము గుణమును రూపును గలుగుధన్య, జనకకన్యయ సుమ్ము రాజన్యమాన్య! 63

సీ. కళ వెచ్చఁబోనినిర్మలచంద్రబింబంబు పరభృతం బంటనిసరసకిసల
మినకరవ్యాప్తి వాడనికమ్మపూఁదీవ మరుఁ డేర్చి దాఁచినమార్గణంబు
లంటి చూడనిమించుటద్దంపుఁబలకలు కొదమరాయంచ మూరొక్కనితూండ్లు
వలరాచయాఁకఁ బాటిలుమావిక్రొంబండ్లు కానంగరానిశృంగారసరసి
తే. యనఁ బడమి ముద్దరాలినెయ్యంపుఁజూలి, ముద్దునెమ్మోము మించుకెమ్మోవి మేను
కలికిచూపులు కచకుచజక్కులు భుజంబు, లుదుటుఁజనుగవయును నాభియును దనర్చు.

క. ఎలదీవబోఁడి జానకి, కలభాషిణి యలరురూపు కలిమిం గడు రం
జిలు శరధివెడలి వెలిఁగెడు, నలచక్కెరవింటివానియమ్మో! యనఁగన్. 65

ఉ. తుమ్మెదకంటు పూమొగడతోఁ దులదూఁగులతాంగిముక్కు నె
త్తమ్మికి జాతిదాయ వనితాజనతామణిమోము కంతుక్రొ
త్తమ్ములతమ్ము లిందు కళికాలికవాలికచూపుఁగోపు ల
క్కొమ్మకు సావిమావిసెలగొమ్మకు సాటియె జోటు లెయ్యెడన్? 66

క. కమలంబు మోము కన్నులు, కమలంబులు కేలుఁగవయుఁ గమలము లడుగుల్
కమలంబులు నిలువెల్లను, గమలాకృతి మించెఁ బుడమికన్నియ బళిరే! 67

ఉ. ఆకరియాన వేనలి యనంతవిలాసము మాధవోదయం
బాకమలాయతాక్షి మధురాధరసీమ హరిప్రకార మా
కోకిలవాణిమధ్యమునఁ గూడిన దింతియ కాదు తాను రా
మాకృతి దాల్చె నీచెలువ మంతయుఁ నాయమయందుఁ జొప్పడున్. 68

తే. చొక్కపుఁబసిండినక్కులఁ జెక్కుఁ జెక్కు, లక్కలికికొప్పు నీలాంబుముక్కుముక్కు
కనకగంధఫలీసారకంబు కంబు, కలితరేఖావిలాసమంగళము గళము. 69

తే. కొలికె మంజులలాట్యాంగకుంతలాది, సౌష్ఠవంబున భూతనూజాత సీత
యఖిలదేశప్రసిద్ధభాగ్యంబుకలిమి, తల్లిఁ బోలిన దదియపో ధన్యకన్య. 70

క. సాముద్రికశుభలక్షణ, సామగ్రిన్ జనకతనయ సాక్షాద్రమయో
నా మించె మత్స్యకూర్మ, శ్రీమంజిమ యంగముల ధరించుటకతనన్. 71

తే. ఆరయ భూజాకృతిఁ దలిర్చునక్కుమారి, కొమ్మమాత్రంబు గాదు కాకుత్స్థతిలక!
మోవియును నిత్యపల్లవశ్రీ వహించె, నద్భుతంబె మధూదయం బందుఁ గలదు. 72

తే. పంటపూఁబోడి గారాపుఁబట్టికౌను, మాయ యామానవతిసూక్తి మధుర యవ్వె
లందికటిసీమ కాంచీస్థలంబు గాన, సార్థ మయ్యెను బురసంజ్ఞ యాఁగలతకు. 73

క. కలితనవశ్రీరూఢిన్, బొలుపొందుట శ్రుతులు చాటు భూపుత్త్రికతోఁ
గలకంఠకంఠి యొక్కతె, గలుగునె సరిసేయ వినుము కమలాప్తకులా. 74

క. అలికంబు మించుఁగ్రొన్నెల, నలికంబు శ్రీల నేలు నలకగళంబుల్
వలనమ్ములమరునడిదపు, వలనమ్ముల గెలుచు మానవతివీక్షణముల్. 75

ఆ. అతివరోమరాజిలత యూరుమాత్రంబె, యరయ లక్ష్య సేయఁనది యటుండెఁ
జానకొనుదీఁగ కేసెందు సరిగాన, విష్ణుపదమె సాక్షి విను కుమార. 76

వ. అని మునీంద్రుఁ డిట్లభీష్టాలాపంబుల రఘునందనున కమందమందాక్షసహితానందకం
దళంబు డెందంబునం బొదుకొలుపుచు నచటనుండి కదలి పురప్రవేశంబు సేయునెడ.

## జనకాతిథ్యము.

క, వారిశుభాగమనము పరి, చారులవలన విని యలరి జనకుఁడు మునిభూ

డారత్నమ్ము నెదుర్కొని, యారఘునందనులతోఁ బ్రియంబునఁ దెచ్చెన్. 78

వ. ఇట్లమ్మునివరుం డెదుర్కొని వచ్చి సవనంబు సాంగంబుగా నొనర్చి మంగళస్నాతుం డైవచ్చి నతియొనర్చి యతికృపానిధేయ! గాధేయ! భవదాగమనకారణంబున మదీయ మఖంబు నిర్విఘ్నంబై సమాప్తం బయ్యెఁ గృతకృత్యుండ నైతి నని రఘుకుమార మనోహరాకారప్రకారంబులు గనుంగొని యి ట్లనియె. 79

ఉ. ఈసుకుమారు లీయనఘు లీజగదేకమనోహరప్రభా
భాసురమూర్తు లీధరణిపాలకబాలకు లెవ్వరి? రిక్షుబా
ణాసనుఁ గన్నతండ్రి చెలు వంతయుఁ వీరిక యొప్పఁ దాపసా
గ్రేసర! పేరు పెంపు నెఱిఁగింపుము సొంపు జనింప నావుడున్. 80

ఉ. ఈక్షితిపాలుఁ డాదశరథేంద్రకుమారుఁ డితండు తాటకా
పక్షము నొక్కకోలనె గవాక్షము సేసి నిశాచరాగ్రణీ
శిక్షయుఁ యజ్ఞరక్షయుఁను జేసి శిలన్ గలకంఠిఁ జేసి దో
షక్షయకృత్పదాంబుజరజంబున వచ్చె మిముం గనుంగొనన్. 81

చ. ఇతఁడు ధనుష్కళావిదుఁ డహీనకృపానిధి రాముఁ డీతఁ డ
ప్రతిహతదీప్తి లక్ష్మణుఁడు పావను లీనృపనందనుల్ హారి
ప్రతినిధు లన్యు లెక్కడఁగ రానిపురాంతకువిల్లు గాంచి స
న్నుతుఁ గ్రతుకర్మఠున్ నినుఁ గనుంగొనువేడుక వచ్చి రియ్యెడన్. 82

వ. అని పలికియున్నసమయంబునఁ గౌశికుం గనుంగొని. 83

క. హరువిల్లు చూచుతమి ని, ర్భరహర్షం బొదవ దాశరథి ధర్మస్య
త్వరితా గతి యన్నాఁ డవ, సరమిది యన నవ్వి మౌని జనకున కనియెన్. 84

క. కనుఁగొనిరి నిన్ను ధన్యుల్, గనుపండువ యొదవఁగా నీకను నీవిలు గ
న్గొనఁ దివిరెడు నీరఘువరుఁ, డనఘా! తెప్పింపుమనుడు నమ్ముని కనియెన్. 85

శా. జీవంజీవసుహృత్కళాధరుఁడు లక్ష్మీభర్తయుం దక్కన
య్యా! వాచంయమవర్య! యిమ్మొలకప్రాయంపున్నరుల్ సేర్తురే
యావి ల్లెక్కిడ? నావుడున్ నగి యతండైనం గనుంగాక నేఁ
డీవీరాగ్రణి యొక్కఁ డన్న నెడ రాజేంద్రుండు హర్షంబునన్. 86

తే. సకలనృపబాహుదర్పామిషంబు మెసవి, యున్నమైఁ జొక్కి నిద్రించునహియపోలె
నున్నహరువిల్లు పెక్కండ్రుయోధజనులఁ, బంపి తెప్పించె జనకభూపాలుఁ డపుడు. 87

హరధనుర్భంగము.

ఉ. చూచి రఘూద్వహుండు సెలజోదులు వేలకొలంది యెత్తలే

రేచి బలాఢ్యు లయ్యు నిపు డీచుసిది ల్లోక పెద్దకొండగాఁ
జూచెద రెల్లవారు నది తూలికిఁ గాకిట నాకు లక్ష్యమే?
రాచతనంపుఁ బెంపు నగరా యిఁక నెక్కుడలేక తక్కునన్. 88

వ. అని తలంచి నిజభుజాపటుత్వసందర్శనాసన్నసకలదిగ్దేశరాజసందోహంబు గనుంగొన
నప్పుడు. 89

చ. చివచివ డాసి విల్లు రఘుశేఖరుఁ డంతఁ గదల్చి పాఁతుగా
భువి నిడి చూడలేనినృపపుత్త్రులచర్మము లెత్తుబాగునన్
గవిసెన యూడ్చి పాంసువు నణంచె రజోగుణదూరుఁ డాటకున్
జవబలయుక్తి నెక్కుడియె సత్త్వమె చూపుచు శార్ఙ్గి గావునన్. 90

క. ఆనృపసూనుఁడు సుగుణాం, భోనిధి గుణఘటన మెఱయ మొరయించెఁ బటు
జ్యానాదము సానంద, జ్యానాదం బయ్యె దశదిశాక్రాంతంబై. 91

క. ఆరమణీయధనుష్టం, కారము సీతాకుమారికాకల్యాణ
ప్రారంభవాద్యనిరవ, ద్యారవమై యెసఁగె సకలహర్షప్రదమై. 92

క. ఆవీరుఁడు తెగ నిండం, గావడి విల్దిగిచి లస్తకము దృఢముష్టిన్
లావొప్పఁ బట్టి గొబ్బునఁ, జే వదలిన భగ్నమయ్యె శింజిని తోడన్. 93

క. బ్రహ్మకు బ్రహ్మయునుఁ బర, బ్రహ్మముఁ దానైన దాశరథి విలువిఱువన్
బ్రహ్మాండచయము నాద, బ్రహ్మమయం బయ్యె మునివరప్రియకరమై. 94

క. కురిసె విరిసోనవానలు, దొరసె సుధాంధోవధూమధురగానంబుల్
మొరసె దివిఁ దూర్యరవములు, విరిసెన్ మునిమానసారవిందము లంతన్. 95

చ. జనకుఁడు గాధిసూతిఁ గని శంభుశరాసన మెక్కువెట్ట నే
ర్చునె నరమాత్రుఁ డీతఁ ? డనుచున్ బరికించితిఁ గాఁడు కేవలుం
డినకులపావనుం డితని కిచ్చెద సీతను గూర్మి నిత్తునీ
తనియనుజత్రయంబునకుఁ దక్కినకూఁతులనున్ భవత్కృపన్. 96

క. అన్వేషించితి నిట్టిగు, ణాన్వితురాకొమరుఁ గాన నగుఁ దగుఁగా కీ
ధన్వికిఁ దన్వికి నుభయకు, లాన్వయముల్ మెఱయఁ బరిణయంబొనరింతున్. 97

క. పిలిపింపు మితనితలిదం, డ్రులఁ దమ్ములఁ దన మునీశ్వరుఁడు నట్లన వా
రల రాఁబనిచెన్ బురిజన, మలరఁగ నట లగ్ననిశ్చయము గావించెన్. 98

వ. అంత జనకభూకాంతుండు నితాంతసంతోషమయహృదయుండగుచు మిథిలానగర
గోపురప్రాసాదవివిధరాజమార్గంబులగణితమణిమయస్ఫారతోరణస్తంభసారసౌరభో
ల్లసదసమకుసుమమాలికావిచిత్రచిత్రపటవితానవిమలముక్తాఫలరంగవల్లివిలాసానూన

భాసమానరత్నదీపధూపవాసవాసమస్తవస్తువిస్తీర్ణవిపణివీథిశృంగారరచనావిశేషంబుల నలంకరించ నియమించె నచ్చట దశరథుండును దత్కల్యాణవార్తాకర్ణనంబునఁ బ్రహర్షరసమగ్నమానసుండై భరతశత్రుఘ్నసుకుమారసూరిసుకవివందిమాగధవృద్ధబంధుసామంతహితపురోహితామాత్యభృత్యమాతంగతురంగశతాంగభటరథినీపరివృతుం డగుచు భూరిభేరీశంఖనిస్సాణకాహళఢక్కాహుడుక్కారవంబులు బెరయఁ గులపాలికాత్రయీసమన్వితుండయి త్రయీతనుండునుంబోలెఁ దేజరిల్లుచు నేతేర యథోచితంబుగా నెదుర్కొని జనకుండు నిజనగరంబునకుం దోడ్కొని చనియె నయ్యెడఁ గౌశికుండు రామలక్ష్మణుల దశరథునిపాలికిం దెచ్చి యిచ్చినఁ గ్రక్కున నక్కునం జేర్చి శిరంబులు కరంబు మూర్కొని యమ్మునీంద్రు బహువిధంబులఁ బూజించి యిట్లనియె. 99

ఉ. ఆయతపుణ్య! నీకృప మదాత్మజు లీరఘురామలక్ష్మణుల్
ధీయుతులున్ శరాసనవిధిజ్ఞు లమోఘశరప్రయోగది
వ్యాయుధతత్త్వకోవిదులు నాహవకర్మఠదైత్యనిర్జయో
పాయులునై వహించిరి శుభంబుఁ గృతార్థుఁడనైతి నావుడున్. 100

ఉ. బోరనఁ జేతి కిచ్చితివి పుత్రులజన్మము గాచి దైత్యసం
హారము చేసి సంయమివరాంగనశాపము మాన్చి పుష్పధ
న్వారిశరాసనం బొకతృణాకృతిఁ ద్రుంచి జయంబుమై నినున్
జేరిరి నేఁడు నాప్రతిన చెల్లఁగఁ దెచ్చితిఁ గంటె భూవరా? 101

వ. అని పలుకుసమయంబున. 102

మ. జనకక్ష్మాపతి వచ్చి నీకతన విశ్వామిత్రమౌనీంద్ర యీ
యినవంశాగ్రణి యైనభూవిభునితో నీసత్యసౌభాగ్యవ
ర్ధనుతో నియ్యెడ వియ్యమందఁ గలిగెన్ ధన్యుండనైతిన్ వివా
హనిమిత్తోచితకృత్యముల్ సలుపరాదా యింక జాగేటికిన్? 103

క. అని పలుకుజనకుపలుకుల, కును దశరథవిభుఁడు కౌశికుఁడు డెందమునం
దనురాగ మొందఁ బూనిరి, గొనకొని రఘురాముఁ బెండ్లికొడుకున్ జేయన్. 104

### యువతులు శ్రీరాముఁ బెండ్లికొడుకుం జేయుట.

వ. అయ్యెడ వసిష్ఠాదిమును లనుగ్రహించి యాశీర్వదింపం బుణ్యాంగనాజనమధురగానంబులు బహువిధానవద్యహృద్యవాద్యఘోషంబును విలోకనోత్సవాగతసకలదేవతాజయజయశబ్దనృత్తగీతవాద్యకోలాహలంబును రోదసీకుహరంబునం బొదల వివాహ

వేదికామధ్యరత్నపీఠిం గూర్చుండ నియమించి దశస్యందనుండు రఘునందనుముఖా
రవిందమందహాసోల్లాసంబు గనుంగొని యంఘ్ప్రాంగుసమయంబున. 105

మ. శిర సంటెన్ గలకంఠి యోర్తు కరరాజీవాంతరస్యందితై
లరసాస్వాదివినీలకేశమదరోలంబంబు లుడ్డీనవై
ఖరులన్ గాంచనకాచకంకణఝణత్కారారవచ్ఛద్మఝం
కరణంబుల్ సలుపన్ రఘూత్తమునకున్ గళ్యాణసంధాయికిన్. 106

సీ. కలికి యొక్కతె వెట్టె గందంపుటటకలి జలకంబమర్చెఁ గోమలి యొకర్తు
తడియొత్తె నొక్కలతాతన్వి గొబ్బున ధౌతవస్త్రంబిచ్చె నాతి యొకతె
గద్దియ యిడె నొక్కముద్దియ గూర్చుండ శిరసార్చె నొక్కయోషిల్లలామ
వనిత యొక్కతె ధూపవాసన యొనగూర్చె నొకకొమ్మ విరిదండ సికఁ జుట్టె

తే. మకరకుండలమాణిక్యమండనంబు, లొఱపు నాటిల్లఁ గీలించె నొక్కయువిద
రత్ననీరాజనం బొక్కరమణి యిచ్చె, సకలసేవ్యున కారఘుస్వామి కపుడు. 107

తే. అలమరుండూర్ధ్వలోకంబు గెలువఁ దలఁచి, తార్చె శింజిని నర్ధచంద్రంబనంగ
సాభినామంబు గంభీరనాభి యొకతె, దీర్చెఁ గనుబొమ్మనడుమ నాధీరమణికి. 108

తే. భువనపావని యగుగంగ పుట్టినిల్లు, తపసియిల్లాలి ప్రాణదాతయును నైన
యారఘూత్తమునమలతరాంఘ్రి నొకప, దంతివిరుదంపుగండపెండారమిడియె. 109

క. నక్షత్రకంఠమాలిక, చక్షుఃపర్వముగ రామచంద్రునకుం బ్ర
త్యక్షామృతకరునకుఁ బ, ద్మాక్షీమణి యొకతె యిడియె ననుగుణలీలన్. 110

ఉ. చందనగంధి యోర్తు రఘుచంద్రునకున్ నెఱపూఁతలాగునన్
గండ మలంది బాసికము గట్టి మణీమకుటంబమర్చి చ
క్కందనమొప్ప నెన్నుదుటఁ గస్తురిబొట్టిడి చూచువారి క
య్యిందుకళాకిరీటుఁ డితఁడే యనుటల్ దలపించె నయ్యెడన్. 111

వ. ఇట్లఖిలమణిభూషణవిశేషాంబరాలంకృతజగన్మోహనాకారుం డైనరఘువీరుండు కౌశికవసిష్ఠవిద్వన్మునీంద్రపుణ్యాంగనాకృతాశీర్వాదలాజాక్షతదూర్వాంకురప్రసూనాంగీకారుండై సమావర్తనహోమాదిశుభనిమిత్తక్రియాకలాపంబులు నిర్వర్తించి తదనంతరంబున. 112

శా. గారా మొప్ప విభుండు సభ్యజనులం గర్పూరతాంబూలక
స్తూరీకుంకుమగంధసారముల సంతోషంబు నొందించి శృం
గారాధీశ్వరు నీశ్వరప్రముఖలేఖస్తుత్యచారిత్రు సా
కారశ్రీధరు రాముఁ బెండ్లికొడుకున్ గావించి యున్నంతటన్. 113

తే. దగ్గఱె ముహూర్తవేళ యోదశరథేంద్ర, యేల యాలస్య? మని మౌను లెచ్చరింప
మహితమణిహేమవస్తుసామగ్రి మెఱయఁ, గ్రంతనడిపించి తామును గదలి రపుడు.

తే. అసమసౌభాగ్యభోగభాగ్యముల మెఱసి, పసిఁడిపక్కెరతేజిసాంబ్రాణి నెక్కి-
కదలునపుడు వివాహలక్షణము లెన్ని, యన్నియును రామచంద్రునియందె యలరె.

వ. కదలి యచ్ఛద్మపద్మరాగరత్నదీపమాలికాజ్వాలికానిర్ధూతతిమిరవర్గంబగురాజమార్గం బతిక్రమించి వందివైతాళికాపారగద్యపద్యగీతికాచాతుర్యంబును విలోకనాసక్త మత్తకాశినీజనకలకలంబును వినుచు నతివిచిత్రవర్తనప్రకారంబులఁ గనుచు వృద్ధవాచా వశంవదుండును లజ్జావనతవదనుండును నై యాజనకరాజసదనంబుఁ బ్రవేశించి కక్ష్యాంతరంబులు గడచి కన్యావలోకనానురాగంబు తమకంబుఁ గయికొల్పఁ గల్యాణాగారంబు చేర నరిగె నంతట. 116

## వధూవరుల కల్యాణమంటపప్రవేశము.

శా. బంగారంపుఁబడంతితోడ సవతై భాసిల్లుపద్మాక్షియో!
యంగశ్రీధరచంచలాలతయొ! యంద్యజ్జీవరత్నంబొ! త
న్వంగీరూపముఁదాల్చుక్రొన్నెలయొ! నా నాజానకిన్ బెండ్లికూఁ
తుం గావించి వివాహవేదికడ కింతుల్ దెచ్చి రుత్కంఠతోన్. 117

వ. అప్పుడు రాజకుమారమణి మణిమయాసనంబున సమాసీనుండై వసిష్ఠాదిబుధజనోపదిష్టమార్గంబున జనకరాజన్యమూర్ధన్యుండు యథావిధిం దనకు నొసంగుమధుపర్కశోభనోపచారంబులంగీకరించి సమగ్రహర్షంబునఁ గన్యాదానోదకధారాపరిగ్రహణంబు జేసి తెరమఱుంగున వెలుంగుఁబోఁడిన్ గదియ వచ్చె నప్పు డొండొరులం గనుంగొనుకోరికలీరికలు గొనఁగీర్వాణులు గల్యాణంబులు పాడఁ గుతూహలంబున వధూవరులు సిరులు దళుకొత్తఁ గ్రొత్తచెలువంబునం బొలిచి రయ్యెడ. 118

ఉ. గాలవకణ్వగార్గ్యభృగుగౌతమకశ్యపశౌనకాత్రిజా
బాలివసిష్ఠగాధిసుతపర్వతనారదముఖ్యమౌనిశుం
డాలము లవ్వధూవరులదగ్గఱఁ జేరి ముహూర్తమియ్యను
ద్వేలతరానురాగము మదిన్ బెరయన్ దెరయెత్త నంతటన్. 119

## సీతాకల్యాణము.

తే. ముత్తియంబులు దోయిళ్ళ ముంచిముంచి, కాంచువారల హర్షాబ్ధి ముంచిముంచి
మించి తన చేయిమీఁదు గావించి మించి, విభుఁడు తలఁబ్రాలు వోసె నవ్వేలఁదిమీఁద.

క. వరుఁ డిడుముత్తెపుఁదలఁబ్రా, ల్నెరసిన యన్నడుమఁ బొలిచి నిలిచెన్ సీతా
తరుణి తెర గడచి రత్నా, కరమునఁ గనుపట్టు కలిమికన్నియ పోలెన్. 121

చ. సరసిజగంధు లెచ్చరిక సల్పఁ గరంబుల దోయిలించి దా
శరథిశిరఃకిరీటమున జానకి ముత్తెపుసేసఁ జల్లె ని
ర్భరకుతి గంగ మేరుశిఖరంబున శుభ్రతరంగశీకరో
త్కరములు నించుచందమునఁ గంకణనాదవినోద మొప్పఁగన్. 122

ఉ. హాటకగర్భదైవతమహర్షులు దీవన లియ్యఁగా నిరా
ఘాటమరుద్వధూమధురగానము నింగిఁ జెలంగ జానకీ
పాటలగంధికంధర శుభప్రదవేళ ఘటించె నాజగ
న్నాటకసూత్రధారి రఘునాథుఁడు మంగళసూత్ర మయ్యెడన్. 123

క. కనదమృతమయము బుధరం, జనమును నైమించురామచంద్రుకరస్ప
ర్శన మొదవ వింతసిరిఁ గై, కొని యలరెన్ జానకీచకోరాక్షి దగన్. 124

వ. తదనంతరంబున బంధుగురుపురస్సరంబుగాఁ గల్యాణవేదికడకు వచ్చి యేకపీఠాసీనులై యివ్వధూవరులు గలసి కూర్చుండ విధ్యుక్తాచారంబున శుభహోమకృత్యంబులు నిర్వర్తించునప్పుడు. 125

చ. ఇరువురసిగ్గు లగ్గలపుటేపఁ గచాకచిఁ బైకొనన్ ముఖాం
బురుహయుగంబు వాంచి తలఁపుల్ మదినువ్విళులూరఁ జూపులొం
డొరులపదంబులం దొరయ నొండు నెపంబున మోములెత్తి ప
ల్లఱు మఱువెట్టిచూడ నెడమం గుడి సేయఁ దొడంగెఁ గంతుఁడున్. 126

చ. చెలఁగి వివాహవైభవము చేకొని రాముఁడు సీతయున్ శిఖిన్
వలగొని వచ్చి సప్తమునివందనముల్ గురువృద్ధబంధుమం
డలయుగపత్ప్రణామము నొనర్చి పరస్పరలజ్జ లాత్త రం
జిలఁ దగువారితోడుత భుజించిరి బువ్వమునన్ వధూవరుల్. 127

వ. తత్ప్రకారంబున. 128

## భరతలక్ష్మణశత్రుఘ్నకల్యాణము.

క. అనఘమతి ధారవోసెన్, జనకుఁడు సౌమిత్రిభరతశత్రుఘ్నులకున్
వనితారత్నము నూర్మిళ, వినయవతిం బుణ్యమాళవిని శ్రుతకీర్తిన్. 129

వ. ఇట్లు రఘుకుమారచతుష్టయంబునకు వివాహంబుఁ జేసి జనకుండు తదనంతరంబునం బరిణయోత్సవాభీష్టదానంబుల నిఖిలబుధవితానంబులకు సంతుష్టిఁ గావించి యుత్తుంగమదమదావళతురంగరథసహస్రముక్తాచ్ఛత్రరత్నశిబికానేకదాసదాసీజన సమస్తవస్తుప్రాజ్యధరణీరాజ్యంబును వివిధవర్ణస్వర్ణమణిమయాభరణంబులు నరణం బొసంగినం దదాదేశంబునం జనసీజనకబంధుమిత్రకళత్రసహితంబుగా రాఘవేశ్వరులు మగిడి ఛనందత్కులకలం బాలకించి. 130

## పరశురామవిజయము.

క. ఆవేళ భార్గవుఁడు ప్రళ, యావసరార్కప్రతాపుఁడై యతికుటిల
భ్రూవికటనిటలతటుఁడై, త్రోవకు నడ్డంబుగా నెదుర్కొని పలికెన్. 131

ఉ. ఎవ్వఁడ వీవు నాయెదుట నిట్లు శరాసనబాణపాణివై
క్రొవ్వి భయంబు లేక యెటకుం జనువాఁడ? వనేకభూపతుల్
ద్రవ్విరి మత్కుఠారనిహతిన్ భృగురాముని నన్నెఱుంగవే?
చివ్వకుఁ గాలుఁ ద్రవ్వెదున జేయధనుర్ధరసార్వభౌమునిన్. 132

క. నావుడు సద్విప్రుఁడవు వ, యోవృద్ధుఁడ వింతె కాదు యోగివి నీతో
రావంగడంపురాముఁడ, నేవిధి రణ మాచరింతు? నెఱిఁగింపఁగదే. 133

వ. అనిన విని. 134

శా. ఏనన్ రాముఁడ నీవు రాముఁడవె? యోరీ! రాజపుత్త్రుండ వీ
వైనన్ సాధ్వస మేమిరా? వినవె మున్నస్మత్కుఠారోగ్రధా
రానిర్భిన్నసమస్తభూవరతనూరక్తంబులన్ శాస్త్రవి
ద్యానీతిన్ బితృతర్పణం బొసఁగితిన్ ధైర్యంబవార్యంబుగన్? 135

తే. పూని గుబ్బలి రాచవిల్కానితోడఁ, గూడి విలువిద్య గావించినాఁడ నన్ను
నక్కుమారుండు గెల్వలేఁడయ్యె దొడరి, యొక్కనుసివిల్లువిఱిచి పెల్లుబ్బనేల. 136

క. పురహరునివిల్లు విఱుచుట, యరుదే? చిరకాలజీర్ణ మది యిప్పుడు నా
కరకలితవిష్ణుచాపము, నిరుపమభుజశక్తినిధివి నీ వెక్కిడుమా! 137

క. పోవిడువ నేర్తునే నిను, నావి ల్లెక్కిడవఁ గాక నా విని యేఁగా
యీవాచాలత? కను నా, లావు భవచ్చాప మేల లక్ష్యము నాకున్? 138

మ. అని భుగ్నభ్రుకుటీకరాళవదనుండై చండిమావార్యశౌ
ర్యనిరూఢిన్ భృగురాముకార్ముక మనాయాసంబుగా వంచి యా
గొనయం బెక్కిడి టంకృతుల్ సలిపి తళ్కుందూపు సంధించి యి
ట్లని పల్కెన్ రఘురాముఁడయ్యెడఁ దదీయాహంక్రియాధిక్రియన్. 139

క. తొడిగితి నేనెద నిఁక నీ, యడుగులు దెగిపడ నమోఘ మస్మద్బాణం
బెడయ న్నేరదు నావుడు, వడవడ జమదగ్నిసూతి వడకెన్ భీతిన్. 140

తే. అపుడు దశరథరాముబాహాపటుత్వ, సత్త్వసంపదఁ గాంచి యాశ్చర్యమంది
సురగరుడసిద్ధసాధ్యకింపురుషవరులు, జయజయనినాదముఖరులై సంతసిలిరి. 141

తే. భార్గవునియందుఁ గలకళాపటిమ దక్కె, నంత వైష్ణవధర్మంబు మంతుకెక్కె
నెరయ రఘురాము చేతనె నిల్చె నప్పు, డన్యులకు నంతపని సాధ్యమగునె తలఁప?

వ. అంత భార్గవరాముండు రఘురాము నుతియించి యి ట్లనియె. 143

క. నీ వాచతుర్భుజుండవు, గావున నెక్కిడితి విట్టి కార్ముక మింకన్
నీవిజయము నాయది శ్రీ, దేవుని యంశమునఁ బుట్టితిమి మన మనఘా! 144

క. ధర యెల్లను గశ్యపునకు, నరవర! మును ధారవోసి నాఁడఁ జరింతున్
బొరిఁబొరి మహేంద్ర శిఖరిన్, జరణము వేయకుము సుకృతశాలివి తలఁపన్. 145

తే. కడఁగి మత్పుణ్యలోకమార్గంబు వేయుం, మంప్రియంగ్మంబు మన్నింపు మనమశౌర్య
యనిన నట్లన చేసె దయాంకురంబు, డెందమునఁ బాదుకొన రఘునందనుండు. 146

వ. అంత నప్పరశురాముం డవక్రవిక్రమాభిరాముం డగురామునకుఁ బ్రదక్షిణం బాచ
రించి వినుతించి మహేంద్రపర్వతంబునకుం జనియె నయ్యెడ దశరథుండు భార్గవు
గెల్చిన ప్రతిహతప్రతాపంబునకు మెచ్చి యచ్చెరువు నొంది యానందించి యక్కు
నుపలాలించి సకలసేనాసమేతుం డై యభంగమంగళవాద్యకోలాహలంబు భూనభోం
తరాళగోళంబునం బ్రబలఁ జని యయోధ్యానగరంబు సొచ్చి రాజమార్గంబునం
బోవుచోడ సౌధోపరిపురంధ్రీజనంబులం గనుంగొనె నివ్విధంబున. 147

చ. కలికి యొకర్తు రామునిజగత్త్రయమోహనదివ్యరూపమం
గళపటువిగ్రహంబు పసఁగాంచుతమిన్ కటిఁ బూని మేఖలా
వలయము గీలుకొల్ప మఱువన్ దిగజాఱినయప్పు డవ్వధూ
కులమణి కోమలాంగలతకున్ గుదురుంబలె నొప్పెఁ జుట్టుచున్. 148

తే. ఒకతె ముంగరముత్తె మీనొక్కయతివ, యందుకొని కేలి కెంజాయ నరుణమైనఁ
గాంచి దాడిమబీజశంకను గరాగ్ర, కేలి కాకీరముఖమునఁ గీలుకొల్పె. 149

తే. మేడపై నెక్కి రఘురాముఁ జూడఁ దివిరి, హారలత మల్లికాదామమని యొకర్తు
కప్పుగొప్పున నిడ నది యప్పు డొప్పెఁ, దారకాపంక్తిగర్భితాబ్దంబువోలె. 150

వ. ఇట్లుపౌరవధూజనంబు లపారపారవశ్యంబు నొందనగరు ప్రవేశంబుచేసి వృద్ధగురు
బాంధవప్రేరణంబున నొక్కనాఁడు శుభలగ్నంబున యామినీసమయంబున రామచం
ద్రుండు నవచకోరలోచనాసక్తికలితానురాగరసతరంగితాంతరంగుం డై. 151

చ. సరసకళావదావదవిశారదపంజరశారికాశుకో
త్కరమును రత్నదీపకళికారుచిరంబును ధూపవాసనా
పరిచితమున్ మధువ్రతతపగఫలదాయకపుష్పమాలికా
సురభియు నై వితానముల శోభిలుకేళిగృహాంతరంబునన్. 152

తే. అధిపుఁడు మనోజ్ఞశయ్య నున్నంత సఖులు, సమయసముచితసకలభూషావిశేష
శంజితాకారఁ జేసి సంభ్రమ మెలర్ప, నత్తుకొని వచ్చి రొయ్యన నతివనపుడు. 153

తే. సిగ్గు వెనుకకుఁ దివియంగ నగ్గలంపు, రాగరజ్జువు ముందుకు సాఁగఁదివియ
నందులకుఁ దోడుతోఁ దోపులాడఁ జెలులు,నడుమఁ బిరివీకులయ్యెనప్పడతికపుడు.

తే. మగువ లజ్జాభరంబున మాఱుకొనుచుఁ, జెలులవాగంకుశంబుల చేతిభీతిఁ
గాంతునిభుజాంతరపుఁగట్టుకంబమునకు, మదనమదనాగమోనాఁగఁ గదలి వచ్చె.

వ. ఇట్లుసఖీజనసాహాయ్యంబున వచ్చి శయ్యాసమీపమణిమయ స్తంభంబుచాటుననడుగు
గదలక మనోభవజయ స్తంభంబన నున్నకన్నియ మెఱంగి యచ్చెలులు విభునకుం
గను గిరపి యొండొరు లొక్కొకనెపంబున నొయ్యనొయ్యనం జని రయ్యెడ. 156

క. తలవంచి లజ్జపెంపునఁ, జెలువ పదాంగుళుల నేలఁ జిమ్ముచుఁ బలిముం
గల నిలిచి పల్లవాయుంథ, కలహమునకుఁ గాలు ద్రువ్వగతిఁ జిత్రగతిన్. 157

తే. స్తంభగతరత్నపుత్త్రిక తనదుబోటి, యని విలోకించి తోడ మాటాడకునికి
నలుఁగడలుఁ జూచి తెలిసి యచ్చెలువబెదరి, వెడలనూహింపఁజేదమ్మియొడిసిపట్టె.158

తే. దశరథమహానరేంద్రనందనుని చేత, నతనువిక్రమధరుని చే మతిఁ దలంకి
యామహీనాథరాజకన్యాలలామ, తగులువడె నవ్వు దేమిచోద్యంబు తలఁప ?.159

చ. నెలయగుఁ దత్క్షణంబ రమణీముఖ మెత్తగఁ జూచుకోర్కియుం
గ్రలిజిగియారునంటుతమకంబునఁ బాటిలు దీర్ఘకాలమై
కలయిక నుబ్బు పెంజెమటఁ గన్గొనుకూరిమిఁ బెక్కువర్షముల్
మలయుంట దోఁచు నప్పతికి మానినిఁ బైకొనుతత్తరంబునన్. 160

క. శయ్యకుఁ దార్చి యనంగుని, నయ్యాటపుఁజిట్టకంపుఁజదురుల కపుడా
యయ్య దొరఁకొని ప్రియోక్తుల, నయ్యువతిక్ గలయంతహాతహం బ్రార్థించెన్.

ఉ. అంగన! నాకుఁ గొంగుముడియై తగు నీవిపు డిచ్చు నీవి త
న్వంగి ! భవన్మనోజ్ఞమధురాధరకాంచనకాంచికాస్థలుల్
తంగెటిజున్ను ముంగిటినిధానము నౌనటు గానఁ బాయలే
నంగజునాన నాదుహృదయం బెఱుఁగుక్ వలపంబుజానన. 162

తే. తరుణి ! నినుఁ గన్నజనకుం డుదారగుణను, ముద్రఁ దదిగాక సంపద ముదిత నీవు
చే వదలవేల కరుణ వీక్షించి యొక్క, విడె మిడఁగరాదె యాపోకముడి వదల్చి.

చ. అని చతురోక్తి వేఁడుకొని యల్లననంకతలంబు నేర్చి పే
ర్చినతమి చే వడంక నునుఁ జెక్కిలి నొక్కి కవుంగిలించినక్
దనువునఁ గంప మొందె తనుఁ దా నడలెక్ దృఢనీవిబంధమో
చన మగు టద్భుతంబె రఘుచంద్రునిప్రాభాకయింత గల్గినక్. 164

క. వనిత! యపు డమితలజ్జా, వనతానన యగుచు నుండ వల్లభుఁ డటఁ గ

న్గాని సతికిఁ గూర్మి వాడమిఁ, బనిగొనియెదుఁ గాక యొకయుంపాయముకలిమిన్.
వ. అని తలంచి. 166

తే. కప్పురముగుల్కు కమ్మబాగాలు మడుపు, లతివచే నిడి తా నవి యందుకొనియోఁ
జిట్టకంపుఁదనాలకుఁ జేయిచాచి, విడెము పెట్టు మనంగ నవ్వేళ విభుఁడు. 167

తే. కొండలకు సన్నలిడుభంగిఁ గోమలాంగి, పయ్యెద మొరంగి చనుదోయిపజ్జ దార్చ
నధిపుఁడు కరంబు చాఁచి నూఁగారు వల్లి, బామఁ బట్టంగఁ జనులీలఁ బట్టఁబూనె.

క. రతిపతిహాళాహాళిం దన, యతిధైర్యధనంబు కొల్లలాడె నటంచున్
గతమిచ్చుకరణి నిచ్చున్, బతి యొకతెలనాకుమడుపు ప్రాణేశ్వరికిన్. 169

తే. కచకుచాభోగగండభాగంబు లంటి, యూరు నిఁక నొక్కటియుంను నీవంటనీవు
లలన! మది నేఁడుగడగాఁ దలంచు నన్ను, నేలుకొనుమంచు వేఁడెనవ్వేళవిభుఁడు.

తే. కుంతలంబుల వాలారుగోళ్లదువ్వి, నాభిముఖ్యాంబునకుఁదెచ్చియనఁగి పెనఁగి
విడెము చవిగొల్ప నపుడహో విషమశరుఁడు, విభువధూధైర్యపరిపాటిపీటఁబుచ్చె.

వ. అత్తఱిం దత్తరంబున. 172

చ. అలనృపసూతి శాతనఖరాంకుశభీతి యొకింత సూపి వ
ర్తులనవకుంతమారుణగురుస్తనకుంభము లప్పళింపఁబా
టిలుతమి మేలుపట్టపుఁగటిం జిఱుగంటలఁ బొల్చుదానిఁ జి
వ్వలవలరాయనిం గెలుచువైపునకున్ సమకట్టె నేర్పునన్. 173

ఉ. చేకొనెఁ గత్యసీమలు విచిత్రగతిం గుచశైలదుర్గముల్
చేకొనె మధ్యదేశమును జేకొనె నూరుయుగంబులోనుగాఁ
బైకొనె బాహుశక్తి సతిఁ బల్మిఱు నాలమునన్ బెనంగి ర
త్నాకరమేఖలాస్థలము నవ్విభుఁ డంతయుం జేకొనెం దుదిన్. 174

వ. ఇట్లు వివిధబంధవిశేషంబులఁ జొక్కి యక్కన్య కౌఁగిటం దక్కి యిట్లనియె. 175

ఉ. పంటవలంతికిం బొడమి భాసిలుసీతవు గానఁ జేలతో
నంటినఘర్మవారిఁ బదనై పులకోదయసస్యసంపదన్
గెంటక యుంకి నీక తగు నేఁ డిట నావ్యవసాయ మేర్పడన్
గంటి నిరంతరానుభవగౌరవసౌఖ్యముఁ బండెఁ గోరికల్. 176

వ. అవ్విధంబున సుఖానవహాభీష్టగోష్ఠివిహారంబున నారాత్రి గడపి ప్రభాతకృత్యంబులు నిర్వర్తించి రఘునందనుండునంతదినదినప్రవర్ధమానవిభవంబునం దేజరిల్లుచుండెనొక్కనాఁడుదశరథుండును నిఖిలధరణీరాజ్యభరణోద్ధారుం డక్కుమారుండే యని యతుల శుభలక్షణాభిరాముం డగురఘురామునకుం బట్టాభిషేకంబు గావింప నుద్యోగించి

కులగురుం డగునరుంధతీమనోహరుననుజ్ఞ సామాత్యభృత్యబంధువృద్ధసమ్మతంబుగఁ దదుచితప్రయత్నంబు లాచరించునంతట. 177

## ఆశ్వాసాంతము.

క. అంగ మగ ధాంధ్ర కురు క, ళింగమహీనాథమండలీకోటీరా
భంగమణిమహితపదయుంగ!, రంగమనామాభిరామ రామారమణా! 178

మాలిని.—

కదనజయకిరీటీ ! ఖండితారాతికోటీ !
మదనసదృశరూపా ! మంజుభాషాకలాపా !
సదయహృదయపద్మా ! సద్మసంసక్తపద్మా !
యుందధినిభగభీరా ! యోబమాంబాకుమారా ! 179

గద్యము. ఇది శ్రీమదొంటిమెట్టరఘువీరశతకనిర్మాణకర్తజగదేకఖ్యాతిధుర్యాయ్యల రాజులిప్పయమనీషిపర్వతాభిధానపౌత్రాక్క్కయార్యపుత్త్ర పరిశీలితసమిద్ధరామానుజ మతసిద్ధాంతమర్మముమ్మడివరదాచార్యకటాక్షవీక్షాపాత్రహృదయపద్మాధిష్ఠితశ్రీరామ భద్రరామభద్రకవిప్రణీతం బైనరామాభ్యుదయమహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.







# పంచమాశ్వాసము.

మన్మందిర! విమత
క్ష్మామండలపతికులాబ్ధిమందరకుధరా!
భీమభుజాజలదురితవి
రామా! గొబ్బూరి నరసరాజలలామా! 1

## శ్రీసీతారామలక్ష్మణుల యరణ్యగమనము.

వ. అవధరింపుము తదనంతరకథావిధానం బెట్టిదనిన. 2

శా. రాముం బట్టముగట్టఁగా దొడరు వార్తల్ సుబ్బినం గైకయీ
నామస్త్రీ పతిపూర్వదత్తవర విఘ్నం బాచరింపన్ సతీ
సౌమిత్రుల్ దనుఁ గొల్వఁ గానలకుఁ గౌసల్యాదశస్యందనా
జ్ఞామాత్రంబు ధరించి యామిహిరవంశస్వామి యేఁగెన్ ధృతిన్. 3

వ. ఇట్లు దశరథుండును దురంతసంతాపచింతాపరాధీనమానసుం డయి సుమంత్రుం
గనుంగొని యి ట్లనియె. 4

తే. అవనకాంక్షాపరుండు రాఘవుఁడు వాసి, నేఁడు వనకాంక్ష నేఁగుచున్నాఁడు నీవు
రథము గొనితెమ్ము విపినమార్గముల సీత, యబల చనలేదు నావుడు నతఁడు వోయి. 5

చ. అరదముఁ దెచ్చి పంక్తిరథునానతి వచ్చితిఁ జిత్తగించి దా
శరథి! రథాధిరోహణము సల్పుము నావుడు జానకీతలో
దరియుం సుమిత్రపట్టియును దానును నెక్కి పురంబు వెల్వడన్
నరులమహార్తనాదము వినంబడియెం దలఁకెన్ ధరిత్రియున్. 6

వ. ఇత్తెఱంగున ధనుర్బాణతూణీరంబులు ధరించి వారిం చనం బోవ పురజనం బాబాల
గోపాలంబుగా వెనుచన నయోధ్యానగరంబు వెలువడ దశరథుండు కౌసల్యాసుమి
త్రాకరంబు లవలంబించి యంతఃపురంబు నిర్గమించి యొండొరులకుం దోరఁగునీరంధ్ర
బాష్పధారావర్షంబువలన రఘునందనస్యందనమార్గంబు గనుంగొనరామికివగలంబొగు

లుచు మగుడల మరల్చి రథంబుఁ గూడ నరిగెదం గాక యనుచు నొక్కొక్కవంకఁ దల
వసిష్ఠుండు వారింప నిల్చి మఱియు నద్దెసం గనుంగొనుచుండె నయ్యెడ. 7

## దశరథవిలాపము.

క. ఎదురఁ జనురథము గనుఁగొను, నది గానక తత్పరాగ మాలోకించుం
దుది నది గానక యడలున్, మది నొనన్ రాముఁ గూర్చి మహిపతి మఱియున్. 8

క. కేకయతనయాదత్తవ, రాకృతి నంధమునిశాప మాహా! నేఁటం
జేకూఱెఁ బోలుఁ జరుసె పు. రాకృతకర్మంబు దుస్తరము పాపవిధిన్? 9

ఉ. హా! యను గాధినందనమఖారినిశాటమదాపహారిబా
హా! యను గ్రావజీవదపదాంబురుహా! యను రాజలోకసిం
హా! యనుఁ బోషితార్యనివహా! యనుఁ గానల కేఁగితే నిరీ
హా! యను నిర్వహింపఁగలవా నినుఁబాసి రఘూద్వహా! యనున్. 10

ఉ. హా! సుకుమార హా! రఘుకులాంబుధిపూర్ణసుధామయూఖ! హా
భూసురపూజ్య యేఁడు చెడుబుద్ధులు విన్నఫలంబు నేఁడు నిన్
బాసితి నింద కోర్చి నిలువంబడెఁ బ్రాణము లట్టులేకదా!
యాసవవాంఛ వర్తిలుదురాత్ముల కెందునుఁ గీర్తిగల్గునే? 11

సీ. కానక కన్నసంతానంబు గావునఁ గానక కన్నసంతాన మయ్యె
నరయ గోత్రనిధానమై తోఁచుఁ గావున నరయ గోత్రనిధాన మయ్యె నేఁడు
ద్విజకులాదరణవర్ధిష్ణుఁడు గావున ద్విజకులాదరణవర్ధిష్ణుఁ డయ్యె
వివిధాగమాంతసంవేద్యుండు గావున వివిధాగమాంతసంవేద్యుఁ డయ్యెఁ

తే. గటకటా! దాశరథి సముత్కటకరీంద్ర, కటకలితదానధారార్ద్రకటకమార్గ
గామి యెట్లు చరించు నుత్కటకరీంద్ర, కటకలితదానధారార్ద్రకటకతటుల? 12

వ. అని యిట్లు దశరథుండు వికలమనోగతుండయి కటకటం బడి పునఃపునర్దూరాభ్
బోధదురవస్థలం బొరలుచుండె నంత నక్కడ రఘూద్వహుండు నల్లనల్లనం జనిచని.

## శ్రీరాముఁడు పౌరుల మరల్చి గంగాతీరముం జేరుట.

క. తమసానది నసమాదిక, తమసారసహంసకులవతంసం గలిసం
తమసార్యమదీధితిను, త్తమసాత్త్వికమూర్తిఁ గదిసి తత్తటి నిలిచెన్. 14

తే. అచటఁ బౌరుల మరలఁగ ననిచి యందుఁ, గాల్యకరణీయములు దీర్చి కడచి పుణ్య
వనవిశేషంబు లానాయిజనపథంబు, లవనికన్యకుఁ జూపుచు నరిగె నపుడు. 15

క. తరణికులాగ్రణి కానల, కరుగుచెడం దోడ లక్ష్మణావనిసుత లి
ర్వురి కా రప్పడయోధ్యా, పురజనులమనములుఁ దవిలిపోయెన్ వెంటన్. 16

వ. అంత. 17

క. సరయూవేత్రవతీముఖ, సరిదుత్తరణం బొనర్చి శౌర్యాకృతులై
యరిగిరి పవినిభు లిరువురు, నరిగిరి భాగీరథీతటావనిఁ జేరన్. 18

ఉ. క్రొన్నెలతాల్పునింగిసిగకుం గసుగందనిపూలదండయున్
వెన్నునిమించుకాలిబొటవ్రేలికిఁ గూఁతురు వేల్పుటాటకున్
మిన్నుకొలంకు పంటచెలిసిద్ధపుఁబయ్యెద పాలవెల్లికిన్
మన్నన యన్నునై తపసి మంతనపుం దెర యైనతొయ్యలిన్. 19

క. ముజ్జగముల నెలవరి నిజ, మజ్జనసంశీలబుద్ధి మజ్జనసముదా
యోజ్జీవన జీవన యగు, నజ్జాహ్నవిఁ జేరె దూరితాధ్వశ్రముఁడై. 20

లయగ్రాహి.—
చేరి కనియె న్నిఖిలసూరినిధి దాశరథి, కోరి సగరాన్వయమువారి కమృతం బ
వ్వారిగ నొసంగుతెగుదారి నిజభూరితర, వారితరవారిముఖదారితబుధాంత
ర్వైరిఁ జని జహ్నుముని కూరిమిఁ గనుంగొనుకు, మారిభువనత్రయవిహారభవనన్ భా
గీరథి సమస్తముని గీరధిపగణ్య నవ, నీరధిక మౌళిమణి నీరధిపురంధ్రిన్. 21

ఉ. తోరపుజీవనంపుఁబసతో నిసుమంతయుఁ దూలిపోనిగం
భీరగుణానుకూలగతిఁ బెం పగుజాహ్నవిఁ జూచి మెచ్చి త
త్తీరనికుంజపుంజవసతిన్ సతి కూరట సంఘటించి యా
చేరుల భూమిభృత్కులజసింహము నిల్చె గుహాశ్రమంబునన్. 22

## శ్రీరాముఁడు గుహాశ్రమంబున వల్కలాదులఁ దాల్చుట.

తే. రాజపరమేశ్వరుండు శ్రీరాఘవుండు, గుహునిచేత సపర్యఁ గైకొని ప్రియోక్తి
నన్నిషాదోత్తమునిసేమ మరసి తనదు, విపినసంచారవృత్తాంతవిధముఁ దెలిపి. 23

క. అచలేంద్రధీరుఁ డవ్విభుఁ, డచట జటావల్కలాజినాంబరధరుఁడై
రుచిరతపోధనవేష, ప్రచురశ్రీఁ దాల్చి నియమపరతం బొలిచెన్. 24

మ. అనఘుం డగ్గుహలాలనాపరతమై నంచజ్జటావల్కలా
జినముల్ గైకొని జాహ్నవీతటిని భాసిల్లెన్ శిరోభాగమో
హనగంగానది డించి కాననవిహారాకాంక్ష వర్తింపుచు
న్ననగాధీశ్వరకన్యకారమణుఁడో నా భూతి శోభిల్లఁగన్. 25

వ. ఇట్లు తపోధనవేషంబు గైకొని. 26

చ. మనుకులసింహుఁ డప్పుడు సుమంతునిఁ బిల్చి రథంబు గ్రమ్మఱం
గొనిచని తల్లిదండ్రు లెదఁ గుందక యుండఁగ విన్నవింపు మా

య్యనికియు సేమముం దెలియ నుండు సుఖంబున నీవు నావుడుం
గనుఁగవ బాష్పముల్ నిగుడఁ గాఁ బురికి న్మగిడెన్ రథస్థుఁడై. 27

తే. అలసుమంతుని వీడ్కొని యర్కవంశ, ఘనులు గంగాతరంగిణిఁ గడచి యపుడు
గుహుఁడు చూచినత్రోవనై కొనిరి చనిరి, యుగ్రకార్ముకధరులై యుదగ్రవృత్తి. 28

శా. ఆయోధాగ్రణు లిర్వురుం జనిరి యాయాపక్షిణప్రక్రమం
బాయాభీలకురంగచంక్రమణ మాయాకుంజపుంజస్థలం
బాయాగ్రావదరీఝరీపరిసరం బాయావనీవైభవం
బాయాఘోషవిశేషముల్ జనకకన్యాదేవికిం జూపుచున్. 29

క. ఒకకొంతదవ్వు చనిచని, తెక తెక సెగ తగయు నెండతెరలం బొరల
న్నకనకల జనకకన్యకు, నకటా! యడుగడుగు గంద మయ్యెం ద్రోవన్. 30

## రామాదులు వనవాసకష్టములం జెప్పి వందురుట.

వ. ఇట్లు కొండొకదినంబునఁ జండాతపంబునం గుందుచు నొకమహాదురవగాహగహ
నోపకంఠంబునం బోవునెడ. 31

లయవిభాతి.—

పొగతెగయుదావశిఖ సెగలవగలన్ నొగిలి, నిగనిగనివచ్చికల సొగసగుబయళ్లన్
దిగితగ వసింపఁజనుదగ యెదగ నిల్చుఁదగ, గగనమణి కాఁక తెగఁ దగిలి విధిదూఱన్
బొగిలిపొదదూరుఁదన తెగువ దెలుపుం గదిసి, మగనియడుగుం దొగరుచిగురులటు చూ
చున్, వగచుమది వేఁడుకొనుఁదొగ నెలవులన్నిలువ, మృగములొలయన్నగువ వెగడు
పడువంతన్. 32

వ. ఇట్లు వేఱొండుదివసంబున జనకతనయ పట్టపగలింటిమింటిమానికంపుఁగాఁక తళుకు
సోఁకులకు నులుకుచు బయలునెత్తమ్ముల వసియింపఁ గనుంగొని సౌమిత్రి యిట్లనియె.

చ. తలకొని యెండలన్ మృదుపదంబులు గందినఁ జాలఁ గుంది యా
స్థలనలినీవనాంతరపదంబున జానకి నిల్చి సొంపు సం
ధిలఁ గమలాలయాసరణిఁ దెల్పుచు నున్నది పద్మినీసుహృ
త్కులతిలకంబ! రామ! కనుఁగొంటె కటాక్షనిరీక్షణంబునన్. 34

క. అన విని డాయం జని విభుఁ, డొనరన్ బూజానుసరణ మొనరించెను దో
డనె నీడ యగుచు నెందున్, వనితలకుం దోడునీడ వల్లభుఁడె కదా! 35

క. ఇటుల నొకకొంతసేప, చ్చట నించుక సేదదేఱి చనిచని యతిదు
ర్ఘటతరమార్గగ్లానిం, గటకట పతితోడఁ బలుకుఁ గటకటపడుచున్. 36

మ. మనయూ రెయ్యది? యెంతదవ్వు మన మీమార్గంబునన్ బోవుటల్?

మన మెచ్చోటికిఁ బోయిరావలయుఁ? నేలా లేదు తే రిచ్చటన్
మనతోఁటన్వలెఁ బువ్వుటోవరులు సమ్యక్చంద్రకాంతస్థలుల్
గనరా విప్పు డదేమి? నావిభుఁడు శోకం బాత్మలో నాఁగుచున్. 37

తే. ఇంతి! గురునాజ్ఞఁ బదునాలుగేండ్లువనుల, నియతిఁ జరియించు వ్రతము పూనితిమి నీవు
విపినసంచారమునకింత వెఱపవలవ, దడవి మునికన్య లాయాస ముడిగి మనరె. 38

క. అని సీత నమృతశీతల, కనదాలోకనము లోలయఁ గరుణాపరుఁడై
కని మఱపించెన్ యాత్రా, జనితాయాసంబు దేహసంతాపంబున్. 39

వ. ఇట్లు రఘువీరుండు మార్గశ్రమంబును మఱపించుచు నక్కుసుమకోమలాంగి యల
మటకుఁ గటకటంబడుచుఁ బలువగలభావగర్భంబులుగాఁ గొన్నిసరసోక్తులనిట్లనియె.

సీ. పలుగుత్తా లొల్లక తొలఁగివచ్చినఁగంటె? పలుగుత్తాలివి గానఁబడియె నిందు
నంధలంబులు మాని యరుదేర నివె కంటె యందలంబులు చేరనయ్యె నిపుడు
పంజుజాడల నేఁగుపదవి రోసినఁ గల్గెఁ బంజుజాడల నేఁగుపదవి యిచట
నాకులభోగ మందక వచ్చి యిదె చూడు నాకులభోగ మందంగఁ గంటి

తే. రేవగలు నేఁడు గురుపాదసేవ గల్గెఁ, గంటి మజ్జనకృత్యముల్ గన్నవారి
నచట లేనిమహాసౌఖ్య మిచటఁ గంటి, మొల్లకుండినఁ బోవునే యోమృగాక్షి. 41

వ. అని సీతతోడం బలుకుపలుకు లాకర్ణించి. 42

క. శ్రీరాముఁడు నీయలమట, లారసి పలువగలఁ బలుకునర్థగభీరో
ద్గారోక్తి వింటె జనకజ, మారీ! యని లక్ష్మణుండు మది వగఁబొందున్. 43

తే. ఇట్లు సీతానుజులతో నరేంద్రుఁ డవల, నరిగి యధ్వశ్రమనివారణార్థ మొక్క
సమధికతమాలకాననచ్ఛాయ నిలిచి, విస్తృతతృణాసనస్థుఁడై విశ్రమించె. 44

వ. అప్పుడు. 45

ఉ. వాసి ననంతభోగముల వర్తిలు కోమలమోహనాంగ యా
హా! సుఖపీఠి యెల్లుగనవయ్యెనె నీకిపు డిదంచు నాసుమి
త్రాసుతుఁ డన్న నన్నరఘురాముఁడు వల్కె సదాశరాసనా
భ్యాసము వంశసిద్ధముకదా విలుకాండ్రకు నంచు నయ్యెడన్. 46

మత్తకోకిల. ఎండమావులకాఁకఁ దమ్ముఁడ యెంతగుందితో! యింక నా
యండమావుల క్రేవలన్ నిలు మల్లనల్లనఁ జండమా
ర్తాండబింబము పండఁబాఱి కరం బపూర్వహరిద్గిరిన్
నిండుకుండవలెన్ దలంకక నిల్చునంతకు నావుడున్. 47

తే. అతులభూజాన్వితుండ వైనట్టినీకు, సర్వదా రామయంతకు నిజ్జనకసుతకు

నెఱుఁగరా తెండపడ దేవ! యిట్టిమీఁప, దాఙ్జములనీడ నున్న నాకలఁత గలదె?

వ. అని విశ్రమించి యచ్చట. 49

## భరద్వాజాశ్రమప్రవేశము.

క. ఈరీతి నిలిచి యచ్చటఁ, గోరిక లలరం బతంగకులమణి చరమాం
భోరాశి కినుఁడు చేరన్, భారద్వాజాశ్రమంబుపజ్జ న్నిలిచెన్. 50

తే. గాలితేజీమెకంబులు క్రోలుపులులు, కొదమసింగముల్ కెంటఁద్రాగుడుమెకంబు
లలభరద్వాజమునిరాజనిలయమునకు, బలకరం బున్నజోదులపగిదిఁ బొలిచె. 51

క. మసలక మావంతునివస, యొసఁగం దెఱనోరిమెక మిభేంద్రత్రాణ
వ్యసనోల్లసనోన్నతి మనుఁ, బసిబిడ్డల నేదుదాదివలెఁ బులి యచటన్. 52

క. విలుదాల్పుం బ్రోడలు తోడ, చెలిజంటకొలంపురాచసింగపుఁగొదమల్
నిలిచిరటఁ బుడమిపుట్టగు, నెలఁతుకయుం దామఁ దపసినెలవున నంతన్. 53

క. పొడగని మునిశార్దూలము, నడుగుంగవ కెరఁగినం దయామతి వారిన్
గడు లాలించి సుఖాసన, మిడి యాబోధనిధి సీత నిట్లని పలికెన్. 54

క. మును వనమాలికకడ నీ, యునికి తగుం గాన నీకు నుండన్ దగు ని
వ్వనమాలికకడ నిపు డో, వనితామణి! పూర్వజన్మవాసన గాదే. 55

వ. అనిపలికి బహువిధంబుల నుపలాలించి. 56

మ. అలముని చిత్రకూటకుధరాధ్వముఁ జూపిన సంతసిల్లి య
బ్బలువిలుకాండ్రు రాకొమరుబాగులజోదులు నేల చూచి యం
గ్మలికి ధనుర్గుణక్వణనగౌరవభీతకురంగచంక్రమా
కలనముఁ జూపుచుం జనిరి కాంచిరి చెంతఁ గళిందకన్యకన్. 57

క. వెండియుఁ బడలిక దోఁపక, యుండ సరిద్దుర్గమార్గయుగ్మార్గవిలా
సాండజలీలావిహరణ, పాండిత్యము చూపి రచటఁ బద్మేక్షణకున్. 58

క. కాళిందీజలశీకర, పాళిం దీరద్రుసౌరభగ్రహణకళా
కేళిం దీపించునవని, గాలిం దీవ్రాంశుకులుల గాసి దొలంగెన్. 59

## రామాదులు చిత్రకూటముం జేరుట.

క. అలరాచకొమరు లర్యమ, కులమణు లభ్రంకషద్రుకుసుమగుళుచ్ఛాం
చలమధుకరఝ్ఝనాఘన, కులముఁ గనుంగొనిరి చిత్రకూటాచలమున్. 60

సీ. శోభిలులాయంపుఁజోటులఁ బాటిల్లి యొక్కడు మావులఁ బెక్కుగాంచి
బలితంపుఖడ్గహస్తులయోలగముఁ జెందిఁ బహురత్నకటకసౌభాగ్య మొంది
సింహాసనస్థలస్థితిఁ బొల్చి యొడనెడ వలయుసెత్తమ్ముల వఱలఁ జాలి

కలకంఠులు భజింపఁగా విచిత్రాగార యుక్తి సుఖవ్యాప్తి నుల్లసిల్లి
తే. చక్రిపాదసమాసక్తిసరణి గలిగి, చెలఁగి నీమాఁబోలె నీచిత్రకూట
భూమిభృత్సార్వభౌముండు పొలుచుఁ గంటె, సంచరద్దివ్యమణిపుత్త్రి! జనకపుత్త్రి!
సీ. కల్లోలడోలాసముల్లోలలీలాసరాళమరాళవాచాలఝరము
లుంగలవంగానుషంగిభృంగీజాతసంగీతభంగీతరంగితంబు
వాతపోతోద్ధూతవాసనావశలసన్మల్లికావల్లికావేల్లనంబు
కిన్నరీఖేచరీపన్నగీజనగీతసుఖదనానాగానముఖరశిఖర
తే. మదె కనుంగొంటె రాకామృగాంకవదన, మదనవిశిఖాయమానానమానకుసుమ
సముదయాపారసౌరభోచ్ఛ్వసితదశది, శాచలం బగుచిత్రకూటాచలంబు. 62
మ. అని చేరం జని శైలమెక్కి యపు డాయాయజ్ఞవాటోల్లస
న్మునిమూర్ధన్యనమస్క్రియార్చనవిధంబుల్ సల్పి తత్కన్యకా
జనసౌభాగ్య మజాతివైరమృగసంచారంబులున్ మేదినీ
తనయాదేవికిఁ జూపుచున్ మెలఁగి రాధానుష్కచూడామణుల్. 63
క. అందుల మునిజనభజనా, మందానందరసమగ్నమానసముల నం
దంద విహరించి నిలిచిరి, మందమరుత్పోతవీతమార్గశ్రములై. 64

పర్ణశాలానిర్మాణము.

తే. తపసిజాబిల్లిజవరాండ్ర దండ నుండఁ, బుడమిపట్టికి మదిఁ గోర్కి పుట్టుటెఱిఁగి
వేడ్క నొకపర్ణశాలఁ గావించి యచటఁ, గొఱలె నారాచసింగంపుఁగోదమదోయి.

కాకాసురరక్షణము.

క. అంత నొకనాఁడు సీతా, కాంత మునిస్త్రీల పొందికలు మరగి నిజ
ప్రాంతమహీరుహాసుమఫల, సంతతిఁ గొని విభుఁ డెలర్పఁ జనుదేరంగన్. 66
క. ఏకాకి నొండు దుర్మతి, యేకాకియొ తోలఁ దోల నేగక సీతన్
రాకన్ బోకన్ వెనుకొనఁ, గాకుత్స్థాన్వయవరుండు గని కుపితుండై. 67
తే. విసరి యొకయీఁచఁగొని వేయ వెంటవెంట, నదియు నొక్కమహాస్త్రమై కదియఁగాకి
లావుసెడివచ్చినను గావు కావు మనుచుఁ, బాదముల వ్రాలఁ బరమకృపాళుఁ డగుచు.
క. నాయాశుగం బమోఘము, నీయంగం బొకటి యిమ్ము నీప్రాణము నే
నీయెడఁ గాచితి నావుడు, నాయంబకమునకు నొక్కయంబక మిచ్చెన్. 69
తే. అతనుదర్పాంధకార మంతంతఁ గవియఁ, గన్నుఁగానక సాధ్వి రాఘవునిదేవి
జనకకన్య జగన్మాన్యఁ జెనకవచ్చి, కన్నుఁ గానక చనెఁ బలుగాకి కాకి. 70
క. సీతాసితామితఫల, జాతరసాస్వాదమోదజాతసుఖశ్రీ

చాతురిచేతన్ రఘుకుల, నేత తపోధనసమేత నియతిం బొలిచెన్. 71

## సుమంతుఁ డయోధ్యఁ జేరుట.

తే. అంతనక్కడనయ్యయో! యయ్యయోధ్య,దాసి యీశూన్యరథ మెట్లుదశరథేంద్రుఁ
డున్నయెడ నుంతు? నే మని విన్నవింతు?, నని సుమంతుండు నధిపుగేహంబు చేరి.

తే. చేరి యరదంబుఁ దద్గృహద్వారసీమ, డిగ్గి యరుదెంచి ప్రణమిల్లి దేవ! యిపుడు
నీకుమారుల సౌభాగ్యనిధులబుధుల, డించి వచ్చితి గంగాతటీవసతిని. 73

తే. నాట మఱునాట నటఁ జిత్రకూటశిఖరిఁ, జేరి యందలిసంయమిశ్రేణిఁ గొలిచి
నిలిచి వర్తింతు రింతకు వలపుగొలుపు, తరులనీడలకాడలఁ దరుల ఝరుల. 74

క. అనుచు సుమంతుఁడు దనతో, ననుపలుకులు చుఱుకుఁజిలుకులై ఘోరతరా
శని నొలుకతళుకులై యు, జ్జనపతి వీనులకు నులుకు సంపాదింపన్. 75

మ. విని మూర్ఛిల్లు బొరింబొరిం దెలియు నుర్వీభర్త యోలక్ష్మణా!
యను నెట్లేఁగితి రామరామ! రఘురామా! యంచుఁ జింతించుఁ గై
కనుఁ దిట్టుం దనబుద్ధి కాల్చుఁ బొగులుం గౌసల్యతోఁ గూడి హా
యను నవ్వేం దల యూఁచులేచు నిఁక నెట్లంచుం దలంచు న్మదిన్. 76

సీ. కంటకాశ్మక్రూరకాంతారములు నీకుఁ గేళీవనము లయ్యెనే లతాంగి!
దురవగాహాగభీరతరతరంగిణులు నీ కాటడిగ్గియ లయ్యెనా మృగాక్షి!
చిత్రకూటాదికగోత్రావళులు నీకుఁ గృతకాద్రు లయ్యెనే కీరవాణి!
హరిణీపరంపరాంతరవిహారము నీకుఁ జెలులపొందయ్యెనే చిగురుబోఁడి!

తే. నాకుఁ గోడలవై నీవనేకవిధుల, నిడుమఁబడ నింత నోచితే యిపుడు తల్లి!
పుడమిఁ బుట్టునెయిఁక నినుఁబోలుసాధ్వి? సనయదాక్షిణ్యవినయ! యోజనకతనయ!

వ. అని మఱియు. 78

మ. ఘుటదీపాకృతి గాదె రాఘవవియోగప్రాప్తశోకార్తిలం
పటచిత్తంబునఁ గుందునాప్రతిభ? పోల్పం గా నచంద్రోదయం
బటు లౌఁగాదె మహీసుతారమణశూన్యం బైనభాగ్యంబు? నేఁ
డటవీచంద్రిక గాదె రామరహితం బౌరాజ్యభోగం బిలన్? 79

## దశరథమరణము.

వ. అని దశరథుండు పురపురం బొక్కి వెక్కి మాఱులు రామశబ్దం బుచ్చరించుచు ని
శ్చేష్టితుం డయి సంక్రందనసహాయుండు గావున ననిమిషత్వంబు నొందె నప్పుడు.

క. నందనవనవాసము తన, డెందముఁ గుందింపఁగాఁ దొడింబడఁ దానన్
నందనవనవాసము విభుఁ, డొందె రఘూత్తమునిఁబాసి యుండం గలఁడే? 81

చ. సురవరమిత్రుఁ డిట్లు సుతశోకవిపద్దశ నంతరించినన్
గురుబుధవృద్ధబంధు లనఘుల్ పరమాప్తులఁ బిల్చి పొందు బం
ధురతరకీర్తిసౌరభరతున్ భరతుం గొని తెండు నావుడుం
ద్వరితగతిన్ గిరివ్రజనివాసునిఁ దెచ్చిరి యక్కుమారకున్. 82

భరతుఁడు గిరివ్రజమునుండి యయోధ్యకేతెంచుట.

చ. దొరసి యయోధ్యఁ జేరి భరతుం డనుజన్ముఁడు దానుఁ గూడి య
ప్పురము తెఱంగు నంతిపురముం గని చింతిలి కైకకున్నమ
స్కరణ మొనర్చి తొంటిసిరిఁ గానము పౌరులయందు నీముఖాం
బురుహము విన్నఁబోయినది పొల్పరి యమ్మ! యిదేమి? నావుడున్. 83

చ. వరములు పూర్వదత్తములు వల్లభుముందటఁ దెల్పి వేఁడుటల్
గురునియనుజ్ఞ లక్ష్మణునిఁ గోమలిజానకిఁ గూడి రాఘవే
శ్వరుఁడు చతుర్దశాబ్దవనవాసము పూనుట యట్టిచింతఁ బ
జ్త్కిరథుఁడు మేనువాయుటయుఁ దెల్పిన మూర్ఛిలి లేచి యుగ్రుఁడై. 84

ఉ. కేకయభూతలాధిపతికిన్ జనియించియుఁ నీచబోధముల్
గైకొని లోకనింద కొడిఁగట్టితి వారఘురాము రాజ్యల
క్ష్మీకరపంకజగ్రహణకేళికి విఘ్న మొనర్చి దుష్టమా
యాకృతివై చరించుపతిహంత్రివి తల్లివె నీవు రాక్షసీ! 85

మ. అని తల్లిన్ నిరసించి తండ్రిని గతప్రాణున్ శవాకారుఁ గ
న్గొని శత్రుఘ్నుఁడుఁ దానుఁ జేరి రఘుసూనుం బాపి నిన్నింత చే
సినయప్పాపసమేత మాత నిఁక నీక్షింపంగఁ బాలైతిమా!
యని వంతన్ భరతుండు గుంది మది హాహాకారఖిన్నాస్యుఁడై. 86

క. నను రామద్రోహపరుం, డనియో! మఱి కైకతనయుఁ డనియో! యేలా
కనుఁగొనవు? మగుడ రాముఁడు, చను దెంచెన్ వీఁడె చూడు జననాథమణీ! 87

క. అని పెక్కుపగలఁ బొగులం, గని భరతకుమార! యగ్నికర్మము లిఁక నేఁ
డునుఁ జేయుకుండఁగా రా, దనుచు వసిష్ఠాదిమాను లానతి యియ్యన్. 88

భరతుఁడు దశరథునగ్నికార్యములఁ దీర్చుట.

తే. సాంగముగఁ దండ్రి కగ్నికార్యములు దీర్చి, వివిధభంగి యథావిధి విప్రవరుల
నిష్టనిఖిలార్థదానసంతుష్టిఁ దేల్చి, యడలు రఘువీరవనయాత్ర నాత్మఁ దలఁచి. 89

ఉ. ఇట్టితెఱంగునన్ భరతుఁ డెంతయుఁ గుందఁ వసిష్ఠుఁడున్ బుధుల్
వట్టన మీఱయొదం బగిలిపాటి యరాజక మైన దింతటన్

బట్టము గట్టుకొమ్ము జనపాలనశీల నయాభిరమ్యతన్
నెట్టుకొనన్ సమస్తధరణీవలయాంకితబాహుశాలివై. 90

చ. అన విని దైవమానుషబలాఢ్యుఁడు రాముఁడు భాగ్యచాతురీ
ఖని యనివార్యశౌర్యుఁడు జగన్నుతుఁ డగ్రజుఁ డుండఁ బాడియే
నను నిట రాజ్యభారభరణంబునకుం బురికొల్పఁ? దెత్తు న
య్యినకులచంద్రు రాక చనెనేనియుం నేను వసింతుఁ గాననన్. 91

### చిత్రకూటప్రయాణము.

తే. అని భరతుఁ డిట్లు ప్రతినమై నపు డయోధ్య, వెడల సరయూసరిద్దురపిపినమార్గ
వితతులు తరించి చని జాహ్నవీస్రవంతి, తటి గుహాశ్రమవాసంబు దఱియఁ జనియె.

క. అలగుహుని చేత భరతుం, డలఘుఁడు పూజఁ గొని రాముఁ డరిగిన తెరు వ
క్కలిహరుఁడు చూప వరముని, కులమఖవాటంబు చిత్రకూటము గనియెన్. 93

క. కని దగ్గఱి గిరిమీఁదికిఁ, జని యొక్కెడ రాముఁ బర్ణశాలాధాముఁన్
మునిజాలపూజ్యు ననుజా, వనిజాన్వితు ధైర్యనిధి నవార్యుం గాంచెన్. 94

క. ఆమేటి రఘువిరాముని, రామునిఁ గరుణాగుణాభరణుఁ గని వినతుల్
ప్రేమ నొనరించి యవ్విభు, నేమ మరసి పఙ్క్తిరథుఁడు చెల్లుట చెప్పెన్. 95

### రామాదులు దశరథుమృతి విని శోకించుట.

తే. తెలుప నత్తఱి మూర్ఛిల్లి తెలిసి విభుఁడు, ధన్య! దశరథరాజమూర్ధన్య! మాన్య! [వంత.
చనితె మమ్ముల నెడఁ బాసి? యనుచు నడలి, తమ్ముఁడును దానుఁ గుంది రెంతయును

క. రామామణి వగచెం బర, భామాజనవిముఖ! సార్వభౌమా! భూసు
త్రామా! దివి కేఁగితివా, మామా! యోరాచచందమామా! యనుచున్. 97

వ. ఇట్లు బహుప్రకారంబుల వగచి సీతాలక్ష్మణసమేతంబుగా రఘునందనుండు దండిక
విధ్యుక్తకార్యంబులు నిర్వర్తించి మునీంద్రగోష్ఠిం బ్రవర్తించుచున్న యెడ. 98

చ. భరతుఁడు రాజ్య మేలు మని ప్రార్థన చేసిన దాఁటవచ్చునే?
నరవరునాజ్ఞ నాకుఁ బదునాలుగువర్షము లోర్చి యంతఁ గ
మ్మఱఁ జనుదెంచి పూనెద సమస్తమహీభర మన్నియెడ్లు భా
స్వరనయవృత్తిఁ జేయుము ప్రజాపరిపాలన మీవు నావుడున్. 99

తే. మిహిరకులదీప! రఘురామ! మిమ్ముఁ బాసి, యుండు నందాఁక నేలాగు బొందిఁ బొంది?
నిలువ దింకఁ బ్రాణ మెట్లైనఁ గొలిచి మనెద, నిమ్ము పాదుకలని వేఁడ నిచ్చెఁ గరుణ.

### పాదుకాపట్టాభిషేకము.

మ. భరతుం డారఘురాముపాదుకల పై భక్తిం బ్రతిష్ఠించి ని

ర్భరభూచక్రము రామరాజ్యముగ మర్యాదానయౌదార్యసు
స్థిరశౌర్యంబుల నేలుచుండెఁ జని నందిగ్రామసంస్థాయియై
సరవిం దత్పునరాగమక్రమవిదృక్షాదక్షదీక్షాధృతిన్. 101

## రామాదులదండకారణ్యప్రవేశము.

తే. అంత నిక్కడఁ జిత్రకూటాద్రి నున్న, మునుల వీడ్కొని సజ్యకార్ముకధరుండు
జనకకన్యానుజసహాయుఁ డనఘమూర్తి, రాముఁడట దండకాటవీసీమ కేఁగె. 102

క. ప్రతిపాదపమూలస్థితిఁ, బ్రతినిర్ఝరవివిధసలిలపానాభిరతిం
బ్రతిగిరిదరీనిరీక్షా, గతభీతిం దెరువు నడవఁ గడఁగెన్ సతియున్. 103

చ. అనుగులకున్ మెఱుంగుఁజిగురాకుకుసుంగు లిసున్ విభుండు క్రొ
మ్ముడి విడఁ జక్క నొత్తుఁ బలుముల్లమిఁ ద్రోవఁ దొలంగఁ ద్రోవఁగాఁ
గడఁగు బెడంగు వింటికొనఁ గర్కశఘోరశిలావితానముల్
కడఁబడఁ జిమ్ముఁ గ్రొమ్మెఱుఁగుఁగాళ్ల లతాంగికి సేద దేర్చుచున్. 104

ఉ. చయ్యన నేఁగి డయ్యు నొకచక్కి రవిచ్ఛవిఁ జొక్కి వేసలిం
బయ్యెదకొంగుచాటుగొను భర్తకరం బవలంబయష్టిగా
నొయ్యనఁ జేరి యూఁతఁ గొని యూఱటఁ గాంచు గమించు నివ్విధిం
దొయ్యలి యవ్విధిం గనలి దూఱుచుఁ బూఁబొదరిండ్లు దూఱుచున్. 105

చ. అలజవరాలు తాలు విభుఁ డంఘ్రులఁ బోవఁగఁ ద్రోవఁ ద్రోవ బె
ట్టులికి సతీశతంబు లగునో యనుశంక మొఱంగి నాథ తా
నెలఘుల నూదఁ మెట్టకుము నీచరణాబ్జము కందు నావుడున్
వెలఁదితలం పెఱింగి రఘువీరుఁడు నవ్వుచు నేఁగె నవ్వలన్. 106

వ. ఇట్లు చనిచని దండకారణ్యంబు చేరి యచట నుండంగోరి సవిధవివిధవిలసనలసదసమ
కుసుమసముదయాలంకృతలతికానటీ నటనసైపుణోపదేశదేశికలక్షణాభినయమనోజ్ఞ
మారుతప్రేరితాత్తీణవేణూపాంగస్వరవిశేషానుగుణ మత్తభృంగాంగనాసంగీతభంగీత
రంగితానంగనాట్యశీలాలీలావహంబు లగులతాగృహంబులును, సముద్దండచండశుండా
దండముఖసముజ్ఝిత నిర్ఝరాంబుకణ కోరకతారకితవియత్తలోత్తాలాభీలమదవిజృంభి
కుంభికుంభప్రదేశచంక్రమణకేళీచంగంబులగు కోదమసింగంబులును, ననల్పదర్పహే
లాలోలకాలకాయోద్వేలకోలకులకరాళదంష్ట్రాకుంతధారా విదారితా ఖర్వపర్వజనిత
పరితగకీర్ణ సముదీర్ణ ముక్తా ఫలకలాపకల్పితదిక్పతిప్రతిగ్రహప్రాంగణరంగవల్లీవిచిత్ర
శృంగారసంవిధానంబులగు ప్రాంశువంశవితానంబులును, యథోచిత్రయీమంత్రోచ్చ
యోచ్చారణోచ్చైర్ముఖరముఖోద్గాతృహోతృమునిజనప్రబుద్ధహుతవహోద్ధూతధూత

ప్రాజ్యాజ్యధారాగంధిలాఖండలప్రముఖ నిఖిలమఖభుక్ఖగపరంపరావశీకరణవాగురామయశ్యామధూమరేఖావలయంబులగుయజ్ఞనిలయంబులును, నక్షుద్రవృక్షవాటీవధూటీమధుకరచికురసీమంతసీమాంతర సుందరసిందూరరేఖావైఖరిశ్లాఘాకరంబు లగుసహజమధుమధురతరపచేళిమఖదేళిమప్రసవఫలగుచ్ఛగళిత లలితమధురసప్రవాహానిర్ఝరంబులును, నభ్రంకషపాదపశాఖాశాఖాశిఖాలీలాడోలాసుఖవిహారవేళా నిజసహజతరుణారుణచరణవిన్యాసవాసామృతరసకిసలయిత ప్రసవితస్థాణుకందంబు లగునిలింపశంపాలతాంగీబృందంబులును, తరళతరవిలోకనవిశేషచాతుర్యానందకరకురంగశాబకముఖముహుర్ముహుర్నవీనఘాసాంకురగ్రాసవిన్యాసాచరణ క్షణక్షణప్రార్థనాత్వరాపరాయణోల్లాసభాజనం బగుధన్యమునికన్యకాజనంబును, ధరిత్రీపుత్రికిం జూపుచు నచట నచట విహరించుచుఁ బ్రతిక్షితిరుహోదగ్రశాఖాంచలఫలాహరణలంఘనవిశృంఖలజంఘాలప్లవంగసంఘాతంబును సరసకిసలయాస్వాదనోత్కంఠాకుంఠకలకంఠకులకంఠకలకలారావసంకులంబును రసాలసాలతాలతమాలతక్కోలకదళీగంధసారకర్పూరభూరుహచ్ఛాయాశీతలంబును నగునొక్కచక్కిం బరిశ్రమం బమర విశ్రమించె నివ్విధంబున. 107

## విరాధవధ.

క. అంత విరాధుం డనుదే, వాంతకుఁ డేతెంచి సీత నయవిఖ్యాతం
గాంతామణిఁ గొని యరుగ దు, రంతపరాక్రముఁడు రాముఁ డప్పు డిట్లనియెన్.

క. నీలోత్పల బెగ డొందకు, నీలోత్పలచికుర! వీని నేలం గూలం
దూలింతు నొక్కకోలన, రాళతరక్రోధు సాపరాధు విరాధున్. 109

## శరభంగదర్శనము.

తే. అని నిరవరోధుని విరాధు నపుడు గూల్చి, యంత శరభంగదర్శనం బధిగమించెఁ
గాని శరభంగదర్శనం బూనఁ డెన్నఁ, డాహవంబున నమ్మహాబాహుబలుఁడు. 110

క. స్మరభంగచరితు దురితో, త్కరభంగవిధాననిపుణకర్ము శరద్గా
శరభంగయశోనిధి నా, శరభంగతపస్విఁ గాంచి సత్కృతుఁ డయ్యెన్. 111

## అగస్త్యదర్శనము.

సీ. తాపసోత్తమదత్తదర్భచర్వణమత్తశుంభత్కురంగికాడింభకంబు
వాచంయమేశ్వరాధ్వరనిరంతరహోమధూమసంఛన్నపాథోదపథము
మానిచక్రేశకుమారచక్రానీతఫలమూలకుశసమిత్పల్లవంబు
సంయమికన్యకాజనకృతాఖిలభూజవల్లికాపరిణయవైభవంబు

తే. పర్ణశాలాతరుస్కంధబద్ధలోహ, పంజరారూఢకీరసంపఠ్యమాన

భాసురామ్నాయశాస్త్రేతిహాసరవము, కలశజాశ్రమపదము రాఘవులు గనిరి. 112
సీ. ఉచ్చరించు మయూర ముపనిషద్వాక్యంబు పారావతంబు శబ్దంబు నొడువు
శారిక తర్కశాస్త్రంబు వక్కాణించుఁ గలకంఠములు షడంగముల నెఱుఁగు
హంసంబు లుభయమీమాంసలు పరికించు రాచిల్క శ్రౌతమార్గములు దెలుపు
నలఘుపురాణార్థములకుఁ జొక్కుఁ గురంగి సామగానము విను సామజంబు
తే. ఖంజరీటంబు వైశేషికము విధించుఁ, గ్రౌంచమిథునంబు యోగవైఖరి భజించుఁ
దరమె కొనియాడ ఘటజన్మతాపసాగ్ర,గణ్యపుణ్యతమాశ్రమారణ్యభూమి. 113
సీ. బలుఁద్రాఁచురాచపూనలువోలె నిగనిగ జడిగొన్న నిడుదకెంజడలు గదల
నెఱసంజకెంజాయ కెదురుమొగ్గరములై కనుపట్టువల్కలాగ్రములు దూల
నిండారువెండు రేయెండతండముమాడ్కిఁ దనువున భస్మగుంఠనము నిగుడఁ
గ్రొంబచ్చపవడంపుఁగొనకెంపుగలవ్రేళ్ల గర్భాంగుళీయసందర్భ మమరఁ
తే. దళుకు తళుకని మెఱయుకుందనపుఁబసిఁడి, డాలుచిందాడుయోగదండము ధరించి
వింధ్యనగమర్ది బహుశిష్యవితతి గొలువ, నెదురుగా వచ్చె మును రాఘవేంద్రులకును.
చ. బిసరుహసూతిసన్నిభుఁ గృపీటభవోపముఁ గుంభజన్మతా
పసుఁ గని యర్ఘ్యపాద్యమధుపర్కసపర్యలచేఁ దదీయమా
నస మలరింప మాని రఘునందనునిం గుశభద్రపీఠియం
దసదృశభక్తి నుంచి వినయాదరపూర్వముగాఁగ నిట్లనున్. 115
మ. ఎనయన్ సంయమిపూజ్య! మీరిటకు నేఁ డేతెంచుటం జేసి నా
పను లెల్లన్ సమకూడె నాతపము సాఫల్యంబునం బొల్చె శో
భనకీర్తిం బొగడొందె మత్కులము నాభాగ్యంబు లీడేఱె నా
జననం బర్థిఁ గృతార్థతం బొరసె సంసారార్ణవౌర్వానలా! 116
వ. అనిన రఘూద్వహుం దమ్మహామహుం బ్రశంసింపం దొడంగె నిత్తెఱంగున. 117
క. గణనాతీతసముజ్జ్వల, గుణమణి! మునిలోకసింహ! కుంభజ! శుభకా
రణపుణ్యదేహ! భువనాం, గణముల నీసవతు సేయఁ గలరే తపసుల్? 118
ఉ. వింధ్య మధిత్యకాకటకవిస్ఫుటపాదపపుష్పగుచ్ఛసౌ
గంధ్యము హేమధాతుమయకల్పితసంధ్యము బద్ధమేరుసా
గంధ్యము చండకేసరినికాయనిరాకృతభద్రదంతిద
ర్పాంధ్యముఁ గ్రుంగఁ ద్రొక్కితి మహాగుణభూషణ! సత్యభాషణా! 119
క. వననిధి భవత్కరాంబుజ, మున నవమకరందబిందుముద్ర వహింపన్
వనమాలి యపుడు తద్భా, వనఁ గ్రోలన్ వ్రాలు తేటిచందము నొందెన్. 120

సీ. ఏవారిరాశిలో నించువిల్తునితల్లి కలుములీనెడువాలుగంటి పుట్టె
వేల్పులవేలుపు వెన్నుఁ డేమున్నీటఁ బడగపానుపుమీఁదఁ బవ్వళించె
లచ్చికన్నియ యాఁడునచ్చనగుండ్లు నాఁ గొండ లేవార్ధిలో నుండు నొకట
వేఁడిమంటలచేఁదువిత్తేపయోధిలోఁ బొడమి యీశ్వరుకంఠభూష యయ్యె
తే. నట్టియాచుక్కమగవానియయ్యనొయ్యఁ, గొంటి వాపోశనం బొక్క గ్రుక్క నీవు
నీప్రభావంబు లోకఁడు వర్ణింపఁగలఁడె?, పరమపుణ్య! యగస్త్యతాపసవరేణ్య!
వ. అని నుతించిన. 122

## పంచవటప్రవేశము.

చ. సమధికపుణ్యశాలి ఘటసంభవుఁ డక్షయబాణతూణయు
గ్మముఁ బరదుర్జయాయుధసమాజము వైష్ణవచాపమున్ సము
త్రముగ నొసంగి పఙ్క్తిరథనందను రాము బహూకరించి య
య్యమలచరిత్రుఁ బంచవటియందు వసింపఁగఁ బంచెఁ బంచినన్. 123
తే. అసమకిసలయకుట్మలప్రసవఫలక, లాపదీపితవివిధపలాశపఙ్క్తిఁ
బంచవటిఁ బర్ణశాలఁ గావించి యచట, నునికిఁ జేసిరి రఘువంశయోధవరులు. 124

## హేమంతర్తువర్ణనము.

చ. మరువకగంధిలంబులును మందరవిద్యుతులుం దుషారధూ
సరములు సర్వవాంఛితహసంతికముల్ సముదగ్రసౌరభా
గరుపరిలిప్తభోగియువకంఠతలంబులు నైతలిర్చె వా
సరములు దంతసీత్కృతివశంవదనుల్ తుహినాగమంబునన్. 125
క. హిమసమయాక్రమభీతిన్, ద్యుమణినిజోష్ణంబు కొంత యునిచెనొ! కాకు
న్న మహీస్థలి నెక్కడి దల, ప్రమదాకుచసీమ నుష్ణభావము దలఁపన్. 126
చ. అరసి నిరుష్ణశంకరకరాగ్ని జపాకుసుమేచ్ఛ గౌరి ద
గ్గఱి యవతంసయోగ్య మని కైకొనఁ బూనుమదిన్ సరోజమం
దిరము మురారికౌస్తుభమణిం గల కీల యటంచు దద్భుజాం
తరమున నిల్చె దుస్తర ముదగ్ర హిమాగమ మెట్టివారికిన్. 127
క. అతిదుస్సహతరశిశిరా, గతభీతిం బఱచి మున్న గా ననలుఁ డహో!
శితికంఠనయనగోళ, స్థితి నొందెం గాక లేదె దిక్కాతనికిన్? 128
తే. తరణి వేసవతఱి మరుద్బాంధవాంశుఁ, జెంది దివసావసానంబు నందు నతని
యందుఁ దానొందుఁ జెందోవవిందు శశియుఁ, శివలలాటాగ్నికడ నిల్చె శీతభీతి. 129
వ. అట్టిహిమాగమసమయంబు నిర్వర్తించి యంత. 130

క. సీతాశీతాంశుముఖి, స్ఫీతోష్ణకుచోపగూహాశీలనరీతిన్
ధూతాభియాతి రఘుపతి, చేతఃప్రీతిం దరించె శిశిరాగమమున్. 131

వ. తదనంతరంబ. 132

## శూర్పణఖా కర్ణనాసచ్ఛేదనము.

క. వచ్చె మునిధైర్యధనపా, టచ్చర శూర్పణఖ విధువిడంబకళాదీ
వ్యచ్చతురవదన మదనశ, రోచ్చయసంతప్తయై రఘూత్తముకడకున్. 133

వ. వచ్చి యచ్చటం బరిభ్రమించుచు నదభ్రహావభావవిభ్రమవిలాసంబుల మించుచు నటత్తటిద్వల్లీమతల్లియుంబోలె నుల్లసిల్లి యల్లిబిల్లిఁ దెచ్చికోలువలపు దెలుపుకలుపుకోలుఁదనంబులు సలుపుచు నిట్లనియె. 134

చ. నను వరియింపు మోయి! నృపనందన! నీయసమానరూపమో
హనతనుసంగమంబులఁ గృతార్థత నొందుదు నన్ను నన్యకా
మిని యని చూడఁ జెల్లదు సుమీ! భవదీయగుణైకపాశబం
ధనమున నేఁ దగుల్పడినదానఁ దలంపు ఫలింపఁ జేయుమా. 135

క. పొందికకుఁ దగినయంపతిన్, సందియ మొక్కింతవలదు జనవర! స్త్రీర
త్నం దుష్కులాదపి యనన్, విందువు గద శాస్త్రవేదివి గదా తలఁపన్! 136

వ. అని బహుప్రకారంబులఁ బరవధూపరాఙ్ముఖాచారనిర్వికారాకారుం డగుకాకుత్స్థవీరుని వీనులకు ములుకు లగుబలుకులం బలుకుచుం గదియ నరిగి. 137

క. దక్కినదింబలె మాయపు, మక్కువ శూర్పణఖ మించుమచ్చికలకు రా
నక్కఱకు జంతరక్కసి, ముక్కరకున్ నోఁచకుండ ముక్కుఱుఁ జేసెన్. 138

క. ఆవికృతి నొంది మది నా, నావిధముల వలచి వచ్చినను ముక్కునెవుల్
వోవు నని పలుకుగాథకుఁ, దావలమై నిలిచితింగదా నేఁ డనుచున్. 139

క. తా నాసఁ దొలఁగి చనియెన్, దానవతరళాక్షి యేకదారవ్రతులన్
భానుకులీనుల దశరథ, సూనులఁ గామించి విగతసుముఖత్వమునన్. 140

తే. చని జనస్థానమున కేఁగి దనుజభామ, కర్ణశూలంబులై వాల ఖరుని మ్రోల
రాఘవులచేత నైనపరాభవంబు, దెలిపెఁ దెలిపినఁ గలిగి దైతేయవరుఁడు. 141

క. తరుణీ! నినుఁ గారించిన, పొరపొచ్చెపునరులఁ బోరఁ బొరిగొనకున్నన్
ఖరనామధేయ మొప్పునె, ఖరనామమె కాక నాకు గర్హాస్పనకున్? 142

## ఖరాసురాదివధ.

చ. అని పదునాల్గువేలు భయదాసురవీరులు గొల్వఁగా ఖరుం
డును ద్రిశిరుండు దూషణుఁడు నుల్కని మచ్చర మెచ్చరింపఁగా

నని మొన కేగఁ దెంచి కమలాప్తకులీనులఁ గాంచి నవ్వి యి
మ్మనుజులు మమ్ము మార్కొన సమర్థులె? యంచుఁ దలంచి రయ్యెడన్. 143

క. ఖరసేనానానావిధ, శరపఙ్క్తి గభీరగుణవిశారదము ద్రా
క్శరధులఁ దార్కొనియెన్ దా, శరథుల నక్షయమహాస్త్రశరధులఁ దోడ్తోన్. 144

తే. కాఁకమించులవిసుమానికంపుజోదు, మంచుగమిఁ గంచుమించు గాఖంచుకరణిఁ
దరణికులమౌళి విశిఖజాతములఁ దుముల, ఖరచమూముక్తశరపరంపరల నణఁచె. 145

ఉ. ఓర్చి రణాంగణంబున నిజోగ్రనిశాచరవీరసేనఁ జే
రార్చినఁ గాంచి యా త్రిశిరుఁ డాఖరదూషణులౌ నితండు స
ప్తార్చిరుదగ్రతేజుఁ డని యద్భుత మంది తలంచి ముగ్గురం
గూర్చెనె ముందదయ్యె మని గుందిరి యందిరి కార్ముకాస్త్రముల్. 146

వ. ఇట్లు దగ్గఱి యగ్గిరీంద్రధీరుం డగురఘువీరున కిట్లనిరి. 147

క. తగవా మగవారికి నిటు, మగువయొడం దెగువఁ జూప ? మాదృశవీరుల్
జగతిం గలవా ? దొరవా?, మగఁటిమి గలరాచచందమా యిది ? యిహిహీ! 148

క. దాకొని ఖడ్గాఖడ్గినొ, కాక కచాకచినొ బాణకౌశలముననొ
నీకెద్ది యిష్ట మనికిన్, దీకొనుమా యొకట మెచ్చితిమి నృపతనయా! 149

వ. అని పలికి కినుకం దమకంబు మునుకొనఁ గొనకొని. 150

తే. ఖరుఁడు రణవీరదనుజశేఖరుఁడు గడఁగి, యేపు చూపుచుఁ గ్రొవ్వాడితూఁపులేయ
రాఘవశరాసనోజ్ఝితామోఘశరము, రాహువునుబోలె ఖరకరగ్రాహి యయ్యె. 151

తే. త్రిశిరుశరవృష్టి నాశుగోద్వృత్తి నడఁచె, రోషభూషణదూషణభీషణాస్త్ర
తతులఁ బ్రత్యస్త్రములఁ ద్రుంచెఁ దాఁకనీక, ధాకఁ గాకుత్స్థవంశసుధాకరుండు.

మ. శశిరోచిష్ణుకళాకలాపవదనాబ్జాతుండు రాజన్యలో
కశిరోరత్నము చాపనైపుణపరిష్కారుండు నానాసుధీ
వశిరోలంబశరణ్యపాదకమలద్వంద్వుండు మాద్యత్ఖర
త్రిశిరోదూషణకంఠలుంఠన మొనర్చెం జండకాండంబులన్. 153

వ. ఇట్లు దుర్దశం జతుర్దశసహస్రదనుజసేనాసమేతంబుగాఁ దద్దోషాచరవీరత్రితయంబు లయంబు నొందినం గనుంగొని కనుంగొనల నశ్రుధారావర్షంబు దొరఁగ విషాదవేదనాజనితరోదనారభటిం బఱచి బొమ్ము చఱచుకొనుచు రఘువరవిరూపితవివృతముఖయగు శూర్పణఖ విముఖత్వంబునం జని రఘుకులప్రదీపప్రతీపప్రతాపాటోపం బెఱింగించిన నదరిపడి యేమేమి? యెక్కడెక్కడ? నెవ్వఁడెవ్వఁ డిట్లుగావించినాఁడు? మనుజులు దనుజులం జెనకువారైరే? మండూకంబు దందశూకంబును గురంగంబు

సింగంబును బరిభవించుచందం బయ్యె నకటకటా! యని వికటామర్ష కుటిలజటిల భ్రు
కుటీప్రకటనిటలతటుం డగుచు మాయోపాయధురంధరుం డగుపంక్తికంధరుండు
నృపకుమారవంచనాపరాయణుండై తదాశ్రమంబుం జేరి మారీచసాహాయ్యంబు
నెయ్యంబునం గోరి. 154

మారీచుఁడు రావణప్రేరితుఁడై బంగారులేడి యగుట.

క. మారీచా! శూర్పణఖా, నారీవైరూప్యకరుని నరునిన్ ఖరునిన్
బోరి పొరిగొన్నయుగ్రా, కారునిఁ గారింతుఁ దోడుగా రమ్మనుడున్. 155

క. జలధిఁ బడఁ గడపె మును నను, వలదు నరభ్రాంతి నీకు వైరం బేలా?
బలవంతునితోఁ గొఱవిం, దలఁ గోఁకికొనంగఁ దగునె దనుజాధీశా! 156

క. నరుఁడా యతండు? వైశ్వా, నరుఁ డాఖిలప్రతాపనైపుణి నలిదు
స్తరమాయాఖని యని నీ, తరమా యతనిన్ జయింపఁ? దారొక్కనఁగలమా? 157

క. అనవుడు మారీచోక్తులు, వినక విధిప్రేరణంబు వెనుకొనఁగ దశా
ననుఁడు గడు వేఁడుకొనినం, గనకమృగం బయ్యెఁ దాటకాతనయుండున్. 158

వ. ఇట్లు మాయాకురంగం బయి పతంగకులపుంగవపర్ణశాలాప్రాంగణంబు చెంగటం దోఁచె
నిత్తెఱంగున. 159

లయవిభాతి.—

కలికితరితీపుసిరి దొలఁకుమఘువన్మణుల
కళుకు లగునున్నెళుకుతళుకుజిగిచూపుల్
నలుగడలఁ గల్వవిరిపొలుపుపొలుపుం దెలుప
నతి నలినరాగరుచికలితనిజశృంగం
బుల బయలఁ జిమ్ముచును బలువగలఁ జంక్రమణ
విలసనచమత్క్రియలఁ బొలయునెలయించున్
సొలయు నలయున్ మలయుఁ గలయుఁ గసవుమ్మెసవుఁ
దొలకరిమెఱుంగుక్రియ మెలఁకువలఁ దోఁచున్. 160

వ. ఇత్తెఱంగునం గుహనాకురంగంబు మెలంగం దొడంగిన. 161

శ్రీరాముఁడు సీతపనుపున మాయలేడిం దేఁబోవుట.

క. జనకకుమారీమణి యా, కనకకురంగంబు నెదురఁ గనుఁగొని రఘువీ
రునిఁ జూచి దేవ! దీనిం, గొని తెమ్మనవుడుఁ బ్రియుండు కుతుకం బలరన్.

శా. డాయం బోయినఁ జిమ్ముఁ గొమ్ములఁ బ్రచండస్ఫూర్తి లంఘించు నే
చాయం జూచినఁ దోఁచుఁ గ్రొమ్మెఱుఁగునోజ న్నచ్చిక న్నిచ్చరా
మేయుం బచ్చిక మచ్చికం గదిసి నమ్మించుం దనుం బట్టఁ బోఁ

బాయఁగన్ బిట్టలయించు ఢాదిగుచు నప్పాటన్ మృగం బీగతిన్. 163

తే. ఇట్లు వెన్నాడి యలసి కాదిది మృగంబు, మాయయో యేమొ యైన నేమాయె ననుచుఁ
గనలి కనకమయోగ్రాశుగంబు వఱుప, లేటిరాకొమ్ముననుచక్కి నాటుకొనిన. 164

క. శృంగత్రయంబుఁ దాల్చిన, భంగిఁ గురంగంబు గానఁబడి యప్పుడు నే
లం గూలె నార్తి హా! సీ, తాంగన! హా! లక్ష్మణా! యటంచుం బెలుచన్.

తే. అచట మాయాకురంగదీనారవంబు, విన్నయంతటిమాత్రనె విన్నఁబోయి
సీత మూర్ఛాసమేతయై సేదదేరి, కాంతునియవస్థ కడలు లక్ష్మణుఁడు వినఁగ. 166

మ. అనణుస్వర్ణమయాంగచిత్రరుచి నాకయ్యో మెకం బేటికిం
గనుపట్టెం? గనుపట్టెఁ బో! వనకురంగభ్రాంతిపై నెప్పట
ట్లనె యే నుండకపట్టితే నధిపు నేలా వేఁడితిన్? వేఁడినం
తనె వెన్నాడి బడిం జనం జనునె? హా! నాబుద్ధి యి ట్లుండెఁగా. 167

## సీత రాముకడకు లక్ష్మణుం బంపుట.

వ. అని పొగిలిపొగిలి భూపుత్త్రి సౌమిత్త్రి కి ట్లనియె. 168

క. మాయన్న! సుమిత్రాసుత!, మీయన్న రఘూద్వహుండు మృగబాధల నే
మాయెనొ! డాయం జనుమా, హా! యనుజా! లక్ష్మణా! యటంచుం బిలిచెన్. 169

వ. అనిన విని. 170

ఉ. మానవతీమతల్లి వినుమా యనుమానము నొంద నేటి? క
మ్మానవసింహముల్ హరిణమాత్రము నొంప సమర్థమే? మరు
ద్దానవసిద్ధసాధ్యుల శతం బనిలోన నసాధ్యుఁ డయ్యెడన్
హాని యొకింత లే దతని కాత్మఁ జలింపక యూరకుండుమా. 171

క. అఱకాలముల్లుగొన కిటఁ, దిరిగి రఘుస్వామి యేఁగుదెంచున్ మదిలోఁ
దరుణీ! వెఱవకు విపినాం, తరమున నిను విడిచి పోవఁ దగ దిఁక నాకున్. 172

క. అని చనక యున్నఁ గనలెడు, జనకసుతా శ్రుతికటూక్తిసందర్భంబుల్
వినలేక లక్ష్మణుం డటు, చనఁ బఙ్క్తిముఖుండు తపసిచాడ్పున నిలిచెన్. 173

## రావణుఁడు సన్యాసియై సీతకడ కేతెంచుట.

చ. జలదముఁ బాయుక్రొమ్మెఱుఁగుచాడ్పున నాయకరత్నశూన్యమై
యలవడుహారవల్లరిక్రియన్ హరిణాంకుఁడు లేనిరాత్త్రియుం
బలె రవిఁ బాసి గాసిలెడుపద్మినికైవడి వంత నొంది వ
ర్తిలెడుపతివ్రతన్ వసుమతీసుతఁ గాంచి దశాస్యుఁ డి ట్లనున్. 174

క. సన్యాసిని వన్యాశిని, గన్యా! సీమంతవీథికాసిందూరో

పన్యాసిమృదుపదాంబుజ, ధన్యా! సితకీర్తి! భిక్ష దయసేయఁగదే. 175

క. నీపేరు పెంపు సెయ్యది?, యేపుణ్యునిముద్దుపట్టి? వియ్యిడుమల కీ
వోపుదె జవ్వని? యెవ్వని, జేపడె నీరూపలక్ష్మి? చెపుమా నాకున్. 176

క. ముల్లోకంబుల నేలుదు, బల్లిదుఁడను గింకరులు సుపర్వులు నాకుం
గిల్లాకుపంపు సేయం, బల్లవలవకృద్విలాసపదపదకమలా? 177

శా. వాక్కాంతాద్రిసుతారమేశులకు దుర్వారుండ నెందున్ హవి
ర్భుక్కంజాప్తసుధాకరుల్ పనులకుం బూనన్ మరుచ్చాళికా
స్త్రీకాంతాంఘ్రితలుండ ధన్యుఁడ మహాసౌభాగ్యభాగ్యోన్నతిన్
దిక్కూలంకషకీర్తి రావణుఁడ నాతీ! నీలాఁతిఁగాఁ జూడకే. 178

తే. సురగరుడసిద్ధసాధ్యకింపురుషసతులఁ, దిరిరి మొఱపెట్ట జెఱఁబట్టి తెచ్చినాఁడ
వారలయగణ్యరూపలావణ్యతతులు, బాల! నీకాలిగోరునఁ బోల వరయ. 179

క. క్రొవ్విరిసిరి నగునీమే, నవ్విధి యెవ్విధి విధించె నాశ్చర్యం బీ
వెవ్వనియొలజవ్వని? విపు, డివ్వని వాల్గంటి నొగుల నేలా యొంటిన్? 180

సీ. వనజలోచన! ఘనాఘనము నే వర్షంబు గురియుచున్నను గాని కురియ వెఱచు
నిందిందిరాలక! యిందుఁడే వెన్నెల గాయుచున్నను గాని కాయ వెఱచు
వెలఁది! నెత్తమ్మిపూవిందు విస్వేది నే వెలుఁగు మన్నను గాని వెలుఁగ వెఱచు
మదిరాక్షి! వలిగాడ్పు కొదమ నెత్తావి నేఁ బోలయుమన్నను గాని పోలయ వెఱచు

తే. నతివ! యరిగాపు లఖిలదిక్పతులు నాకు, నాకు లెల్లను గింకరుల్ నళినవదన!
పడఁతి నాపెట్టుచెట్లు కల్పద్రుమములు, బోలఁతి! ముల్లోకముల కేన పోవిభుండ.

ఉ. చాన! తలంపురాచలువచట్లును వేలుపుఁజెట్లు గమ్మపూఁ
దేనియ కాల్వపట్లును మదీయనిశాంతమునన్ దనర్చున
చ్చో నిను నిచ్చనిచ్చలును సొంపుల ముంపుదు రమ్ము వెంబడిన్
బూని భజింప నీయనుఁగుబోటులఁ జేయుదు నావధూటులన్. 182

వ. అని పలుక నలుక కన్గొనలకెలంకులం దొలంకఁ గన్నీరు మున్నీరై ప్రవహింపఁ
గంపితాంగి యై యి ట్లనియె. 183

## సీత రావణుం దూఱుట.

చ. నను రఘువీరపత్నిఁ గులనాశక! పట్టఁదలంచె దొంటిఁ గా
ననమున నుండగాఁ ఫణిఫణామణిసింహాసనఖాగ్రలగ్నమో
హనతరమౌక్తికంబును సమర్థుఁడె కైకొన నెవ్వఁడేనియున్?
జనునె దురుక్తు లాడ? నని సారెకు నాథుఁ దలంచి క్రమ్మఱన్. 184

క. ఆసమయంబున భూతన, యాసాధ్వి యసాధ్య యగుట కలిగి నిశాటా
గ్రేసరుఁ డాత్మస్పృహాస, న్యాసిత్వం బుజ్జగించి యాభీలుండై. 185

క. ఆకాంతకుఁ గనుపట్టెన్, భీకరదంష్ట్రాకరాళ పెటపెటరవరో
షాకల్పప్రియవాగ్జ, ల్పాకముఖుం డగుచు దైత్యపతి యుద్ధతుఁడై. 186

ఉ. అప్పుడు దానవాధముభయంకరరూపముఁ జూచి సాధ్వసం
బుప్పతిలన్ మహీతనయ యుర్వర వ్రాలె హరిత్కరీంద్రముల్
చెప్పటి కూలి తూలె రజనీచరభాస్కరబింబముల్ రుచుల్
దప్పె సమస్తతారకవితానము రాలె నరాళభంగులన్. 187

వ. ఆసమయంబున. 188

## రావణుండు సీత నెత్తుకొని పోవుట.

క. కన్నియతలమానిక మగు, నన్నాగటిచాలిపేరియతివన్ సిరికిన్
బెన్నుద్దినెత్తుకొని చని, యన్నీచుఁడు రథముమీఁద నవు డిడుకొనియెన్. 189

క. నీవసుమతివై యేగతి, నోవసుమతి! న స్నహించె దోఃఖగవరులా
రా! వీక్షింపుఁడు నాదెసఁ, గావుఁడు వనమృగములార! కన్య ననాథన్. 190

## రావణజటాయువుల ద్వంద్వయుద్ధము.

క. అని పలికెడుజానకిమొఱ, విని కెరలి జటాయుం వభ్రవీథిం జను న
ద్దనుజాధమునిం గనుఁగొని, యనివారణఁ జనకు చనకు మని యి ట్లనియెన్. 191

క. మాయమ్మ రాముసతి గొని, పోయెదు దుశ్శీల! నిన్నుఁ బోరిగొనకున్నన్
నాయది లావె తలంపన్?, నాయది విక్రమమె? కనుము నాక్రియ యనుచున్. 192

క. తల్లీ! సాధ్వీవంశమ, తల్లీ! మది తల్లడిల్లి తరలకు పరయో
షిల్లోలు వీనిఁ ద్రుంతు మ, రుల్లోకవిరోధి ఫణి గరుత్మల్లీలన్. 193

వ. అన విని యద్దురాపపాపజాతి యగునిర్జరారాతి యి ట్లనియె. 194

క. పులుఁగా! నీకోలఁదితలం, పులుగా విని నాకు నాలమున నెదురు నిలిం
పులుగారు వలవ దియ్యెఱ, పులు గాసిల నేల తొలఁగి పొమ్మా యనుడున్. 195

చ. బలియుఁడ! నీయెడాటమునఁ బక్షిని గాఁ బ్రతిపక్షవృత్తి నీ
తల లవనీతలంబుదెసఁ దాళఫలాకృతి రాల లీలమై
జలజల డుల్లు నిల్లు ననిచక్కఁ బతంగకులీనుభార్య ని
ర్మలతరచర్య డించి చనుమా మనుమా మనుజాళనాథమా! 196

క. అని యలుగు పులుగు వెనుగొని, మునుకొని చనుఁ జనకు జనకుముద్దులతనయన్.
ననయన్ విడు విడు విడు మను, ఘనతరధరశిఖరనఖరహతిఁ జింతించున్. 197

క. దంచుచున్ జరణాంచలములఁ, గించుఁదనం బంచు ముదలకించుచున్ ముంచున్
నొందున్ విదళనచంచూ, దంచచ్చంచూపుటస్ఫుటాఘాతములన్. 198

వ. అప్పు డప్పతంగపుంగవుండు దనుజకుంజరంబు పింజపింజంగ ఱవన్ దొరఁగునిశితశర పంజరంబునన్ గొంతవడి గట్టువడి బెట్టువడి వెడలి యత్తూపుగములందుత్తమురుగాఁ గొట్టి మట్టాడి యట్టహాసంబు చేసి డాసి రేసి కినుకంజూచి యేచి లాచి ఖరమరీచి రోచిష్ణుప్రతాపాటోపంబున మించి చంచూపుటంబులు దీటుకొని దాటుకొని శతకోటిసఖనఖముఖకోటిపరిపాటిం దదంగంబు భంగంబు గావించి చించి చెండాడుచున్ జెండాడుచందంబుఁ దెలుపుచుఁ బ్రడీనోడ్డీనగతుల మెఱసి చండతర గురుగరుదురుమరుత్పరంపరం బెంపఱఁ గంపంబు నొందింపుచు జానకీమనోభయంబు వారింపుచుఁ దారింపుచు మెలంగం గనుంగొని యక్కొంచురక్కసిమగం డుద్దండగతి నార్చుచుం గవిసి విశిష్టద్విజవరముష్టిఁ గొమ్మని పొడిచి కడచి గదఁగొని యిది గదా బలారిభంగకదాకృతిం ద్వదీయరక్తమాంసంబులు పీల్చు నున్నది గదా యటంచు నొంచినం గిఱుక వెఱుక లియ్యక డయ్యక యయ్యకల్మషుండు ఘనవిపక్షవిక్షోభ క్రియావిచక్షణస్వపక్షవిక్షేపవాతనిర్ఘాతం బయి తూలి గాలిపటంబువిధంబున రథం బంతరిక్షంబునం దిరుగుడుపడ నొనర్చుచు సమ్మదంబును మదంబును హెచ్చ మచ్చరం బిచ్చం బెచ్చుపెరుగం జెచ్చెరం జొచ్చి క్రచ్చి యొచ్చెంబు లేనియచ్చలంబుల నుచ్చలచ్చరణాంచలంబుల నొంచి విచ్చలవిడి యచ్చుపడ నిచ్చలం బగునచ్చలంబున హెచ్చరిక పిచ్చలింప వ్రచ్చుచు రఘువరులసచ్చరితోచ్చయంబు లుచ్చరింపుచుఁ దొచ్చెంబుల బొచ్చునేయుంచు మెచ్చుచుం గయ్యంపుఁబచ్చం జూచ్చుఱపలుకు కొఱకంచు వెచ్చఁదనంబు లిచ్చుచు నచ్చెరుపడి వియచ్చరు ల్వచ్చి రచ్చగొని సూడ సూడు మిగుల నిట్లు పులుఁగు కలగుండువఱిచి చఱచినం గనలి దనుజుండు గడిమిం బిఱుగులు వడువడువునం దొడరి తడఁబడక వడిఁ గడలుకొన నెడనెడ వెడవెడ నార్చుచుఁ గడు గడుసుఁదన మడర బొమముడి ముడిగొన జడిగొనఁ బిడికిళ్ళఁ బొడిచి యడఁచినం గడల కెడయక యొడలిబడలికం దడయక బెడఁగుఁదనంబునిగుడ నొడిచి నిశితనఖముఖంబుల ముఖంబుల జీరుచు దారుచు నుక్కుగల తెక్కులం బ్రత్యగ్రజాగ్రదుగ్రోదగ్రబలసమగ్రతాగ్రహంబుల నిగ్రహించి విగ్రహంబు చివ్వుచుం గ్రొవ్వుచుం గాలకీలికీలాభీలకోపాటోపంబున మొత్తుచు నొత్తుచుం దత్తరంబునం దాఁకుచు నుఁకుచుఁ జేరెంబు వాఱుచుఁ దూఱుచుఁ బెనంగుచు నేగుచుఁ బొరలుచుం గెరలుచు నలయుచుఁ దెలియుచు విక్రమంబున నాక్రమించుచుఁ బొంగి నింగినుండి సురలు విరులు గురియ నొఱయం నసురవరుముక్కుఁ

జెక్కు నక్కునుక్కు నెక్కనం జెక్కువగలం జించి చీకాకుపఱిచి చఱచినం
జెల్లు శోషిల్లి యుల్లంబునం దెలిసి మఱియుం సంగరోన్ముఖుం డయి జటాయువున
కి ట్లనియె. 199

క. నీవు వయోవృద్ధుండవు, గావున మన్నించి విడిచెదం గా కెటులైనం
బోవిడుతునె నినుం ద్రిజగ, ద్రావణు రావణుని నన్నుం దరమే గెలువన్? 200

వ. అనిన విని పతంగపుంగవుం డి ట్లనియె. 201

ఉ. రావణ! రావణా! గెలువ రా దనరా దజుం డిచ్చినాండొ యీ
కావర మింత కావర మికం దగ దూరక పొమ్ము జానకీ
దేవిం ద్రిలోకపావనిం బతివ్రతం దీవ్రత దించి యాత్రియం
బోవక తక్కితేని నినుం బోర గరుద్గతి నొంతు నుద్ధతిన్. 202

క. నావుడుం గల్పాంతఫణి, గ్రైవేయకజాగ్రదుగ్రగతిం గవిసిం దశ
గ్రీవుం డసిం గసిమసంగిన, లావరి యగుపులుంగుఱేండు లావఱి పడియెన్. 203

రావణుండు లంకం జేరి సీత నశోకవని నుంచుట.

మ. అపు డాపక్షిమగండు రక్కసులజియ్యాం దాంకి యబ్బంగి ను
గ్రపుంగయ్యం బోనరించి మూర్ఛిల బలాత్కారంబునన్ వాండు లో
కపవిత్రన్ జనకక్షితీశతనయన్ గాకుత్స్థవీరాంఘ్రిప
ద్మపటుధ్యానపరాయణన్ రథముమీందన్ నిల్పికొంచున్ జనెన్. 204

తే. పోవునెడం బ్రోవ నప్పు డప్పుడమిపట్టి, యడుగుం గెందామరప సిండియందు వడియెం
దరణికులకర్తవచ్చెనో ధరణితనయ, వార్త రఘుభర్తకెఱింగింపవలసి యనంగ. 205

క. తనయాపహరణవేదన, యొనగూడినరత్నగర్భ నూరార్చుటకుం
జనులీల రాలె సీతా, స్తనముక్తామణులు గుణులు తగవరు లెందున్. 206

వ. ఇవ్విధంబున. 207

తే. కలమయాత్మీయవంశంబుః గాల్చికొనంగం, బొగసి మండెడుకొఱవిం గొంపోవుకరణిం
గీర్ణచికురసువర్ణ సువర్ణ గాత్రి, జనకనృపపుత్త్రిం గొనిపోయె దనుజవిభుండు. 208

క. నరులార! కానరే కి, న్నరులారా! యడ్డపడరె నానాధరణీ
సురులార! వేండికొనరే, సురలారా! దనుజుం డునుమం జూడరె కరుణన్. 209

ఉ. హాజనకక్షితీశ! దనుజాధము వీని హరించి పోవె రా
వే జనయిత్రి! ధాత్రి! వినరే వనదేవత లాలకించరే
భూజనులార! యాండుమొఱ బ్రోవరె సూర్యసుధాంశులార! ని
ర్వ్యాజకృపాభిరాము రఘురాముని భామినిం జూడరే దయన్. 210

క. అని యివ్విధమున వేఁడుచు, వనవననిధిగిరిసరిత్ప్రవాహప్రతతిం
దనుమధ్య గడచి చనియెన్, వినువీథి విలాపముఖరవిహ్వలముఖి యై. 211

తే. శీతలద్రుమసముదీర్ణభూతలములఁ, గలువనెలవులఁ జలువల నిలిచి నిలిచి
భయము నయముచు జూపుచుఁ బక్షికంతుఁ, దూఱడించుచుఁ జని సీత నూఱడించె.

క. పంకజలోచన సీత శ, శాంకముఖీమణి దశాననానూననిరా
తంకపరిపాలనాంకన్, లంకన్ దుష్కీర్తిమయకళంకన్ గనియెన్. 213

మ. కని భీతిం జనుదెంచుజానకి జగత్కల్యాణి నాత్మీయర
త్ననిశాంతోపవనంబునం దునిచి యాదైత్యేంద్రుఁ డత్తన్వికిన్
దనరున్ నెయ్యముఁ దియ్యముం గలవిదగ్ధస్నిగ్ధముగ్ధాసురాం
గనలన్ గావలికట్టడల్ జతనముల్ గా నుండఁ బంచెం దగన్. 214

## రామలక్ష్మణులు సీతఁ గానక పలవించుట.

తే. అంత నక్కడ మాయామృగాపహరణ, మాచరించి భుజావిక్రమాభిరాముఁ
డగుచు రాముఁడు చనుచుండి మగిడి త్రోవ, నెదురుగాఁ దమ్ముఁడే తేరఁ గదిసి పలికె.

ఉత్సాహ.—

మేలువింటిజోద వాఙ్మిటారి భూకుమారి నా
వాలుగంటి నొంటి డించి వచ్చినాఁడ వేల? యీ
వేళ నిట్లు సేయ ధర్మవే? నిశాచరాధిపో
ద్వేలమాయ లీవెఱుంగవే? యహో! సహోదరా! 216

క. నాయాన నడుచుసుకృతివి, నాయాన నతిక్రమించి నాగారాపుం
జాయ నని డించి యొక్కటిఁ, జేయం బెడఁబాయ నీకు జెల్లెనె యనుజా! 217

వ. అనిన విని లక్ష్మణుం డిట్లనియె. 218

చ. అపహృతజీవ మై పడెడునప్పుడు లక్ష్మణ! హా! యటంచు న
క్కపటమృగంబు నీయెలుఁగుగాఁ బిలువన్ విని సీత భీతినన్
గృపణతఁ బిల్చె రాఘవున కేమియవస్థయొ చూచి రమ్ము నా
విపులతరార్తి మాన్పు మని వేఁడిన నేనిటు లంటి సాధ్వికిన్. 219

చ. విపదపహార్త యైనరఘువీరునకుం దురవస్థ రాదు నీ
విపుడు దలంకి యొండొకటి యెన్నక మిన్నక యుండు మమ్మ! యీ
విపినమునందు నొంటి నిను వీడ్కొనరా దని పల్క నల్క దో
సపువచనంబు లాడ నవి సైపక వచ్చితి దేవ! నావుడున్. 220

తే. ఎంత యైనను వని నొంటి నింతి డించి, తగదు చనుదేర నెఱుఁగవే దైత్యమాయ ని
-యైన వచ్చితి వింక నైన నరుగవలయుఁ, బరగ మునుకల్గఁ బద పర్ణశాలకడకు. 221

క. అని పర్ణశాల డగ్గఱఁ, జనుదెంచి యిదేమి నేఁడు జానకి మెలఁగం
గనరాదు చిన్నఁబోయిన, దని వంతం గాంచుఁ గాంత యడుగిడుజాడల్. 222

తే. తమిగమియఁ గాంత గాంతుఁ డంతటను జూచుఁ
జూచి లక్ష్మణ! చాననిచ్చోటఁ గాన
మాయయో! సీత మనయాశ్రమంబు గాదొ!
కలయొ నిక్కమొ! యిది నాకుఁ దెలుపుమంచు. 223

ఉ. చెంగిన తాల్మి కల్మి రఘుసింహము డెందమునందుఁ గుంది పే
రంగదఁ బర్ణశాల కలయంగను ముంగిటఁ జెంగటం గనున్
నింగిఁ గనున్ మహిం గను వనిం గనుఁ బల్మఱునుం గనున్ దశా
శాంగణభూము లేమి యనుజా ? యను డాగితివే సతీ? యనున్. 224

ఉ. చాయను జూపవేమి ? యనుజా ! యను నవ్విధి యెంతఁ జేసె నా
రా! యను నాదుగుండె బలురా యనునాత్మపరాక్రమోన్నతుల్
రోయును గాననాంతరము రోయును దుష్టకురంగచేష్టసు
ష్మా యను జానకీ! దనుజమాయను గ్రుంకితె పల్కుమా యనున్. 225

క. గిరులన్ దరులం బఱులన్, గురులన్ గురుతరుల మరలమరలన్ నెమకున్
విరివిరిపొదలన్ రోదలన్, బోఁబోఁ గను విను వియుక్తిఁ బొరలున్ దొరలున్.

చ. తముఁ గుచకుంభయుగ్మఘనత న్నిరసించునసూయ గంధనా
గము కబళించెనొక్కొ! గజగామిని గావుననొంచె నొక్కొ! సిం
గము హరిమధ్యగానఁ గినుకన్ శరభంబు వధించెనొక్కొ! య
క్కమలదళాక్షిఁ గాక పొడకట్టదె యింతకు నాకు లక్ష్మణా! 227

క. పులినకటి మీనలోచన, సలిలభ్రమనాభి చక్రసమకుచ మాద్య
త్కలహంసగమన వికస, న్నలినాస్య వళీతరంగ నదియై నదియో. 228

క. నడ్వలసికతిలపంకిల, శాడ్వలశర్కరిలసీమ జనకజ నవలా
నుడ్వధిపవదన వెదకున్, రాడ్వంశపయోధివిధుఁడు రఘుపతి వంతన్. 229

చ. నలినముఖిన్ లతాంగిఁ, బులినప్రతిబింబనితంబబింబఁ దుం
దిలకుచ సింహమధ్య హరిణీనయనన్ నలినీవనీధునీ
స్థలగిరితుంగశృంగసముదాయములన్ బరికించు నించు శా
ద్వలముల బట్టుగాంచు రఘువల్లభుఁ డట్టితఱిన్ బొరింబొరిన్. 230

సీ. మాతులుంగంబులఁ జూతలుంగంబుల నీరంధ్ర మగుపట్ల నెమకి నెమకి
భిల్లపల్లులచెంత ఫుల్లమల్లులపొంత నదవద యొదవంగ వెదకి వెదకి

కోలఁకులఁ బొదరింటికెలఁకుల దీపించు నభిరామసీమల నరసియరసి
బలులేటినెలవుల సెలయేటిచలువల శోభిల్లుచోటులఁ జూచిచూచి
తే. పుడమిపట్టిని గానక పొక్కిపొక్కి, విరహదావాగ్నివేదన వేఁగివేఁగి
దుర్భరవిచారడోలలఁ దూఁగితూఁగి, తూలు విభుఁడిట్లు దైవంబు దూఱిదూఱి. 231
క. వనిత కువంనామృగధ్వని,విని నా హాహానినాదవేదన యని య
వ్వనవహ్నిఁ బ్రవేశించెనొ, యని యొంతయుం వంత నంతకంతకుఁ గుందున్. 232
వ. మఱియుం వెదకుచుం జనిచని వియోగవేదనాకులమనస్కుండై యక్కాననంబున
నొక్కయెడ సురతరుసరిద్విశేషంబులు గనుంగొని యిట్లనియె. 233
తే. మాట తెలియఁగమిఁ దమి లేళ్లు మగువజాడ, తెలుపుమాడ్కిఁ దృణాస్వాదకలనమాని
మోములెత్తి కనుంగొన రామచంద్రుఁ, డమ్మెకంబులఁ గూర్చియిట్లనుచుఁబలికె. 234
తే. వారువంబులు గావు దేవరకు మీరు, మీకుఁ జొరరానిచోటులు లేకయుంట
యేనెఱుంగుదుఁ గానరే యిందువదన, హరిణలోచన సీత న్నోహరిణులార! 235
చ. మిము మును వేఁటలాడి కడిమిన్నొగిలించుమహాపరాధమున్
రమణిని శాతదీర్ఘతరరంగదపాంగములన్ జయించు నే
రమును సహించి చూపుఁడు కురంగములార! లతాంగిచన్నమా
ర్గము శశిమాళిమస్తకకరంబులు మీకు విహారధామముల్. 236
మ. సొగసుంబల్కులఁ జిల్కలన్ బెళుకుమించుంజూపులన్ లేళ్ళ నం
చగమి న్నెన్నడఁ గప్పుకొప్పుమెఱుఁగుంజాయన్ మయూరంబులన్
బొగిలించెన్ నొగిలించె నొంచె గెలిచెన్ బూఁబోఁడి కీయందఱున్
బగవా రాపగ యానుకూల్యవిధిమత్ప్రాణేశ్వరిం జూపవే. 237
క. వనదేవత! కానవుగద, యనుపమభూజాకృతిన్ లతాంగిని నీవై
నను రాజహంసగమనన్, గనవే కమలాభిరామ! కమలాకరమా! 238
ఉత్సాహ. అంగనాలలామఁ గానవా లతాకుడుంగ ! మా
తంగమా ! భుజంగమా ! పతంగమా ! కురంగమా !
లుంగమా ! లవంగ ! మాతులుంగ ! మాధవీనట
ద్భృంగమా ! వనీరమా ! కరీరమా ! సమీరమా ! 239
క. కుందమ్ములార ! పలువగ, లం దన్వికి మీకునుం గలదు బాంధవ మా
యిందుముఖిఁ జూపుఁ డౌదల, యందెసు నట్లయిన విరివియగు మీసొబగుల్. 240
సీ. అదెలతాతన్వి యొప్పుదలిర్చుకొప్పని పటుకలాపికలాపభరముఁ జూచు
నదె తన్వితరళితరాపాంగరుచు లని సారంగదృక్చ్ఛకచ్ఛకలుచూచు
నదె జవరాలిమోహనపుఁ బాలిండ్లని పరువడిఁ గుంభికుంభములు చూచు

నదె కోకిలాలాప యసియాడు నదె మని యేనుంగుపగర లేఁగొనుఁ జూచుఁ

తే. జూచు డగ్గఱుఁ గ్రమ్మఱఁ జూచు నరలుఁ, బొరలుఁ గెరలు వియోగాగ్నిఁ బొగులు నొగులు
నెచటి కేగితె ప్రాణేశ్వరీ! యటంచుఁ, జీరు వగఁదూరు నారఘువీరుఁ డిటులు. 241

తే. తనరు నినుఁబాసి యొకముహూర్తంబు బ్రహ్మ, కల్పమై మించఁగా రేపగల్లు నేను
గడపుచున్నాఁడ నిందుకుఁ గర్మసాక్షి, శశధరుండును సాక్షు లోసరసిజాక్షి! 242

చ. అవిరళకంటకోపలకులాకుల మిట్టియఖండదండకా
టవిఁ జనునప్పు డక్కటకటా! రమణీరమణీయపాదప
ల్లవయుగ మెట్లు లోర్చెనొ యిలాధరఘోరదరీనిరీక్షణ
ప్రవణత నెట్లు చెందెనొకొ పాపవిధీ! సతిచిత్త మత్తఱిన్. 243

తే. పుడమిపుట్టువు లతకూన పువ్వుఁబోఁడి, కొమ్మ సైదోఁడు మీఁకు భూజమ్ములార!
తోడునీడయు నగుచుఁ గాపాడుఁ దరసి, యభిమతైకఫలావాప్తి యగు నిజంబు.

తే. అనుచు నున్మత్తవృత్తి నట్లావిభుండు, కలయఁ జూచుచు నాభిముఖ్యమునఁ జనుచు
విరహసంతాపవివశుఁడై విపినవీథి, వెలఁది క్రొవ్వెదరాలు క్రొవ్విరులు గనియె. 245

తే. జనకబాలకసహజవాసనలఁ దెలుపు, క్రొవ్విరులు గాంచి మఱియును గొన్ని నెఱయు
విమలతరతారహారదామములు గాంచి, యందెయును గాంచి మోదంబునందె విభుఁడు.

వ. అంతటం జని చని యగ్రభాగంబున ధాతుమయశైలశృంగసమరుధిరసిక్తకాయుం
గంఠగతప్రాణవాయుం జటాయుం గనుంగొనె నప్పుడు. 247

క. కని రాక్షసబుద్ధిం జని, యినకులసింహము జిఘాంస నెవ్వాఁడవురా?
వని నన్నుఁ జెనకవచ్చిన, దనుజుఁడవో? పలుకు మన నతం డిట్లనియెన్. 248

## జటాయువు రామునకు సీతావృత్తాంతముఁ జెప్పుట.

చ. విను రఘువీర! నీ వెఱుఁగవే ననుఁ? జేసు జటాయు వండ్రు నీ
జనకుసఖుండ నజ్జనకజాత భవత్కులపాలికం దశా
ననుఁ డనువాఁడు గైకొని చనం గని మార్కొని యిట్లు దస్సి నిన్
గనుఁగొనునంతకుం నిలువఁ గల్గితి నంచుఁ దొఱంగెఁ బ్రాణముల్. 249

చ. అతఁడు నిజాగ్రభాగమున నప్పుడు మేనుదొఱంగ ఖిన్నుఁడై
యతనికిఁ దండ్రికిన్ బలె నిరంతరభక్తి యథావిధిన్ స్వధా
హుతవహసత్క్రియల్ సలిపి యొక్కటఁ బంచె శచీసహాయ మి
త్రత దళుకొత్తు నాదశరథక్షితిపాలునితోడి చెల్మికిన్. 250

వ. అంతట నచ్చోటు గడచి చనిచని. 251

క. ధీజనవంద్యుఁడు సురముని, పూజనయోగ్యుండు నగువిభుండు వధించెన్

యోజనదీర్ఘభుజంగవి, భోజనచరితాసురైకబంధుఁ గబంధున్. 252

వ. తదనంతరంబున నద్దనుజుండు ప్రాణప్రయాణసమయంబునం గొంత యుపకారంబు
చేసెదం గాక యని రామలక్ష్మణులం బిలిచి యిట్లనియె. సూర్యసూనుండు సుగ్రీవుండను
వాఁడు వానరేశ్వరుండు పుణ్యుండు వాలిచేతఁ దిరస్కృతుం డయి కళత్రధాత్రీరాజ్య
రహితుండయి ఋశ్యమూకాచలంబున నుండు నక్కపివీరుండు మిమ్ముశరణంబు నొంది
మీకు సాయంబు సేయు నందువలన మీతలంపులు ఫలించు నిలింపు లింపులంజరింపు
దురు చనుం డని తెరువుఁ జూపి పంపఁ బంపఁ దఱియ నరిగి రప్పుడు. 253

రామలక్ష్మణులు పంపాసరోవరముఁ గాంచుట.

తే. తనరు వనదేవతారత్నదర్పణంబుఁ, బొశహస్తపరిస్ఫుటస్ఫటికగృహము
నై విరాజిల్లు పంపాసరోవరంబుఁ, గాంచె హంసకులస్వామి కౌతుకమున. 254

తే. మత్స్యకూర్మావతారసామగ్రిఁ గాంచి, యహిమకరవంశమునఁ బొల్చి యహరహంబు
లక్ష్మణాన్వితగతిఁ దనలాగు దొరయు, నట్టిపంపాసరోవరం బపుడు గాంచె. 255

ఉ. కద్రువకాన్పు వాచవులుగా విహరించి తటీపటీరని
ష్ఛిద్రలతాంతకాంతనవనీపవనీతతులం జెమల్చి హా
రిద్రులతావిహారిశబరీకబరీహతిఁ గుంది పంప న
త్యుద్రతరోర్మిఁ గ్రుంకి రఘుకుంజరుఁ దార్కొనెఁ గమ్మతెమ్మెరల్. 256

శా. ఆపంపాసరసీతటిం బ్రథితబాహావిక్రముల్ చాపవి
ద్యాపారీణులు రాసుతుల్ నిలువఁగా నాఋశ్యమూకాద్రిసా
నూపాంతస్థలి నుండు సూర్యసుతుఁ డార్యోద్గీతచర్యుండు సం
తాపం బాత్మ జనింప మంత్రులకు నంతర్వంతతో నిట్లనున్. 257

తే. వాలిపంపున నొక్కొ! యెవ్వారొ వీరు ?, లదె యలౌకికతేజస్కు లమితబలులు
బాణబాణాసనకలాపపాణు లిటకు, నేఁగుదెంచిరి కనుడు మంత్రీంద్రులార! 258

రామలక్ష్మణులఁ జూచి సుగ్రీవుఁడు భీతిల్లుట.

వ. అనిన సుగ్రీవునిమంత్రులుం దదీయనిఖిలవానరవీరులుం గూడి యక్కోటిసూర్య
తేజోవిరాజమానాకారుల రఘువీరులం గనుంగొని భయకంపితాంగు లయి కలంగి
గిరిశిఖర తరుశాఖాచంక్రమణంబులం బఱచి వెఱచి నలుదెసలకుం దొలంగిన
వారలలోన ధీరోదారవిచారుం డగుసమీరకుమారుం డిట్లనియె. 259

తే. వాలిదొరయును వీర లవ్వాలిఁ గొలుచు, వారు నైపంప వచ్చినవారు గారు
వాలిఁ బరిమార్చి నినుఁ రాజ్య మేలఁ జేయ, వచ్చి పొడకట్టుధర్మదేవతులు గాని.

చ. అన విని సంతసిల్లి హరిదశ్వకుమారకుఁ డిట్లు పల్కె ర

మ్మనిలతనూజ! నాకుఁ బరమాప్తుఁడ వీ వలధార్మికుల్ తపో
ధన నృపవీరవేషములు దాల్చుట యేమికతంబొ? యేటికి
వ్వనమున నిల్చిరో? యెచటివారలొ? వారి నెఱింగి రమ్మనన్. 261

హనుమంతుఁడు రామలక్ష్మణులఁజూచి మాటలాడుట.

తే. అట్ల కాకని మునివేష మధిగమించి, పంపకడఁ దమ్మిదొరచూలి పంప వచ్చి
గాడ్పుకొమరుండు రామలక్ష్మణులఁ గాంచి, పలికె భయభక్తియుక్తులేర్పడఁగనిట్లు.

ఉ. ఎక్కడివారు మీరు జగదేకమనోహరు? లుగ్రకాననం
బిక్కడి కేలవచ్చితిరి? యీజటివేషము పూననేమి? యీ
యెక్కటిజోదుబాగులు వహించితి రేల? వెలుంగఁజేయు న
ల్దిక్కులు మీశరీరపటుదీధితి చోద్యము దెల్పుఁ డిన్నియున్. 263

వ. అనిన విని మనవృత్తాంత మంతయుఁ దెలుపు మనిన లక్ష్మణుండు సవినయుం డగు
వాయుతనయునిం గూర్చి యి ట్లనియె. 264

రామసుగ్రీవసల్లాపము.

సీ. దశరథుం డనెడుభూధవసార్వభౌమున కగ్రపుత్త్రుఁడు రాముఁ డమ్మహాత్ముఁ
డతనితమ్ముఁడ లక్ష్మణాభిధానుఁడ నేను బితృవాక్యపాలనవ్రతము నెఱప
రాజ్యంబు విడిచి ఘోరవనంబులకు రాఁగ నారాముసతి సీత యనఘచరితఁ
గపటజటిత్వమార్గమున నొక్కఖలుండు మానవాదుఁడు మేము లేనివెనుకఁ

తే. బర్ణశాలాంతరంబున ఫలపలాశ, జలము లాహారముగ నిష్ఠ సలుపుచుండ
వచ్చి కొనిపోయె సతి పులివాతఁ జిక్కు, కొదమలేడియుంబలె వడంకుచును జనియె.

క. చనుచో వెదకుచు మార్గం, బున దైత్యుని యంగముచ్చములు గన్గొని యం
తనె పువ్వుబోఁడిజాడలు, గని వింటిమి పులుఁగుచెప్పఁగా నొకచోటన్. 266

తే. మఱియుఁ జని యొక్కవనదుర్గమార్గసీమఁ, బుణ్యుఁడొక్కఁడు మేదినీపుత్త్రివార్త
లర్కజుఁడు తెల్పు బుశ్యమూకాద్రి కరుగుఁడనిన వచ్చితి మిచ్చోటి కనఘచరిత!

క. నావుడు రంజిల నే సుగ్రీవుని సచివుండ హితవరిన్ సుతుఁడ మరు
ద్దేవునకున్ హనుమంతుఁడ, గావింపుఁడు నతనిచెలిమి గలుగన్ మీకున్. 268

మత్తకోకిల. వాలిచేత నిరస్తుఁడై బలువంతలం బడి భానుజుం
డాలి నేలునిజావనీవలయంబుఁ గోల్పడి వర్తిలున్
జాలి నెవ్వగఁ దూలి క్రమ్మఱఁ జాలువాని విరోధి న
వ్వాలిఁ ద్రుంచిన వానరుల్ గొలువంగ వచ్చు సహాయుఁడై. 269

తే. అతఁడు మీరు ననూనసఖ్యంబు చేసి, కడఁక సాధింపఁగలరు లోకంబు లెల్ల

మీకరుణ నేన దిక్చక్ర మాక్రమించి, సీతఁ దేఁగల దశకంఠుశిరముఁ దన్ని. 270
వ. అనిన విని ప్రేమ రామలక్ష్మణు లజ్జగజ్జీవనందనున్ బుజ్జగించి సంశయంబు లుజ్జగించి
యట్ల సేయు మని పంపఁ బంపకడనుండి హనుమంతుఁడు సుగ్రీవుపాలికిం జని. 271
తే. వారివృత్తాంత విధులు సర్వమును దెలిపి, వాలికల రెండుపిడుగులు వాలినట్లు
వచ్చిరిద్ద రఖర్వదుర్వారబలులు, సఖ్య మొనరింతు రమ్ము భాస్వత్కుమార! 272
క. పితృవాక్పరిపాలకుఁ డా, శ్రితవత్సలుఁ డతులసత్యశీలుఁడు సదయుం
డతిశూరుఁడు రఘువీరుఁడు, హతకల్మషుఁ డతని నమ్మ నగు రమ్మధిపా! 273
మ. అని సుగ్రీవునిఁ దోడితెచ్చి నయవిద్యాధామునిన్ రామునిన్
గనిపించె న్వినిపించె నేలిక గుణోత్కర్షంబు హర్షంబుతోఁ
బెనఁచెన్ వాలి వధింపఁగా నభయ మిప్పించెన్ సఖిత్వంబు దా
ల్పనొనర్చెన్ వనవహ్నిసాక్షిగ నొరుల్ సామీరికిన్ సాటియే? 274
వ. ఇట్లగ్నిసాక్షిగాఁ బరస్పరంబు నమ్మికలు పుచ్చుకొని పొందు చేసి డెందంబునఁ
గ్రందుకొనునమందానందంబునం దేజరిల్లుచు నొండొరులు చెలంగుచుండి రారఘు
కుమారునకు రవికుమారుం డిట్లనియె. 275

## రామసుగ్రీవసఖ్యము.

ఆ. రవిసుతుండ నేను రవివంశమణి నీవు, నీజయంబె తలఁప నాజయంబు
నీపరాభవంబు నాపరాభవ మార్య, వగవవలదు మగువఁ దెగువఁ దెత్తు. 276
సీ. నగముల నీడ్చి పన్నగములతల లాడ్చి దివి దూల్చి రవి గెల్చి భువి పెకల్చి
నరుల నదల్చి కిన్నరులఁ దెరల్చి కేసరులతోఁ గరులతో దొరసి యరసి
గవులతో మౌనిపుంగవులతోఁ బరికించి ప్రాదనదీజనపదపదవు లరసి
వనమున వనధిజీవనముల లంఘించి పలుదెస ల్నలుదెస ల్పాలయఁ జేసి
తే. కీలిఁ గబళించి యాతమ్మిచూలి మించి, శూలిఁ గెరలించి యుగ్రాగ్రహాలి నొంచి
యొందు నున్నను దెత్తు నీయిందువదన, వదన ననుఁ జూడు మదవద వదలి యధిప!
వ. అని పలికి మఱియు రఘువరముఖారవిందపునఃపునర్విలోకనానందంబునం దనరుచు
వనరుహాప్తసూనుం డిట్లనియె. 278
చ. దనుజునిబారిఁ జేరి యలతం జనుచో వినువీథి నీదుమా
నిని వగ నశ్రుపుల్ దొరఁగ నేనును మంత్రులు నిగ్గిరిం జరిం
చునెడ నిజోత్తరీయమున సొమ్ములు గట్టి మదగ్రసీమ వై
చిన నవి దాఁచినాఁడ రఘుశేఖర! తెచ్చెదఁ గానుకిచ్చెదన్. 279
క, అని యొకగుహాకుహరంబు జని తె, చ్చిన సొమ్ములు గాంచి సొమ్మసిలి తెలిసి దురం

తనకాంతచింత మనమునఁ, గనికని యవి యన్ని మఱియుఁ గనుఁగొని పలుకున్.

సీ. సహృదయమ్మై యుంట చాలెనే యోగుణగ్రాహిముక్తాహారగణములార!
కరము సఖ్యంబున దొరయుంట మాని మత్కాంతఁ బాసితిరె కంకణములార!
రవియుంగరపుఁబద్మరాగంబ నీముద్దుటొరపుల యుంవతి నేల్లవైతి
లలనపాదంబుల లంకెవాటై యుండి రాఁజనునే నూపురమ్ములార!

తే. యనుచునక్కునఁ జేర్చు బిట్టలఁత నార్చు, కన్నుఁగవనద్దుకొని కుందుగాసినొందుఁ
గలవరించును దలవంచుఁ బలవరించు, మిట్టిపడు నుత్తరీయంబు ముట్టిపలుకు. 281

క. దాఁకొని రతిసమయంబుల, జోక న్వలిగాడ్పులీను సురటివి నీవే
యాకాంత సేద దేర్పుదు, నీకుఁ బటాంతరము సనతు నేఁ గానఁ జుమీ. 282

వ. అని పలుమఱుఁ బ్రాణేశ్వరిం దలంచి క్రమ్మఱరఘువరుం గనుంగొని. 283

తే. ధృతిశుచిత్వమహత్వపతివ్రతాత్వ, సత్యసౌశీల్యశమదమాచారవిధులు
జానకీదేవిసొమ్ములుగాని కావు, సొమ్ము లివి కాంత కని పల్కె సూర్యసుతుఁడు.

తే. భూవిభుని కంటఁ గంటను పుట్టెఁ డేసి, తొరఁగ బాష్పాంబుధారలు తుడిచితుడిచి
నీకు శోకార్తి చెల్లునే నృపవతంస!, యనుచు నూరార్ప రవిసూతి కనియె విభుఁడు.

క. ఏవంక మనము సీతా, దేవిని వెదకఁదగు నెవ్విధిన్ ఖలుని దశ
గ్రీవు వధింపుద మీవగ, యేవగ మాన్చెదవు తెలుపుమిపుడినతనయా! 286

క. నీవంటిప్రాణబంధుఁడు, నీవంటిహితోపదేష్ట నేఁ గాన నిఁకన్
నీవాంఛిత మెయ్యది? యది, కావించెద నడుగు మనుడుఁ గపివరుఁ డనియెన్. 287

క. తారాధిపవదనన్ రుమ, సారమణిన్ రాజ్యమున్ ధనముఁ గొని సోదు
ర్వైరుఁ డగువాలిఁ దునుముట, కోరిక యిది నమ్మినందుకున్ ఫల మధిపా! 288

## రాముఁడు సుగ్రీవునితో వాలిని జంపెదనని ప్రతిజ్ఞ సేయుట

చ. అనవుడు రాఘవుండు విని యస్మదమోఘనిశాతబాణప
త్త్రిని బలశాలివాలి బహుదిగ్విజయోద్యమశీలిఁ ద్రుంతు వా
లినభుజశక్తి నేటికిఁ జలింప నిలింపపరంపరల్ నుతిం
పను నినుఁ జేర్తు నీయనుగుభామిని భూమిని భానునందనా! 289

వ. అనిన విని యమాత్యులుం దాను ననంతసంతోషంబు నొంది యుప్పొంగి యవ్వాలి పరాక్రమంబుఁ దలంచి రఘువరుం గూర్చి దేవతాధిపతనయుండు దుర్జయుండు తత్ప రాక్రమం బెఱిఁగించెద నవధరింపు మని యిట్లనియె. 290

## సుగ్రీవుఁడు రామునితో వాలిపరాక్రమ మెఱింగించుట.

ఉ. నాలుగువారిరాసు లొకనాఁటనె త్రిమ్మరి వచ్చుఁ గ్రమ్మఱన్

శైలము లెత్తి కందుకముచందముగా నెగవైచి నేలకున్
వ్రాలఁగనీక పట్టు నజవంబుగ నేఁగినఁ దృప్తదిక్కరుల్
వాలి యజేయుఁ డాజి గెలువంగ సురాసురు లోపరాతనిన్. 291

క. కావున నీవిటు నిలిచి మ, హావంచనఁ బొంచి సునిశితామోఘశరం
బీవేయుము మర్మం బిదె, యావీరు వధింపనోపు దౌ శుభచరితా! 292

వ. అని మఱియు నొక్కతెఱంగు విన్నవించెద సహింపు మని యిట్లనియె. 293

తే. ఎదిరి మున్నింద్రసుతు చేత నీల్గిపడిన, దుందుభికళేబరము నీవు త్రోవఁ దోవఁ
జాలితివ యేని నోపు దవ్వాలిఁ దునుమ, లేనిచో నీబలము నమ్మలేము మేము. 294

రాముఁడు దుందుభిశరీరము నెత్తివేయుట.

క. అన నెలవి నవ్వి కాని, మ్మని దుందుభికాయ మున్నయచటికి లీలన్
జని చూచి నిజాంగుష్ఠం,బునఁ గొని పదియోజనములు పోవఁగ మీటెన్. 295

వ. అట్లు మీటిన. 296

మ. ఇది నే నమ్మ సురేంద్రనందనుఁడు మున్ హేలాగతిన్ మీటునాఁ
డుడుకై శోణితమాంసమేదురము నత్యుగ్రంబు నై యుండ ను
న్నది నేఁ డిత్తను వస్థిమాత్ర మయి యింతం బోవ దవ్వాలిఁ దు
ష్మద విత్తాళము లేదు నేయుము తెగన్ నీ వొక్కబాణంబునన్. 297

మ. అన బాణాసన మప్పు డందుకొని బాహాశక్తి మోపెట్టి చం
డనిశాతాస్త్రము నారిఁ గూర్చి తెగనిండం బిట్టుగాఁ దీసి యే
సిన నత్తాళము లేడునుం దునిమి యచ్చోంతన్ గిరిం గాఁడి మే
దిని భేదించి రసాతలం బొరసి యేతెంచెన్ విభున్ డాయఁగన్. 298

తే. తాళ్లు దెగ రావణాదిశాత్రవులయాంత్ర, త్రాళ్లు దెగు నిట్టులనెడు చందమున నంత
మరలి దొనచొచ్చె రఘువీరవరశరంబు, శరము దొన చేరు టెందు నైజంబు కాదె!

వ. అప్పు డారాఘవామోఘవిశిఖంబున నరాళంబులు నుత్తాలంబులు నగునత్తాలంబు
లుం దునిసినం జూచి యద్భుతానందపరవశత్వంబున. 300

క. రంజిలి యంజలి చేసి ధ,రం జాగిలి మ్రొక్కి నిలిచి రఘువర! యపరా
ధిం జూడుము కృప ననుఁ దెలి, యంజాలఁగ నైతి నీమహామహిమ మహా! 301

క. నావుడు రఘుపతి విని సు, గ్రీవుని లాలించి చనుము కిష్కింధ కటన్
నీవెంటనె చనుదెంతుము, వేవేగమె వాలి ననికి వెడలింపు మిఁకన్. 302

### సుగ్రీవాదులు కిష్కింధను జేరుట.

వ. అని సకలసేనాసమేతంబుగా సుగ్రీవునిం బనిచి తాము నంత వెనుకొని చని. 303

శా. దుష్కీర్త్యార్జనశాలి వాలి సహజద్రోహిన్ వధింపన్ సమి
న్నిష్కంపాత్మకులాశ్రితోద్ధరణనిర్నిద్రుల్ జగజ్జైత్రధా
నుష్కస్వాములు రామలక్ష్మణులు ధన్యుల్ సత్యసంపద్ఘనుల్
కిష్కింధానగరంబుఁ జేరి యొకచక్కి న్నిల్చి యున్నంతటన్. 304

### వాలి సుగ్రీవ యుద్ధము.

వ. అప్పు డప్రతిప్రాకారవలయతోరణావిష్కారపరిష్కారం బగుకిష్కింధాపురద్వారంబు చేరి యుగ్రీవుం డగుసుగ్రీవుండు ప్రళయకాలకాలగ్రీవహుంకారధిక్కారభూరిభైరవరవంబున భూనభోంతరాళగోళంబు ఘూర్ణిల్ల నార్చుచు నిలువ నమ్మహాధ్వని విని రోషావేశారుణముఖుం డగుచు వాలివాలినకడింది పిడుగువాలినవిధంబున దిక్కులు వ్రక్కలై యవురుల నార్చుచుం దాఁకె నప్పు డిరువురుం జరణఘట్టనాచరణంబుల ధరణి గ్రక్కదలఁ బటుభుజాస్ఫాలనంబుల ఖగంబులు మృగంబులుకంచు మించై పఱవ నొండొరునకనలు కనుంగొనలఁ గొనలుసాగువిస్ఫులింగంబులు మేఘసరణి ధరణిం గబళింపఁ జలింపక కదిసి యశనిసమముష్టిఘాతంబుల నిశితవిశిఖసఖనఖముఖంబుల నడంచుచుం జించుచు నొంచుచు రక్తధారాపాత్రంబు లగుగాత్రంబుల దొరసి మఱియును. 305

క. గిరిగిరియున్ గరికరియున్, హరిహరియున్ బలెఁ బెనంగ నల్లన నృపుఁ డ
య్యిరువురరూపులుఁ జూపులు, నరసి పరస్పరవిమర్శనాదక్షుం డై. 306

క. అతఁ డీతం డితఁ డాతం, డతఁడీతం డనుచు నింద్రజార్కతనూజా
కృతు లొక్కరూపుఁ గావున, మఱిఁ దెలియక యప్పు డేయ మానె విభుండున్.

క. పోరిఁబోరి బెనంగి యోడిన, కరసూనుఁడు వాలిచేత గాసింబడి ని
ర్భరరక్తసిక్తతనుఁ డై, యరిగి రఘూత్తమునిఁ జేరి యపు డిట్లనియెన్. 308

క. నను వాలి చావ నడిచిన, వెనుక ఫలం బేమి నీకు? విక్రమరూఢిన్
మును గలుగ వాలిఁ జంపిన, నినుఁ జెందుం గాక కీర్తి నృపవర! యనుడున్. 309

క. కరచరణనఖముఖాక్షీ, స్వరశిరములు నురము నరయ వాలికి నీకున్
సరిగాన నమోఘము నా, శరమేయం జాలనైతి సైఁపు కపీంద్రా! 310

వ. అని లక్ష్మణునిచేత నఱుతన్ గురుతుగా నొక్కగజపుష్పమాలికం గీలుకొలుపం గాంచి రవికుమారపునస్సంగరోన్ముఖుండ వై పొమ్ము భయంబు వలవదు రయంబున

జయంబు గాంతు వనిన సంతసిల్లి యుద్ధసన్నద్ధుండై చని మఱియు సమరంబునకుం
బిలువ నెలవిఁబాఱి నవ్వియవ్వాలి యాలంబు సేయ నేతేరఁ దారాముఖశశిముఖులు
జగదేకశూరుం డగురఘువీరుండు నీతమ్మునకు సహాయుండు బలవద్విరోధంబు వల
వదు చనకు మని హితంబు పలుక నఖర్వదోర్గర్వదుర్వారుం డై వచ్చి తాఁకి యప్పు
తంగపుత్త్రు నొప్పించిన నది తననొప్పిగాఁ గనుంగొని యతని నొప్పింప మహాశరాస
నంబు మోపెట్టం దొడంగె నయ్యెడ. 311

## వాలివధము.

సీ. కలగుండుపడి కుంచెఁ గులమహీధరపంక్తు లాకులపా టొందె నఖిలతరులు
కలఁగి భంగము నొందె జలరాసు లేడును దలమూపఁ డయ్యె నత్తమ్మిచూలి
పృథ్వీతలం బెల్లఁ బెల్లగిల్లఁ గడంగె నతిమలినం బయ్యె నంబరంబు
తలయేఁకు దాల్చి గట్టులు వట్టె నగధన్వి ఫణిరాయకుఁడు గూఢపదము నొందె
తే. దిక్కరులు మూలమూలలఁ జిక్కి మ్రొక్కె, ధరణిచక్రము దిర్దిరఁ దిరిగె నపుడు
వాలినిగుఱించి రాఘవేశ్వరుఁ డమోఘ, సాయకము వింట సంధించి వేయఁబూన.
వ. ఇట్లు ముల్లోకంబులు తల్లడిల్ల నొక్కతరుషండంబు మఱుంగున మెఱంగి యేపునం
దూపు సంధించి. 313
క. కీలిప్రతాపశాలిన్, వాలిన్ జితదానవాలి వాలినతనయా
ఖీలశరచంపకప్రస, వాలిం గారింపఁ దూలి యవనిం గూలెన్. 314
ఉ. ఏసి విభుండు డగ్గఱిన నింద్రతనూభవుఁ డిట్లు పల్కె నేఁ
జేసిన ద్రోహ మేమి రఘుశేఖర! బల్విలుకాఁడ వౌదు నీ
వాసియు వన్నె నేఁడు గనవచ్చె బుధుల్ గొనియాడ సత్యసం
ధాసదయత్వశాలి వని నమ్మితిఁగా నిను నమ్మి సావుడున్. 315
క. అనుజన్మవధూగమనం, బొనరించినద్రోహి వగుట నోర్వక నిన్నున్
గనుబ్రామి సంహరించిన, ననుఁ జెందునె దుష్కృతంబు నగచరతిలకా! 316
వ. అనిన విని రఘునందనునకు సంక్రందననందనుం డిట్లనియె. 317
తే. ఆహవంబున నీశరాహతిని వ్రాలి, నందుల కొకింతవగవ నాయిందుముఖకి
వగవ రాజ్యంబు చనుటకు వగవ వగతు, నంగదునికంచు సుతునిఁ జేరంగఁబిలిచి.
ఉ. అంగదలేక నిన్నుహారహాంబును నంకతలంబుఁ జేర్చి పా
యంగద యౌవరాజ్యనిధి వై యలరన్ నినుఁ జూడనియ్యఁ డా
యెంగద దాయఁ గూడి విధి యివ్విధి నీ కిఁకఁ దండ్రిప్రాపు వో
యెంగద వాలి నేఁడు పడియెంగద యంగద! దోర్బలాంగదా! 319

వ. అని వగచి వగచి శ్రుతికటుప్రాయన్యాయనిష్ఠురంబులు గొన్ని పలికి రామచంద్రున కయ్యింద్రతనయుం డిట్లనియె. 320

క. శోభిలు నంగదభరణం, బాభరణము నీకు నిలుపు మస్మద్వంశం
భాభానుసూతి చేతికి, సౌభాగ్యపుఁబట్టి నిమ్ము నరనాథమణీ! 321

వ. అని పలికి మదీయహృదయకీలితవిశిఖవ్యథం బ్రాణంబులు నిలుపం జాల బాణంబు పెకలింపుము భవత్పాదపద్మసాన్నిధ్యంబునం దనువు దొఱంగి కృతకృత్యుండ నగుదునని యను సుగ్రీవునిం జేరి వెనుకటిమత్కృతాపరాధంబులు సహించి యంగదుం గటాక్షించి రక్షింపుము రామలక్ష్మణచరణారవిందసేవానిర్ణిద్రుండవై సుఖంబున నఖిలరాజ్యంబు సేయుం మనియును బ్రియంబులు వలికి రఘువరముఖవిలోకనైకాగ్రచిత్తంబునం బ్రాణాశుగంబులు వదలి ముక్తుం డయ్యె నయ్యవసరంబున. 322

క. శ్రీరాముఁడు నయధాముఁడు, తారాశోకంబు నంగదవిలాపంబున్.
వారింపుచు లాలింపుచు, వారకసౌమిత్రి కుత్సవంబుగఁ బలికెన్. 323

## సుగ్రీవపట్టాభిషేకము.

శా. సీతాన్వేషణకార్యయత్నము దగం జేయంగ శీఘ్రంబ సం
ప్రీతిం దత్కపిరాజ్యలక్ష్మి కిట సుగ్రీవుం బ్రతిష్ఠించి ప్ర
ఖ్యాతశ్రీఁ దగ యౌవరాజ్యయుతుఁగా నయ్యంగదు న్నిల్పి ర
మ్మా తీవ్రక్రియ వారిఁ దోడుకొనిపొమ్మా ప్రోలికిన్ లక్ష్మణా! 324

వ. అని యనుజు నియోగించి సుగ్రీవునిం గనుంగొని తపోధనప్రకారంబుఁ బూనినాకుఁ బట్టణంబు సొర నుచితంబుగాదు సౌమిత్రి న్వెనుకొనిచని పట్టంబుగట్టుకొమ్ము పొమ్మని పనిచిన లక్ష్మణుండు కిష్కింధానగరంబు వివిధరత్నతోరణవిచిత్రశృంగారరచనావిశేషంబుల నలంకరింపించి హనుమత్ప్రముఖప్రధాననిఖిలవీరవానరసమ్మతంబుగా నమ్మిహిరసుతునకు నఖిలకపిరాజ్యపట్టాభిషేకంబు గావించి యౌవరాజ్యంబునకు నంగదుం బ్రతిష్ఠించి దుష్టనిగ్రహశిష్టపరిగ్రహంబునఁ బట్టణంబున సుగ్రీవాజ్ఞ నడవంగట్టడఁ జేసి మరలి లక్ష్మణుండు రాఘవేశ్వరుం డున్నయెడకు నపూర్వమణిమయాభరణసమస్తవస్తూపాయనపూర్వకంబుగా నక్కపివీరుం దెచ్చి కానిపించిన నతండును బరమానందంబు డెందంబున సందడిగొనఁ బునఃపునఃప్రణామంబులు చేసి యి ట్లనియె.

ఉ. ఆరఘువాత్మజన్ము నొకయమ్మున దిమ్ముగఁ గూల నేసి నా
భామిని భూమి నిచ్చితివి పల్కును బంతము సంఘటిల్లె నీ
కేమికొఱంత లేనికృప నీబుణ మేక్రియఁ దీర్చుకొందు? నిం
కేమని యందు నీమహిమ? యెవ్వరు నీసరి రాఘవేశ్వరా! 326

వ. అని కీర్తించిన రవికుమారుం బరిరంభణంబున గారవించిపొమ్ము సుగ్రీవ! రాజ్యరక్షణ విచక్షణుండవై సుఖం బుండుము శరత్సమయంబున రమ్మివ్వర్షాకాలంబు మాల్యవద్గిరివాసంబునం గడపెదము జనకతనయాన్వేషణక్రియాధారంబు నీయది సుమ్మని బహూకరించి వీడుకొలిపి చని తద్గిరిపరిసరంబుల విహరింపుచుండె నంత. 327

## ఆశ్వాసాంతము.

క. రామాజనవనమాధవ!, రామాయణభాగవతపురాణశ్రవణ
ప్రేమరసవివశహృదయ, స్థేమా! యుద్దామభోగజితసుత్రామా! 328

క. శరధిపరీతధరాతల, పరిరక్షణదక్ష! ప్రథనఫాలాక్ష! నిజా
జిరవిహరద్భంభురసిం, ధురలక్షా! కందనోలిదుర్గాధ్యక్షా! 329

చ. వితతయశోవిలాసనిధి! విప్రవివాహవనీతటాకదై
వతనిలయానవద్యసుతవర్గ యశస్కరకావ్యసప్తసం
తతికలనాకృతార్థ! వనితాజనతామకరాంక! విక్రమా
న్వితా! యవనీపశేఖర! వనీపకనీపవనీపయోధరా! 330

గద్యము. ఇది శ్రీమదొంటిమెట్ట రఘువీరశతకనిర్మాణకర్తృజగదేకఖ్యాతిధుర్యాయ్యల రాజుతిప్పయమనీషిపర్వతాభిధానపౌత్రాకయార్యపుత్త్ర పరిశీలితసమిద్ధరామానుజ మతసిద్ధాంతమర్మమ్ముష్మడివరదాచార్యకటాక్షవీక్షాపాత్రహృదయపద్మాధిష్ఠితశ్రీరామ భద్ర రామభద్రకవిప్రణీతంబైన రామాభ్యుదయమహాప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము.




# షష్ఠాశ్వాసము.



భారతీధరాజ్ఞా
శ్రీభవనీకృతకటాక్షజిహ్మాంచల బా
హాభాగ ! దయాంభోరుహ
నాభా ! గోబ్బూరినరసనరనాథమణీ! 1

వ. అవధరింపుము తదనంతరకథావిధానం బెట్టిదనిన. 2

## వర్షర్తువర్ణనము.

క. ధరణీతనయాన్వేషణ, కరణోద్యోగానురోధకంబై యంతన్
తెరువరుల కాలిసంకెల, యరుదెంచెన్ వానకాల మాభీలంబై. 3

తే. బ్రహ్మ తన చేయులోకప్రపంచమునకుఁ, దారతమ్యంబుఁ దెలుపంగఁ దలఁచి యొక్కొ!
సూటి మింటికి నేలకు సూత్రపట్టి, వీఁక నీరంధ్రధారాళవృష్టి గురిసె. 4

మ. రటదంభోధరమాలికల్ మలసె ఘర్మద్రుద్విషేంద్రంబులై
పటుదంభోళికృశానుధూమతతులై ప్రావృట్పరివ్రాడ్జటా
చ్ఛటలో నా మెఱసెన్ మెఱుంగులు దివిన్ సంవర్తవేళామహా
నటచూడాహిఫణాసహస్రమణిసందర్భప్రభాచాతురిన్. 5

తే. మెఱుఁగుతఱిత్రాడు పెనఁకువ మించు మొగులు, చాలుకవ్వపుమలమరుచ్ఛయము చేత
భ్రమణ మొందించి నూత్నమా నమృత మార, వినుకడలిఁ గల్గఁ జేసెఁ బ్రావృణ్మురారి.

తే. క్రొమ్మెఱుఁగుదీఁగె తళుకులకమ్మపసిఁడి, కొడుపుతాఁకుల ఘూర్ణిల్లె ఘోరభంగి
దర్పకోద్దండదండయాత్రకునుబోలె, భూరితరమేఘమాలిక భేరి భేరి. 7

తే. సాగరవిషంబు గ్రోలి ధూర్జటియుఁ బోలె, నాత్రివిక్రమగతి దివి నాక్రమించి
విధియుఁ బలె నాదిసృష్టి కావించి కాఱు, మొగులు దలఁపించె నపుడు త్రిమూర్తిమహిమ.

మ. స్థిరమైత్రిం దనవారిలోఁ గలయికన్ క్షీరంబులుండం బర
స్పరభేదం బొనరించు నంచుఁ గలహంసశ్రేణులం జండభీ

కరఘోషంబున ధిక్కరించి కడుఁ గిన్కన్ బోలె వర్షోపలో
త్కరపాతంబున బిట్టు పాఱ నడఁచున్ గాలాభ్రసందర్భముల్. 9

తే. మేఘరాజులు సరసత మీఱఁ దమ్ముఁ, దరళవిద్యుల్లతాదీర్ఘతరకటాక్ష
వీక్షణకలాపముల గారవింప నలరి, నెమ్మి నర్తించుఁ బురివిచ్చి నెమ్మిగములు. 10

క. కాలరసవాదిమొగులం, కాలాకృతిఁ బొదలుచదలు గవిఁ బవిశిఖివా
తూలధమనీముఖంబునఁ, గ్రాలించి మెఱుంగుఁబసిఁడిఁ గనె రససిద్ధిన్. 11

చ. సమయకులాలుఁ డగ్గగనచక్రతలంబున నంబురాశి పం
కము గొనివచ్చియొక్క పొసఁగన్ మఘవాయుధదండ మంది యం
దముగ నవాభ్రకుంభము లొనర్చె రసజ్ఞుఁడు గాఁడె వాఁడు లో
కము లెఱుఁగం బయోధరతఁ గాంచుటయున్ గలిగించె వానికిన్. 12

శా. ధారాశుద్ధిఁ బ్రసిద్ధి గాంచి ఘనశబ్దస్ఫూర్తి వర్తిల్లఁగాఁ
జోరం బై నరసస్థితిన్ దరళవిద్యున్మాలికాలక్షణో
దారంబై కవిసేవ్యమౌ వనమయూరారూఢిఁ బ్రాపించి వ
ర్షారంభంబు ప్రబంధమట్టఖిలపద్యాక్రాంత మయ్యెం దగన్. 13

తే. వడియె వడగండ్ల నింద్రగోపములఁ గూర్చి
ఘనవిభుఁడు క్రొమ్మెఱుంగుజవ్వనిఁ బెనంగఁ
బన్నసరమున నడలి పైపైని రాలు
విమలముక్తాఫలాబ్జరాగము లనంగ. 14

చ. చెలువునఁ గాఁకఁ బైకొను శుచిప్రియుఁ బాయుటఁ జేసి వేదనం
బలె మలినాంబరాంతలును బంధురవర్షమిషాశ్రుధార లా
కుల నిబిడోర్జితశ్వసనగుంఫనలున్ బరిలీనతారకా
పటలును నై జడప్రకృతి వర్తిల నుండిరి దిగ్వధూమణుల్. 15

ఉ. సారపుసోగక్రొమ్మెఱుఁగుసంపఁగిపువ్వులదండవిందు చే
కూరినతోరపుంజిగిమొగుల్ దురుముం బస నుల్లసిల్లు ది
క్నారుల తోరహారములుగాఁ దలఁపించె నిరంతరాంబుము
గ్ధార లనర్గళాగతి సదా సకలాశయముల్ దలిర్పఁగన్. 16

క. గగనాంగనమణిదీపిక, లగుచు దివాసతుల కింపు లగుసంపఁగిక్రొ
మ్మొగడసరు లగుచుఁ దగుఁ బలు, వగ మెఱుఁగులు కాలభైరవజటాచ్ఛటలై. 17

సీ. హరిహయాయుధరేఖ లనుగడల్ వేయించి యలముధారారజ్జువుల బిగించి
జలదంబు లనునీలివల లెల్లెడల నిల్పి వివిధగర్జావాద్యరవము గొల్పి

తేప మీఱఁ దటిన్నటీపంక్తిఁ బ్రేరించి కోపుగా మెఱుములు గొనఁగఁ జేసి
సరసుల కోకసోంపు సంధిల్లఁ గావించి పెక్కుదిక్కులవారిఁ బెంపుఁజేసి
తే. యలరెఁ దొలకరితఱిఁ పేరియాటవాఁడు, మీటు వాటిల్ల వలరాచ మెచ్చువడసి
పథికజనమానధనము లపారలీలఁ, గొల్లలాడెను భువనంబు లుల్లసిల్ల. 18

వ. ఇట్టి దుర్ధర్షవర్షాగమసమయంబున జనకతనయావియోగవేదనాదీనదీనమానసుం డై
రఘువరుండు సౌమిత్రి కిట్లనియె. 19

## రాముఁడు సీతావిరహతప్తుఁ డగుట.

క. వానల సీతావిరహద, వానలసంతాప మంతకంతకు నధికం
బైనది శమింప దించుక, యైనఁ దటిద్వహ్నియంతమ చేటనె చెప్పుమా. 20

తే. లీల నీప్రావృడాగమవేళయందు, నిండు జాబిల్లి పండు వెన్నెలలు మింట
నెడనెడలఁ గాయ నవి కంటివేకరంబు, మొగులు విరియొండపలెఁ దాపమునఁ దేర్చు.

తే. అకట! నాకిపు డొక్కవర్షాగమంబె, పెక్కువర్షంబు లై తోఁచె బీరువోయె
నొప్ప వన యింక సీతావియోగదావ,దహన మేమిట: జల్లాఱుఁ దలఁపు మనఘ!

ఉ. ఝుంకరణంబు సల్పు మరుసైన్యములట్ల కదంబమారుతా
ఘ్యంకరణంబులై యహరహంబును బాంధమనోభిమానన
గ్నంకరణంబు లై ఘనఘనాఘనముల్ పొగ రెక్కె కేవలాం
ధంకరణంబులై బహువిధంబుల మబ్బులు గొల్పు గంటివే? 23

వ. అని మఱియుం వియోగవేదనకుం గాక కదధ్వమదద్విరేఫజాతశీతవాతపోతశుకనికర
ముహుర్ముహుశ్చంద్రికామిషవిషోద్గారికైరవప్రియప్రముఖప్రసవవిశిఖాప్తసైన్యంబు
ల గుఱించి దైన్యంబున ని ట్లనియె. 24

## చంద్రాద్యుపాలంభము.

తే. ఏల ప్రేలెదు తేఁటి! యింతేటికలుగ?, సంశ్రితలసన్న గాలి! యోసన్న గాలి!
చెల్లునే రోషరసమింత చిలుకఁ జిలుక!, సారెఁ గుందింపఁ జందమా చందమామ!

క. పవనా! పరిచితనవనీ, పవనా! నా కీవు ప్రాణపద మాట దలం
ప వనారతమును నీ పెం, పవనారూఢంబు తాప మణఁగింప వనా! 26

క. అనిలుండ వయ్యు నయ్యో!, చను నే యిల మెలఁగ నంబుజముఖియంతుకా
జనులకడ? నుడియవేలా, నను నేచెద వింతచలమునం బవమానా! 27

తే. జగతిఁ బొడమించ నంబుజాసనుఁడ వైతి, సకలభూచక్రవిస్ఫూర్తి సమయఁజేయ
నైతి సోముఁడ వైన నేమాయెఁ జంద్ర, విధుఁడ వేలైతి పోషించువిధము లేక?

వ. అని వేఁడి వేఁడి వెన్నెలకాఁకకు సైరింపరాక రాకామృగాంకునిం దేఱి కనుంగొనం

గనుంగొని యనుజునకు నాద్యమణికులమణి యి ట్లనియె. 29

తే. గరముతోఁబుట్టు వగుటనో కలువవిందు, కందు దనయందుఁ దాల్చె లక్ష్మణకుమార!
యది కళంకంబు గాదయా యనఘచరిత!, యతనితో నుండు నొక్కలేడనవిభుండు.

తే. సీత నెలయింపవచ్చి నా చేతఁబొలియు, మాయలేడి నిశాకరుమఱుఁగు జొచ్చి
యిపుడు పగఁ దీర్చుకొనవచ్చె నేమొకాక, యేమి చేసితి బ్రాఁతినే సోమునకును? 31

వ. అని యుల్లంబున నాయల్లకవ్యవస్థం బురపురంబొక్కి యకోమలశ్యామలఘనఘనాపఘనుం డగునక్కాకుత్స్థాన్వయఘనుం డత్తఱిం గురియునిఖిలనీరంధ్రధారాళవర్షంబునకు లోఁగుచు నమ్మహామహీధరగుహాగృహాంగణంబుల వసియించియుం బిరహవేదనావిషాదజనితనిజబాష్పధారావర్షంబునఁ దోఁగుచుఁ బుడమిముద్దరాలిమోలిం దలంచుకొని కృశించు చున్న సమయంబున శారదాగమం బేతెంచె నిత్తెఱంగున.

శరదృతువర్ణనము.

తే. చెదరి దశకంధరోదీర్ణజీవనంబు, పొలియు నీచందమున నంచుఁ దెలుపుకరణి
జీవనముఁ బాసి వెలవెల్లనై పసించె, బంధురము లైన మేచకకంధరములు. 33

తే. అలశరత్కాంతదిగ్వయస్యలును దాను, విన్నకొలఁకులఁ గ్రీడించి వెడలి కదలఁ
గన్నెయొండలఁ దలయార్చి కట్టుక్రొత్త, మడుఁగు లన మించె శుభ్రాభ్రమండలములు.

క. దిక్కు లతికోమలాతప, భాక్కులుగాఁ దెలిమొగుల్ నభశ్శ్రీకి నవ
స్రక్కులుగాఁ జేయుఁచుఁ దన, దృక్కుల కింపై ఘనాంతదీధితి దోఁచెన్. 35

క. శరకాండజడిమ దక్కెన్, శరకాండ మఖండకాంతిసంపద నింకెన్
శరదాగమంబు వోవన్, శరదాగమ మిపుడు మించె జనరంజనమై. 36

క. కనుపట్టె శారదాగతి, వనరుహజాతప్రసాదవర్ధనమై మో
హనరాజహంసవిహరణ, మొనరెన్ సరసులకు జడిమ యుడివోవంగన్. 37

వ. ఇట్లు శారదాగమం బేతెంచుట గాంచి యపుడు హృదయపద్మాధిష్ఠితశ్రీమంతుం డగుహనుమంతుండు భానుసూనుపాలికిం జని యతని కిట్లనియె. 38

సుగ్రీవుఁడు సీతను వెదకింప నీలున కానతిచ్చుట.

క. సుగ్రీవ! సమయమయ్యె ద, శగ్రీవు జయింపఁ దడయఁ జనునే! తారా
సుగ్రీవాసుఖసక్తిగ, రగ్రీవనిభుండు సుమ్ము రఘుపతి కినుకన్. 39

ఉ. రాముఁడు సత్యసంధుఁడు దురంతపరాక్రమశాలి యాగుణో
ద్దాముఁ దయాఢ్యుఁ గొల్వక కృతఘ్నత వీడొకొనఁ జెన్నె? యారఘు
గ్రామణి నీకుఁ గూర్చినయకారణబంధుఁడు గాఁడె? లోకర
క్షామణి గాఁడె? సీత వెతకం గపివీరుల నంపఁజెల్లదే? 40

చ. అనవుడు వాయుసూతి పరమాప్తవచోనయరీతిఁ బ్రీతి నూ
నినమతి నాలకించి యట నీలుని నీతివివేకశార్యశీ
లునిఁ గని జానకిన్ జగములో వెదకంగఁ బ్లవంగవీరులన్
బనుపు మటంచు సౌరి నిజభామినిచెంతకు నేఁగె నంతటన్. 41

## రాముఁడు సుగ్రీవుప్రమత్తతకుఁ గోపించి లక్ష్మణుఁ గిష్కింధకంపుట.

వ. రామచంద్రుండును దుస్తరంబు లగువర్షాగమదివసంబు లొక్కచందంబునం గడపి యొక్కనాఁ డగ్గిరీంద్రకందరమందిరాళిందరమ్యప్రదేశంబున నిల్చి యాకాశావకాశప్రభావిశారదసీరదశ్రీ నిరీక్షించి భూమితనయ లేమికి దుస్సహవిరహవేదనం గుంది లక్ష్మణుం జూచి వత్స! కుత్సితమనస్కుండై భాస్కరకుమారుండు రాకమసలె నాకార! తారాతారాధిపముఖిలికుచకుచక్రీడాసుఖాయత్తప్రమత్తచిత్తవృత్తిం గృత్యం బెఱుంగక మొఱంగి రాక జూసింగినం బోవిడుతునె? కటకటా! యప్పుడచుకవి మఱచె నొక్కో! తనకోరిక లీకలుగొన సఫలంబు గాఁ జేయుంట కాని మిత్త్రెఱంగున మద్వాక్యంబులుగా నచ్చుఱుకుమికుకు తేనిక్కొడుకుకడకుఁ జని నయభయరసంబు లాలంకంబలుకు. పలికినం గనక వినక రాక యుద్ధారంబు లాడ్డెనేని మున్ను తన్ను మన్ననఁగొని పడని పాటులం బఱచుసురు చిరప్రతాపజ్వాలి వాలిం దూలించి యతని జీవానిలాలిం గ్రోలి తనివిసాల కున్నమన్నిశితవిమమాశుగవిషంబునకు నొప్పింతు ననుము. చను మన మహాప్రసాదం బని లక్ష్మణుం డాక్షణంబ యక్షీణబాణబాణాసనతూణీరధారియై ప్రళయవేళాఫణిగ్రైవేయు జాగ్రదుగ్రాగ్రహంబునం జనిచని కిష్కింధాపురద్వారంబు నిర్జిరోధుండై దఱియుం జని నిజదురాలోక భీకరమహామహోవిభవంబునకు వెఱచి పఱచి పరణరక్షకప్రముఖనిఖిలబలీముఖులు విముఖులై గురుతరువ్రాత భీషణపాషాణపాణులై కలగుండుపడ నార్చి రోషావేశంబునం బేర్చి పొచ్చి ప్లవగరాజునగరిమొగసాలమ్రోలన్ నిలువ నలయులబలంబు విని యంగదుండు వెడలి వచ్చి కాంచి యంతఃపురంబునకుం జని పతంగసూతికిం బ్రళయకాలాంతకుండునుంబోలె ముంగిట రఘువరప్రేరితుండై తదనుజుండు వచ్చి నిలిచియున్నవాఁ డిక్కపికులంబు నేఁటితో నిశ్శేషంబు గాకుండ నముండవై యెదురొక్కను మనవుడుఁ దలంకి కక్ష్యాంతరంబునకు నేతెంచి నిత్యసన్నిహితహితామాత్యభృత్యవర్గంబుతోడ నాలోచనంబు చేసి రఘుపతికృతోపకారంబు దలచికొని యవ్వానుమతీశ్వరవరుని పాలికి వాలినందనుం బంచి ప్రార్థితుం గావించి రావించి తారారుమాసమన్వితంబుగా నతుండై కనుంగొని యర్ఘ్యపాద్యాద్యుపచారంబు లాచరించినం

గినుక నతండు గైకొనక రామదురవస్థాస్థితికిన్ ప్లవంగనాయకసుఖవసతికిం దలం
పునం గృశించుచుఁగనలుసౌమిత్రికి మైత్రి కీలుకొనం దారాపురంధ్రి యిట్లనియె. 42

తార లక్ష్మణు ననునయించుట.

క. నాపట్టి నన్ను రాజ్యముఁ, జూపట్టఁగ నిల్పినారు సుగ్రీవుఁ డయో!
మీ పెట్టుచెట్టు గాఁడా?. చేపట్టిన వెనుకఁ గినుక నేయందగునే? 43

మ. అని తారాసతి వేఁడిన న్విని ప్రసన్నాస్యంబునం బొల్పుధ
న్యుని సౌమిత్రిని జూచి పల్కు రవిసూనుం డల్క కర్హుండనే ?
మనుజాధీశ్వర! రాజ్యవైభవమదోన్మత్తుండనై యున్నవాఁ
డనె? మున్నల్గఁ ప్లవంగపుంగవులఁ జూడం బంపనే జానకిన్? 44

ఉ. వాలి వధించి రాజ్యవిభవంబున కర్హునిఁ గా నొనర్చి యుం
ద్వేలపరాక్రముండు రఘువీరుఁడు నీవుఁ బ్రతిష్ఠఁ గల్గన
న్నేలితి రిట్టిమే లెఱిఁగి యీఋణ మెన్నఁడు దీర్చుకోఁగలం
గాలము గాచి దాశరథిఁ గన్గొన రా కిట నిల్వ నోర్తునే? 45

ఉ. ప్రేమ దలిర్ప రాముఁ గనిపించుము తోడ్కొని పోయి వేళవో
నేమిటి కేఁగుదెంచె నని యించుక నాపయి నల్గెనేని నా
స్వామికి నీవె తెల్పఁగలవాఁడవు సుమ్మని సూర్యసూతి లీ
లామధురోక్తి వైఖరుల లక్ష్మణు రంజిలఁ బల్కె నత్తఱిన్. 46

మ. కెలనన్ మారుతిఁ గాంచి రమ్మనఘ! కిష్కింధాపురిం గల్గువా
రల నల్దిక్కులవారలన్ ప్లవగులన్ రావించుమా యొల్లి పో
వలెఁ బౌలస్త్యవధార్థమై రఘుకులస్వామిం గన న్నావుడున్
జెలఁగ న్నింగియు నేల యీనుగతిఁ గూర్చెన్ వానర వ్రాతమున్. 47

సుగ్రీవహనుమదాదులు శ్రీరాముపాలి కేతెంచుట.

వ. ఇట్లు మఱునాఁడు యంగదాసన్న సన్నద్ధసముద్ధతావాష్టానసగోచరవనేచరకోటులం గూడుకొని యంగదాంజనేయనీలగవయగవాక్షజాంబవన్ముఖప్రసిద్ధులు గొల్వ సూర్యపుత్త్రుండు సుమిత్రాపుత్త్రునిం జిరత్న రత్నశిబికారూఢునిం జేసి తానును నుచితవాహనారూఢుండై చనిచని మాల్యవన్మహీధరవరోపకంఠంబున డిగ్గి తమరాకకు నలరి యెదురుచూచుచున్న రామచంద్రు ననతిదూరంబునం గని డగ్గఱి యవ్విభుపదారవిందంబులకుందుపఁ దేఁటియుం బోలె వ్రాలిన దనూజుండు గావున నప్పతంగతనయుం గౌఁగిలించుకొని యతనిం బ్రణయగర్భితరోషంబున నారఘూద్వహుం డిట్లనియె. 48

చ. సమయము పల్కి రాక వెడజాగులఁ బెట్టితి వీడుకొంటివే
మమత? భవద్విరోధి నసమానభుజాబలశాలి వాలి దు
ర్దముని వధించి నీకొసఁగుత త్తరుణీసుఖరాజ్యభోగముల్
మము మఱపించెనే యటకు లక్ష్మణుఁ డుగ్రత వచ్చు నంతకున్? 49

క. అన విని మజ్జనకుండవు, నను నేలినవంశపతివి నాదైవమవున్
విను నీదుమేలు మఱవన్, గొనకొని కపిసేనఁ గూర్చుకొనదడవయ్యెన్. 50

వ. అని విన్నవించి యుంభయపార్శ్వంబులన్ బలంబులం గూర్చి వేర్వేఱం బ్రసిద్ధులం
బేరు గ్రుచ్చి యి ట్లనియె. 51

చ. విశదచరిత్ర! కన్గొనుము వీ రసమానబలుల్ సమిన్నిరం
కుశులు దశాస్యసైత్తిపిడుగుల్ దనుజాటవి కాదవానలుల్
కుశలు లటంచు భూగగనగోళము నిండఁగఁ జేర్చువైరిక
ర్కశుల నపారవీరకపిరాజులఁ బొఁజులఁ దీర్చి చూపినన్. 52

క. కని సంతసిల్లి రాముఁడు, జనకజ వెదకంగఁ దగినచతురుల నీఁకనై
నను బనుపరాదె రవిసుత!, యన నతఁడు మహాప్రసాద మని యుత్సుకుఁడై. 53

సుగ్రీవుఁడు నలువంకలకుఁ గపివీరుల నంపుట.

వ. అప్పు డప్పతంగసూనుండు రఘువరాగ్రభాగంబున నిలిచి గజ గవయ గవాక్ష గంధ
మాదన సుషేణ పనస కుముద నీల జాంబవత్ప్రధానయూథపుంగవులం బిలిచి యుం
చితభాషణసంభావనోపచారంబులం గారవించి ప్రాక్పశ్చిమోదక్ప్రదేశంబుల నెచట
నెచటఁ దరణి కిరణప్రవేశంబునకు నవకాశంబు గలుగు నచట నచట నాయాదేశం
బులఁ గొలంకుల కెలంకుల గిరులదరుల: దీవలక్రేవల నదుల: బొదల: దక్కుండుసెల
వులం గలయ వెదకి రఘువరవరారోహాకాందుపఁ గనుంగొని సరగున నరుగుదేరవలయుం
నని యసంఖ్యాజేయవీరవానరవ్రాతంబులం గూర్చి పనిచి మఱియుం దక్షిణదిశా
ప్రదేశంబునకు నతులితప్రతాపప్రతిభాశుభాచారలక్షణవిచక్షణుం డగునాంజనే
యుం బ్రత్యేకంబ సంపఁ దలంపు గలవాఁడై విలోకించి యిట్లనియె. 54

రామసుగ్రీవులు దక్షిణదిక్కునకు హనుమదాదులం బంపుట.

ఉ. పావని! రమ్ము నీ వఖిలపావనమూర్తివి మత్కులంబు నీ
చే వెలయున్ సమర్థుఁడవు సీతఁ గనుంగొని రా నటన్న సు
గ్రీవ! బళారె! యొంతపనికిన్ హనుమంతుఁడు దక్షుఁ డంచు ను
ర్వీవరశేఖరుండు రఘువీరుఁడు దగ్గఱ: బిల్చె మారుతిన్. 55

క. శ్రీరామచంద్రుఁ డోహో!, యారా! హరువరి నెఱుఁగు నంగదముఖ్యుల్
లేరా? వారు ప్రసిద్ధులు, గారా? హనుమంతుఁ బిల్చెఁ గర్ణంబునకున్. 56

వ. పిలిచి యనురాగంబు పొంగ నతని నుపలక్షించి. 57

శా. రమ్మా పావని! భావనిశ్చలుఁడవై రాఁబోవ నీచేత నాఁ
బొమ్మా ప్రాణమువచ్చుఁ జూచుకొనినన్ భూదేవతాపుత్త్రికి
విమ్మా యిచ్చెద నానవాలు పని నేఁ డీడేర్పఁగా మ్రోలఁ జే
ర్కొమ్మా రే పని యుంగరం బొసఁగి కాకుత్స్థుం డను న్వెండియున్. 58

ఉ. పల్లవపాణికి న్నిగులు వాయఁగ నాకతఁ జెప్పినప్పుడా
యల్లకబాధ నేతియుండు కాఱినయూర్పుల తావినీగురుం
డల్లనఁ దెచ్చుఁగాక మలయానిలుఁ డంతకు నీవు రావమా
చల్లనివార్తఁ గొంచు రభసంబున నోయి సమీరనందనా! 59

క. అని పలుక నంగదాదులు, వెనుకొన హనుమంతుఁ డపుడు విభుఁ డంపినయ
ప్పనిఁ బూని యడవిదిరుగుచు, మొనగొలువన్ దక్షిణాభిముఖుఁడై చనియెన్. 60

క. తరుచరవీరుఁడు రఘుశే, ఖరుఁ డిడురత్నాంగుళీయకముఁ గైకొని స
త్వరుఁడై చనియెన్ లంకా, పురిఁ గాల్పఁగ నిప్పు గొంచుఁ బోయెడుమాడ్కిన్.

వ. అంత నలబలంబులు నెలనెలవులం గ్రందుకొన నంగదహనుమదనుచరులై వనచరులు
చనిచని. 62

## వానరవీరు లెల్లెడల సీతను వెదకుట.

మ. చనుచోఁ గొండలఁ గానలన్ వెదకుచుం జాలింపుచున్ వేసరన్
బనిలే దంచుఁ గపుల్ గనుంగొనుచుఁ దప్పంగంటి మే మోకదా
యనుచుం జూచినచోటె చూచుచుఁ గరం బాలించి యేయుల్కుడే
న్వినుచుం జేరఁగఁబోయి వానరవరుల్ వింధ్యాటవీభూములన్. 63

తే. ఎక్కి పెక్కుతరుల నొక్కొక్కచిగురాకె, యెత్తి వెదకఁజొచ్చి రిగురుఁబోఁడి
దంతి తప్పి చనిన దొంతికుండలలోనఁ, జేయిపెట్టి వెదకఁ బోయినట్లు. 64

క. ఇటువలె వెదకియుఁ దమత్రి, ప్పట గురువిరహితుల మంత్రపఠనం బెటుల
ట్లటమటమై పోఁ జొచ్చినఁ, గటకటపడి యొక్కొకపుడు కపు లడియాసన్. 65

క. తల్లి మనరామచంద్రుని, యిల్లాలివు డుండవలదె యీపాదపాంతన్?
మల్లీవల్లికకడ నని, యెల్లరు నొకచోట నిలుతు రెంచుకొనంగన్. 66

సీ. ఉట్టిపడ్డట్టు లెందుండి వచ్చెఁ గడింది విలుదోయితో రాజవీరయుగము?
వచ్చెఁబో మనరాజు వారితోఁ గరువలి విందుసన్నిధి నెంత పొందువట్టెఁ?
బట్టెఁబో దాయాదివగ జగద్దుర్జయుం బొకయేటిలోన నెట్టుడిగిపోయెఁ
బోయెఁబో పోయినప్రొయాలిపోఁబడి వెదకిపెట్టుట యేల విహితమయ్యె

తే. నయ్యెఁ బో యంగదాదుల నంటఁ బట్టి, కాదవపడదయ్యె ననిపించుకొనఁగ వలదె?
యదన మనచేత సాఫల్య మొదవు టెన్నఁ, దుభయతారక మైనయాయుచితవిధికి. 67
వ. అని తలపోయుచు జనకతనయాన్వేషణపరాయణులై. 68
మత్తకోకిల. చొత్తురుం జొరరానిచోటులఁ జొచ్చి పుణ్యవశంబునన్
వత్తురుందిరుగంగ నీగతి వానరోత్తము లెత్తఱిన్
మెత్తఁబా టొకయింత లేక భ్రమింపఁగాఁ దమపాటు పే
రెత్తి పోవక శ్రీవశన్ ఫలియించుకాలము వచ్చినన్. 69

హనుమదాదు లుదధితీరముం జేరుట.

తరల. అదరిపా టొకచో జటాయువు నన్న యన్నియుఁ జెప్పినన్
బ్రదుకుజీవము కల్గెఁ గాఁ దలపట్టి చూచుకొనంగ మే
లెదురుగాఁ జనుదెంచెఁ బొమ్మని యెంచుకొంచు గమించి ర
య్యుదధియుత్తరతీరభూమికి నొక్కయుమ్మడి మొత్తమై. 70
మహాస్రగ్ధర. పవిధారాపాతభీతిప్రశమనకవచప్రాయమద్గాధివాసో
త్సవసంపన్నాటహాసోచ్ఛ్రయముఖరవియచ్చంక్రమోద్దండభూభృ
న్నివహాభ్రాంతిప్రదోద్యన్నినదభయదవేణీముఖోత్తుంగభంగా
ర్ణవగర్వాలోకనిర్విణ్ణ మగుకపిచమూనాథయూథంబులోడన్. 71
తే. అనిరొ నంగదుఁడిది కొండ మనలకొలఁదు, లరయ నొరగల్లు ప్రత్యక్షమయ్యెనిచట
బిల్లమెఱుములఁ బోదు కప్పించరాదు, దీని నేలాగునఁ దరింపఁ దీఱు మనకు? 72
వ. అని కడలికడ నిలిచి మఱియును. 73
క. జంభారి విసరి వైచిన, దంభోళికి తెక్కు యిచ్చి తఱఁగక మును సం
రంభించి చనియెఁ దా న, య్యంభోనిధి దాఁటునే విహంగమవిభుఁడున్. 74
చ. అది యటు లుండె నిం దొకమహాజవసత్త్వసమర్థుఁ డెవ్వఁడే
నిది తరియించి రావణునియిల్లు చొరంబడి సీత యున్నచో
టిది యని చూచి వచ్చి మనయిందఱియావలమోపు డించి యా
పద యనువారిరాశి కొకపారముఁ జూపునొకో తటాలునన్! 75
క. ఒడయనిపని యీడేఱిచి, యడియాలము చూప నోప మఁట మన మేలా
యడవుల ఫలమూలాదులు, చెడఁ దిననా? విఱుగ ద్రొక్కి చెట్లు చెఱచనా? 76
వ. అని పలికి నిరుత్తరులైన వానరవీరులం దేఱిమాచి వెండియు. 77
చ. అనుకొనఁగాక తా వలసినట్లని యున్నతలంపా! వీరులన్
వినరో బళా! బలాబలవివేక మొనర్పమి యెల్లఁ జేతఁగా

దనుటగదా యెఱింగితి నట్లైన నిఁకన్ ననుఁ జూడుఁ డబ్ధిలం
ఘన మన నెంత నా కనినఁ గ్రక్కున భల్లుకవల్లభుం డనున్. 78

క. దొరకుఁ బని చెప్పి కలిగిన, పరివారము చూచుచుండఁ బాల్పడునే ? యె
వ్వరు నేల యెంతపనికిన్, దురంధరుఁడు పవనసుతుఁడు తోఁడై యుండన్. 79

## జాంబవంతుఁడు హనుమంతుని నుగ్గడించుట.

చ. అని హనుమంతుదిక్కు మొగమై పవమానతనూజ! యేమయా
నినుఁ గపిమాత్రుఁ జేసికొని నీపని మాపయిఁ బెట్టియుండె దిం
తఁడె తనయానవాలు రఘునాయకుఁ డెవ్వరిచేతి కిచ్చెనో
మనతెగలోఁ దలంచికొనుమా యపు డన్నియుఁ గాన నయ్యెడున్. 80

క. నీసత్త్వము నీ వెఱుఁగవు, వానరపతి పొడమి పండువలె నుండఁగఁ జే
రాసం బిన్నప్పు డసా, యాసత యోజనశతత్రయం బెగరవఁటే? 81

## హనుమంతుఁడు సముద్రము దాఁటు మహేంద్రగిరి నెక్కుట.

తే. అనుచుఁ దను నింత గుఱిచేసి యనుసరించు, ప్రార్థనాగౌరవముతోడి పలుకు పలుక
విని సముత్సాహసంరంభవివశుఁ డగుచు, గాడ్పుదేవర గారాపుఁగన్నకొడుకు. 82

క. తనప్రాపు నచ్చి వచ్చిన, పెనుగపులకు సంతసంబు పెరుఁగన్ బెరిఁగెన్
వినుముట్టఁ గట్టె బిగియం, దనకాసియ వారిరాశి దాఁటెడు తెగువన్. 83

క. ఇటు నిశ్చయించి యపు డటు, నిటుఁ జూచి మహేంద్రశైల మెక్కిన లంకా
పుటభేదనంబు మీఁదికిఁ, బుట మెగయును వాయుసూతి పొమ్మని కదలెన్. 84

వ. కదలి యచ్చెరువనుండు కొండదండకుం బోయి యారోహణంబునకుం బ్రారంభించి. 85

చ. ఒకయడుగు గొక్కచక్క నిడి యూఁదినఁ దచ్చరణంబు నిర్ఝరో
దకములు ముంపునం దడియఁ దద్గిరి గోడివడంగ లేచి యొం
డొకయడుగ వ్వలన్ నిలువ నుండి యథాస్థితి నర్ఘ్యపాద్యపూ
ర్వకముగ రాఘవాప్తునకు వచ్చి యెదుర్కొనిపోయెనో యనన్. 86

వ. తదనంతరంబ. 87

## సముద్రలంఘనము.

సీ. అడుగు లొత్తినపట్లఁ బిడుగు మొత్తినయట్లు బహుమహోపలములు పగిలిపడఁగ
దోఁక త్రిప్పినపట్ల మూఁక విప్పినయట్లు బలుగాన లిలఁ గూలి బయలుగాఁగఁ
నేలఁ దట్టినపట్లఁ గోలఁ గొట్టినయట్లఁ గరికేసరాదులు గలఁగి పఱవ
రంతు చూపినపట్ల వంతు మోపినయట్లు గుహలు ప్రతిధ్వనుల్ గ్రమ్మరింపఁ
తే. గంపితధరాధరాధిత్యకాఝురీక, రంగఘుట లెట్లెడల నుప్పరంబు లెగసి

పడి తడిసి కార్యదాహవిభ్రాంతకపుల, యుల్లములతో దవాగ్నులఁ జల్లఁజేయ. 88

తే. ఒడలువడసినతమతండ్రి వడువు దోఁప, రయమునకుఁ గూటకోటులన్నియుఁ జలింపఁ
బెరిఁగి గిరి గాడ్పుకొడు కెక్కి తిరిగితిరిగి, యొక్కచో నిల్చి దక్షిణదిక్కుఁజూచి.

క. కటకట ధరణీకటితట, పట మనిపించుకొనఁ గన్న పారావారం
బిటు వచ్చి కుటిలదానవ, పుటభేదనవప్ర పరిఘ పోయనఁ దగెఁగా. 90

క. తగుఁగాక తాను దనలో, నిగురొత్తిన వీడు దాని నేలినవాఁడున్
జగదేకపతికి రఘుపతి, కగపడ కెటు పోఁగవచ్చు నని యున్ముఖుఁడై. 91

ఆ. గాడ్పువేల్పుపట్టి గట్టెక్కి యుంకునఁ, జూచె నూటి నేటిజోటిమగని
భావిసేతు వచ్చుపడ లంకకడకును, సూత్రపట్టుమాడ్కిఁ జూడ్కి వెలుఁగ. 92

మ. తనచూ పంబుధిమీఁదఁ జాఁచి శ్రవణద్వంద్వంబు రిక్కించి వం
చినచంచద్భుజముల్ సముత్కటకటీసీమంబులన్ బూన్చి తోఁ
క నభోవీథికిఁ బెంచి యంఘ్రు లిఱియంగాఁ బెట్టి బిట్టూఁది గ్ర
క్కున నక్కొండ యడంగఁ ద్రొక్కి పయికిం గుప్పించి లంఘించుచోన్. 93

క. గిరి గ్రుంగఁ ద్రొక్కి చెంగున, హరి నింగికి దాఁటుగొనిన హరిహరి యపు డా
హరి యెగసినట్లు దోఁచక, గిరి యెగసినయట్లు తోఁచెఁ గెళవులకెల్లన్. 94

క. గిరికార్ముకనిర్గతమై, హరిశర మపు డసురపురవరాభిముఖంబై
సురగరుడదురవలోక, త్వరతోఁ జనె నొకమహారవం బుదయింపన్. 95

క. వాలంబుఁ దానుఁ గరువలి, వేలుపుఁగొడు కరుగఁజూచి విపరీతగతిన్
దోల దొరఁకొనెనొ రవి యిటు, దేలం బెనుగాడితోడి తే రని రమరుల్. 96

క. పవనజజంఘాసంభవ, పవనము వడిఁ గదలిఁ బాయపడ నడఁచి మహా
వివరమునకుం జొరంబడి, పవనాశనకోటి నాశపఱిచి గమించెన్. 97

వ. అప్పుడు. 98

సీ. నగశిఖాశిల లెగసి గుభేలు రనఁ గూలి యాగామిసింధుబంధాభినయము
సమధురప్రసవగుచ్ఛము లుచ్చలితములై సతమఖకుమారనక్షత్రశంకఁ
బొడవంటుకొనఁ గొట్టువడి గొంతవడి హరుల్ శరదభ్రజాతసంజాతబుద్ధి
నుప్పరంబున లేచి యుందధివీచీపంక్తు లజలమేఘములకు సజలగుణముఁ

తే. జూప జంఝూసమీరంబు కోపు నెఱప, నిక్కఁదనముక్క దక్షిణ దిక్కుఁజూడఁ
గీలిశిఖవోలెఁ జాఁచిన కేలు లంకఁ, జంక నిడఁ జూచు పొంకంబు సంతరించె. 99

వ. వెండియుం. 100

సీ. రఘువరేణ్యక్రోధరసము లంకకు ముట్టఁ గ్రొవ్వారు కాలువ ద్రవ్వె ననఁగ

నాగామిసేతుబంధానురూపంబుగాఁ జేయుఁగుణావర్తమో యనఁగ
నవయశోవసనంబు లవని కర్పించి య చ్చెల్వ నల్లనివల్వఁ జించె ననఁగఁ
దనుఁ జూడ శేషుండు తలుపులు దెఱచిన బలిమందిరంబువాకిలియొ యనఁగ
తే. నొకనిమిషమాత్ర మప్పుడయ్యుదధినడుమ, నఱుకువడితోఁ జెనదరంటఁ జఱచిపఱచు
నలఘుజంఘాప్రభంజనంబులఁ దనర్చి, యాతఁడు వ్రాలెఁ ద్రికూటకూటాగ్రవీథి 101
వ. ఇవ్విధంబున నంబునిధి నిస్తరించి. 102

## హనుమంతుఁడు త్రికూటశిఖరంబుఁ జేరి లంకం జూచుట.

సీ. అగరుధూపపుఁబొగల్ బాగరారు కురులుగా నవగవాక్షము లీక్షణములుగాఁగఁ
జికిలివిటంకముల్ చెక్కుటద్దములుగా నగరిహజారంబు మొగముగాఁగ
నతులవీథిక లలంకృతభుజాలతలుగాఁ బ్రమదశైలము లురోజములుగాఁగ
దృశ్యశృంగాటకదీర్ఘికనాభిగాఁ బృథువప్రచక్రంబు పిఱుఁదు గాఁగఁ
తే. బికశుకీకేకిమధుకరప్రకరముఖర, వనవలయరేఖ బెళబెళ వలువ గాఁగ
రావణుని చెట్ట పట్టిన రాజ్యలక్ష్మి, కైపుఁ దోఁపించు లంకపొంకంబు గాంచి. 103
సీ. అదరుమంటలు గ్రక్కున ట్లున్న యదిగదా వప్రరత్నప్రభావళులచేత
నట్టహాసము చేయున ట్లున్నయదిగదా పటవాదికార్కటీపటిమచేత
నదటుమై గర్జించున ట్లున్నయదిగదా ప్రతిపతాకాంశుకాహతులచేత
సాహవగతి గాంచున ట్లున్నయదిగదా నగశిఖరారోహణంబుచేత
తే. దీనిఁ గనుఁగొన్న వేగంటి దేవరకును, వెచ్చనిట్టూర్పు పుక్కిట వెడలకున్నె?
ముకుటకంపంబు తడవుగా ముదురకున్నె?, పిడుగుటడిదంబు చేవిడి పడకయున్నె?
వ. అనుచు నయ్యసురపరివృఢపురవరసౌభాగ్యంబు నగ్గించి జనకతనయాన్వేషణమనీ
షాయత్తచిత్తుండై కరువలికొడుకు నిరపాయంబుగాఁ దగిన యుపాయంబులెల్ల నుల్లం
బున వల్లించి. 105
క. ఇది వేళ గాదు చొరఁబడి, వెదకఁగ నని యున్నయతని వెరవు త్రిలోకా
భ్యుదయాంకురార్పణం బీ, కదలిక యీడేర్తు నన్నగతి రవి గ్రుంకెన్. 106
తే. అంతఁ బడమట నెఱసంజయామ్రుకవిసె, నలిని కనుమూసెఁ దుమ్మెద కలువకరిగెఁ
బులుఁ గిరవు చేరె మొఱఁగుడుఁబురువు వెలిఁగెఁ, బెంటి నెడఁబాసి జక్కవయొంటిఁ దిరిగె.
ఉత్సా. చుక్క త్రొక్కుఁ డెక్కుడైన సుడివడంగఁ దోఁడఁగె న
మ్మక్క! నింగిపాడి యనంగ నవ్వు డిరులు నెఱసెఁ బో
యొక్కడెక్కడని వియోగిహృదయతాపదవహవి
ర్భుక్కులానుమానజనకరూప మై దురాపమై. 108

## హనుమంతుఁడు చంద్రోదయవేళ లంకఁజొచ్చుట.

క. అంత హనుమంతుఁ డంతట, సంతమసము దీఱె నిదియె చా టని యొకటే
గంతున లంకానగరా, భ్యంతరమున వ్రాలి యుచిత మగువేషమునన్. 109

లయగ్రాహి. వీదులను గన్మఱువు వేదుల మరుత్తరులపాదుల సరోవరతటాదుల మణిప్రా
సాదములఁ గేలి గిరిపాదములఁ దద్గతపయోదముల బంధుగృహభేదములఁ గాంచెన్
మోదములతోఁ గలహఖేదములతో సరసవాదములతో హితవినోదములతో నా
నాదనుజదంపతుల శ్రీ దనుకుపట్టఁ బిక, నాదనుడు గెంచఁ గనరా దనుచుఁ బోంచెన్.

వ. తదనంతరంబ. 111

క. బలురక్కసు లెత్తినక, త్తులతో దీవియలు బలియ దుందుభు లులియన్
వెలిఁ బ్రహరి దిరుగు నెల్లరఁ, జులకఁగఁ గిఖరించి నగరు చొచ్చి కడంకన్. 112

## రావణాంతఃపురప్రవేశము.

క. పులియున్నపొదనె పన్నగ, బిల మ య్యమరారిపడకపెనుమేడ చొరన్
దలఁకక చని యెల్లెడలన్, వెలఁదులు మధువాని పొరలువెతఁ కనుఁగొనుచున్. 113

సీ. మణిమయస్తంభకుంభద్దీపకళికలు వేనవే లిరువంక వెలుఁగుచుండఁ
జెలులఁ జేపడిన జేజేరాణివాసంబు లలఁతి నిద్దురలతో నడుగులొత్తఁ
గడెఁదిఱొమ్మునఁ గాయకాచినచౌదంతి కొమ్ము దాఁకినజీర యెమ్మె నెఱపఁ
బదిచెంపకొప్పులఁ బారిజాతంపుఁగ్రొవ్విరిదండ నెత్తావి సిరుల నీన

తే. నొక్కమహనీయశయ్యపై నొడలు మఱచి, నిదురవోయెడునుద్దైతేయభిదురపాణిఁ
జూచి తలయూఁచియీరాజ్యసుఖమితండు, చెఱుచుకొనెఁ గాకమనమున నెఱుకలేక.

చ. సమదపురందరద్విపనిశాతవిషాణముఖక్షతవ్రణాం
కము లిగురొత్తుపేరురపుఁగందువ యన్యవధూకుచాగ్రకుం
కుమరసరక్తమై మెఱయఁ గూర్కఁగ నిట్లనె యొమ్ముపోటులన్
సమయుం నీఁక న్నిశాచరపిశాచము రాముని చే రణంబునన్. 115

క. భావిదశాననహానికి, లో వగచుచుఁ గుంది యిందులో నుండునె య
ద్దేవి గుణాభరణ జగ, త్పావనచారిత్ర? యనుచుఁ బావని మఱియున్. 116

## హనుమంతుఁడు సీతం గానక చింతిల్లుట.

క. మెచ్చుగ నంబుధి దాఁటితిఁ, జొచ్చితి నివ్వీడు గలయ శోధించితి నిం
దిచ్చోటచ్చోటన కిపు, డెచ్చోటం జెలువఁగాన నిది యేమియొకో! 117

ఉ. భూమిజఁ గాన కే మగిడిపోయిన నేమని చూచువాఁడ నా
రాముని నెమ్మొగంబు మదిఁ బ్రత్యుపకారము నేయఁ గోరు శా

ఖామృగభర్తృనిక యిఁకం దుది నేమగుసీతయునిక్క? ము
న్నాముదిపుల్గు చెప్పుట నిరర్థకమే విధి నేమనం గలన్? 118

తే. అందఱు వినంగ సంపాతి యాడినట్టి, మాట ప్రామాణికము గాని మాయగాదు
చేరి రఘువీరుఁ గొల్చినవారి కెచటఁ, జేటు లే దింక నొకపని సేయవలయు. 119

ఉ. చూచుట లే దశోకవనిఁ జొచ్చి యటుం జని చూడఁగాఁ గదా
యాచపలాక్షి మజ్జనని యచ్చట నుండినయేని లెస్స లే
దా చతురాననుండు మొదలైనసుపర్వు లెఱుంగఁ జిచ్చులో
వైచెదఁగాక యీయొడలు వానరవీరుల మ్రోల వైతునే? 120

క. ఆవేళనైన వచ్చెద, యావతి జానకి ప్రసన్నయై తోఁచి ననుం
బావకశిఖలకుఁ గడగా, దీవించుంగాక యని మదిన్ నిశ్చలుఁడై. 121

## అశోకవనీప్రవేశము.

క. అనగరు వెడలి యొకకే, ళీనగకూటాగ్ర మెక్కి లీలాగతి సం
ధానముగఁ జౌకళించెన్, వానరవీరుం డశోకవనిలోపలికిన్. 122

వ. అంత. 123

చ. కుముదవనంబు కోరిక చకోరిక పండుగ భోగభాగధే
యము ననవిల్తుకాఁక కడియాలము చీఁకటిమొట్టుకొల్వు పు
న్నమకోకవన్నె చేకుఱ నొనర్చినయొప్పులకుప్ప యామినీ
రమణుఁడు దోఁచె నొయ్యనఁ గరంబులు చాఁచి దిశాముఖంబులన్. 124

క. వెన్నెలలు గాసె జక్కవ, కన్నులఁ బెన్నీరు వెడలఁగా నెలరాలన్
జెన్నీరు వెడలఁ గాఁతెన్, గన్నియకున్ జలకమాడఁ గలిగె ననంగన్. 125

## హనుమంతుఁ డశోకవనిలో సీతను వెదకుట.

వ. అప్పు డయ్యనిలతనయుం డశోకవనిం గలయం గనుంగొనుతలంపున. 126

చ. భుగభుగతావు లుప్పతిలఁ బూచినతీవలు చక్కనొత్తి క్రొం
బగడపుఁబట్టెలంగడకుఁ బన్నినకన్నుల దళ్కుఁ గెంపుతా
బోగడవెలుంగులం బొలిచిపోవఁగఁ ద్రోవఁ గనంగఁ జేయఁగా
నిగనిగలీనుచుందనపు నేలలవీథులు చొచ్చి చూచుచున్. 127

సీ. నలువంకశోభనంబులతోడ మిన్నంది కొమరారుసీలంపుతమగ మైన
నాలుగువాకిళ్ల నలువంద వేడుకల్ సవరించుముత్యాలచవిక యైనఁ
బోడవెన్నెలల నంచపడఁతి జీరుకవారు బదనొందు నెలతాలబావి యైన
మాయావిరచిత మై మణిమయం బై తోఁచు గోడకంబము లేని మేడ యైనఁ

తే. గలిగియో వెలుంగుశృంగాటకములఁ గాంచి, గారుడోపలముల నొప్పుకప్పురంపు
టిసుకతిప్పలఁ బన్నీటియేటిపాయ, నెసఁగుసౌభాగ్యములఁ జూచియొగువఁజనుచు.
వ. ఒక్కవిమలప్రదేశంబున. 129
సీ. ఘూకకుటుంబినీకోటిలో నడిరేయి జక్కవజవరాలు చిక్కినట్లు
జరఠబిడాలికాజాలంబులోపలఁ జిలుకముత్తైదువ మెలఁగినట్లు
మత్తశిఖండినీమాలికలోపలఁ బాఁపకన్నియ దగుల్పడినయట్లు
కితవమృగాదనగృహిణీగణంబులో లేడియిల్లా లుమ్మలించినట్లు
తే. వేషభీషణదానవవనితలలోనఁ, దల్లడంబులఁ బెదవులు దడపుచున్న
సాధ్విరఘువీరగేహినిఁ జక్కఁజూచి, యవునొ కాదొ కదా యని యనిలసుతుఁడు.
క. పలుకులవలనం జేష్టిత, ములవలనన్ నిశ్చయంబు పుట్ట సమీప
స్థలిఁ బొంచి తెలియఁదగు నని, తలచుచు నొకచక్కి నున్నతఱి జానకియున్. 131
చ. వెత వెడలంగఁ బోసికొన వేఱొకనెచ్చెలిఁ గానమిన్ దిశా
వతులకు నంతయుం దెలియఁ జాటుటకై గమకించునో సుమీ
యతివ! యనన్ గళంబునకు సానినయేడ్పునఁ గెంపుమోవి గం
పితముగ నాల్గువంకలును బెగ్గలి చూచుచునుండి వెండియున్. 132
ఆ. వల్లభుండురాక కెల్లప్పుడును దన, యుల్ల మెదురుచూచు చుండుకతన
గాలిఁ గసవుకట్ట గదలినఁ గనువిచ్చి, దీనవీక్షణములఁ దేఱి చూచు. 133
వ. వెండియుఁ. 134
చ. పొలుపు నలంగి పువ్వు లుడివోయినతీవయుఁబోలి యున్నమే
నలయ భరింపలేక తనప్రాణములన్ వెడలించురీతి నూ
ర్పులు వెలిదార్చుచుం బలలభుక్స్త్రీయావహధూమకేతువుం
బలె జడకట్టినట్టికచభారము వెన్నున వ్రేల పండురున్. 135
ఆ. వాఁడుఁగన్నుఁగవయుం వలిచన్నుఁగవయునే, కాని యొండురూపు గానరాక
యిగురుఁబోఁడి యుండె నిఁకఁ జిక్కినయవస్థ, చెప్ప నేల? విధిని దప్ప నేల? 136
వ. ఇత్తెఱంగున నుత్తలపడుచున్నసమయంబున. 137

## రాక్షసస్త్రీలు సీతతో దుర్వాక్యము లాడుట.

చ. మొగములు రాఁజఁగా ముడుతముక్కులఁ గోరపుఁగోఱలం బొగల్
దగులఁగఁ బల్లజుంజురుఁదలల్ గదలింపుచు నావులింతతో
నగమునగంబు హుంకృతిగఁ జాఁపుచు నొక్కొకమాటవెంట నా
లుగునయిదున్ వికారపుటెలుంగులు పుట్టఁగ నాఁడుదయ్యమున్. 138

చ. పలుకఁదొడంగి రప్పడమిపట్టిఁ గనుంగొని నీ కిదేటికిం
జలమునఁ జాన నీమగనిసత్త్వ మీపొలిమేరఁ జొచ్చి రాఁ
గల దని చూచితో ఖరుఁడు గాఁ డటు గూలఁబడంగఁ శంకరో
జ్జ్వలరజతాచలోత్థనవశాతశిఖోన్నఖరుండు మానినీ! 139

క. ఓవెఱ్ఱిరాచకూఁతుర!, యావెన్నెలమెకము ద్రిప్పి యటు మరవె నినున్
దా వలచి కాదె యిఁక ర, ఘోవల్లభుమనసు చెఱిచికొని చెడనేలా? 140

క. అవివేక ముడిగి దైత్య, ప్రవరునియంతిపురమునకుఁ బద మనుచున్ దా
నవురాండ్రు వలుకుపలుకుల్, చెవిఁ దాఁకి చుఱుక్కు మనినఁ జిత్తం బొఱలన్. 141

ఆ. అడలు నిలుపలేక యాయమ్మ వాయెత్తి, దుఃఖపడఁ దొడంగెఁ దోఁటలోన
యేడ్పుటెలుఁగుచెంత కెలయించి కోయిల, కొదమ తలిరుఁబోండ్లఁ గూడఁబెట్టె. 142

హనుమంతుఁడు సీతం గాంచుట.

ఉ. అప్పుడు నిశ్చయించి జనకాత్మజ యౌ నని వానరుం డనుం
డిప్పుడుగా ఫలించెఁ బనియెల్ల ననున్ ఫలపుష్పశీధువుల్
చిప్పిలఁ జెట్టుచెట్టునకుఁ జివ్వనఁ జివ్వన దాఁటు వాలముం
ద్రిప్పుచు నాడుఁ బేరెములు ద్రిమ్మరుఁ గొమ్మలవ్రేలుఁ గ్రమ్మఱన్. 143

రావణుఁడు సీతకడ కేతెంచి దురుక్తు లాడుట.

మ. మనువంశప్రభుదేవిపాటు పరికింపం డాయమం జూడఁ గ
ల్గినసంతోసమె కాని యీగతి నిజక్రీడల్ పచారింపుచో
దనుజాధీశుఁడు వేయిదీవియలతో ధర్మేతరస్త్రీతితో
వనితల్ పట్టినపైఁడిపల్లకిపయిన్ వచ్చెన్ నిశీథంబునన్. 144

వ. అంత. 145

క. హనుమంతుం డితఁ డేమని, వనితారత్నంబుతోడ వదరునొ నేనున్
వినియెదఁగా కని యొకమఱుఁ, గున నుండెన్ దనుజనాయకుఁడు నాలోసన్. 146

ఉ. వేల్లదహోనినాదములు వేత్రధరావిసరం బొసంగఁగాఁ
బల్లకి డిగ్గి దివ్యమణిపాదుక లంఘ్రుల మెట్టి యప్సరః
పల్లవపాణు లిర్వు రిరుపార్శ్వములం దనయూఁతగా జగ
ద్వల్లభుదేవిమ్రోల నిలువంబడి పల్కెఁ బ్రమత్తచిత్తుఁడై. 147

క. ఎలనవ్వులతో జంకెన, మొలకలతోఁ జూపుఁగొనలు మొనయఁగ నీవే
నెలఁతా! నాపయిఁ బసుమరు, బలుదూపులఁ దునుమఁగాని ప్రతిబాణమ్ములై. 148

చ. వెడవిలుకాఁడు నెమ్మనము వేమఱు గేదఁగిఱేకువంకిణిన్

బోడువఁగ మేను పానుపునఁ బొందక ని న్నభయప్రదాన మే
నడిగెద నంచు రాఁ గఠినమై యిటు వెన్నెలవేఁడి వెన్కొనన్
గొడుగులనీడ వచ్చితిఁ జకోరవిలోచన! యేమిచెప్పుదున్? 149
ఆ. చలము దనకుఁ జెల్లి జాబిల్లి యంచునం, బెట్టి మిగుల వాఁడి పుట్ట నూఱి
నల్లగలువతూపు నాపైఁ బ్రయోగించి,చించె మరుఁడు ధైర్యకంచుకంబు. 150
క. ఎంతటిపౌరుషవంతులు, నింతులకుం బంతమీఁగి యొగ్గని మతులం
జింతింప రగుట నోయలి, కుంతల! నిన్నింత వేఁడుకొనఁగా వలసెన్. 151
క. జడలు ధరియించి యడవుల, నిడుమలఁ బడి కాయగసరులే మెసవెడు పెన్
బడుగు నినుఁ గవయఁ దగునా?, విడువిడు నీకేల పట్టె వెఱ్ఱి లతాంగీ! 152
ఉ. అక్కఱ దోఁప నీ వతనియోదల కేలున నంటి యోజడల్
చిక్కులువాయ దువ్వి కయిచేసెదవే? యటు సేయఁబోయినన్
మొక్కలువోవె నీచిలుకముక్కులవంటినఖాంకురంబు? లా
దిక్కున నీవినోదములఁ జేలిద నంచుఁ దలంచితే చెలీ! 153
వ. అదియునుంగాక యతండు బ్రతుక నెవ్వరుపూఁట పాటలగంధీ! యాకర్ణింపుము.
క. చక్కిరవిలుకాఁ డొకఁ డే, నొక్కఁ డఁ దద్వైరులము వియోగవ్యథచే
నక్కడన బొలియుఁ బొలియక, యిక్కడ గని వచ్చె నేని యిక్కడఁ బొలియున్.
తే. మగువ! నీ వింక రాముని మాట మఱవు, తీవ్ర మిదియేల నీకుఁ బతివ్రతంబు?
వచ్చి మందోదరీచంద్రవదన చేతఁ, బనులు సేయించుకొన నీకు మనసు రాదె? 156
క. పదపద దశముఖదేవీ, పదవికి నింద్రాదిదివిజపాలకు లిఁక నీ
ముదల న్నిజరాజ్యరమా, పదవుల మనఁ దలఁచినారు పల్లవపాణీ! 157
పంచచామరము.—బలారిదంతిదంతకుంతభంగ కారిసాయక
స్థలం బలంకరించవే యచంచలాంచలస్థితిన్
గులాచలోజ్జ్వలత్తటంబు గూర్చి కల్పవల్లియున్
బలెన్ జెలీ! యటంచుఁ గించుఁ బల్కులాడఁ జొచ్చినన్. 158

## సీతాదేవి రావణునకు నీతి బోధించుట.

క. సీతాపురంధ్రి తృణ మొక, చేతం బట్టుకొని పల్కె శిర మెత్తక శో
కాతిశయ ముడిపి రఘుపతిఁ, జేతోగతి నిలుపుకొని వశీకృతధృతియై. 159
శా. అన్నా! నీవు పులస్త్యవంశమణివై యాఖండలాదుల్ బళీ!
యౌన్నత్యం బిదిరా! యనన్ బ్రతికి నీ వయ్యో! యిదేమీ యవి
చ్ఛిన్నప్రాభవనాశహేతువు పరస్త్రీకాంక్ష చాలింపు మిం

తన్నన్నేలినవాఁడు రాముఁ డితరుల్ నాకుం దనూసంభవుల్. 160

క. ననుఁ జేతఁ జూడఁ జెల్లదు, నినుఁజేసిన బ్రహ్మకైన నిక్కువ మిది యీ
యనుచితపునడక నాయము, కొనసాఁగమి నెందు నీకుఁ గొఱగాదంటిన్. 161

వ. అది యట్లుండె వడిఁ గలవాఁడ ననుకొంటివిగదా యాకర్ణింపుము. 162

ఉ. కానక యుండఁ దెచ్చితివి గాని యిట న్ననుఁ దెచ్చువేళ రా
మానుజు లైన నొక్కనిమిషార్ధము మారొక్కని నిల్వవైతిగా
కానఁగవచ్చు నీకదనకర్మము చౌర్యమె నీదు శౌర్య మా
నా! నిఁక నిన్ను నీవ కొనియాడఁదగున్ గ్రతుభుగ్భయంకరా! 163

ఉ. ఈవెడమాయ లేమిటని? యీచెడుఁద్రోవ యిదేల రావణా?
రావణ! యిప్పుడైన రఘురామునిముందఱ నన్నుఁ బెట్టి వా
చావినయంబె చాలు మణిసంధులఁ గేలిడి నిల్వఁ గాచు ని
న్నావసుధేశమౌళికి దయారసశీతలముల్ కటాక్షముల్. 164

తే. బ్రతుకుదెరువిది నీకు నీబద్ధవైర, ముడిగి నామాట విను వినకుంటివేని
వెనుక రఘువీరచాపమౌర్వీరవంబు, శ్రవణకటువది వినలేవు చలము వలదు. 165

మ. ప్రతిబాణప్రకరంబులన్ నిజముఖప్రాదుర్భవద్దుర్భరా
ద్భుతకీలాపటలాహుతిన్ సురసురం బోఁ బెట్టుచుం జానకీ
పతి బాణంబులు ముంచెనేని శలభప్రాయుండ వీవేమి చూ
చితి! లంకాపురమున్ నిమేషమున భస్మీభూత మౌఁ జెప్పితిన్. 166

ఉ. కుత్తుక లెండియున్నయవి ఘోరముఖంబుల రామమేదినీ
భృత్తిలకంబుతూణములఁ బెట్టినతూపులు ప్రాతిభట్యసం
పత్తియ పుట్టినన్ గఱచిపట్టి దురంబున నీయురంబు క్రొ
న్నెత్తురువార పట్టు నిది నిక్కువ మింతకుఁ దాళఁజాలుదే? 167

రావణుఁడు సీతం జంప నుంకించుట.

క. అనినన్ విని తన యిరువది, కనుగ్రుడ్లన్ నిప్పు లురులఁగాఁ ద్రిప్పుచు న
జ్జనకనృపాలాత్మజపై, ననిమిషరిపుఁ డపుడ చంప నలిగియుం నచటన్. 168

తే. ఎత్తివచ్చిన దేవేంద్రుఁ డెక్కినట్టి, మత్తకరిమీఁద నెత్తినరిత్తకేలు
చెంగటనె నవ్వఁగా నీకృశాంగిమీఁద, నెత్తిన నదేల నిగుడు నాకత్తికేలు? 169

క. మగసింగం బితఁ డనఁదగి, దిగిభమదోద్దండగండదృఢమస్తకముల్
వగులం బొడిచినపిడికిట, మగువకుఁగా వాఁడివా లమర్చిన నగరే? 170

క. అని యచ్చటిపైశావలి, పెనురక్కెస వక్రరాంద్రుఁ బిలిచి తినుం డి

వ్వనిత నీకు రెండునెలలగు, దనుకం జూచి యని చెప్పి దైత్యుఁడు వోయెన్. 171

త్రిజట సీతను బెదరించు రాక్షసస్త్రీల వారించుట.

ఉ. పోయినపిమ్మటన్ జనకపుత్త్రి నదల్పులఁ గక్కసింపఁగాఁ
బోయెడిరాక్షసీనిచయముం గని క్రమ్మఱఁ బిల్చి రాఘవ
ప్రేయసికై దశాననునిపై రడఁగం గలఁ గంటిఁ బోకుఁడీ
యాయమ త్రోవనంచుఁ ద్రిజటాహ్వయదానవి మాన్చెఁ దత్త్వరన్. 172

సీత చింతించుట.

వ. అప్పు డప్పుడమిపడఁతి గారాపుఁగూఁతు రంతవడియుం వెడలకుండం గట్టినకన్నీటికిన్ గాలువలు దిద్ది యాహా! రఘువర! నీయమ్ములకుం గన్నులు గలవు గదా యెందు చని యేఁ గర్జంబిడేర్చుకొని రాఁజాల వవి గలిగియుం లంక నిరంకుశజ్వాలాలీఢర్గాం నీఱు గాకుండుటకు నుచితవాహనారూఢ నై యేను దేవరం జేరకుండుటకు వెఱఁగయ్యెడుఁ దూణీరంబులు రిత్తలయ్యెనే? లేక యివ్విచారంబు పుట్టదో? యెట్టు పట్టుదుఁ బ్రాణంబుల నని వెండియు. 173

క. తనవారికి మాసద్వయ, మని గడువిడెఁ గాని దానవాధముఁ డిపుడే
తినుమని సెలవిచ్చిన గొ, బ్బున నా కితోడునుమాలి పోవచ్చుఁ గదా. 174

క. అని వగలఁ బొగులఁ ద్రిజటా, దనుజాంగనకన్నుకలకుఁ దగఁ దనకున్ డా
కనుఁదమ్మి యదరఁగా నిది, యంనుఁ జూచెదనని యొకింత యూఱడి యుండెన్.

ఉ. అప్పుడు వేళ గాఁ దెలిసి యచ్చెరువారఁగ మోడ్పుఁగేలుతో
గుప్పున మ్రోల వ్రాల రఘుకుంజరునేమపువార్త మున్నుగాఁ
జెప్పి తదంగుళీయకము చేతికి నిచ్చి సమీరనందనుం
డప్పుఁడుపోఁడి కాత్మ వినయానుగుణంబుగ మ్రొక్కి నిల్చినన్. 176

క. ఆయుంగరంబు గనుఁగొని, తోయజముఖి మోహమూర్ఛఁ దూఁగొని యుండెన్
గాయము నిపతితలతికా, ప్రాయముగాఁ గొంతవడి ధరాభాగమునన్. 177

వ. అంతటం దెలిసి కూర్చుండి. 178

క. తనశిరముమీఁద నిడుకొనుఁ, గనుఁగవ నద్దికొనుఁ జల్లకన్నీటం దోఁ
చు నెద ననుచు నమ్ముద్రిక, మనసునఁ దనప్రాణవిభునిమాఱుగఁ దలఁచున్. 179

సీ. కెంగేల నిడి కోమలాంగుళీభూర్త్మతోయంబున నభిషేక మాచరించి
నగవార వికసించుమొగముపై జిగిపేరి లలితనూతనదుకూలంబు చాది
గ్రక్కున నవతటిత్కళికలు గైకొన్న పువ్వారుచూపులఁ బూజ చేసి
సహజమాధుర్య మైసంభవించిన ప్రణయరసంపుటమ్ముతోపహార మిచ్చి

ఆ. ప్రాణవిభుఁడు రామభద్రుండు శ్రీహస్త, మున ధరించునట్టిముద్దుటుంగ
రమున కివ్విధమున సముచితభంగుల, నుపచరించె నప్పయోజగంధి. 180

వ. అప్పు డప్పావని యావనీదేశంబున నప్పులలాశినీజలాంబులోన దురవస్థలం బొరయుచున్నయన్నెలప్రోయాలిచూలిపాటు గీటునంబుత్తు నేఁటితోనని లంకపైనపుడు గఱచుచున్నట్లుండె నప్పురంధ్రియుం జెప్పార్పక యమ్ముద్రికనిరీక్షింపుచుండెనాలోన.

ఉ. ఉగ్రధనుర్విభేదనున కోమణిముద్రిక! నీవు నేనుఁ బా
ణిగ్రహణం బొనర్చి కరుణించుటకుం దగియున్నయుంక్కి య
వ్యగ్రమతిం దలంచికొని ప్రాణసఖి న్ననుఁ బాఱుపైవ క
త్యుగ్రవిపద్దశ న్నొగిలి యున్నదిగా యని చూడ వచ్చితే? 182

ఉ. ఈమణికాంతిచేత నిరు లెచ్చటికో చనఁ జేసి నీవు గా
వా మును రేలునుం బయట పైతువు నీవికి నెగ్గు నేయుం శ్రీ
రామునిమ్రోల నా కలుక రా నటులం బ్రతికూల వయ్యె నా
హా! మఱి నేఁడు నాకయిలి వాపద వచ్చినవేళ ముద్రికా! 183

క. ఆకరుణాజలరాశికిఁ, నీకుం దగు నూర్మికా! గణింపఁగ సాకున్
నీకతనఁగదా యిప్పుడు, శోకానల మాఱి చలువ చొప్పడె మదికిన్. 184

క. ననుఁ బాసి దూరమున, జిక్కినయినకులుఁడ్రేల నుండ కిటు వచ్చితే? యా
యన నలఁకువ దినదినమున్, గనుఁగొనఁగాలేక ముద్రికా! నను వెదకన్. 185

తే. హారమంజీరవలయకేయూరకుండ, లాదులివియుండఁగా నేమి యడవులకును
గరమనుసరించివచ్చి నీకరణి విభుని, యొద్దనుండనె యోముద్దుటుంగరంబ! 186

తే. విశ్వలోకేశ్వరుఁడు రఘువీరుఁ డిట్లు, పనికి పత్తువటంచుఁ జేపట్టినపుడ
భూషణంబులు తలద్రొక్కి పూజఁ గొంటి, చాలదే యోయలంకారచక్రవర్తి! 187

తరల. అనవరోధునిఁ మునివిరోధిని నవ్విరాధునిఁ గూల్చి వే
చనునెడం జనకావనీవరచక్రవర్తియనుంగున
ల్లునికరాగ్రము వెంటఁ జిందెడులోహితాంబులవంబులో
యని భవన్మణిరోచు లొల్కుఁ గదా తదాశ్రితముద్రికా! 188

క. ఘోర విరోధుని గొని రఘు, వీరుఁడు కర మూఁచికొనుచు వేంచేయఁగ నా
డీరత్నరుచి నవాసృ, గ్ధార వడసినట్లు తెరువుకడకుం బడుఁగా. 189

తే. పలలభుక్ప్రాణపవమానపారణాప, రాయణం బైన రామదోర్దండఫణికి
గరళవైశ్వానరజ్వాల గాదె నీదు, ప్రాంతమాణిక్యమున విడివడిన డాలు? 190

క. ఈజాలికెంపుశే లుట, జాజిరజ్వాజ్వల్యమాన మగుఖిపినవిశ

ల్యాజాలజన్యకిరణస, మాజముతో మాఱుమలయము మాన్పెఁడుగదా! 191

ఉ. మాయలలేడి నామదికి మక్కువఁ గొల్పినఁ దెచ్చి పెట్ట రా
దా యని రాము నంపితిఁ గదా యెడ దవ్వయి పోవ నప్పుడున్
బాయక ముద్రికా! సుకృతపాకముచే సులభానుబంధవై
యాయనచెట్ట పట్టుకొని యక్కఱతోఁ జన నీకుఁ గల్గెఁగా. 192

క. తెరువున జఘనపయోధర, భరమున నడుఁ గలసి యుడుఁగఁ బతియూఁతగ నే
కర మిచ్చు నాకు నవ్వలి, కరమది నీకాణయాచిగా యుంగరమా! 193

సీ. మొగము ద్రిప్పిన వేగమునఁ జెక్కుపైఁ జిందు శ్రవణకైరవధూళి చక్కఁదుడిచి
దిగువుజెప్పముసుంగు దీయనికనుదోయి కలితలీలాహల్లకమున నొత్తి
చిఱునవ్వుతమకంబు చెల్లఁబెట్టని మోవి కడిఁదిప్రాఁదెలనాకుమడు పొసంగి
పానుపు డిగఁబోయి బడలికఁ బొరసిన యడుగుదమ్ములనొప్పి యాఱ నంటి

తే. యినకులస్వామి కరమునన్నునయించు, పలుకులకమున్న తాన నాయలుకదీర్చు
నెప్పుడప్పుడ యెఱుఁగవే చెప్పవేమి?,యూర్మికా! యిపు డెటువలె నున్నయదియొ?

చ. చిటికెనవ్రేలిగోరునకు నేచు మెకి? తాఁ గయినేయుఁ గావునన్
జిటిపొటిముచ్చటల్ దనుకఁ జెక్కులకుం గలవేదిప్రొద్దు తొ
ల్లిటివి దలంచుకొన్నె? లవలీదళసీమల వ్రాయఁ జొచ్చెనో
కటకట! ముద్రికా! మకరికాలత లిప్పుడు పువ్వుదేనియన్? 195

క. అడిగితి నసెన్నో నన్నని, వడి మూర్ఛిలి కొంతవడికి వైదేహి కడుం
బొడవులుగా నొనరించిన, తడికన్నులు దెఱచి చూచి తనమదిలోనన్. 196

## సీత హనుమంతుఁ గని సంశయించి ప్రశ్నించుట.

తే. పోయి దశకంఠు డిది యొక్కమాయ పన్ని,పనిచెనో నన్ను నిర్బంధపఱుపననుచుఁ
జాల నమ్మిక పుట్టక మ్రోల నున్న, వినయసంపన్నుఁ బవమానతనయుఁ జూచి. 197

సీ. అయ్య! నీనామధేయం బేమి? యెప్పుడు వెనుకకు మీ కుండువిషయ మెద్ది?
యినవంశమణియొద్ద నెవ్వారిసరబడిఁ గొలువుపట్టితి? వెందు నిలిచియున్న
వారు రాఘవులు? తద్వర్ణచిహ్నంబులు తెలియునే యెటుల నేతెంచితిటకు?
జలధి యడ్డముగానిసులభమార్గ మెకండు కలిగెనో తావకాగమనమునకు?

తే. ననినఁ దనతోడ వేర్వేఱ నతఁడు దెలుప, డిందుపడి జడలోఁ రత్నమిందమనుచు
నిచ్చి తెలతెలవారఁగ వచ్చె గెలువు,మనిలజా! యంచు దీవించి యనుపుటయును.

## అశోకవనికాభంజనము.

క. తల్లీ! నిను వెలిపించుచు, విల్లే రత్తించుకొనెడు వెలిబొమ్మల నీ

కల్లరినీ రక్కసిజంతల, త్రుళ్లడఁతునొకో వనము వెరుకుదునె మొదలగదా! 199

వ. అని మిన్నుముట్టఁ బెరికిన నోమహాబలనందన! వీరు నీయిప్పటియాకారంబునకు వెఱచి సామజుంగునకు వచ్చుచున్నవారు వీరిపై నలుగక యిది యొకటి మన్నించు మనియద్దేవి యానతిచ్చిన మహాప్రసాదం బని యద్దానవీనికరంబు త్రోవఁ బోవక వనంబునకరిగి యావానరవీరుండు. 200

సీ. విఱిచి లీలాశైలవిధుకాంతకూటముల్ క్రీడాసరస్సులఁ బూడవైచి
కలకలనవ్వుమేడలు పాడుగాఁ ద్రవ్వి శృంగాటకంబులు చిన్నఁబుచ్చి
కేతకీమందారకేసరాదులఁ దన్ని కెడపి వీథులనెల్ల దడుకువొడిచి
పువ్వారుఁదీఁగెమోపులు కాలువలఁ ద్రొక్కి ప్రవహించుపన్నీరు పసరు చేసి
ఆ. మాలకరులఁ దోఁటనేలలోఁ బూడిచి, వెలిఁ దదీయరక్షకుల వధించి
ఘోరభంగిఁ దోరణారూఢుఁడై యార్చె, గగన మగల జగము దిగులుపడఁగ. 201

క. అనినదము విని యపుడు ద, శాననుఁ డిది యేమి తెలియుండాఁ యనిన వెసన్
దానవు లొకకొందఱు చని, వానరపరువార్త దెలిసి వచ్చి యతనితోన్. 202

తే. దేవ యొకవానరంబు లీలావనంబు, నేలమట్టంబు చేసి యాఖిలవాల
మూఁచియాఁ దెఁచుదనుఁజూచి దిక్కుఁచవాఱు, రక్కసులనొక్కితోరణంబెక్కినగుచు.

క. అనవుఁడు నతఁ డేవురువా, హినిధవుల మంత్రిసుతుల నేడుగురిం బోం
డని పంపెఁ బంపుటయుం వా, రనేకబలములు భజింప నరుదెంచి వెసన్. 204

వ. ప్రొద్దు కరకరం బొడిచి రాఁగాఁ బరాక్రమపరిపాకజాగరూకప్రతిభానుండై ప్రతి
భానుండునుంబోలెఁ బవనసూనుండు తోరణాగ్రంబున నుండం గనుంగొని. 205

హనుమంతుఁ డనేకరాక్షసులఁ జంపుట.

శా. ఆర్పుల్ నింగిఁ జెలంగ నిష్ఠురనిశాతాస్త్రంబులం గప్పినన్
దర్పం బొప్ప నతండు దద్బలముమీఁదన్ వ్రాలి వాలంబు న
ల్లార్పుల్ గాడ్పుల రేఁచ దంతి రథరథ్యవ్రాతముల్ చేతులన్
గోర్పి శ్వార్చుచు వచ్చుచున్నఁ గని రక్షోనాథసేనాధిపుల్. 206

ఉ. ఏవురు నొక్కయుమ్మడిఁ బయింబడి యేయఁ గరాళదివ్యబా
ణావళు లెచ్చిరా నొదిసి యుగ్రతమప్రదరాగ్నికీలముల్
వోవఁ గరంబులం బలిమి పుచ్చుచు మారుతి యుగ్రదానవుల్
త్రోవ నెదిర్చినం గెడపి త్రొక్కుచు నుక్కున దూఱి గ్రక్కునన్. 207

క. తల యెన్ని యద్దశాననుఁ, దళవాయుల నొకరినొకరిఁ దప్పకయుండన్
గలయ నఱచేతిచఱపుల, నలియంగా నడఁచె నడఁచినం గని కినుకన్. 208

ఉ. బాహుల విఱ్ఱ వంచుకొని బాణపరంపర సాఁగ సాహసో
త్సాహముతో సమాత్యతనుజాతులు సూతుల వేఁగిరింపుచున్
సాహసికుల్ మహారథు లనం దనమీఁదికి దైత్యరాజితే
జోహుతభుక్ఛవిచ్ఛటలచొప్పున మండుచు నేఁగుదెంచినన్. 209

తే. అతఁడు మునుఁ గూల్చె నందు మేటైనవాని, జంబుమాలి నుదగ్రతేజంబు మాలి
చనఁ బ్రహస్తుఁడు విని శోకమున మునింగె, బిడ్డపడుటకుఁ గడుపున మడ్డుపడఁగ.

వ. మఱియు నంతటం బోవక తక్కరక్కసి రాచప్రగ్గడలకుమారులపయిం గవిసి
పవనతనయుండు. 211

తే. తాఁచి యొక్కనిఁ దేరితో వైచి యొకని, గ్రుద్ది యొక్కని మోఁచేతఁ గ్రుమ్మియొకని
నుఱిచి యొక్కని మెడనొక్కి విఱిచియొకని, నాక్షణంబునఁ దెగటార్చె నాఱుగురను.

క. అపుడు హతశేషు లసురాధిపుఁ జేరంబోయి దేవ ! దేవరసేనా
ధిపులం బ్రగ్గడకొడుకులఁ, గపివరుఁ డొకరుఁడ ససైనికముగాఁ గూల్చెన్. 213

## అక్షకుమారవధ.

క. అన విని కపిమాత్రుఁడు గాఁ, డని యచ్చెరువంది పలికి యక్షకుమారుం
గనుఁగొనిన నతం డది దన, కనుమతి యిచ్చుటగఁ దెలిసి యాయితపడుచున్. 214

క. ఘీంకృతిమయమై హేషిత, సంకులమై యట్టహాససంపూర్ణంబై
టంకారభయదమై నలు, వంకల బల మనుసరింప వచ్చి కడంకన్. 215

ఉ. తాఁకినపీఁక చూచి భుజదర్ప మెలర్ప మనోరథంబు న
ట్టాఁకలుమానమి న్నొఱయ నక్షరథధ్వజదండ మంది య
మ్మూఁకల నెత్తురుస్రైదడు మూలుగులుం బెదరంగ మోఁదెఁ బో
యాఁకలి దప్పిమాని కలహాశనమాని నటింప నింపునన్. 216

శా. ఆలోఁ గేతనశూన్యమై హతసహాయం బైన తే రొక్కఁడుం
గాళీసమ్ముఖనిర్విశేష మగునక్కయ్యంపు నేలన్ వెసన్
ధూళీపాలిక రేఁగఁ దోలుకొని చత్తుం జంపుదుం గాని యీ
గోలాంగూలముఁ బోవనీ ననుచు నక్షుం డుద్ధతి న్వచ్చినన్. 217

వ. సమీరకుమారుండును దద్దివ్యబాణాసారంబు ఘోరంబై పైకొనినం గైకొనక కినుకం
దూఱి పాఱె. 218

చ. ఉలుకక యుండఁ గొండఁ వడ నొంపొకకొండనఁ గోడెనాగమున్
బులుఁగులఱేఁడు దన్నికొనిపోవుతెఱం గిటు లాడి చూపెఁగా
ఫలయుం సనంగఁ దేరిపయి వ్రాలి దశాననునందనుం భదం

బుల నిఱికించి సాఁచికొని పోయె విహాయసవీథి నుద్ధతిన్. 219

క. ఈరీతి నెగసి యెప్పటి, తోరణమున వ్రాలి చిఱుకతోడలం దొడలన్
వీరాచారధురంధరుఁ, డారక్కసు నలియ నొక్కి యటఁ బడవైచెన్. 220

క. ఆకత లీవలియావలి, రాకాసులవలన విని సురద్వేషి యసీ
నాకాదిభీకరుననున్, నాకా యీవినికి మేఘనాథా! యనినన్, 221

ఆ. కొలువులోనివాఁడు గొబ్బునఁ బ్రణమిల్లి, లేచివచ్చి తండ్రిఁ జూచి యతఁడు
దేవ ! విఱిచికట్టి తెత్తునే యగ్గబ్బి, క్రోఁతి ? నని యనుజ్ఞగొని కదంగి. 222

క. ఖరకాసరపంచానన, తరతుసన్నద్ధములు రథంబులు పెక్కున్
బరివేష్టించి భజింపఁగ, నరుదెంచె రథంబుమీఁద ననిలజుమీఁదన్. 223

వ. ప్లవంగపుంగవుండునుం దోరణంబు డిగ్గి యగ్గంపు కంపింపం జొచ్చి యచ్చండశర పరంపరానిర్మాణకర్మఠకార్ముకంబుతోఁ దేరుదోలుకొని వచ్చునద్దనుజాధినాథతనూ జాతు నెదుర్కొని వెనకముందర దోఁచనీక భీకరాటోపంబున. 224

## ఇంద్రజిత్తు హనుమంతుని బ్రహ్మాస్త్రబద్ధుఁ జేయుట.

క. అనిఁ బోదివినయరదంబులె, కొని పైపఁగ నరసి తప్పుకొనుచున్ మదిలోఁ
దనచేతనె తనబలమున్, దునిమించుట కింద్రజిత్తు తుకతుక నుడికెన్. 225

తే. మఱియుఁ జలమున ననిలసంభవుఁడు గనలి, తత్సహాయశతాంగజాతంబు నెల్ల
విఱిచి నిలిచిన నిలనీక వెఱచి యతని, యుగ్రబాణాగ్నిశిఖల కాహుతిగ వైచె. 226

వ. అప్పుడు మేఘనాదుండు తనమనంబున. 227

క. చూడఁ గపి గాని చరమ, క్రీడాపరతంత్ర గగనకేశునితోడన్
జోడై యున్నాఁ డితఁ డే, జాడం జిక్కవడు నని విచారించి వెసన్. 228

క. నియమంకృతబ్రహ్మాస్త్ర, ప్రయోగమునఁ గట్టివైవ బ్రహ్మోపాస్తి
క్రియఁ బావని విడివడి యుం, డియుం లోనై చిక్కె నేమిటికో దనుజునకున్. 229

తే. వెండియును మేఘనాథుండు బండిమోకు, మెడకుఁ గాళ్లకుఁ దగిలించి ముడియఁ గట్టి
ధీవిచక్షణుఁ డవ్వీరుఁ దేరిమీఁద, బెట్టికొని వచ్చి తన మ్రోలఁ బెట్టుటయును. 230

## హనుమద్రావణసంవాదము.

మ. కొడుకు న్తెచ్చి దశాననుం డనిలజుం గోపంబుతోఁ జూచి యో
యడవిం ద్రిమ్మరుచుండు క్రోఁతివిర రారా యెవ్వ రంపంగ ని
క్కడికి న్వచ్చితి వేల చొచ్చితివి లంకారాజధానిన్ నిజం
బడుగం జూచెద నంతయుం దెలియ నొయ్యం జెప్పరా నావుడున్. 231

వ. అప్పుడు శౌర్యాలవాలం బగువాలంబునం బీట వెట్టుకొని నెట్టుకొనిన ధైర్యంబున
వసించి. 232

చ. అనిలజుఁ డోరి రావణుఁడ యల్లన నేటికి బెట్టు చెప్పెదన్
విను రఘురామదూత నరవిందహితాత్మజమంత్రి నేఁ బ్రభం
జనతనుజాతుఁడన్ జనకజన్ వెదకం జనుదెంచి కాంచితిన్
నను హనుమంతుఁ డంద్రు భువనంబులు మా కిల నెల్ల కానలున్. 233

క. పఱతెంచి వనము వెఱుకుట, కుఱకుఱ రక్కసుని నొక్కకొందఱుఁ గేలన్
విఱుచుట యిటు చిక్కుట ని, న్నెఱుకపడం జూచుటకు సుమీ దనుజేశా! 234

ఉ. చూచితి నే కదా నిను విశుద్ధచరిత్రుఁ డయో! పులస్త్యుఁ డే
లా చెడుఁద్రోవ పట్టితివి యాయనవంశమునం జనించియున్
నీచలమున్ ఖరాసురుని నెత్తురుద్రావినతూపు నేనియుం
జూచి తొలంగు తల్లి యని చూడు విదేహనృపాలకన్యకన్. 235

ఉ. అప్పులపోతుఁ జిచ్చుయినయట్టిగృహంబున నున్నవాఁడు దాఁ
జెప్పఁగ దుర్విషాన్నము భుజించునతండును గాంచు పాట్లిఁకన్
దప్పవు సువ్వె నీకు నహితం బిటు లెవ్వరు చెప్పి రేమొకో!
ని ప్పాడిగట్టితే? విడువ నేరవె యింతటనైన? సాపుడున్. 236

క. మండిపడి పీని తలగొ, ట్టుం డటు గొనిపోయి సాపుడున్ రావణుతో
నిండుదొర తదనుజుం డన, ఘుండు విభీషణుఁడు వలికెఁ గోప మడంగన్. 237

తే. దేవ! విను దూతఁ జంప విధింప లేదు, రాజులకు నీతిశాస్త్రంబు రాముఁ డుండ
నితనిఁ గొనియేమి? విడిపింపుఁ డిప్పు డనినఁ, దోఁక గాలిచి వీనిఁ బోఁదోలుఁ డనియె. 238

## రాక్షసు లాంజనేయునితోఁకఁ గాల్చి యూరేగించుట.

వ. అప్పు లసురవరుండు నుడువ దడవ బెడిదంబుగా నుడిగంపురక్కసులు పెక్కండ్రు
గూడి. 239

క. కడవల నూనెలఁ గోకలు, తడిపిరి కపివీరుదీర్ఘతరవాలమునన్
గడకుం జుట్టిరి కొనఁ దగఁ, బిడిచిరి ముట్టించి రనలభీషణశిఖలన్. 240

క. ఆవార్తలు విని జానకి, పావక! నీ ప్రాణసఖుని పట్టి సుమీ! హా!
మావాఁడు సుమీ! వినుమా, నీ వేఁడికి వేఱె కలవు నేతు ల్నెలవుల్. 241

ఉ. అంజలి చేసి వేఁడెద మహాత్మ! యనం దడ వాంజనేయుతోఁ
కంజలికప్పు లానపడఁగా నొనరించి శిఖల్ మధూళి మ
ద్వంజులపుష్పమాలికలవంటివియై తలిరాకుదండలై

రంజిలఁ జేసె వహ్ని యవిరామహిమంబు లనన్ జగంబునన్. 242

తే. అపుడు పవమాననందనునంగములను, గట్టిగా మున్న కట్టినకట్లు విడిచి
వెంటఁ దోఁకొని దైతేయవీరభటులు, విచ్చుకత్తులతోఁ బదివేవు రెలమి. 243

మ. పురవీథుల్ గలయంగఁ ద్రిప్పి యిఁకఁ బో పొమ్మన్న నవ్వీరవా
నరసింహం బొకనవ్వు నవ్వి చనెనే నా కిప్డు దాకాంతఁ ? యం
ప్పురిగల్ సెజ్జలు చప్పరాలు ఛవికల్ పైఁజూడ లే దెక్క చె
చ్చెఱ మీ రెక్కడఁ జూపినా ? రిపుడు నిశ్శేషంబుగాఁ జూచెదన్. 244

వ. అని పలికి కీలామాలికాఖీలం బైనవాలంబు ద్రిప్పుచు. 245

## లంకాదహనము.

ఉ. కోటలమీఁదఁ జుట్టుఁ జని గొప్పయలంగపుటిండ్లు చూచి య
వ్వీటికి నెల్ల నట్టనడువీథిని మీటుగఁ గట్టినట్టిశృం
గాటక చంద్రశాలకొన గాలిచి యారొఱమంట లంటి యె
ప్పాట నటించునో యనుచుఁ బావని వేడుకఁ జూచుచున్నడన్. 246

మ. అనిలజ్వాలవినిర్మితాంగదకిరీటాఖీల మై రావణా
దినిలింపాహితకోటి నాహుతి గొనం దెంపూని సాక్షాత్కరిం
చెనొకో తద్దురితాధిదేవత యనం జిచ్చుల్ కడుం గోటవెం
టను దోడ్తో నడుమేడను న్నిగిడి మండన్ లంక చూపట్టినన్. 247

ఆ. అలబలంబు లేచెఁ గలయంగ మందిరా, గ్రంబులకును నిండుకడవ లెక్కెఁ
జల్లుదుమ్ము లెసఁగె నుల్లోలకీలికి, లోపశాంతి యొందు నొదవ దయ్యె. 248

వ. వెండియుఁ దచ్చండకిరణతనయామాత్యప్రతిష్ఠితపవనసఖబహుముఖశిఖాసంఘాతంబులు నిరస్తనిఘాతంబులై బందిమందిరంబులం గ్రందుకొను బృందారకపురంధ్రీసందోహంబులనిట్టూర్పుగాడ్పుల సాహాయ్యంబు వడసి భానుంగువడనిసహస్రాంశుపీడా వితీర్ణంబు లగునిప్పులం దప్పులు వట్టి విస్ఫులింగంబులు ముంగోలుజోఁజులై తేజరిల్ల సీతాశాతోదరీహృదయపరితాపంపుటుడుకుం బుడికి పుచ్చుకొని పెచ్చు పెరిఁగిన సెగ దిగంతంబుల దీటుకొన గవకులు రవులుకొలిపి కోటలకు బీటలు నెఱపి మళిగల వెలింగి మేలుమచ్చులు నేలకుం దెచ్చి మట్టంబులు మొట్టుకోలు పట్టి వాడలు గోడలు చెక్కుంజేసి లాయంబుల కపాయంబు దెచ్చి గుళ్లు గూలిచి నగళ్లకు నడచి చవికెల నప్పళించి చప్పరంబుల కెసరు పెట్టి యుప్పరిగల కుప్పరంబు లెగసి పొగసిన పొగల నడుమ న్నిగుడునప్పుడు కప్పం గుప్పసంబులు ద్రోడవినపడుపును భాసుర

భసితధూసరంబు లైనయపుడు యోగివేషంబులం బోషించినసంచును విటంకమణీ
విభావిసరంబులతోడ జోడై కూడినపుడు విందులంగలసినచందంబున ఛటఛటత్కార
చమత్కారంబులం దేలినయపుడు వికవిక నగినయనువునం జూపుచుం దమవేడిమిం
దామ తాళుకొనంజాలక చనుపోలికం గేలీకాననంబులు దూఱియుం దూపటిలినజాడం
గ్రీడాసరోవరంబులకుం జేరియుం నాంకటిసోంకోర్వని కాంకంబోలెం బాకశాలలకుం
బరువులు వాఱియుం వారింపరాక యథేష్టవిహారంబులు సలుపుచుండె నయ్యవస
రంబున. 249

సీ. పాదివి లేంగానక పొత్తులలోపట్టం బోనాడుకొనిన లేంబురిటియాండ్రుం
బొగచుట్టుకొన వెంటం దగుల నేరనివయస్యల మోసపోయినజవ్వనులును
దొడవు లేమేనియుం వెడలింపంబోనిచ్చి పతులం గోల్పోయినభామినులును
నరుగ లేనిముసల్ల నత్తమామలం బాయం బాలైనప్రోషితభర్తృకలును
తే. జాలిం దమతమముంగిళ్లం గూలంబడుచు, నూంచముట్టుగ గీము లాహుతిగొనంగ
ముఖరపావకశిఖలపై మోందుకొనిరి, యది దశగ్రీవుకీడుగా నరయరే మొ! 250

క. పాకారిదురాలోక, ప్రాకారాకారపురపరాభవపరిపా
కాకులులై కాకులవలెం, గాకై చనం జొచ్చి రెల్లకడలకు నసురల్. 251

క. తనకొంప గాలం దెచ్చెన్, దనుజకులక్షోభ గాంచ దశకంఠుం డీలా
తనయ నని పలుకం దొడంగిరి, కని తెలిసిన పెద్దవరుస గలతొలివేల్పుల్. 252

చ. వనచరవీరుం డానగరివాకిట మున్నటులన్ హితంబు ప
ల్కినకతనన్ విభీషణనికేతనవాటిసకేతనంబుగా
ననలశిఖానికాయముల యావళిం బోవక యుండం గాచి త
క్కినపుర మంతయుం గెడపి కేవలభస్మముగాంగం జూచినన్. 253

క. ఆయెం గదా వచ్చినపని, పోయెద నింక నిన్న నింతప్రొద్దున నేనున్
మాయంగదాదులుం బెడ, వాయక జలరాశివేలపై నుంటిమిగా. 254

క. ఈమేలివార్త నాచే, వేమాఱున్ గ్రుచ్చి గ్రుచ్చి వినుదనుకం గుల
స్వాముల కెంతయుం జింతా, సామగ్రీమంతములు నిజస్వాంతంబుల్. 255

చ. అనుచుం బ్రవాళవల్లికలయల్లికలం బొడువాటి పోంకమ్రా
నొనరినరీతి నున్నతనయున్నతవాలము వహ్నికీలముల్
పెనంగొనం బొల్చుదానిం గదలింపుచు రాముని రాణివాస ముం
డినయెడకు న్వెసం జని వినీలిమెయిం బ్రణమిల్లి నిల్చినన్. 256

## ఆశ్వాసాంతము.

క. గోబ్బూరివంశమణీ ! హ, న్నిబ్బరగండాంక! మేదినీశ్వరతిలకా !
బిబ్బోకవతీమదన ! క, ఱబ్బంధురసురభికీర్తికుసుమోత్తంసా! 257

ఉ. చిత్తసరోరుహాంతరవశీకృతనందకుమారభృంగ ! భూ
భృత్తిలక స్తవార్హ ! రణభీకర! పట్టుతలాడరాయరా
హుత్తభుజంగకార్ముకరఘూత్తమ ! కృత్తమహారి ! సాహితీ
విత్తమ ! విత్తమర్దితకవిప్రజదైన్య! వదాన్యశేఖరా! 258

క. యజ్వజనాధార ! ప్రతా, పజ్వాలిగ్రస్తరిపునృపాలారణ్యా !
ఋజ్వాలాపకలాల ! స, ముజ్జ్వలగుణకాండ ! హాత్తుమువ్వరగండా! 259

గద్యము. ఇది శ్రీమదోంటిమెట్టరఘువీరశతకనిర్మాణకర్తృజగదేకఖ్యాతిధుర్యాయ్యల
రాజు తిప్పయమనీషిసర్వతాభిధానపౌత్త్రాక్కయార్యపుత్త్ర పరిశీలితసమిద్ధ
రామానుజమతసిద్ధాంతమర్మ ముమ్మిడివరదాచార్యకటాక్షవీక్షాపాత్ర హృదయ
పద్మాధిష్ఠితశ్రీరామభద్ర రామభద్రకవిప్రణీతంబైన రామాభ్యుదయమహా
ప్రబంధంబునందు షష్ఠాశ్వాసము.




# సప్తమాశ్వాసము.



లలనానాయకపద
నాళీకరసానుభూత్యశారతనంద
ద్రోలంబ! సకలదిగ్జయ
శీలా! గొబ్బూరినారసింహనృపాలా! 1

వ. అవధరింపుము తదనంతరకథావిధానం బెట్టిదనిన. 2

హనుమంతుఁడు సీతయనుజ్ఞఁగొనివార్ధిఁదాఁటి కపులంగలయుట.

క. వాలవలద్వహ్నిశిఖా, మాలిక లీక్షించి జాలిమాలిన్ సీతా
నాళీకవదన వెదవులు, నాలుక తుదఁ దడుపుకొనఁగ నగి నగచరుఁడున్. 3

తే. వెఱపు నటియించె దేటికి విశ్వజనని!, బిరుదుకెందమ్మిదండలై బెరసి నాకుఁ
దోఁక నంటినమంటలు తోడు చూప, నెంత దీవించితివొ కాని యిచటనుండి. 4

క. కాకున్నఁ గెంపువెన్నెల, రేకులవలెఁ జలువ గ్రుమ్మరించునె తల్లీ!
యీకారుమంట లిటులన్, నీకు న్నీమహిమ చూప నేఁ బనివింటిన్. 5

వ. అని పునఃపునఃప్రణామంబు లాచరించి యాచారపవిత్ర యగునప్పద్మపత్రనేత్రచేత ననుజ్ఞాతుండై యంత్తరదిశావియత్తలంబున కెగసి సంరంభవిజృంభణంబున నంభోధి పయిం జనుచు నుల్లోలంబు లగుకల్లోలంబులం దనవాలానలజ్వాల[illegible]జాలించుకొని నిజజంఘావిశృంఖలమారుతంబులచేత దూరోద్ధూతంబులై శరచ్ఛరదశకలసంఘాతంబులు గోలాంగూలంబుల వేలంబులమీఁదం బడుచున్నం గనుంగొని యందు విచారనిశ్చయవేదులైన జాంబవదాదు లుప్పొంగి తప్పదిది యప్పవనతనయాగమనవేగంబ యగు నతండు దడయక వచ్చుటం బోయినపని పండుకాని కాయగాదని చాయగాఁ దనమాటయె తలపోసికొనుచుండ నద్దండునకుఁ గన్నులపండువై తోఁచ వేలాపులినంబున వాలి వాలినందనునకుం బ్రణమిల్లి యెల్లరకుం జేటతెల్లంబుగాఁ గార్యసిద్ధి తెలుంగెలింగించిన నంగదాదులు చెంగలించినయంతరంగంబులతోఁ

ప్లవంగపుంగవుంగొని ప్రసంగవశంబున నొక్కింత సూచితంబైనయతనిపరాక్రమంబు విరివి యగుట తలంపుల వెరవునం దెలిసినవారై యిట్లనిరి. 6

### జాంబవదాదులు హనుమంతుం గొనియాడుట.

సీ. అలఘుపారావార మెలదోఁట కాల్వయే యవలికివ్వలికుండి యడుగువెట్ట
నక్షరక్షోవీరహార్యక్ష మరకాలిదూళియే తాటించి నేలఁ గలప
బ్రహ్మాస్త్రబంధంబు పట్టుదోరపుదూయయ్యముడియె ననాసూసములను విడువ
నరిభయంకరలంక యంబేదకొంపయే కోసించుకొని పోయి కొఱవిఁ జూడ
ఆ. నింతలావు చేసి యీడేర్చుకొని రాఁగఁ, దొల్లి యెరికైనఁ జెల్లెనయ్య ?
నీకుఁ జెల్లెఁ గాక నేఁడహో ! పతిహితా, పహావిహార ! గంధవహకుమార! 7

ఉ. దారుణకంఠపాశ మగుదానవకోటికిఁ బంక్తికంఠకం
ఠీరవపీఠికిన్ బ్రతిఘటించినపీఠ మగున్ గురుత్వసం
హారక మైనచూడఁగొడుపా నిది లంకకు బాపురే ! యసా
ధారణ మే మనంగలము తావకవాలము వాయునందనా! 8

### హనుమదాదులు శ్రీరామసన్నిధిం జేరుట.

ఉ. అంచుఁ బురస్కరించుకొని యందఱు నాయనతోడఁ గూడ నే
తెంచిరి భానునందనుని తేనియతోఁటకు లూటిచేసి ద
క్కించుకొనంగ వేళ యని కేరుచు దూఱుచుఁ దిట్టి కొట్టి దం
డించిరి మించి తన్మధువనీపరిపాలకు లడ్డగించినన్. 9

ఆ. తియ్యపండ్లు దినిరి తేనియల్ ద్రావిరి, తేలి యాడి కల్లదీర్ఘికలను
ఘటితకార్యులైనకతమున వారికిఁ, జేసినంతపట్టు చెల్లిపోయె. 10

క. ఇవ్విధమున నధ్వశ్రమ, మవ్వనమునఁ దీర్చుకొని వనాటప్రవరుల్
నవ్వుమొగంబులతోఁ జని, మువ్వురుదొరలకును జాగి మ్రొక్కినపిదపన్. 11

వ. లక్ష్మణసుగ్రీవు లిరువురు నిరుగెలంకుల నిలిచి యుండ సాంజలియై యాంజనేయుండు మనుకులపుంగవుం గనుంగొని. 12

### హనుమంతుఁడు సీతావృత్తాంతముఁ జెప్పి శిరోమణి నిచ్చుట.

మత్తకోకిల. దేవ ! కంటిఁ గదయ్య సీత నతిప్రయాసకృశన్ భవ
ద్దేవి మజ్జనయిత్రిఁ దావకదివ్యవిగ్రహభావనో
జ్జీవనవ్రత నంచు నన్నియుఁ జెప్పఁగా నతఁ డప్పు డా
పోవఁ గ్రోలె వధూకథామృతపూరముం జెవిదోయిటన్. 13

వ. అనంతరంబ. 14

### రాముఁడు సీతాశిరోమణిం జూచి దుఃఖించుట.

క. సీతాదత్తశిరోమణి, వాతూలతనూజుఁ డానవా లని యొసఁగెన్
చేతం గొని యురమున సం, ప్రీతిం జేర్చుకొని రఘువరేణ్యుం డంతన్. 15

క. మును వెక్కసముగఁ గ్రోలిన, వనితావార్తాసుధాద్రవము చిప్పిలునో
కనుఁగవ నవఁ బ్రమదాశ్రులు, మొనతెప్పలఁ గురియఁ బ్రణయమూర్ఛం బొరసెన్.

తే. అపుడు లక్ష్మణసుగ్రీవు లాచరించి, యుచితశిశిరోపచారము లొక్కకొన్ని
దానఁ దెలివొంది కన్నీటివానతోన, లేచి కూర్చుండి మణివంకఁ జూచి విభుఁడు.

క. నినుఁ జూడఁ గలిగినప్పటి, యనుమోదం బింతలోనె యధికవ్యథయై
కనకనమనఁ జొచ్చెఁగదే, మనమున సీతాశిరోగ్రమాణిక్యంబా! 18

చ. వెనుకఁ గేలిసౌధమణివేదుల నాయెదఁ బవ్వళించి య
జ్జనకజ యున్న నీవు నడుచక్కిన మామకహారవీథి న
ల్లనఁ గదియంగ నబ్బుఁ దరళద్వయలాభము తద్విభూష కా
యనికికి ముచ్చటయ్యెడు నయోఘ్యుఁ బోవుదునో శిఖామణీ! 19

క. అని దిగ్గన లేచి పురం, బునకై పోఁబోవ నడ్డముగ నిరుగడలన్
జని లక్ష్మణసుగ్రీవులు, జననాయక! సీత లేదు సాకేతమునన్. 20

### సుగ్రీవుఁడు రామునకు వానరులం జూపివారిపరాక్రమము దెల్పుట.

మ. వినవే వాయుజుఁ డేమిచెప్పె? నిదిగో విల్లంది లంకాపురీ
దనుజశ్రేణి వధించి రం డిపుడె సీతం దెండు లేలెం డనన్
విని యోగా యని తెల్వి దెచ్చుకొని యుర్వీమండలాధీశ్వరుం
డినపుత్త్రుం గనుఁగొన్న నాతఁ డిదె గొం డేతెంచె మద్వాహినుల్. 21

వ. అని పలికి యయ్యవసరంబున. 22

క. గవయ గజ గంధమాదన, గవాక్ష నల నీల దధిముఖర్షభ మైంద
ద్వివిద శరభ శతబలిముఖ, భువనోన్నతకపులఁ దెచ్చి పొడగనిపించెన్. 23

వ. ఇట్లు సమ్ముఖంబునం బెట్టి. 24

క. ఒక్కొకఁడు పెక్కుకోటుల, వెక్కసపుంగపులఁ గూర్చి విప్పంగలవా
రుక్కునఁ గావలె నన్నం, బుక్కిటఁ బట్టుదురు వీరు భువనము లెల్లన్. 25

వ. అని విన్నవించి మఱియును. 26

తే. జాంబవంతునిఁ జూపి యోస్వామి యితఁడు, వెరవునకు లావునకు దురంధరుఁడు సువ్వె
కలరు నాకిట్టి చేరువకాండ్రు దేవ!, చక్కఁబడకున్నె మీ ప్రయోజనము లెల్ల. 27

క. ఇది మంచిముహూర్తం బిఁకఁ, గదలుఁడు దండునకుఁ బంపుఁ గాయ గలఘోలం

బది యొఱఁగి త్రోవవెట్టం, బదిలక్షలకపుల మున్న పంచినవాఁడన్. 28

ఆ. వాయునందనుండు వాలినందనుఁడును, దేవరకును నూర్మిళావరునకుఁ
ద్రోవఁ బోవునపుడు తురగసారథులకు, నాసపడని తేరు లవనినాథ! 29

క. అనుమాటతోనె వెలికిన్, హనుమంతుఁడు వహనవాంఛ నాయితపడి వ
చ్చినఁ జూచి రఘువరేణ్యుఁడు, తనమదిలో నాదరంబు దైవారంగన్. 30

క. ఇపుడా నన్నెత్తుకొనం, గృప పుట్టుట నీకు జానకీవృత్తాంతం
బెపుడు గొనివచ్చి తెచ్చుటి, కపుడే నన్నెత్తికొంటి వనిలకుమారా! 31

## శ్రీరాముఁడు సుగ్రీవాదులతో యుద్ధమునకు వెడలుట.

సీ. అని చేరఁ దిగిచి గాఢాలింగనంబున బాంధవస్నేహసంభ్రమము నెఱపి
యతనిమనోవాంఛ కనుగుణంబుగఁ దదీయస్కంధమున నెక్కి యవ్విభుండు
గదలె లక్ష్మణుఁడు నంగదభూజాశృంగాధిరూఢుఁడై యన్నపిఱుందఁజనియెఁ
గటురటత్కపికంఠపటహానిష్ఠురముగా సేనల నడిపించె భానుజుండు

ఆ. బలభరంబుచేత భారతవర్షంపు, టుర్విచెఱఁగు మోచియున్న దిక్కు
పడగ లొరగ శేషఫణి కగ్రభాగంబు, మలకచుట్టకంటె నెలగఁబడియె. 32

వ. అప్పుడు. 33

సీ. ఇది మహాసంరంభ మెఱుఁగనిత్తమటంచు మూఁడులోకములకు ముట్టనార్చి
యెదురునోరత్తంగ నిత్తుమె తము నందుఁ గొండలగవులలో గుండ్లుగొట్టి
యివి దూఱి తూలి పో వింత యేమిటికంచు దుర్గమారణ్యముల్ ధూళిఁ గలిపి
యీలీల మున్నీటి నెచ్చ నీరాదంచు నెల్లకూలంకష లింకఁ ద్రావి

ఆ. వనరుహాప్తతనయు వాహినీవానర, వరులు సహ్యమలయగిరులు గడచి
త్రోవ లంకదెసకు దుమ్ము తూర్పెత్తుచుఁ, జనిరి వెస మహేంద్రశైలమునకు. 34

## రామాదులు మహేంద్రపర్వతముం జేరుట.

ఉ. అగ్గిరి యెక్కి దాశరథు లట్లు ప్లవంగతురంగమంబులన్
డిగ్గిన నంగదుండిదె సుఁడీ మనమారుతి త్రొక్కి లేచినన్
దిగ్గన నేలఁ దూఱి చనుదెంచినకొండ యెఱుంగరాదె యీ
దగ్గఱికూట కాంచనతటంబుల నంటిన మంటిబేటులన్? 35

క. అన విని పవనసుతకృతం, బునకుం బ్రతి గలదె జగతిఁ బురుషాచారం
బనఁగాఁ బరోపకారం, బనఁగా నీరూపు దాల్చె నని పేర్కొనుచున్. 36

వ. రామలక్ష్మణులు దక్షిణంబు నిరీక్షించి. 37

## సముద్రతీరప్రవేశము.

సీ. పరితశ ప్రకీర్ణమై పరిచిన ట్లున్న శైవాలజాలము నీలిజాలు గాఁగ
ప్రబలిపైఁ బ్రాఁకినపవడంపులత లింపు దగవైచినపసిండిత్రాళ్లు గాఁగ
బ్రహ్మాండపాటనోద్భటములై మినుముట్టు ఘోరఘోషములు ఘీంకారములుగ
వేలాగహానపక్షికోలాహలములెల్ల నారిగట్టినపౌజు నదలుపులుగ
తే. నెగసివ్రాలెడుజలజంతు లెక్క నెక్కఁ, గూల విసరినఁ బడుమావటీలుగాఁగ
నూర్మిరేఖాకరంబు బిట్టూఁచికొనుచు, గంధగజలీలఁ గ్రాలుసాగరముఁగాంచి. 38
క. అగురగుర ! ముఖరముఖుఁడై, జగము వినం దమబలంబు చాట సముద్రం
డొగి బిరుదు ఢక్క యయ్యెన్, సగరకుమారులు కదా ప్రశంసార్హతముల్. 39
వ. అది యట్లుండె నిది దాఁటనుపాయం బెద్ది యొకో యని తలపోసికొనుచు రాజన్యులు
కొండడిగి దండునకుఁ బాళెంబులు దిగఁ బాలెంబు లెఱింగి వేలావనంబుల నెలవులు
చూపించి యున్నసమయంబున. 40
చ. అగచరుబాలుఁ డాది నొకఁ డాఁకొని పైకొని యెంతచేసె? నీ
యగచరు లిందఱేని గల రందఱు నాఁకలిగొన్నవారలే
తెగువకుఁ జొత్తురో యనికదే చరమాచలశృంగ మెక్కియొ
ప్పుగ నిటు చూడనే వెఱచి పోయె ననన్ రవి గ్రుంకె నవ్వలన్. 41
క. ఎఱపంజ విరసి నెఱసెం, జిఱుచీఁకటు లెగసి గగనసీమం బలిసెన్
గుఱుకుర లెగలై కనఁబడి, తఱుచై వెనువెనుకఁ బెక్కుతారలు తోఁచెన్. 42
క. పుంజీభవించి మించిన, పెంజీఁకటి చిత్తమీఁదఁ బెట్టినబెడిదం
పుంజంద్రనిప్పుచాడ్పునఁ, గంజాహితబింబ మరుణకళతోఁ దోఁచెన్. 43

## శ్రీరాముని సీతావియోగదుఃఖము.

వ. అప్పుడు జనకతనయామనోహరుం డొకరమ్యప్రదేశంబున హనుమత్కృతంబైనపల్లవ
తల్పంబునం బవ్వళించి యుండి యాయుల్లకభరంబున నుల్లంబు దల్లడిల్లం జొచ్చిన
నచ్చకోరహితునిం దేఱి చూచి లేచి కూర్చుండి. 44
క. ఈపూపున దాఁటెదనని, యే పొందఁగఁ బొంగఁబెట్టితే జలరాశిన్
నీపగ యిందునఁ దీఱెనె, పాపాత్మా! యేమిగంటి పద్మారాతీ! 45
క. అని యాదట మఱచి పలుకఁగ, వెనుకదెసం జల్లగాలి వీతెంచిన గ్ర
క్కున నులికిపడి కదంపడి, హనుమంతునిదిక్కు చూచి యవ్విభుఁ డనియెన్. 46
ఉ. నాలితనంబు నేర్చుకొని నక్కుచు నక్కుచు వాడవాడ వే
లాలపలీలతావలికెలంకులనుం డిటు వచ్చి వచ్చి దం

భోళియుఁబోలె మీఁదఁ బడి పోయెదుఁ బల్కుఁ బిల్చి తెల్పవే
తాళకొనంగ నీయనుఁగుఁదండ్రికి ధన్యవిచార! మారుతీ! 47

సీ. వచ్చు దక్షిణగంధవాహంబొ వలఱేని కౌపవాహ్యముగదా యాంజనేయ!
వనరాశి మీనకేతనునకు బిరుదాంకపరిపాలకుఁడుగదా పవనతనయ!
తోయజారాతి సహాయసంపదగదా శ్రీనందనునకు సుగ్రీవసచివ!
విరహవ్యథావిధావిహితవేళ విభావరిగదా యనంగున కగచరేంద్ర!

తే. యింతపట్టును నాపాల నిచటఁ గూడె, నేమి చేయుదుఁ బనికిఁ బైరెత్తు తోఁచ
దనుచుఁ జింతాపరంపరాత్యంతదంతు, రాంతరంగంబుతో నుండె నవ్విభుండు. 48

## రావణుఁడు కపిసేనల జూచి మంత్రులతో నాలోచించుట.

క. కింకరులచేత నంతక్, లంకకు వే గంటె నందిన న్వాని యంకా
ప్రాంతాలు దరికొనంగ ని, రంకుశసాహససమర్థుఁ డగుదశముఖుఁడున్. 49

వ. నిజనగరగోపురోపరిభాగాధిరూఢుండై. 50

తే. కడలిచెలియలికట్టపై కడకు విడిసి, యున్న శ్రీరాము సేనలయురవు చూచి
చూచినప్పుడ వీరవిస్ఫూర్తి నడచి, యద్భుతరసంబున మునింగె నతనిమనము. 51

మ. ఇటు లాశ్చర్యనిమగ్నుఁడై మఱియుఁ సంవీక్షించి వే వచ్చి యొ
క్కట నాప్తుల్ భజియింప నేకతమునం గూర్చుండి కర్జంబు లె
ట్టెటు వచ్చెం గనుఁగొంటిరే? కపిబలం బియ్యంబుధిం బాయపు
చ్చుటకుం జొచ్చుటకున్ సమర్థమని తోఁచున్ నామదిన్ నావుడున్. 52

తే. యూపధూమ్రవిరూపాక్షు లురగవృశ్చి, కాసిరోమలు మొదలైనయసురవరులు
విచ్చుగత్తుల ఝుళిపించి వికటహసిత, వికృతిఁ బలికిరి బొంగుగొంతుకలు మెఱయ.

చ. పడగలు పట్టి చింపుదుమొ? పాపదొరం దల కొక్కువ్రక్కగాఁ
దుడుతుమొ? వహ్నిలోచనము ధూర్జటిపైఁ జని చుట్టుగట్టుతోఁ
బుడమిచెఱంగు లెత్తి యిట బోరగిలం బడఁద్రిప్పి వైతుమో?
విడు సెలవిచ్చి మమ్ము నొకవేడుక చూతువుగాని రావణా! 54

ఉ. చివ్వకు వచ్చి నిన్నెదురఁ జెల్లునె దైత్యకులాధినాథ! మ
న్నెవ్వరికైన నెంతగలఁ? దీపని కెవ్వరమైనఁ జాలమే!
యివ్వలినేల చేమొనల నెత్తి సశైలజలగ్రహంబుగా
నవ్వలిసేనమీఁద మకరాకరమంతయుఁ డొల్లఁబోతుమే. 55

క. నావుడు విభీషణుం డో, హో! వీరాలాపములనె యోడించితిరే?
పై వచ్చినబలవంతుల, నావననిధి యొడ్డగిల్లినట్లనె యుండెన్. 56

క. మీ రేల వంచవలయుం, బారావారము ప్రయాసపడి వడదేరన్?
వారే పైఁ జిలికికొనం, గోరుదురఁట రోమకూపకోటుల నింకన్. 57
ఆ. వారిమీఁద వనధివంచినంతఫలంబు, వారివాఁడు తగులవైచి చనిన
మిగిలి కాలుచున్నమీమీగృహంబుల, చిచ్చులాఱ నీరు చిలికికొనిన. 58
మ. అని యంతం దమయన్నఁ జూచి దశకంఠా! యిప్పు డీ వానతె
చ్చినవాక్యంబు నిజంబు తత్కపిబలస్థేమంబు సామాన్యభా
వనకు న్నోచెనె? యింతబల్మిగలదైవం బాతఁ డల్పుండె? బో
రన నాస్వామికి సీత నిచ్చుటయె కార్యం బెన్నిటం జూచినన్. 59
క. అన విని యెవ్వరి నొఁగా, దన కంతఃపురమునకు దశాననుఁ డరిగెన్
దనుజులు నిండ్లకు నరిగిరి, చనియె విభీషణుఁడు నాత్మసదనంబునకున్. 60
వ. మఱునాఁడు సూర్యోదయానంతరంబునం గాల్యకరణీయంబులు నిర్వర్తించి విభీషణుండు వెండియుం దమయన్న కొలువిచ్చియున్నయవసరంబునఁ జనుదెంచి యాతని కానతుండై యంతకు మున్న సమాప్తనిద్రానియమసమయుండై వచ్చియున్నకుంభకర్ణునకుఁ బ్రణమిల్లి యుచితపీఠంబునం గూర్చుండె నంతఁ బంక్తికంధరుండు. 61

కుంభకర్ణునివీరాలాపములు.

తే. నేఁడె నిద్దురదెలిసినవాఁడు గాన, నీప్రసంగంబు లేమియుం నెఱుఁగఁ డనుచు
నంతవృత్తాంతమును దెలియంగఁ బలుక, లెస్స గాఁ గుంభకర్ణుఁ డాలించి పలికె. 62
క. మించినపనులకు నేరము, లెంచం బనిలేదు సీత నెక్కటినటులన్
గొంచు న్వెడలంబడి యే, తెంచితిగా చాల సుస్థితి న్నిలు మింకన్. 63
క. ఘోరాహవసంక్రీడన, భారము నామీఁదఁ బడియెఁ బడినంబడనీ
వారా నే గద్దించిన, వీరాచారంబు నెఱపి వినియెదు వారల్? 64
శా. కేళీలోలుఁడనై భుజాంగదముగాఁ గీలింతునో? కాక డా
కాలం బెట్టుదునో? నిజాంకకటకాకారంబునన్ గ్రాలఁగాఁ
బ్రేలం ద్రిప్పుదునో? యెఱుంగఁబడ నవ్వేడెంపుగ ట్టెత్తెదన్
గోలాంగూలబలంబు వచ్చి ననుఁ దాఁకుంగాక వారింపఁగన్. 65
ఉ. ఆఁకొనినాఁడ నేఁ దనిసినప్పుడుగా యితరత్ర చింత లీ
కాఁకకుఁ బద్మజాండఘటగర్భగతాఖిలభూతసర్గముం
జీఁకటి చిక్క మ్రింగి మఱి చీరెదఁ దేరెలుఁగెత్తి పోరికిం
దోఁకలమూఁక లెవ్వగలఁ దోఁచునొ చూచెద నప్పు డంతయున్. 66
క. భవదురుతరపురదాహ, శ్రవణంబున నంటె వచ్చి బ్రహ్మాండనుటం

బవియించిన పెంచున నీ, భువనముతో నుడుకఁబెట్టి పొరవెదఁ గపులన్. 67

విభీషణుఁడు నీతి నెఱింగించుట.

వ. అనినవిని విభీషణుండు దుర్నిమిత్తంబులు ప్రసక్తంబులై తోఁచుచున్నయవి యివ్వి
టికిఁ జేటు వాటిల్లక పోవునే? యనునంతలోన నింద్రజిదాదికుమారవర్గంబును బ్రహ
స్తాదిసచివనిచయంబును మఱియునుం బంక్తికంధరుం బరివేష్టించి యున్నచుట్టంబు
లును వీరభటులు నతనిం జూచి. 68

ఇంద్రజిదాదులు విభీషణుం దూఱుట.

ఉ. శాకునికప్రసంగ మిది సాహసికాదరణీయ మౌనె? చీ
కా కయి యూరకే యొగదిగం దలపోయుచు నున్నవారికిన్
గాక సదామనోజయము గల్గినధీరులకున్ భయంబు లే
దే కొఱగాము లైన మము నింత యెఱుంగక మించివచ్చునే? 69

క. అల్పముల కేమి? కృతసం, కల్పులమై యడఁగఁద్రొక్కఁగలమో లేమో
పొల్పడి రమ్మనుమా యల, కల్పాంతము నాఁటియేడుగాడుల్ప నిటకున్. 70

వ. అనిన విభీషణుం డిట్లనియె. 71

క. అకటకటా! యి ట్లందురె, యొకసప్తానిలము లనెవె! యూహించిన మీ
సకలప్రాణానిలముల, నొకమాటున నడఁగఁద్రొక్క నున్నాఁ డింకన్. 72

విభీషణుఁడు రావణునకుఁ గర్తవ్యముం దెల్పుట.

వ. అని దనుజరాజు నవలోకించి. 73

సీ. తెగి లేనిబీరంబుఁ దెచ్చిపెట్టి కులంబుఁ గ్రుంగఁ ద్రొక్కెడువాఁడు కొడుకుగాఁడు
చెవి కిచ్చకపుమాట చవి చూపి కార్యంబు మఱుఁగుపెట్టెడువాడు మంత్రిగాఁడు
నేర్పులేక చెడంగ నిండ వేవురునుండి యని నోడువారు నొయ్యారులుగారు
తెని గ్రొవ్విపైచేటు తెలియక కలహంబు బలియఁ జెప్పెడువారు భటులుగారు
ఆ. గాన నీకు హితులు గారు వీ రందఱుఁ, నిన్నుఁ జంపి చావ నున్నవారు
వలదు సీత నిచ్చి నలినాప్తకులనాథు, కొలువు పట్టి యిల్లు నిలుపుకొనుము. 74

క. పరుషోక్తిబాధ చూడకు, పరిణామసుఖంబు చూడు ప్రతికెద వసురే
శ్వర! మందు చేఁదు చూడకు, పెరిఁగిన తెవు లడఁగఁజూఁడు పెద్దతనానన్. 75

ఉ. దాఁటక మాన రిక్కడలి దాశరథుల్ తమదండిమూఁకతో
దాఁటినదాఁకఁ జూడకకదా కని కావు మటంటివేని నా
ఫ్రాఁటయ కాచుఁ గాంచుటకుఁ బో మ్మిది మంచిది పోనినాఁటికిన్
నాటకపోవు నీయురమునన్ రఘువీరకఠోరబాణముల్. 76

క. ఱొమ్మునకు వచ్చి యానిన, యమ్మునకుం దప్పఁ దలఁగ కది నాటం గా
నిమ్మని కదియం దాఁకిన, పిమ్మటఁ బ్రాణములతోడఁ బెకలింపఁబడున్. 77

వ. అనిన నుగ్రాకారుండై దశగ్రీవుండు. 78

## రావణుఁడు విభీషణుం దన్ని వెడలఁ గొట్టుట.

ఆ. వీఁడు కొడుకు గాఁడు వాఁ డమాత్యుఁడు గాఁడు, వీరు వారు నెంచువారు గారు
ఇటు శపించువాఁడ వీవె నాతమ్ముండ, వనుచుఁ దన్ని వెడలుమన నతండు. 79

వ. ఆస్థానవేది డిగ్గి దశముఖున కభిముఖుండై నిలిచి యన్నా! నిన్ను నాలంబున సృగాలంబులపాలం బొమ్మనం జాలక యేల కలహంబు వలదు వలదని పలికినఫలంబు గలిగెంగదా యది యట్లుండె నాకు నింక వేఱొక్కరుం డెవ్వండు శరణ్యుండు.

## విభీషణశరణాగతి.

మానిని. శ్రీరఘువీరు నుదారుని భవ్యుని సేవ్యుని మాదృగనన్యగత
క్రూరదశాపహృతివ్రతధారుని ఘోరవనాటనచీరజటా
ధారుని ధీరుని గారణజన్ముని భావనమన్ముని భూనుతునిన్
ద్వారసమాగతు నున్నతిఁ గొల్చెద ధన్యత నిల్చెద నిత్యుఁడనై. 81

వ. అని తనమంత్రులం గూడుకొని యచ్చోటు వాసి చని నిజజననిచేత ననుజ్ఞాతుండై సీతామనోహరుని శరణంబు వేఁడుకొనుటకయి నభోమార్గంబునం బోయి తదీయ సేనావానరవీరులం గనుంగొని గగనంబున నిల్చి యి ట్లనియె. 82

పంచచామరము.—విపన్నుఁడం బ్రసన్నులార! విశ్వవంద్యుఁ డైనయీ
నృపాలుపాలఁ బెట్టరయ్య నీతి చెప్పఁ బోయినన్
నెపంబు పన్ని యన్న తన్నె నే విభీషణాఖ్యుఁడన్
విపక్షుసోదరుండఁ గాన వీరులార! భీతుఁడన్. 83

## శ్రీరాముఁడు హనుమత్పురుషకారంబున విభీషణు రక్షించుట.

క. అన విని సుగ్రీవాదులు, చని విభునకు నతని నమ్మఁ జన దనఁగా బా
వని యితఁ డనఘుం డెఱుఁగుదు, మనఁగా నుభయవచనములు విని విభుఁడున్.

ఉ. ఎచ్చట నున్నవాఁ? డభయ మిచ్చితి నేలితి రమ్మనుండు పొం
డచ్చపుదాయ యైన శరణార్థిఁ జూమీ యని యొక్కమాటు వా
క్రుచ్చినపిమ్మటం గలుపుకోలుతనంబునఁ గాతు వాని లో
మచ్చర మెంచరాదు మఱి మారఘువంశపురాచవారికిన్. 85

వ. అనినం దల యూఁచి యినతనయుండు రఘువరు నసాధారణం బగుశరణాగతరక్షాపరాయణత్వంబునకు నచ్చెరువందుచుం జని తోతెంచిన. 86

క. శ్రీరామచంద్రు లవణా, ర్ణోరాశితటి న్విభీషణుఁడు సేవించెన్
మారుతసుతధృత మగుసుప, కారము సుగ్రీవుపురుషకారముఁ గలుగన్. 87

తే. ఇట్లు సేవించి యంజలి యొత్తి యతఁడు, సకలసులభదయాసిక్తవికచనయన
తపము లెన్ని చేసితినొకో తావకీన, పరికరములోనివాఁడనై బ్రతుకఁగంటి. 88

ఉ. గంధిలపౌరుషప్రకటగౌరవ! రాఘవ! త్వచ్ఛరీరసం
బంధులవాఁడఁగానయితి మామకమౌళికిఁ దావకాంఘ్రిసం
బంధము గల్గె నిప్పరమభాగ్యము నేఁ డిటఁ గొల్లగొంటి నీ
గంధవహాత్మజాదికృతకార్యులలో నొకపాలివాఁడనై. 89

విభీషణుఁడు రామునకు రావణుపరాక్రమము దెల్పుట.

క. నావుడు దినరాజాన్వయ, దేవుఁడు మీయన్నలావు దిక్కులఁ బొగడం
గా వినియుం విభీషణ! నీ, చే వినఁగా వేడుకయ్యెఁ జెపుమా నాకున్. 90

వ. అనిన నతం డవ్విభున కిట్లనియె. 91

తరల. కదనకర్కశబాహువింశతిఁ గాలకంఠుని కొదలన్
చిదిమి పెట్టినబంటు వింట నజేయుఁ డద్దశకంధరుం
డదయహస్తచపేటలబ్ధదిగంతదంతిజయోదయుం
డదనుజన్మునిఁ గుంభకర్ణునిఁ దాఁకి నిల్వఁగ వచ్చునే? 92

క. శక్రజిదాదికుమారులు, విక్రమదుస్సహులు దనదువీఁకకు రాఁగా
వక్రించునతఁడు దర్పో, పక్రమమున దిగధిపాధిపత్యంబులకున్. 93

వ. దేవరకుఁ దక్కఁ దక్కినవారికి నతండు దుర్వారుండు. 94

క. అని దశముఖునతిశయమున్, దనచెప్పిననయముఁ దన్నుఁ దాఁకినభయమున్
వినిపించిన వెఱవకుమీ, నిను లంకారాజ్యపదవి నే నేలింతున్. 95

వ. అజ్జగద్ద్రోహిం ద్రుంతునని పలికి యవ్విభుండు తమ్మునిం జూచి. 96

విభీషణుని లంకాపట్టాభిషేకము.

శా. రా సౌమిత్రి! పవిత్రతోయముల నీరక్షఃకులాధ్యక్షు లం
కాసామ్రాజ్యవిభూతి కిప్పు డభిషేకం బింకఁ గావింపుమా
నాసామర్థ్యము చూచుఁగాని జగ మన్నన్ దేవతాదుందుభుల్
మ్రోసెన్ జేసె నతండు నన్నపనుపున్ మోదంబు రెట్టింపఁగన్. 97

వ. అనంతరంబ లంకాయాత్రకుం బ్రారంభించి రామభద్రుం డప్పయనంబు పయోనిధిం
బ్రార్థింపక సాఁగదని నిశ్చయించి. 98

## శ్రీరాముఁడు దర్భశయనుఁడై సముద్రుఁ బ్రార్థించుట.

క. నియమనిమీలితనయనుం, డయి కోమలదర్భశయనుఁడై యొకసికతా
మయమగువేలాతటమునఁ, బయోధిఁ బ్రార్థించుకొనుచుఁ బవళించుటయున్. 99
సీ. క్షీరవారాశిపై చికమాఱు దక్షిణక్షారపారావారతీరభూమి
ఫణిసార్వభౌమతల్పము మాఱు ధవళాయతంబైన మృదుసైకతస్థలంబు
తొలుపల్కు కలవరింతలమాఱు తత్తపశ్చరణోచిత స్తవోచ్చారణములు
యోగనిద్రాభోగభాగధేయము మాఱు చక్షుర్నిమీలనాచారదీక్ష
తే. కలిగెఁబో పూర్వపరిచితి దలఁపుసేయ, మనకుఁగా మానవుండైన మాధవునకు
ననుచుఁ దద్వృత్తలత కప్పు డఖిలసురలు, పిచ్చలించిరి వినువీథిఁ బిందుగట్టి. 100
తే. రాముఁ డీచందమునఁ ద్రిరాత్రవ్రతంబు, సలిపి ఫలియింపమిని లేచి జలధిమీఁది
యలుకఁ జిఱునవ్వుమొలకయై సెలవి నొలయ, మ్రోలనున్నట్టిసౌమిత్రి మోముఁజూచి.

## రాముఁడు సముద్రుపైఁ గోపించి బ్రహ్మాస్త్ర మేయుట.

క. ఎటువంటితగవు చేసెం ?, గటకట ! కంటే పయోధిగర్వము ? వినుమా
యిటువంటిది సౌమిత్రీ !, కుటిలాత్ములచంద మెంత గుఱిగాఁగన్నన్. 102
సీ. అక్కటా ! తనయింటి కభ్యాగతుండైన వృషభవాహనునకు విషము వెట్టె
మేఱ మీఱనియట్ల మెలఁగి నమ్మించి యిన్విశ్వమంతయుం మ్రింగె విలయవేళఁ
గడుపుగందినయట్టికొడుకు నొక్కనిఁ గాంచి పాంథులఁ జంపంగఁ బాలువెట్టెఁ
బ్రత్యక్ష మిపుడు నాపగరకు లోనిచ్చి తెరువాఁగి వాకిలి తెఱవఁడయ్యె
తే. ద్రోహి యనుమాత్రమే వీని త్రుళ్ళడంతు, విల్లుఁ దే తెమ్ము లక్ష్మణ! విశిఖముఖభ
యారసాతలవలమానభూరిగిరుల, వలనఁ దిరుగుడుమడుఁగు గావలయుఁ జూడు. 103
క. నాయమ్ములు తనపుడిసెఁడు, తోయమ్ములు గ్రోల నడుగుదుమ్ము లగచర
వ్యాయామమ్ముల రేఁగి వి, హాయస నది కెగయఁజూడుమా నిమిషమునన్. 104
చ. అని కినుక న్నిజానుజభుజాగ్రవిలంబిశరాసనంబు గై
కొని వెస నెక్కువెట్టి గుణఘోషము చేఁ దదుదన్వదూర్మిని
స్వన మడఁగంగఁ గొట్టి శతశ స్తతరోగ్రనిశాతశస్త్రసం
జనితనితాంతవహ్ని జలజంతువితానము నేర్చె నుద్ధతిన్. 105
సీ. ధావత్సడిండీరశైవాలములరీతి గురుగురుజ్యోత్స్నతోఁ గొన్నిపొగలు
ద్రుతపలాయితసవిద్రుమవీచికలమాడ్కిఁ గొదమకీలలతోడఁ గొన్నిపొగలు
వారటన్నిర్గచ్ఛదంభఃకరులభాతి గుణనినాదముతోడఁ గొన్నిపొగలు
నుత్పతన్మణిఫణ్ణమహోరగంబులభంగిఁ గ్రొమ్మిణుంగురులతోఁ గొన్నిపొగలు

తే. నిగిడి నీరంధ్రముగఁ బర్వె నిఖిలదిశల, దాశరథిచేత వారాశినాశవిశున
నిశితముఖ నిస్సరద్వహ్ని సిబిడ నిష్ఠు, రాస్త్రశస్త్రప్రకాండంబు లదరునపుడు. 106

చ. పొడిమిరియంబుగా వెడలిపోయెఁగొండల నుగ్గు చేసి యొ
క్కుడు జలజంతులం బొలసుకూరలు వండి వెడంద చిప్పలం
దుడుకఁగఁ బెట్టి ముత్తియపుటోగిరముల్ కడుఁ గ్రుమ్మరించె న
య్యెడ రఘువీరసాయకము లెక్కడ నేర్చె సువారపుంబనుల్. 107

ఉ. క్రీడమెయిన్ వెడల్చి వెసఁ గ్రిందికి మీఁదికి వైచి కందుకం
బాడఁ దొడంగె సింధుశరణాగతశైలశతంబులం గర
శ్లాడఁగనీక మంథనగమాడిన నాఁటి పరిభ్రమక్రమా
మ్రేడితవేగవాసనలు మేకొలిపెన్ బళిరే ! తదస్త్రముల్. 108

క. జలమాని యొగయుసచపల, జలదము లనులెత్తి దాఁటి జలధిభటు లనం
బొలిచి తెగె రామశరముల, నిల జడసంగతి సమాప్తిహేతువు గాదే? 109

ఆ. విషకృశాను లదర వీచికానిక్షిప్త, మగుచు సెగయుఁ దెంచె నహికులంబు
వింటఁ గడలి యేయుఁ విశిఖవ్రజమువోలె, నెదిరి తెగియె విభుని ప్రదరములను. 110

వ. వెండియుఁ రఘుపుంగవుండు కుండలితకోదండుండై యేయుచుండం గొండలుండు
గొందులు వెదకి వెదకి వెంట వెంటం బడి వేఁటలాడు సైంద్రబాణమ్ములునుఁ దర
లెత్తి మొత్తంబులై హత్తునుత్తుంగతరంగపాథఃపూరంబు చమురుగాఁ గ్రోలి మండు
నుద్దండసాహసస్వాహాసాయకసాయకంబులును సారసాతలంబుగా జడధిపాయువడ
నడఁచి తిమితిమింగిలగ్రాహకాకోదరకమఠకర్కటకాదిజలగ్రహనివహంబుల విహాయ
సంబున కెత్తి త్రిప్పుకొల్పు సురకరువలితూపులును మంథానమహీధరప్రవరప్రవితామహ
సహస్రంబు లనుబుద్ధి నుద్ధించు ధరణీధరపరంపరలం బుట్టింపుచు బిట్టుగా నిరంతర
గుభులుగుభులుధ్వానంబు లుప్పతిల్ల గుప్పిగుప్పి చుట్టు నడుగు గానంబడ నతిగంభీ
రారంభంబున నష్టదిక్కులం జెదరి మూలజంబాలంబు లంబరంబున కెగయం జేయుం
నద్రిదేవనాకశరంబులును గ్రమ్ముకొని యింక నెక్కడికడలి భాగీరథి బట్టబయిటం
బడియెఁగదా! గౌతమికి గతి యెయ్యది? కాలింది యెందుఁ జేరు? దక్కు పెక్కు
నదులకు దిక్కెక్కడనో? యనిపించె నయ్యవసరంబున. 111

క. వే తనివిసనక చేతని, శాతబ్రహ్మాస్త్ర మంది సంధించుతఱిన్
సీతాపతిఁ జేరి సుమిత్రాతనయుఁ డహో! మహాత్మ! తాళంగదవే. 112

ఉ. నీకడకంటిసత్కరుణ నేఁ డటు జానకిఁ జూడఁబోయెనో
శాక శమింప కింత యలుగం దగు నే యొకయుప్పుకాల్వపై?

లోకము తల్లడిల్లు నిఁక లోఁగొనవే రఘువీర ! శాతుఁగా
నీకడలి న్నినుం గొలువ నిప్పుడ వచ్చునటంచుఁ బల్కఁగన్. 113

## సముద్రుఁడు శ్రీరాముని శరణంబు వేఁడుట.

క. ఆతోయధి తనయొమ్మున, నాతలి కీతలికి వెడలినమ్ములతో గం
గాతుంగభద్రలపయిం, జేతులు పైచుకొని రాముఁ జేరఁగ వచ్చెన్. 114

తే. వచ్చి శ్రీరామునడుగుల వ్రాలె నబ్ధి, కేలుగవ పట్టి నిజసతుల్ వ్రాల వంప
నవని నురమాన వీఁపునవమ్ములెక్కఁ, బొటకుబొటకున గ్రొన్నెత్తు రొలుకనపుడు. 115

వ. ఇత్తెఱంగునఁ బ్రణామం బాచరించి యొట్టకేలకు నొక్కవెరవున లేచి సాంజలియై యిట్లనియె. 116

ఉ. ఓదయమానపౌరుష ! రఘూత్తమ ! నేనపరాధినైన నీ
పాదమునన్ జనింపఁ దొలుబాములనోములు పెక్కునోచు గం
గాదిమహానదుల్ త్రిభువనైకపవిత్రలు వారికైన ము
త్తైదువపోడుముల్ వలయు నల్గను నేనయ కర్తృఁడం గదే ! 117

చ. తరణికులావతీర్ణ ! పరతత్త్వమ ! నాయిలువేల్ప నన్నయో
కరుణఁ గనుంగొనంగఁదగుగాక తెగం దగునయ్య నాగుణం
బరసినయప్పుడే పలచ నయ్యెదఁ దప్పులు పట్ట నేటికిన్
నరవర ! యెంతయైనఁదగునా తెగ నాజ్ఞకు నాశ్రితుం డిలన్ ? 118

ఆ. తప్పఁ జూడఁదగునె? ముప్పున కయ్యెద, వనుచు నాదికాలముననె నమ్మి
నిన్ను నింట నిలిపినే నీకు నాబిడ్డఁ, బెండ్లి చేసినాఁడ బెద్దవాఁడ. 119

మ. నలునిం బంచి నగంబులొ బరపుగా నామీఁద కట్టించవే
వెలయన్ సేతువు లంక కాతెరువునన్ వేంచేయవే నీవిరో
ధులు నాబంధువులే ? జగత్త్రయహితా ! త్రుంపంగదే రావణున్
వల దన్నన్ మఱి నాపయిం గినియవే వారింపవే? కోపమున్. 120

ఆ. తొడిగినట్టితూపు దొనలోన వైచిన, దనుక డిందుపఁడదు మనసు నాకు
నటుల కానినాఁటి కనఘ! నాలోనున్న, మరుకిరాతకోటి మడియనేయుం. 121

వ. అనవుడు నారామభద్రుండు సముద్రుఁడు విన్నవించినతెఱం గాచరించి యతని నెప్పటియట్ల యుండు మని యనిచి నలుంబిలిచి నీవు వానరవీరులుదెచ్చి యందిచ్చుగట్టిగుట్టలం గట్టగట్టిన వనధికట్టువడుం బ్రారంభించు మని నియమించి దండెల్లం గొండలు పెకలించి తెచ్చునది యని చాటించె నంత. 122

## నలుఁడు సముద్రముపై సేతువుఁ గట్టుట.

క. హరివీరు లఖిలదిశలకుఁ, బరమోత్సాహముల నరిగి పరువులఁ బంతా
లురు గర్జలు సై శిఖరో, పరిపరిరంభణవిభక్తపర్వతు లగుచున్. 123

శా. ఆక్రాంతాచల మెత్తఁగా నొరు నొరుం డాసింప కుత్పాటనో
పక్రాంతిం గొనదాఁకఁ దోఁకనదుమన్ బంధించియుం గూట ఘో
ణిక్రీడన్ మొదలంటఁ ద్రవ్వియును బూన్కిం గౌఁగిటం బెట్టియున్
నక్రూరగ్రహణంబుగా ఝరులఁ గ్రిందం జింద బిట్టూఁచుచున్. 124

క. పదిగాదివాట్లు చుట్టుం, బదఘాతంబులును ననువుపఱిచియుం లావుల్
ముదలించి బంధసంధులు, వదలించి పెకల్చి రపుడు వానరు లద్రుల్. 125

ఉ. కొండలు ద్రవ్వినట్టి పెనుగుంటలవెంటనె నిర్గమించి మా
ర్తాండమరీచులం దఱిమి తాఁకినమాత్రమె కాదు రయ్యత
న్మండలముం గరాగ్రగిరిమండలిచేఁ గపులాఁచి దాఁచ నీ
కొండలు గాచెఁ బైకొని ఫణీశఫణామణిదీప్తు లిమ్మహిన్. 126

సీ. కూలు సైరిభములు కొలపగల్తలపోసి రవిరథ్యములు పొట్టలవియఁ దన్నఁ
గలిగెఁ బో గట్టిషగ్గవు లంచు నరుణుండు కుణకుల దిగజాఱుఫణులఁ బట్టఁ
దప్పునే భవితవ్య మెప్పాట నన దిశాకరులపై నడిఁ దాఁకి హరులు పడఁగ
మగుడంగ ఱెక్కలు చిగిరించెనో యను జంభారిదంభోళి సంభరింప

ఆ. గగనభాగ మెంత గల దంతట నగంబు, లాడఁ జొచ్చెఁ దెచ్చునపుడు గపులు
వరుస కెగర నెగర వైవఁగా గలగలఁ, గటక కాననములు గ్రక్కదలఁగ. 127

ఉ. ఈగతిఁ దెచ్చి తెచ్చి కపు లెల్లరు నుబ్బునఁ దారతార ద
త్సాగరమధ్యవీథి రభసంబున వైవఁ దొడంగి రగ్గిరుల్
సాగిల నెత్తిఁబెట్టియును సందిటఁ బట్టియుఁ దోఁకఁ జుట్టియున్
వేగము నేలఁ ద్రొక్కియును వెన్కకు నిక్కియు నింగి కెక్కియున్. 128

క. హెచ్చినరాముని శరముల, నొచ్చినతరువాత గిరులు నూటార్లు పడన్
వచ్చునె జలచరములపై, వచ్చుం బైపైన చెడ్డవారికిఁ జేటుల్. 129

క. ఇది యొకటె చాలుఁ దుదయున్, మొదలున్ వేలానువేలముల మిగులఁగనీ
యుదధిపయిఁ బఱచి యవలికిఁ, గదలుట కని తెచ్చినవియ కలగిరు లెల్లన్. 130

క. కపు లింత అనియుం నొక్కక, కపితెచ్చినకొండ లిన్నిగల వనియుం గ్ష
త్తి పఱుపరా దని మునిఁగెం, గపటకిటిస్వామి గొరిజఁ గాఁడినబోఱియన్. 131

ఉ. కచ్ఛపరాజు వెన్నుముక ఖంగునఁ దాఁకనిగట్టు లేదుగా

తచ్ఛరధిం బ్లవంగసముదాయము వైచినదాన నీదృశ
స్వేచ్ఛల వైవ నొండుమల యేనియుఁ దేలుట దక్క నొక్కఁడం
తచ్ఛదదంశమన్నలుఁడు దాఁగొని కట్టినఁ దేలె నన్నియున్. 132

తే. కపులు కాపేయ ముడిగి కైంకర్యమునకుఁ, జాలుటయుఁ నీటిలోఁ ఱాలుదేలుటయును
జాలదే రావణాదినాశ ప్రశంసి, దుర్నిమిత్తంబు లిఁక నేమిదోఁచవలయుఁ? 133

## శ్రీరామాదులు లంకకుఁ బయనమగుట.

వ. అనంతరంబ కౌసల్యానందనుండు పరమానందభరితుం డై సుగ్రీవవిభీషణులం బిలిపించి యేమీ కదలుదమే? యని యానతిచ్చిన మోడ్పుఁ గేలెత్తి దేవా! మహానుభావ! సిద్ధసంకల్ప! వేంచేయుము శత్రుక్షయంబుఁ జేయుము. నావుడు విభుండు సుగ్రీవుని ముందఱ సేనల నడిపించు మనియుం విభీషణుని వెంటఁ బాయక రమ్మనియుఁ నియోగించిన వారునట్లనయాచరించిరి తానుందమ్ముండును హనుమంతునినంగదుని వాహనంబులు గావించుకొని వనరాశితరంగభంగురధ్వానంబులు మంగళతూర్యనినాదంబుగా నంగీకరించి నలనిబద్ధసేతుమార్గంబున విజయంచేసి రయ్యవసరంబున. 134

క. చల్లనికమ్మదనంబులఁ, జల్లెడు ననుకూలపవనసంతతు లెసఁగన్
మెల్లమి గని యష్టమది,గ్వల్లభు నాఁబోతు ఱంకె వైచె న్నింటన్. 135

ఆ. మునుపు తారు వైవ మునిఁగినకొండల, నెనుకి తేరఁ బన్నిదములు వైచి
జలధి నఱికి యంతికి గెలిచినకపు లెల్ల, వచ్చి మ్రొక్క నగుచు వల్లభుండు. 136

వ. ఇత్తెఱంగునఁ బ్లవంగబలంబుల చేష్టలు గనుంగొనం గనుంగొనుచుం జనుదెంచి. 137

ఉ. సాలతమాలపాటలరసాలపలాశపటీరభూరుహో
త్తాలము మారుతోల్లలదతాంతలతాంతనితాంతవాసనా
ఖేలదలీనజాలము శుకీకలకంఠనవీననాదవా
చాలముఁ గాంచె నంత రఘుచంద్రుఁడు వేలసువేలశైలమున్. 138

వ. కాంచి యయ్యఖిలదిక్కూలంకషోదగ్రగ్రావాగ్ర విశాలోన్నతగుణమాహాత్మ్యంబు నకు నచ్చెరువడి రఘువీరుండు మరుత్కుమారుం గనుంగొని తత్ప్రకారంబు తెలియ నడిగిన నయ్యచలంబు దనకు బూర్వపరిచితంబు గావున నగ్గిరీంద్రగౌరవం బెఱింగింపందొడంగె నిత్తెఱంగున. 139

ఉ. రావణు సంగరక్షి యసురప్రభు నాపదకైన నిందు లం
కావిభుజీవగఱ్ఱ దశకంఠుని పెన్నిధు లున్న టెంకి ర
క్షోవరురాజ్యలక్ష్మి మనుచోటు సురాంతకుభాగ్యరత్నపుం
గోవ యనం దనర్చు త్రికూటము మ్మిది లక్ష్మణాగ్రజా! 140

క. మత్తాసురవంశము చెడు, నిత్తఱి నిజ మని యంపరికరీంద్రధ్వనిచే
నుత్తాలబాహువై యిపు, డెత్తునఁ జాటుక్రియఁ దోఁచె నిగ్గిరి కంటే? 141

తే. కంటివే గైరికస్థానకములుదీని, తటము లంగంబు లగుచు నంతటను వెలుఁగఁ
గదిసి యందర్క హయఖురక్షతము లొరపు, గఱపుది కాంతలకునఖక్షతములగుచు.

మ. మృగగర్భంబులు చించి తద్రుధిరముల్ మేతైనమధ్యం బుద
గ్రగతిం గ్రోలి మదించి నిర్భరభుజాకండూతి వాయన్ శిలల్
వగులం దాఁకుచుఁ బెచ్చు రేఁగి నిజవప్రక్షోభముం జేయుదై
త్యగణంబుల్ భరియించు నిగ్గిరికి సామ్యం బెద్దియుం గల్గునే? 143

క. చెఱఁ బెట్టెను దశముఖుఁ డే, డ్తెఱ నిచ్చటఁ జందమామ దేవేరుల నం
దఱ ననఁ గను మిగ్గిరితన, చఱులఁ దగుల్పడినచుక్కచాలునఁ బోల్చన్. 144

చ. ఇతరనగంబు లెత్తువడియెం గపివీరులచేత నెన్నఁడున్
ధృతిఁ దను దేవదానవులు దీఁనలే రని యున్నగర్వసం
గతినొ గుహాముఖస్ఫటికకాంతిమిషంబున నవ్వుచున్నద
ప్రతిహత మైనతెంపున నృపా! కనుఁగొంటివె యిన్నగేంద్రమున్? 145

క. హిమశిశిరమధుతపాబ్దా, గమశారదసమయసార్వకాలికభోగ
క్షముఁ డై యిగ్గిరికాంతా, రములం గ్రీడించుఁజుమ్ము రావణుఁ డధిపా! 146

తే. కడలి యావాలపై మించఁగాఁ ద్రికూట, నగమునగమట్ల పోలుచు నన్నడుమఁగంటె
వివిధరత్నమరీచిపల్లవిత మగుచు, నతులదిగ్దంతిరదకోరకితము నగుచు. 147

ఉ. కంజవిరోధియందులదిగా దది కందు దశాస్యుచేతిభీ
తిం జరియింపుచున్ బెదరి దిక్కు మొగంబులువోలె నేతద
ద్రిం బెఱ నున్నదిక్పతిసతీజనపంక్తులపక్ష్మలాక్షికో
ణాంజనబాష్పపాతముల నైనకళంకముగాని రాఘవా! 148

మ. హరిదంతద్విరదేంద్రదంతహతిచాయల్ చూప నీయద్రిగ
హ్వరమార్గంబులు చొచ్చి కొంత చని యుష్ణాంశుపంక్తుల్ తదం
తరగాఢాంధతమంబు పాయుంవగ గానన్ లేక వీఁగున్ సుదు
స్తరవృత్తిన్ బహిరంధకారమె యడంచం జాలి వీక్షించితే? 149

క. అని హనుమంతుఁడు దెలిపిన, వినుచున్ గిరచెంత విభుఁడు విడిసెన్ దోడ్తో
డనె సరిగా నొకసరిగా, వనచరసైన్యములు మించె వడి నన్నగమున్. 150

వ. అప్పుడు. 151

చ. వెళవెళ నార్చి మల్లడగఁ దేర్చి జవంబునఁ జెట్టుచెట్టునన్

శిలశిలఁ బ్రాఁకి పూఁబొదలు చించి హాళాహళిగా ఫలావళుల్
జలజల రాల్చి వప్రమణిజాలము లూడ్చుచు వానరుల్ దిగం
చలములు మ్రోయ రాయిడులు సల్పఁగ మారుతి పల్కె రామునిన్. 152

తే. దేవ ! సురసిద్ధసాధ్యసాధ్వీజనంబు, చెఱలు విడిపించి పుణ్యంబుఁ జేర్చికొనుట
రాజధర్మంబునకు శేఖరం బటన్న, నలరి విభుఁ డట్లు కావింపు మనిన నతఁడు. 153

చ. చెఱ జవరాండ్ర నెల్లఁ గపిసింహ మహో! విడిపించి పంచినన్
వెఱచి పరిగ్రహింప కలవేల్పులు రావణబాధ యొంచి యం
దఱు వినువీథినుండి తమవారుల కువ్విళులూర దైత్యుఁ డి
త్తఱిఁ బడు రాముచే వలదు తద్భయ మంచు వచింప నయ్యెడన్. 154

సీ. ఊరఁబడి వెడలి క్రేళ్ళుఱుకంగఁ జూచుచు బెదరుచుఁ జను లేటికొదమ లనఁగ
భీమజాంగలికపేటీ మోచనము గాంచి తలఁకుచుఁ జనుపాపచెలువ లనఁగ
సముదీర్ణపంజరస్థానంబు వెలువడి యళుకుచుఁ జనుముద్దుచిలుక లనఁగ
వలలకుఁ జిక్కి వెల్వడి లేచి ఱెక్కలుఁ జాడించి చనునంచచాన లనఁగఁ

తే. చెఱల విడివడి రామ జే జే యటంచుఁ, దవిలి మ్రొక్కుచుఁ దమయథాస్థానములకుఁ
జనిరి తడయక నలుగడల్ గనుచు దివిజ, గరుడగంధర్వకిన్నరకంజముఖులు. 155

హనుమంతుఁడు రామునకు రావణువిహారస్థలంబులఁ దెల్పుట.

వ. తదనంతరంబున హనుమంతుం డవ్వసుంధరాధరాధిత్యకాతటంబులం గలపంక్తి
కంధర విహారస్థలవిశేషంబు లెఱింగింపం దొడంగె నివ్విధంబున. 156

సీ. ఇవి వేల్పుజవరాండ్ర నీడ్చి మానము దూలపుచ్చు సంకేతంపుఁబువ్వుటిరవు
లివి గుఱ్ఱపుమొగంబు చివురాకుఁబోఁడులఁ దెగి చెట్టఁ గట్టిన తెంకిపట్టు
లివి సిద్ధసాధ్యమానవతీవితానంబుఁ గలఁచు కారాగృహకందరంబు
లివి చిల్వచెల్వల హ్రీభంగ మొనరింపఁ జలపట్టు సెలయేటిచఱులజాడ

తే. లివి కనుంగొను మెడనెడ ధవునిఁ గూడి, క్రీడ గావించు మందోదరీపురంధ్రి
చరణపంకజలాక్షాంకసాక్షు లైన, నెలచలువ వెన్నెలబయళ్ళు నృపవరేణ్య! 157

క. అని హనుమంతుఁడు రఘురా, మున కగ్గిరిఁ గలవిశేషములు దెలుపు నెడం
గనఁబడియె వారి కీగతి, నొనరన్ దశకంఠనాశకోత్పాతంబుల్. 158

మ. తవిలెన్ రావణదాహసూచకగతిం దావాగ్ని దిక్పాళి రా
ఘవబాణార్చులు రాలు నింక నన లంకాగోపురోత్తుంగశృం
గవిటంకంబులఁ జౌకళించె నపు డుల్కల్ దైత్యపక్షంబు లి
ట్టిగో ప్రీలు నన్ ఖభేరిమము లయ్యెం గంద పాషాణముల్. 159

ఉ. అంబరవీథి దారొక్కని దశాస్యలయావహధూమకేతుభా
వంబునఁ దోఁచి యంతట నవాచి నుదీచిఁ బ్రదీచిఁ బ్రాచి తే
చెంబొగ యప్పు డప్పుడమిచెల్వయుఁ గంపము నొందెఁ గూఁతు సీ
తం బొగిలించుపంక్తిముఖదైత్యు భరింపఁగలేమినింబలెన్. 160

శ్రీరాముఁడు వ్యూహముం బన్నుట.

వ. తదనంతరంబునం గాకుత్స్థవీరుం డొకమొత్తంబుగా నేర్పఱించి నిఖిలవానరసేనావ్యూహంబునకుం బార్శ్వంబున ఋషభగంధమాదననీలాంగదదుర్జయులం దద్వక్షంబున దివసమణితనయుం బశ్చాద్భాగంబున భల్లూకవల్లభసుషేణహార్యక్షులం గుక్షిప్రదేశంబున గవయగవాక్షశరభశతబలిముఖవలీముఖాద్యక్షుల నునిచి యుత్తమాంగంబున దాను నిలిచి పంక్తివదనువృత్తాంతం బరయం దగినగూఢచారులం బనిచి యుండు నవసరంబున. 161

శుకుఁడు రావణునకు రామవృత్తాంతము నెఱిఁగించుట.

చ. శుకుఁ డనుదూత పంక్తిముఖచోదితుఁడై చనుదెంచి కీశసై
నికనికరంబు పెంపు ధరణీవరు తెంపును జూడ వానివా
లక మొకవీరవానరలలాముఁడు గన్గొని పట్టితెచ్చి కా
నుక యిడ రాఘవుండు కృప నూల్కొనఁగా విడిపించి పంపినన్. 162

క. చని వాఁడు కీశవీరులు, వననిధి బంధించి దాఁటి వచ్చుటయును రా
మునియప్రతీపమహిమయుం, వినిపించి నిశాటవిభుని వెండియుఁ బలికెన్. 163

ఉ. ఒక్కకవానరుండె విను మొక్కట సప్తసముద్రతోయముల్
పుక్కిటఁ బట్ట భానుహుతభుక్కులఁ జిక్కులఁ బెట్ట మృత్యువుం
జెక్కలి గొట్ట నంతకుని జెట్టులఁ గట్టఁగఁజాలు లెక్కకుం
జిక్కల కెక్కు డట్టిబలుజోదుల నేలినరాము నేమనన్? 164

క. కావున రాముఁ డజేయుఁడు, రావణ పనిలేదు మచ్చరం బిఁక సీతా
దేవి నిపు డిచ్చి ప్రాణము, గావలసిన శరణ మొందఁగాఁ దగు ననియెన్. 165

వ. అనిన నద్దశకంధరుండు బంధురతరరక్తలోచనుండై భ్రుకుటినటీరంగస్థలాయమాననిటలభాగుం డై కల్పాంతదహనకల్పానల్పరోషంబున నిట్లనియె. 166

ఉ. అంబుజసంభవుండును బలాంతకుఁడున్ మొదలైనదేవసం
ఘంబులు వచ్చి నాకొలువు గాంచఁగఁ గోరి యొకళ్లొకళ్ల ని
త్యంబును వాకిటం గవియ దండధరుల్ ప్రహరింపఁగాఁ గిరీ
టంబులు దుల్ల నందడిఁ బడన్ నరవానరు లింక లక్ష్యమే? 167

ఉ. కించుదనంబులేక వలకేల నొకించుక యప్పళింత గా
వించినఁ బండ్లుపీడు భయవిహ్వలసిద్ధవధూకరస్థల
త్కాంచనవల్లకీచయము గా నలబంగరుగట్టు నెట్టు ని
స్సంచలనాస్మదీయభుజచండిమకుం బ్రతిగల్గ నేర్చునే. 168

క. దనుజకులపుంగవాకృతి, వినుముప్పదిమూఁడుకోట్లవేల్పులఁ దలమో
చినకైలాసము నే చి, వ్వన మూఁపున నెత్తఁ గకుదమై తగు నాకున్. 169

తే. వెండియును నెత్తనామీఁద వెండికొండ, మించి సెలయేటినీటఁదొలఁకించుఁదొడఁగు
నపుడు వీరాభిషేక ప్రతార్థ మొదవు, పూర్ణకుంభంబు పోల్పఁ దెల్పుచుఁజెలంగు.

ఉ. అంకుశభిన్నమై కుపితమై ననుఁ దాఁకి యురంబు దూర్చి వ
క్రాంకునిదంతిదంతము లుదగ్రగతిం బెకలింప రాక యా
తంకము నొందఁగా విఱిగి తచ్ఛకలంబులు మోసు లెత్తఁ గీ
ర్త్యంకురలీల దాల్తు నిఁక నవ్వల నా కెదు రెవ్వ రయ్యెడన్ ? 171

ఉ. ఏమును శంక డెందమున నించుక యేనియుం లేక త్రుంతు సు
త్రామమదాంధసింధురమదం బొకసింహము మాడ్కి నింక లం
కామృగయావనాంతరము కందువ నొండొకచింత మాని యా
రామమృగంబు సత్త్వ మనురజ్జువునం దుది గట్టివేయనే? 172

ఉ. చంచలనేత్ర సీత విడఁ జాలుదునే శుక ! యేమిగా నిరీ
క్షించితి నన్ను సృష్టియిటఁ జీఁకటిఁ జేసెదఁ జూడు మంచు రా
త్రించరపుంగవుం డలుక దిక్కులు మ్రోయఁ బ్రయాణభేరి వే
యించె సమస్తరాక్షసుల కింపొదవన్ బవరంపుఁదెంపునన్. 173

క. తద్భేరీభాంకృతి విని, యుద్భటు లవ్వీరవానరోత్తములు సర
స్వద్భంగార్భటి యనఁగవా, రిద్భిత్తులు పగుల నార్చిరి రణోన్ముఖులై. 174

రాముఁడు సువేల మెక్కి లంకం జూచుట.

తే. అపుడు రఘువీరుఁ డచలశృంగాగ్ర మెక్కి, చూచె గృహరత్నదీప్తిరింఛోళి గప్పి
యసురనాశంబు సూచించునదియుపోలె, రూపు గనరాక యున్నలంకాపురంబు.175

ఉ. లంక నగాగ్రలగ్న నకలంకమణీమయఁ గాంచి యాత్మది
క్పంకరుహాక్షు లంజనము పట్టఁగఁ గంచము నిల్పి మీఁద వి
స్పంకవలంకునన్ వెలుఁగఁ బెట్టినదీపికగాఁ దలంచి ని
శ్శంకుఁడు రాఘవేశ్వరుఁడు సంతస మందఁదొడంగె నయ్యెడన్. 176

తే. లంకలోఁ గూడ నిజశృంగ మింక నిటకుఁ, దెండు వేగమె యని యప్పసిండికొండ

యాత్మజాతుల నంపెనో యనఁగఁ గాంచ, నాభమూర్తులు గపు లెక్కి రన్నగంబు.

తే. తనదుప్రాణేశ్వరికి మహీతనయ కేడ, యావహిల్లెనో దురవస్థ ? యనుచుఁ గాక
చుఱుకుఁజూపుల రఘుపతిఁ జూచినపుడ, లంక యావహిల్లెఁగొనఁడె నిశ్శంకమహిమ.

వ. అయ్యెడ. 179

చ. ఉదిరి పసిండిచాయ గలయొప్పులకుప్పలు వేఁడివేలుపుం
గొదమలు దావపావకునికుఱ్ఱలు చిచ్చుఱకంటిచెచ్చెలుల్
తుదజనువేఁడుముల్ పిడుగుతున్కలు వానరవీరు లొక్కటన్
బొదవిరి లంకచుట్టునను భూగగనంబులు నిండ నార్చుచున్. 180

వ. అంత దశకంధరుండు. 181

## రావణుఁడు వానరసైన్యముకడకు శుకసారణుల నంపుట.

క. శుకుచేత మున్ను రఘుసా, యకుమహిమము వినియుం మఱియుం నాతని సమరాం
తకుఁ డనిచెం గార్యవిచా, రకృతిన్ సారణుని గూర్చి రణతత్పరుఁడై. 182

వ. ఇట్లు రావణాదేశంబున శుకసారణు లిరువురు నరుగుదెంచి. 183

క. రెండవసముద్రముంబలెఁ, జండతరార్భటిఁ బ్లవంగసైన్యంబు సము
ద్దండగతి రామచంద్రున, ఖండాభ్యుదయమున కలరఁ గాంచిరి మఱియున్. 184

ఉ. కొందఱు లంక చుట్టియును గొందఱు వారిధికట్ట మెట్టియున్
గొందఱు దాఁటివచ్చియుఁ ద్రికూటశిఖాతలశాఖిశాఖలన్
గొందఱు వ్రాలియున్ బ్లవగకోటు లజాండము లీనుపిల్లల
ట్లందఱు భూనభోంతరము నల్లుకొనం గని చారు లిర్వురున్. 185

తే. అదిరిపడిపొంచిపొంచి యందంద యరసి, తిరుగునాదైత్యచారులతెఱఁగెఱింగి
సమ్మదంబున రఘువీరుసమ్ముఖమునఁ, బెట్టెఁ గొనిపోయి వేగ విభీషణుండు. 186

వ. అప్పు డద్దనుజచారులం గనుంగొని రఘువీరుండు కరుణాపరుండు గావున నిట్లను విభీషణా! మనయపారవీరవానరసేనావ్యూహసన్నాహంబు గలయం దెలియఁ జూపి దశాననునకు నెఱింగింపఁ గావలయుఁ విడిచి పుచ్చు మనిన నతం డయ్యిరువురకుం బేర్వేర సకలసైన్యంబుల నాయాచమూపతులయతులసన్నాహసంరంభసామగ్రియుం జూపి మీయేలికపాలికిం జని బలవద్విరోధంబు వలవదు రాఘవామోఘశిలీముఖప్రహారంబులం దూలిచనక మునుగలుగ జనకతనయం దెచ్చి యిచ్చి యయ్యార్తరక్షాపరాయణుంగని మని తిరుగుమని యనుండు పొండని యనుప ననుపమప్రమోదంబున నరిగి నిర్భయంబుగ నాచారద్వయంబు రావణుని కిట్లనియె. 187

### శుకసారణులు రామసేనావిశేషములం దెల్పుట.

ఉ. వ్యక్తిత్రయంబునం బోలుచు దేవుని కేళి నశేషముం బల్విభుల్
వ్యక్తియె వాణియుం బొగడ వారలదీప్తి కపీంద్రులం జతు
ర్వక్త్రుఁడు నేర్చునే భుజగవర్యవశంబె గణింప ? నింక నీ
వక్త్రము పూర్వసంచితతపఃఫల మెట్లగునో ? దశాననా ! 188

ఉ. చూడవు గాని రాఘవరుజోదులఁ బోల్పఁగరానికయ్యపుం
బ్రోడల భానుకోటిరుచిఁ బోల్చిన బల్విలుకాండ్రఁ జుక్కరా
జోడుమొగంబువారల యశోధనులన్ బగదాయచూడ్కికిన్
వేడుకగొల్పరే వినిన వీరులవిందులుగావె తత్కథల్ ? 189

క. ఇల నరులఁ దినెడుమనకుం, గలిగిరిగద యిప్పు డసురఘస్మరు లిఁక వా
రల నరవానరు లని మదిఁ, దలపకు మొకయప్పుడేని దనుజాధీశా! 190

### శుకసారణులు వానరవీరుల నేర్పఱించి దెల్పుట.

క. అని శుకసారణు లాడిన, విని విస్మయ మంది వారివీరాకృతు లేఁ
గనుఁగొందుఁగాక యనివే, చని రావణుఁ డెక్కె నొక్కసౌధాగ్రమునన్. 191

తే. నిలిచి చారుల రావించి యిలయు దివియుఁ, ముంచుకపివీరసేనల మించు గాంచి
వీరిలో ముఖ్యు లెవ్వార లేరి ? రాముఁ, డతని యనుజన్ముఁ డెట్టివా ? రనుచుఁ బలుక.

సీ. కలితసుగ్రీవయై కడుఁ బ్రశస్తి వహించి కుముదాప్తముఖి వికాసమునఁ బొలిచి
బ్రకటరంభోరువైభవమునఁ బాటిల్లి కేసరిమధ్య యై కీర్తి గాంచి
స్ఫురితలీలాంగదభూషిత యై మించి తగుగజగామిని యగుచు నలరి
ఘనచక్రజఘన వై ఖరిజాడ రంజిల్లి కార్ముకభ్రూభంగిఁ గరము మెఱసి

తే. కంటె దశకంఠ ! యలరు నిక్ష్వాకువంశ, నృపునిముందర సాక్షాత్కరించు విజయ
లక్ష్మియునుబోలె భువనకూలంకషోగ్ర, విక్రమోదార వానరవీరసేన. 193

చ. గవయుఁడు వాఁడు వానివెనుకన్ గజుఁ డాకడ గంధమాదనుం
డవల నలుండు నీలుఁ డతఁ డాతరువాత సుషేణ భల్లుక
ప్రవరులు వారు వారియిరుపక్కియలన్ శరభాదియోధపుం
గవు లతఁ డంగదుం డఖిలగణ్యుఁడు వాలిసుతుండు రావణా! 194

క. ప్రతిలేనియట్టియప్రతి, హతమల్లులఁ బుట్టియున్న యగచరసైన్యం
బతిలోక మపారమద, ప్రతత మవాఙ్మనసగోచరము దనుజేంద్రా! 195

క. ఏవంవిధకపికోటికి, జీవాతువు సూర్యసుతుఁడు సీతాపతి సే
నావల్లభుఁ డతనిం గుల, పావను సుగ్రీవుఁ జూడు పంక్తిగ్రీవా! 196

క. అక్షజయశాలి సాహస, దక్షుని లంకాపురీదిదక్షాదీక్షా
రూక్షప్రతాపుఁ గంటే, సాక్షాల్లయసమయపవనసఖు సామీరిన్! 197

ఉ. ఇందుశతంబు నేలుమొగ మిక్షుశరాసనకోటి నీనుచ
క్కందనముల్ దనర్చు తొలుకారుమొగుల్ జిగిమేనివాఁడు లం
కం దెరలించుమాడ్కిఁ గినుకం దనుజాన్వయ మొక్కగ్రుక్కమిం
గం దమకించుమించువిలుకాఁ డలరాముఁడు చూడు రావణా! 198

మ. మును గాచెం గ్రతువంఘ్రిధూళి శిలఁ గంబుగ్రీవఁ గావించె శం
భునివిల్ ద్రుంచె వరించె సీత భృగురాముం గెల్చె గూల్చెన్ ఖరున్
దునిమెన్ మాయమెకంబు నేసె రవిపుత్త్రున్ వాలిఁ దూలించె న
వ్వనధిం గట్టె విభీషణున్ నిలిపె నిక్ష్వాకుండు సామాన్యుఁడే? 199

తే. చిఱుతప్రాయంబువాఁడు పసిండిచాయ, మేనుగలవాఁడు విలుకాండ్రమేటివాఁడు
వీరరస మిట్టిరూపమై వెలయువాఁడు, రాముతమ్ముఁడయా వాఁడు రాక్షసేంద్ర!

మ. కనుఁగొన్నంతనె యాదరించి తను లంకారాజ్యపట్టాభిషి
క్తుని గావింపఁగ మాట యిచ్చి కృపఁ గాకుత్స్థుండు మన్నింపఁగా
మను నీమర్మము వీరధర్మకులకర్మంబుల్ నిరూపించునీ
యనుజుం గంటె విభీషణుం దివురు నీయాపద్దశల్ గన్గొనన్. 201

ఉ. హాస్త్యసురారి పత్క్రతువరావధి యయ్యెనొ! కాక వీరె నీ
వస్త్యము వంశముల్ జెఱుప వచ్చినవానరవీరు లేల చా
లస్త్య! వృథావిరోధ? మకళంక నిలాసుత నిచ్చి రాఘవో
పాస్త్యభిలాష పూని నిరపాయసుఖస్థితి నుండఁ జెల్లదే? 202

శా. స్వర్ఘంటాపథసీమ నిల్చి యమరుల్ సంతోష మందన్ మహా
నిర్ఘాతోగ్రరఘూత్తమాస్త్రనిహతి న్నీ కేటికిన్ గీడ్వడన్?
దీర్ఘక్రోధము మాని మానిని ధరిత్రీపుత్త్రి నిమ్మా భవ
ద్దోర్ఘోరక్రమవిక్రమంబులు వృథా స్థూలంబు లౌఁ జెప్పితిన్. 203

ఉ. కంటున రాఘువేశుఁ డలుఁగన్ నలుమోములవేల్పు నోడు ము
క్కంటికి నింతబంటి నన కైదువుపోటరిఁ గన్నచుట్టు వా
లంటినయట్టియొక్కటియం నాతఁడు నొక్కటి యవ్విభుం డనిన్
బంటుతనంపుఁబెంపు సెఱపన్ నిలువం గలరే భవాదృశుల్? 204

వ. అనిన రావణుండు రోషించి. 205

క. చారులుగాఁ దగుదురె కపి, చారులు మద్రిపుహితప్రచారులు దుష్టా

చారులు పరిగ్రహితసం, చారులు మీ రన్యయూపచారులు దలఁపన్. 206

మ. అని రోషాఘూర్ణితనేత్రుఁడై దశముఖుం డల్కన్ శుకున్ సారణున్
గని వారిన్ గటుశబ్దదాభిముఖుఁడై గద్దించి వధ్యుల్ గదా
యని యుత్తుంగనగావతీర్ణ మగుకాలాభ్రంబుచందంబునన్
దనుజాధీశుఁడు మేడ డిగ్గి యతిచింతాక్రాంతచిత్తంబునన్. 207

క. కుందుచుఁ జారుల మఱియుం, గొందఱ వీడ్కొల్పి భానుకులవీరుల వెం
పుం దెంపును గపివీరుల, చందంబును దెలిసి తాల్మిఁ జని యలసుండై. 208

రావణునానతి విద్యుజ్జిహ్వుఁడు రాముశిరము సీతకుఁ జూపుట.

క. కలఁగుచు విద్యుజ్జిహ్వునిఁ, బిలిచి మహీపుత్త్రి యాత్మ బెగ్గిల మాయా
బలమున రామునివిల్లుం, దలయును నిర్మించి చూపఁ దగు నని పలికెన్. 209

వ. వాఁడును దత్ప్రకారంబునం గావించి తెచ్చిన మెచ్చి యశోకవనికిం జేర్చిన. 210

సీత రాముశిరముఁ జూచి దుఃఖించుట.

చ. అతఁ డపు డట్లు చేసి జనకాత్మజముందఱఁ దెచ్చి వైవ నా
సతియును భీతి గాంచి రఘుచంద్రునిధన్యధనుశ్శిరంబు లీ
గతి నిటు లయ్యెనే? యని వగన్ బడి మూర్ఛిలి వ్రాలి యంతలో
దితిజునిమాయయో! యనుచుఁ దెప్పిరి ముప్పిరిగొన్నఖిన్నతన్. 211

చ. బొమగవసోయగంబు శ్రుతిభూషణలీలఁ జెలంగు నబ్జమి
త్రము లగుదీర్ఘనేత్రము లరాళతరాలకజాలకాంతిమం
జిమమును నవ్వుకెంబెదవి చెక్కులఁ జెందము లాడుచాకచ
క్యములును జూచి రాఘవముఖం బని సందియ మంది యాత్మలోన్. 212

చ. తలఁకొని యవ్వసిష్ఠపదతామరసంబులతావి గ్రోలి భూ
తలనుతకీర్తిసంపదకుఁ దాఁ దలకట్టును నైన భానుమ
త్కులమున కెల్ల బెద్దతల గోత్రభిదాదుల పూజ గాంచి యా
తల మఱి సాటి లేనిదిగదా ధవ! నీతల యంచు వేమఱున్. 213

ఉ. అంకతలంబుఁ జేర్చుకొని హా! యనుచుం దలవడ్డచోనె కా
ళ్లింక సహింతునే? యని యొకించుక యూహ యొనర్చి యాజి నా
తంకము నొందునే దశరథక్షితిపాలునిముద్దుపట్టి ని
శ్శంక భుజాబలుండు ఖరసంహారుఁ ? డంచుఁ దలంచుచుండఁగన్. 214

ఉ. కంటివె మత్ప్రతాపము జగంబులు మువ్వురునం గలంతు నేఁ
గం టొనరించినం దృణము గాదె మనుష్యుఁడు రాముఁ! డింక లేఁ

దంట యెఱుంగుకొంటె యిఁక నైనను వేఱొకచింత మాని చే
కొంట తగుఁ‌ మదిం దలఁచుకొమ్మని పంక్తిముఖుండు పల్కినన్. 215

సరమ రాక్షసమాయఁ దెలిపి సీతాదుఃఖముఁ దీర్చుట.

వ. అప్పు డప్పరుషవాక్యంబులు సైరింపలేక యాకంబుకంఠి కాకుత్స్థవదనారవిందసందర్శనంబు గలిగె నిప్పుడ మజ్జీవితం బుజ్జగింతు మాయన్న! పంక్తికంఠ! నీయకుంఠక్రూరఖడ్గధార నన్ను విదారించి పుణ్యంబుఁ జేర్చుకొమ్మని పలుకుసమయంబున నొక్క దౌవారికుండు పాఱుతెంచి దేవ! వేగ వేఁ గరసి పచ్చి ప్రహస్తుం డొక్కవృత్తాంతం బేకాంతంబున విన్నవింతు నని వాఁడె వాకిట వసించినాఁ డేగుదెం డని వాక్రువ్వఁ దడవ దిగులుపడి తుందుడుకుచెందు డెందమున దనుజనాయకుండు నిర్గమించె నంత మాయాశిరశ్శరాసనంబు లదృశ్యంబులై చనియె నవ్విధంబుఁ గని జనకనందనయుం నొక్కించుక యూఱడిల్లె నంతటం బరమపుణ్య సరమ సరకుగొనక జనకజం గూడి భయనివారణంబు చేయుంచు వినుము పుడమికన్నియ! యిన్నియు నిన్ని చద్దైత్యమాయాకృతంబు లింకఁ దలంకకుము రామునకు సేమంబ యగునమ్ము మిదే దశముఖుని యమపురాభిముఖునిం జేసి రాక్షసక్షయం బొనర్చి నిన్నుం జేకొని యతం డయోధ్యానగరసింహాసనస్థుఁడై రాజ్యం బేలు వేలదనం బడుగు మని యాదరింపుచుండు నంత నిక్కడ. 216

క. దుస్సహగతి రావణ రణ, నిస్సాణనినర్గళోగ్ర నిస్స్వనము లు
చ్చైస్సరణి మ్రోసె లంకన్, నిస్సంశయవృత్తి మేదినీసుత చెలఁగన్. 217

తే. అపుడు కార్యవిచార మయ్యసురనాథుఁ, డాప్తమంత్రులతోఁ జేసె నందు వృద్ధ
మంత్రి మాతామహుం డైనమాల్యవంతు, నఖిలనయశాస్త్రకోవిదునని యె నిట్లు. 218

క. రా మాల్యవంత! యిటు మా, తామహుఁడవె కావుగద పితామహుఁడవు ప్ర
జ్ఞామహిమ బుద్ధి యెయ్యది?, యేమాడ్కి ఘటిల్లుఁ దెలుపవే కార్యగతుల్. 219

వ. అనిన విని. 220

మాల్యవంతుఁడు రావణునకు నీతి బోధించుట.

క. నయశాస్త్రము లాదిగ న, న్నియుం నెఱిఁగినప్రోఢ వీవు నేఁ జెప్పెడిదే
మి? యభిజ్ఞతిలక! 'పౌల, స్త్య! యతో ధర్మస్తతో జయ' యనన్ వినవే? 221

తే. నీ వఖిలవేది వౌ దైన నే నెఱింగి, నంత వినిపింతు నావాక్య మాదరింపు
మాదిమసుపర్వుఁడవు పులస్త్యాన్వవాయ!, ధన్యమూర్తివి కీర్తిప్రతాపనిధివి. 222

క. కులశీలసత్యనిధి ని, శ్చలధర్ముఁడు దైవమానుషబలాఢ్యుఁడు కే
వలుఁడే రాముఁడు? నీకున్, బలవద్వైరంబు చనునె పంక్తిగ్రీవా? 223

క. మీఁ దెఱుఁగవైతి రాఁగా, ఛ్ఛాదనమునఁ బ్రాణహరణశస్త్రి పరస్త్రీ
గాదె? పరస్త్రీమాత్రమె?, యాదేవి త్రిలోకమాత యసురాధీశా! 224

క. ఆదేవిఁ జూచి పోవుచుఁ, గాదా నిస్సాదిరి యొక్కకపి మును మనలం
కాదీప్రవప్రసుప్రా, సాదంబులు వాలవహ్నిఁ జవి గొనిపించెన్? 225

క. అటువంటివీరవానర, భటసింహు లపారబాహుబలసాహసవి
స్ఫుటతరరంహు లనంహులు, పటుకీర్తులు రామభద్రపరిసరవర్తుల్. 226

క. తెగఁ దగదు విచారింపక, పగరబలం బాత్మబలము బహుళము నల్పం
బగు నేని వైర ముడుగఁగ, నగుఁ గావున సీత నిచ్చు టర్హం బింకన్. 227

తే. బిట్టుగా వేల్పువెలయాలి తిట్టుగుడుచు, టొండు మును వెండిమల యెత్తిఖండపరశు
నుపిద నుడికించుపాతకం బొండుఁ గాక, సీత నీపాలిమృత్యువుఁ జేనయఁదగునె?228

చ. ఇపుడు దలంపు విశ్వజనయిత్రిని జానకి నాదిలక్ష్మిఁగా
నృపతివిలాసశార్ఙ్గి యని నిక్క మెఱుంగుము రాఘవేశ్వరున్
గపిమిషభీషణాళనులఁగా వివరింపు తదీయశౌర్యవ
ద్విపులచమూసమూహముల వేఱొకభావము మాని రావణా! 229

వ. అనిన విని దశముఖుండు రోషారుణముఖుం డై యతని కిట్లనియె. 230

### రావణుఁడు మాల్యవంతుఁ గోపించి వీడ్కొల్పుట.

ఉ. కించుఁదనంబుతో నొకనృకీటముఁ దెచ్చి ప్రతాపదీపితా
శాంచలుఁ డంచు శాత్రవజయావహబాహుపరాక్రమోదయుం
డంచు రమాంగనారమణునట్టిడ యంచుఁ బొరింబొరిం బ్రతి
ష్ఠించెదు నన్ను నిం బ్రతిఘటింపఁగ నేర్తురె దేవదానవుల్? 231

క. దేవాసురభీకర మగు, నావిక్రమ మెఱుఁగ వీవు నను లీలావి
ర్భావవిధూతమదాంధ్రై, రావణురావణు నెఱుంగరా యెవ్వారున్? 232

ఉ. ధర్మము ధర్మ మంచు రిపుధర్మమె పేర్కొనెదీవు రాముఁ డే
ధర్మి వధూవధం బెపుడు ధర్మమె? స్త్రీముఖరూపవిక్రియా
కర్మము ధర్మమే? గరళకంధరజీర్ణధనుర్విభేద మే
ధర్మము? వాలివంచననిధానవిహారము నొక్కధర్మమే? 233

శా. రంభాశాపము నాకు లక్ష్యమె? కపివ్రాతంబు మచ్చండదో
స్స్తంభస్ఫూర్తికి నడ్డమే? యకట! సీతాశోకమే తన్మహీ
శుంభద్రాజ్యసుఖంబు మాన్పునది, యిచ్చో స్వర్గపాతాళలో
కాంభోజాక్షులఁ బట్టనే బలిమి! నాహా! నేఁగి సంధిల్లనే! 234

ఉ. సంశయ మేల? యిట్టియొలజవ్వనిచక్కఁదనంబులోనఁ గో
ట్యంశము లేదు ముజ్జగములందు లతాంగులకుం బరాక్రమ
భ్రంశము నొంది నే విడువఁ బాడియె సీత ? నిఁకన్ మదీయని
స్త్రింశముఖంబున న్నిలుతురే నరవానరమాత్రు లక్కటా! 235

క. అని కనలి మాల్యవంతునిఁ, జని పోఁడ వెౌదు నీతిశాస్త్రములను నీ
కును నెంతదూర మనుచున్, దనుజేంద్రుఁడు వీడుకొల్పి దర్పోద్ధతుఁడై. 236

తే. దక్షిణద్వారమున మహోదరమహోగ్ర, తరమహాపార్శ్వులను దా నుదగ్ధరిత్రిఁ
బశ్చిమప్రాక్కకుబ్ద్వారపదవి నింద్ర, జిత్ప్రహస్తులఁ గట్టడ చేసి నిలిపి. 237

రావణుఁడు సౌధాగ్రమునఁ గొలువుదీరుట.

వ. అంత నంతకపురంబునకుం జని రఘువీరోదారవీరవానరసేనాదిదృక్షాధీనమానసుండై
యొక్కగోపురాగ్రభాగంబున నాప్తపరివారవృతుండై యుండు నాలోన. 238

క. శ్రీరాముఁ డఖిలవానర, వీరానీకములతో సువేలగ్రావా
గ్రారూఢుండై ఘోరాం, కారం బగుదనుజపురముఁ గనె విస్మితుఁడై. 239

చ. భవదతులప్రతాపపటుభానుని చేతికి నన్ను నిచ్చి వై
రవిహృతి మాని కూడుకొనర మ్మటమీ యని విన్నవింపఁ జే
రువ కరుదెంచునట్టిరవిరూపున రత్నమయాతపత్ర మొ
ప్ప వెనుక గోపురాగ్రమున భూరివిభూతిఁ దనర్చు రావణున్. 240

వ. మణిపీఠిన్ సమాసీనుండై యున్నవానిం జూచి సుగ్రీవుండు. 241

సుగ్రీవుఁ డెగసి రావణుకిరీటంబులు నేలఁ బడఁ దెస్సుట.

క. వీఁడా లేవక యుండెను, వాఁ డెక్కడ రాముఁ డున్నవాఁ డని వినియున్
నేఁ డీరక్కసుఁ బోడిమి, మాడుతు నని యౌడుకఱచి మచ్చర మెచ్చన్. 242

క. ఉడువీథి కొండశిలపై, పిడు గెగసినవడువు దోఁప బిట్టెగసి పడిన్
బెడతల గుప్పునఁ దన్నినఁ, బడియెం దొడదొడలుగాఁగఁ బదిమకుటంబుల్. 243

తే. మఱియుఁ దోడనె యమ్మేటిమానికములు, నట్టనడుమనే జాఱిపో బిట్టు దన్ని
బిగువుబాసిక పెట్టుతోఁ బెద్దయమర, గోపురముమీఁదఁ జదికిలఁ గూలఁబడఁగ. 244

క. పడినం బడుమని యప్పుడ, గొడుగు న్వేచించి యోరి! కుటిలాత్మక! యి
క్కడకు విభీషణుఁ డొడయఁడు, విడురా యమర విఁక నీకు విభచిహ్నంబుల్. 245

చ. అని మరలంగఁ జూచుతఱి నద్దశకంఠుఁడు చండభానునం
దనుకడ కాలికై యొడియఁ దక్కపినాథుఁడు చాలదయ్యెనో
మునుపటితన్ను కొమ్మనుచు మోములపై నొకతాపు తాచినన్

గినిసి యతండు పై కుఱికెఁ గేసరి కేసరిమీఁదికిం బలెన్. 246

వ. ఇత్తెఱంగున నుఱికి యదలించి. 247

### సుగ్రీవరావణ మల్లయుద్ధము.

క. పిడికిఁ ద్రొక్కకడఁ బడియున్, నడుమొమ్మునఁ బడఁగ విసరినం గదలక బి
ట్టొడిసి యవి యొక్క సందిట, నిడి మగుడం దివియఁ బెనఁగె నినజుఁడు బలిమిన్.

ఆ. పెనఁగ నవలివంక పిడికిళ్ల బిరుసుగా, నసుర తలకు విసర నవియు నొడిసి
సరియ కాఁగ రెండుసందిళ్లఁ గొని లాగి, విసరి క్రేళ్లు దగుల ద్రోయుటయును. 249

ఉ. వ్రేసిన వేటునం బడక వేగమ దాఁటి పిఱిందికట్టె బా
హాసము దాయమధ్యమున నర్కతనూభవునిం దగుల్పడం
జేసికొనంగఁ జేర్చి కడుఁ జిక్కఁగఁ బట్టి సురారి నేలకున్
వ్రేసినవెంటనే యెగసి వ్రేసెఁ దటాలునఁ జెంప లాతఁడున్. 250

ఆ. అడవిమీఁదఁ బడినపశువుఁ గాలవ్యాళి, జాల మాఁగికొనినపోలికయును
దోఁచ నతనిచండదోర్దండవిళలి, పైఁ బడంగఁ గలఁగఁబడక పోరి. 251

క. చేయం గలపనిఁ జేసితి, నీయూడల మట్టితోడి దిది నా కేలా
మాయావు లసుర లని కపి, నాయకుఁడు సువేలనగమునకు డిగి యంతన్. 252

క. ఏలికచరణంబులపై, వ్రాలిన నతఁ డెత్తికొని వివస్వత్తనయా!
యీలాగునఁ జనఁ దగునే? నీలోకమె నాకు ననుచు నే నుంటిఁ జుమీ! 253

### కపులు లంకను ముట్టడించుట.

వ. అని యాదరించి రాఘవుండు రవితనయున కిట్లనియె. 254

క. పెట్టుము వాకిట వాకిటఁ, గట్టడఁగాఁ గోటికోటికపులను వేగన్
ముట్టడి దాఁకన్ లంకా, పట్టణమున కనినఁ బెట్టె బలిమిగ నతఁడున్. 255

### అంగదురాయబారము.

ఉ. అంతట భానువంశకరుఁ డంపఁగ నంగదుఁ డద్దశానన
ప్రాంతము చేరఁగా నరిగి పల్కెఁ బురందరశాత్రవా! పరా
కింతయు లేక నావచన మించుక నే విపు డాలకించు వి
న్పింతు ఖరాంతకుం డుఱక నీ కొకమాటెటు చెప్పి రమ్మనెన్. 256

వ. నీ వెవ్వఁ డంటేని. 257

చ. నినుఁ దనచంకవైచుకొని నీరనిధానచతుష్టయంబునన్
జని చని సాంధ్యకృత్యములు సల్పెడునంతకుఁ ద్రిప్పి తెచ్చి పెం

పుస నట వైచి కొంకరలు పోయిననీమెయి చక్కనొక్క పో
వనిచినవాలినందనుఁడ నంగదుఁడన్ దశకంఠ! వింటివే? 258

తే. బ్రహ్మసంతతివాఁడ వై పట్టణంబు, లంక గా నుండి కేలఁ గైలాస మెత్తి
ప్రబలితివి నీకులస్థానపౌరుషముల, కొచ్చెమఁగ నేల చొచ్చితి పిచ్చపనికి? 259

తే. ఎదఁ దగుల్పక కంఠంబు తుదఁ దగిల్చి, తప్పఁ దగిలించెఁగా తొల్లి ధర్మగుణము
కరసహస్రంబు గలిగియుఁ గార్తవీర్యుఁ, డేమిచేయను నీపుణ్య మిటుల నుండ?

క. కాళ్లుం జేతులుఁ బిసపిస, నోళ్ళుం బెక్కలగలిగెనో? యని నీకా
రళ్లుగ బలిగృహవనితలు, సళ్ళించిరొ వేళ్లఁ బిసికి సత్త్వం బెల్లన్. 261

తే. ఇంక నైనను జానకి నిచ్చి శరణు, చొచ్చితేని యయోధ్య నీకిచ్చు విభుఁడు
నాఁడె లంక విభీషణునకు నొసంగె, నాఁడు నేఁ డింక నీ కది వేఁడరాదు. 262

ఆ. అర్జునుండు గాఁడ యట్లెఁ గట్టి విడంగఁ గాఁడు వాలి కేలఁ గట్టి విడువ
జానకీవిభుండు సత్యపరాక్రముం, డెఱిఁగి నడువు ప్రాణ మిష్టమేని. 263

వ. అని పలుకం బంక్తిముఖుండు కట్టలుక మిట్టిపడి పట్టుకొం డనినబలవంతు లగుపలల
భుజులు నలువురు బలువిడిం బయింబడిన నడిచిపడక నగుచుం దేఱిచూచి. 264

## అంగదుఁడు రాక్షసుల నురుమాడుట.

ఉ. అంగదుఁ డద్దురాత్ముల రయంబున నీడిచికొంచు నింగికిన్
జెంగున దాఁటి నల్వురను జిట్టలు చీఱి నభఃప్రపంచపా
రంగతసౌధశృంగము గరంబున నొక్కటి త్రుంచి తెచ్చి యు
త్తుంగశిరఃకిరీటములతోడి దశానను వైచెఁ గూలఁగన్. 265

ఆ. ఇట్లు వైచి దాన నిలమీఁద దనుజుండు, దిమ్మదిరిగిపడుటఁ దేఱి చూచి
యనుభవింపు చేసి సంశయం బని పారె, మనకు మరలి విభునిఁ గని భజించె. 266

క. దేవా! విను మన నొల్లఁడు, రావణుఁ డని పలుకుటయును రాముఁ డతిక్రో
ధావిలుఁడై కార్ముకమౌ, ర్వీవిస్ఫారముల దిశలు విఱుగం బెట్టెన్. 267

## రావణుఁడు సకలసేనల నాయత్తపఱిచి రణభేరి వేయించుట.

ఉ. అప్పుడు రావణాసురుఁడు నాప్తులఁ జేరఁగఁ బిల్చి వింటిరే
చప్పుడు వింటి నిప్పు డదె చప్పటగాఁ జఱచెన్ గపుప్పులన్
విప్పనెలుంగులుం గవని వెల్వడి నేఁ దనతోడ మార్కొనన్
జెప్పినవాఁడు గావలయుం సీతమగం డిది నిక్క మింతయున్. 268

ఆ. పగరు మెట్టిపట్టి పఱగడ నుండంగ, నెవ్వఁ డుండు మూల నేను దక్క
నాయుధోపజీవి కర్హమే యీకూడు, గుడువ జగడమునకు వెడలువాఁడ. 269

చ. అన విని దేవ నీవు చనునంతకు వచ్చెను యేము చాలకుం
డినఁగద యింత గావలయుం నిల్వము రాముఁ డనంగ నెంత వి
ల్లన నది యెంత యేమహిమ నందె నతం డిపు డొక్కమ్రోఁతయున్
వినఁబడెనే యటంచుఁ బరివేష్టకు లింద్రజిదాదిదానవుల్. 270

క. అతనియనుజ్ఞను భేరీ, శతములు రణయాత్రఁ దెలుపఁ జఱపించిరి త
ద్వితతరావితధారవ మ, ద్భుతకరమై మ్రోసె భూనభోవ్యాపకమై. 271

సీ. కల్పాంతవాతూలకర్షనిర్మర్యాదశరధినిర్ఘోషంబు శరణుచొచ్చె
సంవర్తశిఖిశిఖాచర్వ్యమాణోర్వీధరాలఘుధ్వానంబు కేలుమొగిచెఁ
బ్రళయాంతకగభీరగళబిలావిర్భవత్కఠినహాసరవంబు కనవుగఱచెఁ
గాలాభ్రగణగర్భగోళనిర్యద్భీమభిదురనాదము బిడ్డపేరు పెట్టె
తే. నిష్ఠురానిస్వనమునకు నిదియ తప్ప, దన్నియును దీనివెనుకనే యని సమస్త
లోకవాసులు నిశ్చేష్టులై కలంగఁ, బంక్తికంఠునిపురి మ్రోసెఁ బటహశతము. 272

వ. అంత. 273

## రామరావణసేనలు యుద్ధసన్నద్ధము లగుట.

సీ. అనికి మేడలు తోడు చనుదెంచునో వీరి కనఁ బొల్చు నున్నతస్యందనములు
ఖురధూళిశరధి గూర్పఁగ నోపునో యనఁ దగు సేతుబంధంబు లగుగుఱ్ఱాలు
నవసరం బైనప్పు డంభోధి నావఁ జాఁ దనుపుకొండ లనంగఁ దనరుకరులు
నాలంకలో నున్న కాళరాత్రికిఁ గల కొడుకులు నాఁ దోఁచు ఘోరభటులుఁ
ఆ. గలిగి యరుగుదేరఁ గాహళరావంబు, భటులరవము శంఖపటహనినద
మెనసి బలియ వెడలి యింద్రజిత్ప్రముఖులు, పోఁజు దీర్చి రొక్క బయల నరుదు.

ఆ. ఉగ్రభానుసుతుఁడు నగ్రభాగంబున, బలిముఖాధిపతులు పన్ని నడువ
వెనుకఁ దాను గదలె వెన్నుబలంబయి, నూఱుకోట్లకపుల నుగ్గు లలమ. 275

క. ఇవ్వీఁకను నిరువాఁగును, జివ్వకుఁ దలపడియె నడిమిచిదు గిడియే లం
చవ్వనధిభాగయుగళము, చివ్వన నాలంక ముంచఁ జేరె ననంగన్. 276

వ. అంత. 277

క. ఒకయెడఁ దెలు పొకయెడ నలు, పొకయెడ నళిదివగయొరపు నొకయెడ నెఱుపుం
బ్రకటింపుచు సకలాశా, నికురుంబంబునకు మేదినీరజ మెగసెన్. 278

సీ. సమరవిక్రమనాట్యసంవిధానాగ్రనైపథ్యమై కనుపట్టె భటుల మ్రోలఁ
దనబిడ్డఁ జెఱ నిడ్డగనుజు మ్రింగఁగ నుర్వి లాఁచెనో యనఁ దోఁచె లంకమీఁదఁ
బై ముద్దవాటుగాఁ బడఁ జొచ్చె మిన్నేట సిక్తమై యలశిలాసేతువీథి

దైత్యతతియోద్యుక్తమృత్యుయాత్రాబహిః పటకుటీరం బయ్యెఁ బలసి మింట
తే. నవపతాకాలతాకాననస్ఫురత్ప్ర, రాగము నిజాంగరాగంబు రథచమూస
ముద్రశైవాలమును రామభద్రనికట, ధూపధూమంబు నైనట్టు దుమ్ము రేఁగి. 279
వ. ఆసమయంబున. 280
క. రక్షోబల మపు డార్చిన, వృక్షాయుధ మైన ప్లవగవీరబలంబున్
దాక్షాయణీధవాలిక, వీక్షాక్షేపక్షమాక్షివీక్షల నిగిడెన్. 281
క. రథికులపైఁ దరు లాహవ, పథికులు కపు లెత్తఁ బుష్పఫలములు రాలెన్
బ్రథనాధిదేవతకు నవి, ప్రథమసపర్యలు నయించెఁ బార్థివుఁ డనఁగన్. 282
ఆ. దనుజవీరభటులు దాఁకి పైఁ గురిసినఁ, దోమరాసిరాశి తోఁచెఁ గలనఁ
గపులు నపుడు దన్ముఖంబుల నేలతోఁ, దోమ రాశిరాశి దోఁగిపోయె. 283
క. అందునఁ గనలి హయంబులఁ, గ్రందుగఁ దఱిమియును గరులఁ గాలాడియు మీఁ
దం దేరులు వఱపియుఁ శర, బృందార్చులఁ జేర్చి రొక్కటిరుసున నసురల్. 284
సీ. అవి లెక్కగొనక దైత్యబలంబు నటు గొంత యెగిరి యూడఁగనిచ్చి తెగువఁజొచ్చి
పెద్దగా భూదేవి పెంచి యిచ్చిన యాయుధంబులకలిమి దర్పంబు పెరిగి
పైఁ బడినగుఱ్ఱాలఁ బాదపంబుల మోఁది గండోపలములచేఁ గరులఁ జదిపి
గిరులచే రథముల గెడపి తత్తద్వాహనముల వారికిఁ గాలినడలు దెచ్చి
ఆ. కాలినడలు లంకపాలికిఁ దెచ్చిన, మేటిఁ గూడి యుక్కుమిగిలి తగిలి
ముంచి వంచి దంచి చించి నొంచి కలంచి, కఱిచి విఱిచి చఱిచి నుఱిచి రటులు.
క. మునుము మొన రిత్తయైనన్, వెనుకం బన్నినబలంబు విచ్చె న్వచ్చెన్
గని రావణిచకితవరూ, థినికి న్వీలు చూపి వెరపు దెలిపె న్నిలిపెన్. 286
వ. తోడన కూడుకొని యరదంబులు దోలుకొని బలసి ప్రజంఘప్రముఖరథికు లధికరభ
సంబుగాఁ ద్రోచిరా దవుదవ్వులం జూచి. 287
సీ. అంగదుం డింద్రజిత్తుం గోరికొనియె సంపాతి ప్రఘాజనుఁ బంచికొనియె
మరుదాత్మజుఁడు జంబుమాలిఁ బంచికొనె గజుండు ప్రతాపునిఁ జూచికొనియె
మైందుండు వజ్రముష్టిం దిగిచికొనియెఁ గుముదుఁ డకంపనుఁ గుదురుకొనియెఁ
గేసరి ధూమ్రాక్షు గిలుబాడుకొనె వానరేశ్వరుండు ప్రహస్తు నేఱికొనియె
తే. ద్వివిదుఁడశనిప్రభుని వగఁదెచ్చుకొనెసు, షేణుఁడు మహోదరునివిభజించుకొనియెఁ
బనసుఁడునరాంతకుని గుఱిపఱచుకొనియె, జాంబవంతుఁడుమకరాక్షుఁజరుముకొనియె.
తే. యజ్ఞకోపునిసుప్తఘ్ను నగ్నికేతు, రశ్మికేతుని దాఁకె శ్రీరాఘవుండు
లక్ష్మణుండు విరూపాక్షు నలఁచె నవ్వి, భీషణుండును మిత్రఘ్నుఁ బిలిచెననికి. 289

## ఆశ్వాసాంతము.

మ. నరనాథాగ్రణి ! సారసింహపదచింతాలోల ! నిస్తంద్రవీ
రరసాధీశ్వర ! నీతికోవిదనుతప్రారంభ ! నూత్నాకృతి
స్మర ! నేత్రస్థిరపద్మ ! సైరమహీజఖ్యాతదాతృత్వమా
నరుచిశ్రీధర ! నాగతారినృప ! నందన్మిత్ర ! నర్మోక్తితా ! 290

క. సతతసపాదబరీదా, దితురుషాగ్రధిపశరణ్యాదివ్యాంఘ్రి సము
న్నతకర్ణాటస్థాపన, చతురాళియరామరాజజామాతృమణీ ! 291

ఉత్సాహ.—

అధ్వరావనవ్రతక్రియా ! ప్రచండదాన ! వి
ద్యాధ్వనీన ! ధీనిధాన ! యష్టదిఙ్నృపాలహృ
త్సాధ్వసప్రదప్రతాప ! చాపనైపుణీఖనీ !
సాధ్వనీకహృద్యపద్యసత్యవాగ్విచక్షణా ! 292

గద్యము. ఇది శ్రీమదొంటిమెట్టరఘువీరశతకనిర్మాణకర్తజగదేకఖ్యాతిధుర్యాయ్యల రాజు తిప్పయమనీషిపర్వతాభిధానపౌత్రాక్కయార్యపుత్ర పరిశీలితసమిద్ధ రామానుజమతసిద్ధాంతమర్మ ముమ్మడివరదాచార్యకటాక్షవీక్షాపాత్రహృదయ పద్మాధిష్ఠితశ్రీరామభద్ర రామభద్రకవిప్రణీతంబైన రామాభ్యుదయమహా ప్రబంధంబునందు సప్తమాశ్వాసము.






# అష్టమాశ్వాసము.



శిష్టనిజాగార! చతు
ష్షష్టికళానిపుణ! సూక్తిసందర్భజిత
స్రష్టా! గుణసంతుష్టవి
శిష్టా! గోబ్రాహ్మణసారసింహాన్నపాలా! 1

వ. అవధరింపుము తదనంతరకథావిధం బెట్టి దనిన. 2

## వానరరాక్షసుల ద్వంద్వయుద్ధము.

క. ఇక్కరణి జోదు లేర్పడి, పెక్కండ్రలం బోరఁ దెరుగు పెనుచివ్వలు మి
న్నెక్కి కలహాళి కన్నులఁ, దొక్కట్టిన విడక కఱవు దీఱ న్మెక్కెన్. 3

మ. పటహధ్వానములన్ ధనుర్నికరవిస్ఫారంబులన్ శంఖని
స్ఫుటనాదంబుల నట్టహాసముల నేర్పుల్ దప్పి వీలంగ న
ట్టటు వో నొత్తె దిశావితానములఁ బక్ష్యక్షేచరప్రాణసం
కటకృత్యత్వరితప్రసారితశరౌఘంబుల్ నిరాఘాటముల్. 4

క. దానవఘోరాశుగములు, వానరవీరాననములు వడి దూఱి చనం
గా నెత్తురగుట దెలియం, గాన రవి మునుపును నెఱుపుగను నెవ్వారున్. 5

ఆ. నృపుల కపుల సమరనిష్ఠురత్వంబుల, నొచ్చి చరమదిశకు వచ్చి దనుజు
లెపుడు ప్రొద్దుగ్రుంకు నెపుడు మా కెచ్చర్లఁ, గలుగు ననుచుఁ బోరు సలుపుచుండ.

చ. తనకుల ముద్ధరించఁ గలధన్యుఁడు రాముఁ డీశన్ వృథావ్యథన్
మునిఁగెడుఁ జూడలే నని యినుం డపరాద్రి చఱిం బడెం గదా
యన రవి గ్రుంకె సంజ యెఱుపందె సుపర్ణుఁడు వచ్చి యందుఁ గా
ల్కొనియెనొ మీఁద రాఘవులకున్ ఫణిబంధము లూడ్వఁగానవన్. 7

వ. అంత. 8

## ఇంద్రజిత్తు రామలక్ష్మణుల నాగపాశబద్ధులఁ జేయుట.

తే. పోల నొకమఱి తనహోమశాలఁ జొచ్చి, రాక కాదని యింద్రజిద్రాక్షసుండు

నరిగి యొకవేల్పు ప్రేల్చి కుండాంతరుదిత, దివ్యసన్నద్ధరథ మెక్కి తిరిగి వచ్చి. 9

వ. తళుక్కనం బొడకట్టి రామసౌమిత్రిసుగ్రీవప్రముఖులు వెఱఁగంద నదృశ్యుం డై గగనంబున మాయామేఘంబులు పన్నఁ జుక్కలవెలుంగు దోఁచదయ్యె నయ్యెడ రక్కసు లుక్కు మిగిలి యక్కటికిచీఁకటిం గనుచూపి యినుమడించి తూర్యనినదంబులు నట్టహాసంబులుఁ జెలంగం దఱిమి తాఁకిరి కపులును లోఁచేవకలిమిసీడం బోవక కూడందఱిమిరి రఘుపుంగవుండును దివ్యశరజ్వాలామాలికలచే రాకాసిమూఁకల తోడనకూడం జీకటితిట్టల నెరియంబెట్టఁ దొడంగినం గలంగంబడి తద్దానవానీకంబు సైరింపలేక చని గవని చొచ్చిన మచ్చరంబు పెచ్చు పెరిఁగి శాంబరీశాదంబినీతిరోహితుండయినరావణ సుతుండు. 10

క. శరములు గురియఁ దొడంగిన, నరనాథులు ప్లవగయూథనాథులుఁ గడు న
చ్చెరువొంది యిపుడు వోయెన్, బరిఁబడ నరిబలము మ్రోలఁ బొడ గన మేదిన్.

వ. పయినుండి ఘోరనారాచంబులు పడుచున్నయవి రావణానుమతిం గాలమేఘంబులు గురియం నిడువాలుంబిసుగులు గావు గదా యనుటయుం విభీషణుండు.  12

క. మొదలఁ బొడకట్టి పోవఁడె, యదృశ్యుఁ డై యొక్క రథికుఁ డతఁ డగ్నివరో
న్నదుఁ డై వచ్చినరావణి, యిదె యిప్పుడు మింట డాఁగి యేయుం జొచ్చెన్. 13

చ. అన విని రాఘవుండు నిశితాస్త్రము లంబరవీథి కేయఁ దొ
ట్టినకుహనాపయోదముల టెక్కునఁ దాఁకి పడం దొడంగె నం
దున వెఱఁ గంది ఱేఁ డతనితూపులు ద్రుంచుచు నుండె వాఁడునుం
జునిఁగి జునింగి తూ పడరుచో టెఱుఁగంబడనీక మాయలన్. 14

వ. గగనంబున నెల్లెడలం దానై గర్జిల్లుచుం గఠినబాణంబులు గుప్పుచుం గపులకుం గాలంబు వచ్చె ననిపించుచుం దెంపు చేసి. 15

సీ. మెడకు మిోఁగాలికిఁ బుడమికిఁ గొనసేయఁ బొగడదండలలోన వాలియుంవారు
నలువుర నేవురఁ దల లంటఁ గొనసేయఁ దిక్కుట్లతోడన తిరుగువారు
తొడలు వక్షంబులు దూరంగఁ గొనసేయ మూఁటిలెక్కలమాడ్కి మ్రొగ్గువారు
పైకళేబరములు బరులునోఁ గొనసేయ నెడకువతోడన మడియుంవారు

ఆ. నగుచుఁ దచ్చరముల నగచరప్రళయంబు, పెట్టె ననఁ బ్రసిద్ధపూజ్యుఁ డైన
యూథనాథుఁ డనక యొంటరికాఁ డన, కాకసమున కసువు లప్పగింప. 16

వ. కనుంగొనుచుం గౌసల్యానందనుండు నేయుంనదిలేక వింటికొప్పున దాకేలువై చుకొని యయ్యంధకారంబులో నిలువంబడి వారెవ్వరు విభీషణా! నీవా? సుగ్రీవా! నీవా? నిన్నున్ని దాఁకెన్? జాంబవంతుం డున్నాఁడా? యంగదుండా! హనుమంతుండు

పడఁడుగదా? యనుచు డగ్గుత్తికవెట్టి పలుకుచున్నం జూచి లక్ష్మణుండు 'దేవా! తాళినంబనియెత్తి పోవుచున్నయది యరాక్షసం బయ్యెడుం గాకజగంబని ప్రయోగింతునే బ్రహ్మాస్త్రం? బీతులువయ్యు నందులోనివాఁడై పోయెడునటు గాదేని మనకై వచ్చి యనేకదూరదేశవాసు లివ్వానరవీరు లాకసంబునకుఁ బ్రాణంబు లప్పగింపుచున్నా రిది చూచినం గడుపు దరికొనియెడు నన విని యవ్విభుం డతనిమొగంబై యేమి చేయుఁవార మొకనిపైఁ గినిసి పెక్కండ్ర నసంనద్ధసన్నద్ధులం జంపరాదు గదా యని వారించె నప్పు డమ్మేఘనాదుం డయ్యిరువురన్నదమ్ములమీఁదనుం బన్నగప్రదరప్రయోగంబు గావించె నంత. 17

క. కలయ డిగి కీలుకీళ్ళకుఁ, జిలువలు దగులఁకొని పడగ చెఱఁగులకుం దోఁ
కలు ముళ్ళుగొని బిగించెన్, నిలిచిన నిలువుననె వారు నేలన్ వ్రాలన్. 18

వ. అంత. 19

చ. బిసరుహబంధునందనవిభీషణు లమ్మలికంబుతోడ వె
క్కసముగ బాష్పధార లొలుకం గని వీరవినోదచాతురీ
రసికుల రామలక్ష్మణుల రాజకుమారుల మోసపుచ్చె నే
దుసికిలి డాఁగిపోయి యొకతుచ్ఛుఁడు నేఁ డని చింత నొందుచున్. 20

ఆ. ఉండి కొంతవడికి నుపశాంతసంతాపు, లైనవెనుక రావణానుజుండు
దండు గలయ నరయుచుండెఁ దన్నింద్రజిద్దృష్టిఁ జూచి కపులఁ దెలిసికొనుచు. 21

వ. అంత. 22

క. అచ్చిలువకాట్లచేత, నొచ్చిపడినరాఘవులఁ గనుంగొని తనచేఁ
జచ్చి రనునిశ్చయంబునఁ, జెచ్చెరఁ దండ్రికడ కింద్రజిత్తుఁడు చనియెన్. 23

క. చని మ్రొక్కి రామలక్ష్మణు, లనియెడువా రన్నదమ్ము లయ్యిరువురు నా
యనిమొనఁ జచ్చిరి చచ్చిరి, వనచరులుం బఱకపాలు వసుధం జిక్కన్. 24

తే. అనిన నందనుఁ గౌఁగిట నలమి యెత్తి, గజముపై గంట వేయించి కలయవీటఁ
జాటఁగాఁ బంచెనతఁడు రాక్షసులకెల్లఁ, గ్రోఁతిమూఁకనుగ్గువయయ్యెఁగొనుఁడటంచు.

వ. ఇట్లు రావణుండు పరమానందంబునం బొంది జానకిం దలంచి. 26

క. జలజానన యిఁక నేనియుఁ, గలయంనొకో నన్ను నన్నుఁ గదరించుటకున్
వలఁతు లగుచెలులు సౌనకులఁ, బలుకులఁ దేలింప ననుచుఁ బాతకి యంతన్. 27

క. ఆక్రాంతఁ బుష్పకముపై, నెక్కించుకొని చని చూపి యిదె రాఘవులన్
మక్కించె మేఘనాదుం, డొక్కఁడ యని యతనియాస యుడుపఁ దటంచున్.

రాక్షసస్త్రీలు సీతకు దాశరథులఁ జూపుట.

వ. తన తూడిగంబు సేయుంరక్కసి మగువలం బనిచినం బోయి వార లత్తలోదరిం బుష్ప

కంబునం బెట్టుకొని చని పాలికలనిలోనం బడియున్నచిన్ననుం బెద్దనుం జూచి వీరిరు
వురు నీమఱందియు మగండునుంగద! చచ్చిరి కనువిచ్చి చూడు మన నల్లతాతన్వి
యుల్లంబు ఝల్లనం ద్రెళ్ళి యొల్లంబోయి యల్లన యెట్టకేలకుం దెలిసి లేచి తేరి
కొనంజూచి. 29

నాగపాశబద్ధు లగుదాశరథులం జూచి సీత శోకించుట.

క. హా! రాఘవ! నీనయనము, లారక్తాంతములు మొగిచె నని యేమియొకో !
నే రాఁగా నో? దాసుల, నేరము లెంచనిదయాంబునిధి కిటు దగునే ? 30

క. తహతహఁ బెట్టితిఁగా నినుఁ, గుహనామృగవాంఛఫలము గుడిచితిఁగా నీ
సహజన్ముఁడె యవ్వలిదొరకి, మహాత్మ! సౌమిత్రి! నీవు మాటాడఁగదే. 31

చ. అని విలపించుచున్నఁ ద్రిజటాసురి యల్లలితాంగిఁ జూచి యో
వనజదళాక్షి! నీహృదయవల్లభుఁ డాయురుపేతుఁ డౌటన్
నిను భరియించు పుష్పకము నిక్కము దెల్పెడుదివ్యయానముం
గని విధవన్ భరింప దటుగానఁ జలింపకు మమ్మ! నెమ్మదిన్. 32

ఆ. మేనికాంతి కందమిని నీమఱందియుఁ బ్రతికి యున్నవాఁడు పతివిహీన
మైన బలము నిలుచునా వారికడ దొర, లున్నవారు చూడు మూరడిలుము. 33

క. అని తెలిపి క్రమ్మఱం దో, కొని చనిరి యశోకవనికిఁ గోమలి నసురాం
గన లంత నిచట శోకం,బున మునుఁగుచు భానుసుతుఁడు మొదలగువారల్. 34

వ. రఘుకులరాజన్యులం బరివేష్టించి మీఁ దెట్లొకో యని చింతించుచున్నం గనుంగొని
ఖేదంబునం గ్రోధంబు వెరిగి హనుమంతుండు. 35

హనుమంతుఁడు విజృంభించుట.

చ. నమలెద నేతదాదిభువనంబులు మంథనగాదు శైనజా
లుమిసెదఁ బంటిసంధిఁ బడి యుండఁగనీక యజాండ మంతయున్
జిమిడిచెదం బ్రతాపశిఖిచేతఁ బ్రపంచము చేసినాతనిన్
నెమకెదఁ బట్టెదం బిదప నే నతఁ డేలెడుపట్ట మేలెదన్. 36

క. అప్పటికి రాముఁ డించుక, తెప్పిరి తనదండ మూర్ఛ దెలియనియనుజుం
దప్పక కనుఁగొని యిఁక నీ, వెప్పుడు కనుదెఱచి చూచెదే సౌమిత్రీ? 37

చ. అరులకుఁ గోరువెట్టితిగదా నినుఁ దమ్ముఁడ! వైరిఁ జంపి యె
వ్వరివలమూపుమీఁద విలు వైతు నయోధ్యకు నెట్లు పోవుదున్
మరలి సుమిత్ర నన్నడిగినం దలవంచుట యుత్తరంబె? నీ
ఘరిగెడుచోటికే పయన మైతి విభీషణు నప్పు బొంకితిన్. 38

చ. అని విలపింప నారదమహాముని వచ్చి నృపాలుచేత వా
చవికనమస్కృతుల్ వడసి సంస్తుతితో వలచుట్టి దేవ! నిన్
గనుఁగొనినన్ బసాపడినకయ్యము నీరయిపోయెఁ గంటికిన్
జనునె యిటుండ నీకుఁ? దలఁచన్ వలదయ్య సుపర్ణు నిత్తఱిన్? 39

క. ఈతుట్టెపురుగు లేమగు, నీతేజీ వచ్చినపుడు? నిఖిలేశ్వర! నీ
వేతెలివి దెచ్చుకొమ్మని, యాతఁడు దీవించి చనియె నధిపుఁడు నాత్మన్. 40

గరుడి వచ్చి నాగపాశముల వదల్చుట.

వ. వైనతేయుం దలంచిన. 41

ఉ. ఎక్కడ వచ్చునో యమృత మిమ్మని క్రమ్మఱ? నంచు వేలుపుల్
బొక్కలు దూఱఁగా నెగసి భూరుహకోటులు బారువెంబడిం
ద్రొక్క మహానినాదములతో వలిఱెక్కవెలుంగు దిక్కులం
బిక్కటిలన్ బిలేశయవిభేది నభోగతి వచ్చుచుండఁగన్. 42

క. మెదలెన్ మొదల నొకించుక, వదలెన్ ముడిగొన్న ముళ్లు వడిఁ బుడమిఁ బడన్
బ్రిదిలెం బిదపం బద మని, కదలెన్ రాఘవులఁ బొదివి కట్టినపాముల్. 43

దాశరథులు మూర్ఛఁ దేరుట.

సీ. అంత నాగాంతకుం డరుదెంచి గరుదంచలాచ్యుతశీకరవ్యాప్తి నెనుప
మునుపాజిభూమిఁ జచ్చినవానరులు లేచి వచ్చిరి చానున్నవారు బ్రతికి
రినవంశమణి తమ్ముఁడును దాను బడలికల్ దేఱి కూర్చుండిరి తెమ్మఁబడియె
బలమెల్లఁ దల్లడంబులు మాని యావేళ భువనంబులకు మహోత్సవము దోఁచె
తే. బతి యతనిఁ బిల్చి రమ్ము సుపర్ణ! నీవు, దశరథునిమాఱు మాయాపదలు దలంగె
నీవలన నన్న దేవ! నే నీకు బంట, నంత వలదని నేవించి యరిగె నతఁడు. 44

ధూమ్రాక్షుఁ డంగదునిచే నీల్గుట.

క. రవితోఁచఁ బ్రాచిఁ నలుగడ, గపులకుం బ్రాఁకి వీరకపు లార్చిరి యా
రవము విని రావణుం డిది, సవిశేషముగా నెఱింగెఁ జారులవలనన్. 45

వ. ఎఱింగి యీయాపద గడచివచ్చినప్పుడ రాఘవులజేయులు కపు లాడినవి యాటలని
విచారించుచున్న ధూమ్రాక్షుండు. 46

క. తలఁ కేల నీకు రాక్షస, కులనాయక! కపుల నృపులఁ గూల్చెద ననుచున్
సెలవంపి వచ్చె బహువిధ, బలములు గొలువంగఁ బటహాభాంకృతు లెసఁగన్. 47

ఆ. ఇట్లు గవని వెడలి యేతెంచి తాఁకినఁ, గపులు చెట్లు లెత్తి గట్లు లెత్తి
వైచివైచి తురగవారణస్యందన, భటులఁ బిలుకుమార్చి పయికిఁ గవియ. 48

శా. ఆధూమ్రాక్షుఁడు ఘోరసింహముఖవాహవ్యూహసన్నాహలీ
లాధారేయరథత్వరోద్ధతుఁడు గోలాంగూలభిక్షాబుభు

ఘాధావద్విశిఖుండు వచ్చె నడుమం జచ్చెన్ మరుత్పుత్త్రబా
హాధాత్రీధర మూదలం బడిన రథ్యస్యందనోపేతుఁడై. 49

క. ఆవార్త విన్నయప్పుడ, రావణుఁ డతిరోషభీకరభ్రుకుటిముఖుం
డై వజ్రదంష్ట్రుఁ బంచిన, వే వచ్చె నతండు పార వివిధబలముతోన్. 50

వ. ఇత్తెఱంగునం బురద్వారంబు నిర్గమించి మృత్యుముఖంబున వెడలివచ్చుచిచ్చుచందం బునం దోఁచి యవ్వజ్రదంష్ట్రుండు నిజబలంబులం గూర్చుకొని కపులం జుట్టుముట్టి చతురంగంబులం బట్టిసపరశ్వథప్రాసపాశకృపాణాదుల ముంచినం గొంచెంచక యదలించి వానరవరులు శిలాపాదపాదులం జెండాడి గండడంచిన దానవసేనలు కనుకనిం బఱచిన నవుడుగఱచి తరుచరవ్యూహంబు దెరలించికొని చొరంబడివజ్ర దంష్ట్రుండు యూథాధినాథుల కుఱికి వెంపర నంపరం బఱపి వెంపరలాడుచుం జంపుచున్నం గని యంగదుం డెదిరి యతనియరదంబుఁగరంబులం బట్టి నేలంగొట్టినం బుట్టచెండుకరణి నెగసి ధరణికి లంఘించి యాదైత్యుండు. 51

తే. ఉగ్రకరఖడ్గ మెత్తి పై కుఱుక నంగ, దుండు వాఁ డెత్తుకెదుపుతోడికేలు
పెనఁగిపట్టి మోచేతిపట్టునకు విఱిచి, నడుము తెగవైచె వాని నాయడిదమునన.52

క. అంత నకంపనుఁ డనువాఁ, డంతకనిభుఁ డసురవిభునియనుమతి గని య
త్యంతరభసమున నేనా, సంతానము గొలువఁ బటహశంఖము లులియన్. 53

క. వెలికిఁ జనుదెంచె నపుడ, ప్పలభుక్కుల కన్యపన్యఫలభుక్కులకున్
గల నయ్యె నందుఁ బైకొని, గెలుపునఁ గపివీరు లొడ్డగిల దొరకొనినన్. 54

## అకంపనుఁ డాంజనేయుని చేఁ జచ్చుట.

పంచచామరము.—

అకంపనుండు తేరిపై శరానలంబు గ్రాలఁ గా
లకంఠదోఃపినాకలీలలం గరంబు గ్రాల సా
యకప్రకాండకృత్తవానరాంగుఁడై వెలుంగఁ గా
ద్పుపూర్తి పట్టి ముట్టి వానిపుట్టి ముంచె గట్టులన్. 55

## ప్రహస్తాదులు వానరవీరులతో ఘోరముగఁ బోరి దోరుట.

వ. అంత. 56

క. అభయము పలి కొనఁగి వెసన్, ద్రిభాగనేనాధిపతి యతిస్ఫురితబలుం
డుభయబలభయదభూరి, ప్రభతోడఁ బ్రహస్తుఁ డాత్మ బలములు గొలువన్. 57

వ. నిర్యాణనిస్సాణధ్వానంబులు మిన్నుఁ జించుకొని చనం దనవెంటం గుంభహనుం డును మహానాదుండును నరాంతకుండునుం జనుదేర నుత్పాతంబులకు భీతిల్లక తనధాకకు నచ్చెరువంది రాఘవులు విభీషణుం బిలిచి యితండు రావణుండే యని యడుగునట్లుగాఁ దోఁచి నడచినం దదీయనేనలుం గోపులు ముంచి వచ్చెం బ్లవంగ

బలంబులు చలంబులం జొచ్చి వియచ్చరులు పిచ్చలింప శిఖరమణిగణఘృణికదం బంబులు చదలం జెదర భుజాగ్రంబుల గిరులు ద్రిప్పుచు సాయోధసాధిదేవతలకు నీరాజనంబు లిచ్చు పోల్కి జెల్పినవాఁడై కరిహరిశతాంగభటాంగంబులు నుగ్గు గావించి రప్పుడు నరాంతకుండు శరధారాసంపాతకంపితాఖిలవనచరుండై వచ్చిన ద్వివిదుండు వానింబట్టి ఖరనఖరధారలం జీరి నొప్పించినంత మహానాదుండు మార్కొనిన వానిం జాంబవంతుం డంతకరాజధాని కనిచెఁ గుంభహనుండు విజృంభించిన నీలుండు సంరంభించి యొక్కయెత్తుతాయి నెత్తి వైచి వాని వధించె నంత.

ఉ. మ్రోల సహాయబంధువులు మువ్వురుఁ గూలుట చూచి కార్ముకో
చ్చాలనభీముఁడై రథము సారథిఁ దోలఁగఁ బంచి సాయక
జ్వాలలఁ జుట్టుపట్ల కపిసంఘము నేర్చుచు రాఁ బ్రహస్తునిన్
నీలుఁ డెదిర్చి చంపె నవనీధరశృంగనిపాతనంబునన్. 59

మ. పలభుక్కుల్ హతశేషు లెల్లఁ జని చెప్పం జచ్చెనే లంకతన్
గలసేనాధిపుఁ డింద్రవహ్నిముఖదిక్పాలప్రధాహారి క్రోఁ
తులచే ? నంచుఁ బ్రహస్తు నెంచి దనుజేంద్రుం డాత్మఁ జింతించి కో
ల్తల నేఁ జేసి జయింతు వైరి నని యాత్రాభేరి వేయించినన్. 60

## రావణుఁడు యుద్ధమునకు వెడలుట.

ఉ. కూలఁబడెం దిశల్ కుధరకూటము లుర్వి కి రాలె నేల పా
తాళము దాఁక వీలె జలదప్రకరోదరముల్ చిరిఁగె దం
భోళిశతటిల్లతాశకలపుంజము నల్గడఁ గుప్పగూలె ది
క్పాలురగుండియల్ గరఁగి కాఱె విభిన్నహృదంతవీథులన్. 61

వ. అయ్యవసరంబున. 62

ఉ. ఎండలఁ జుట్టుముట్టుకొని యేర్చుచు భూరిభుజాసిదీధితుల్
మండఁగ భానుమండలము మాడిన నిప్పటివోలె నుండ ను
ద్దండహాలాహలార్చుల గదా జగదాహుతి కప్పళించున
ట్లొండొరుమీఱుచున్ వెలిఁగి రుగ్రపలాశిపదాతు లెల్లెడన్. 63

క. నడచి హుటాహుటిఁ బూడిచి, విడిచె మహాబిలము నొక్కవిఘటికలోనన్
బుడమిపొడిగొరిజచెంగుల, వెడలంగా రేఁచి దనుజవీరహయంబుల్. 64

క. దిగనేకపములగుండెలు, పగిలి పడెన్ బ్రథమపటహాభాంకృతి ననుచున్
జగతీస్వయంవరమునకు, మగలై వెడలుగతి వెసలె మత్తేభంబుల్. 65

క. పొడవులకు నింగిచాలని, కడఁకం బఱెఁ బుడమికిం దిగంబడి నెమ్ముల్
బిడువుల్ ద్రవ్వఁగ వెడలెన్, దిడిమిలిడిమ్ములు చెలంగఁ దేరులబారుల్. 66

సీ. కంఠీరవధ్వజాంకవిభాసి రథ మెక్కి మేఘనాదుఁడు విజృంభించి నడచెఁ
దన తేరు దిగియు వాహనసహస్రము చాలు టదురుగా నతికాయుఁ డరుగుదెంచె
సింగపుఁగొదమ తేజీరావురవద్రొక్కఁ బొగరెక్కి త్రిశిఖుండు దగిలి వెడలె
వెలుఁగులుఁ బులులుఁ గాకెనుపోతులును బూచు బండి పైదేవాంతకుండుగదలె
తే. నచ్చరల గభ్రమునఁ బ్రహస్తాదివీర, పరిణయము గర్గఁ దద్వధూవరులమీఁద
సొలయ పీచుల బలధూళి నుంకుచెరుగ, నుగ్రకరిఁ దోలి యూపాక్షుఁ డురవడించె.
క. సంభృతపరిఘచ్ఛవిపరి, రంభుఁ డగునికుంభుఁ డుగ్రరథశారజ్య
తుష్కుంభీనసఘనకేతు, స్తంభుఁడు కుంభుండు మఱియుఁ దక్కినదొరలున్. 68
ఉ. సైరిభ వారిభద్విరదశాసనఖడ్గఖరాధిరూఢులై
తారలు బూరగొమ్ములును దప్పెటలున్ బటహంబులున్ బదుల్
నూఱులు వేలు మ్రోయ గవనుల్ వడి వెల్వడి హత్తి యుత్తర
ద్వారమువంకఁ దార యిరువంకలఁ బౌఁజులు దీర్చి రయ్యెడన్. 69
సీ. పంచముఖున కిన్నడించి తోఁచిన దేవ! మ్రొక్కు లెక్కటిగొను మొదలివేల్ప!
యనరణ్యరాజభోజనపిచండిలబాహా! కలధౌతశిఖరిలాఘవవదాన్య!
యలకాధిపతివిపజ్జలధిజైవాతృక! కాలదండకథాసికాభుజంగ!
వరుణకృకాటికావలమాన కాలాహి! వజ్రిలోచనసారివర్ధమాన!
తే. రావణేశ్వర! యని మ్రోల రాజవంది, బిరుదభీషణచాటువుల్ బెట్టు చదువ
మేరుశిఖరంబుఁ దొలిచి నిర్మించినట్లు, తనరునపరంజి తేరెక్కి దశముఖుండు. 70
వ. ఇత్తెఱంగున రథారూఢుం డై. 71
శా. క్రాలం దద్దశకంఠు డెట్టయెదురన్ రాకాసు లవ్వేళ హే
గ్గాళు ల్వట్టిరి యూర్పుగాడుపులబుగ్గల్ వొంగి గండోపల
స్థూలాభీలము లై తనర్పఁగ దదుద్ధూతధ్వనుల్ దాఁకి లో
కాలోకాద్రిగుహాల్ ప్రతిధ్వను లొసంగం బోయి వ్రయ్యంబడన్. 72
క. చిందములు పట్టి రిందున, నందున సుడివడి హయంబు లంబుజబంధు
స్యందనము వైచి పడఁగా, నందుకొని పురస్థ మొక్కహర్మ్యము నిలిపెన్. 73
సీ. వనచరేంద్రులకు దిమ్మనఁ దలల్ దిరుగంగ నిలువున మూర్ఛలు నివ్వటిల్లెఁ
గణతలెల్లను గాతు కలఁగి దిక్కరులకు బొటఁబొటఁ గన్నీటిబొట్లు వడియె
బ్రహ్మలోకంబువారలకు వీనులలోన సానించి మొరయించినట్లయుండె
లచ్చిలో సుద్దులెల్లను మాని వైకుంఠపతికిఁ దేరెలుఁగెత్తి పలుకవలసె
తే. సమ్ముఖరశంఖపటుకాహళాదికాధి, కారవము విశ్వ మంతయుం నాక్రమింప
నేమి వాత్రువ్వఁగావచ్చు నిత్తరంబు, వాఁడిమి ప్రకాశముగ దైత్యవల్లభుండు. 74

క. తనవారలు పన్ని నిలిచిన, పెనువాకిట నిర్గమించి పృతనాభారం
బున మేదిని నలినలిగాఁ, జనుదేరఁగఁ జూచి రామచంద్రుం డంతన్. 75

వ. విభీషణుం బిలిచి. 76

రాముఁడు రావణసైన్యముఁ గని యచ్చెరువడి విభీషణు నడుగుట.

శా. ఊర్ధ్వాజాండకటాహ ముచ్చి చన భూమోభూయరుద్యన్నిజాం
తర్ధ్వానంబులు విస్మయంబు వెనుపన్ మధ్యాహ్నమార్తాండరో
చిర్ధ్వంసం బొనరించుచుం జనదె ప్రాచిం దోఁచె నక్కోటమై
దుర్ధ్వాంతం బిది యేమొకో యనినఁ జేతుల్ మోడ్చి యాధన్వికిన్. 77

తే. రావణానుజుఁ డనియె నో రఘువరేణ్య!, యానలుపు దానవేంద్రుని సేన సుమ్ము!
కారు క్రమ్ముచు రోఁజుచుఁ గదలి వచ్చె, నీలధూళినిచోళమై నింగి మోచి. 78

విభీషణుఁడు రామునకు రావణుసామర్థ్యం బెఱింగించుట.

కవిరాజవిరాజితము.—
తెలిసినవాఁడు వహాయల్ విలువిద్యకు దిక్పరిపాలురదీవులకున్
వెలసినవాఁడు ప్రహస్తుఁడు మానవినీతుఁడు సై తనరాణవకున్
గలిగినమంత్రి తదీయభుజాబలగర్వకథల్ మనసీలుని చే
వెలిసిన నన్నెగు లాత్మ సహింపక వెల్వడెఁ బంక్తిముఖుం డనికిన్. 79

వ. అవ్వీరుం డవార్యశౌర్యుం డయిన తెఱం గెఱింగింతు నవధరింపుము. 80

శా. ఆదిం బన్నగరాట్ప్రభంజనులలో నన్యోన్యసామర్థ్యసం
వాదం బొక్కటి పుట్టి చిల్వదొర దేవగ్రావముం జుట్ట వి
చ్ఛేదింపంగఁ బ్రతిజ్ఞ పల్కుకొని వీచెన్ గాడ్పు దానన్ దిశల్
దూదుల్ దూలినయట్లు తూలుటయుం నింద్రుం డాదిగా దిక్పతుల్. 81

సీ. కంపించి శేషునికడ కేఁగి యోభోగి కులనాథ! యీయద్రికూట మొకటి
వైవవే యీమహావాతూలవరువాత వరువాత నినుఁ బ్రతివాసరంబు
తలఁచి యేము భుజించెదము గాని యంతట గానిపోఁడీభూతఘాతుకుండు
నావుడు నతఁ డొకింతఫణాగ్ర మెత్తిన విఱుగ విసరి యిందు వేసెగాడ్పు

ఆ. లంక యయ్యెఁ దదకళంకభూధరశృంగ, భంగ మంతనుండి బలిగృహంబు
విడిచి వచ్చి విడిసి రదరి మాలి సుమాలి, మాల్యవంతు లచట మనుజనాథ! 82

ఆ. విష్ణుదేవుచేత వెస మాలి పస మాలి, కడును మాలి యొదలి తొడును మాలి
శాలియు బలిని జేరెఁ బూర్వస్థితికి ముప్ప, లేమి మాల్యవంతుఁ డో మహాత్మ! 83

ఉ. రక్కసు లుక్కడంగి చన రాజయి రాజ్యము చేసె రాజరా
జిక్కడ వచ్చి నాఁటిమొద లిప్పరి నంతఁ బులస్త్యపుత్త్రకుం
డక్కడ మాల్యవత్తనయయందుఁ గనెన్ మము ముప్వురన్ దిశల్
ఫొక్కఁగఁజేసి యుగ్రతపముల్ దశకంఠుఁడుఁ గుంభకర్ణుఁడున్. 84

సీ. జలజసూతి మదుగ్ర జాలకుఁ బ్రసన్నుఁడై యడుగుఁ డిష్టవరంబు లని వచింప
నిద్ర వేఁడుకొనియె నిర్దయత్వము వేఁడికొనఁ బోయి వాతప్పి కుంభకర్ణుఁ
డీరావణుఁడు మర్త్యులే లెక్క? యని తక్కువారిచేఁ జావుండ వరము వడసి
యేఁగుదెంచి కుబేరు నియ్యూరు వెడలంగఁగొట్టి తాఁ బట్టము గట్టుకొనియె
తే. నతనిపుష్పక ముపదఁ గా నందుకొనియె, వాసవాదులఁ గమతులఁ జేసికొనియె
నిరువది యినుపకంబాలయెత్తు మేడ, నెనయ బాహులఁ గైలాస మెత్తిపట్టె. 85

ఆ. ఇతఁడు మూఁడుకోట్లు నేఁబదిలక్షలు, వత్సరములు హరునివరమువలన
నుండువాఁడ కాఁడె యొకవృద్ధిపుఁడై, వచ్చి శౌరి మోసపుచ్చెఁ గాక. 86

క. కోఁతి యని తెగడె వలిమల, కూఁతున్ నందిమొగ మందికొని యిట్టిదివో
కోఁతి యని నవ్వెఁ గడపటఁ, గోఁతియుఁ గోఁతియును జేటగుట గనిపించెన్. 87

క. పాటించి నారదాదుల, పాటలపైఁ జూపఁ డితఁడు బందీదివిజ
త్పాటలగంధులకొండల, పాటునఁ బలవించుకొందలపైఁ గలప్రేమల్. 88

వ. అని యిత్తెఱంగున విభీషణుండు నిజాగ్రజుం డయినరజనీచరరాజు సామర్థ్యంబు నౌద్ధత్యంబు నభివర్ణించిన విని విభుండు విస్మితుండై వీక్షించుచుండె నయ్యవసరంబున.

సీ. పెరికి కుత్తుకలకు విరివిబల్లెఁకులు గదలుగాఁ గొల మ్రోలఁ గదలువారు
ముఖరఘురీంకారి మోఁచేతులకు జాఱఁ గరముల గిరులెత్తి కదలువారు
నేనుంగు తెరు లేజీ నిల్చునే? యంచుఁ బిడికిళ్లతో నార్చి పిలుచువారు
నావచ్చు రిపులవాహనములే సమరసాధనములు తమకంచుఁ దాఁకువారు
తే. నేరువడి నాల్గుపాఁజులై యెప్పు డెప్పు, డుర దురం బనుచున్న వానరులఁ జూచి
తనదొరలతోడ నొక్కింతతడవు నన్నుఁ,జూడుఁడీ యని దశకంఠుఁ డాడి యపుడు.

## సుగ్రీవుఁడు రావణు నెదిర్చి మూర్ఛిల్లుట.

ఉ. పైఁడిరథంబుతోఁ బ్రళయపావకపట్టము నేఁడు కట్టుకొ
న్నాఁడో యితం డనం గనలునం గనుగుడ్లు గదల్చి కాయంబ్రో
వ్వేఁడిమిచే దిగంతములు వెచ్చపడన్ బలభేదిమీఁదిమా
స్టిఁ దతఁ డొక్కఁడున్ గడువడిన్ గదియం గపిరాజు దగ్గుఁడై. 91

క. ఒకపాదపంబు కేలం, బెకలిచికొని యెదుర భిదురభీకరబాణం
బొకటి యతఁ డేయ నగ్గా, లికి నినజుఁడు వడియెఁ జెట్టు లేచెం బయికిన్. 92

వ. ఇత్తెఱంగున సుగ్రీవుండు మూర్ఛిల్లిన నుల్లంబుల ఖేదక్రోధంబులు గ్రమ్మం జిమ్మకేఁగి.

రావణుఁడు గజాదివానరవీరులను మూర్ఛ నొందించుట.

క. గజగవయగవాక్షాదులు, గజిబిజియదలుపులు చెలఁగఁ గదిసి గురుగిరి
వ్రజములు గురియఁ గనుంగొని, రజనీచరరాజు రౌద్రరసవివశుం డై. 94

చ. శరశతకోటులం దొరుఁగుశైలములం జిఱునుగ్గుచేసి వా
నరు లవు డెంద ఱేర్పడి రణం బొనరించిరి వారి నందఱన్
బరిఘపరశ్వథాదుల సబాలుగ మూర్ఛ మునుంగఁ గ్రమ్మి మ
చ్చరములు మాని యండుఁ డిఁకఁ జచ్చినయ ట్లని నవ్వి యార్చినన్. 95

క. పట్టినగట్లుం జెట్లుం, గట్టెదురన్ వైచి మరలి గట్లుం జెట్లున్
బట్టెఁ బ్లవంగానీకము, లట్టిట్టయి కలఁగఁబడి భయభ్రాంతములై. 96

వ. అప్పుడు. 97

చ. బలములపాటు దాయ తలపాటును జూచి పు డడ్డపాటుతో
ల్లల కొడ బాటు లెస్స యని లక్ష్మణుఁ డన్నయనుజ్ఞఁ గాంచి వ
ల్కలములఁ గాసె గట్టి జడలన్ సిక వేసి వెడందవిల్లు న
మ్ములపొదిదోయి దాల్చి విలు మ్రోయఁగఁ జేయుచుఁ బోరఁ బోవఁగన్. 98

హనుమంతునిచే రావణుఁడు మూర్ఛిల్లుట.

ఆ. తలకడచి సమీరతనయుఁ డద్దశకంఠుఁ, దారసిల్లి యేమి దనుజనాథ !
క్రొత్తయిండ్లు గట్టుకొంటివే ? నేఁ జూమీ, నాఁటివాఁడ మఱచినాఁడవేమొ? 99

ఉ. ఎక్కటిఁ గాసెకోక బిగియించితివేమి? సహాయసేన న
ల్లక్కడఁ బెట్టి నీయొకనియాగడ మిందఱిగోడునైన నేఁ
డక్కటికంబు పుట్టెనొ ? మహాగుణమే యిది? నిక్కమైన నీ
మిక్కిలి మూఁక నెల్లఁ దునిమించక చావవుగాని రావణా ! 100

వ. అనవుడు నద్దశకంఠుండు హనుమంతుం జూచి. 101

తే. ఏమఱినవేళఁగాఁ జూచి యొలుక యొకటి, దిగదిగన వచ్చి ప్రమిదలో దీపకళిక
కఱచికొనిపోయి మంజూఱు కాలఁబెట్టి, నట్ల యైనది యైన నేమయ్యెనోరి ?102

ఉ. మీదొర మేదురాగ్రహసమేతుఁడు సూర్యసుతుండు దేవతా
సూదనబాణ వేగమున సొమ్మసిలెం జెవిలోన సొంటికొ
మ్మూఁదినవాఁడ వైతివె? యయో! యిటువంటివె భృత్యకృత్యముల్ ?
గా దనిపించుకోఁ దడవు గాదుర వానర! యెందు వోవుదున్. 103

క. నిను వరియింపఁగ నున్నది, యినతనయునిమూర్ఛ వచ్చి యిపు డనుడు నటే
మును నీసత్తువ యెల్లం, గావ ని న్నొకపెట్టుఁ జూచుకొనియెద ననినన్. 104

క. బండికలు దన్ని పైఁబడి, గుండె లగలఁ బవనసుతుఁడు గుద్దిన బాహా
దండములు పాఱఁ జాచి యు, తండు పడెం బోరగిల రథం బద్రువంగన్. 105

క. పడి మూర్ఛిలి యొక్కించుక, తడవునకున్ లేచి మఱియుఁ దల తిరిగిపడన్
బడఁబోయి నిలిచి పవనజుఁ, బిడికిట మూర్ఛిల్లఁ బొడిచి పిలిచె న్నీలున్. 106

## నీలుఁడు రావణుతోఁ బోరుట.

వ. అతం డతని మార్కొనియె నంత హనుమంతుండు మూర్ఛదేఱి తనకన్నమున్న తెలిసి నేవలు దీర్చుకొని జగడంబునకుం దివురురవితనయప్రముఖులం గూడుకొనియె నప్పటికి నీలుండు కయ్యం బందుకొని పెనంగ చునికిం దమకుం దఱియు నుఱికి దొమ్మి నేయం దగవు గాదని చూచుచుండి రయ్యెడ రావణుండు. 107

క. అబ్బురపుటంపబోనున, నిబ్బరపుంగడఁక యుండిపి నిలిపెన్ వలచే
గుబ్బలితో బొబ్బలతో, బెబ్బులివలె వచ్చునీలు భీమురాభీలున్. 108

ఉ. ఇట్టటు మెట్టనీక యసురేశ్వరుఁ డీగతి నడ్డపెట్టినం
బట్టిన గట్టువైచి యతిమాత్రతనూకృతగాత్రుఁడై తనుం
జుట్టినయంపపెండె మొకచొప్పున వెల్వడి మేను వెంచి క
న్పట్టి ప్రభంజనప్రియుఁనిపట్టి దిశల్ పడఁ గూఁక వెట్టుదున్. 109

వ. గుప్పునం గకుప్పతి భయంకరుపైఁ గుప్పించి. 110

క. సిడ మెక్కి గొడుగు నొక్కున్, మెడ ద్రొక్కుం గ్రిందనక్కి మీఁద న్నిక్కున్
జడిముడి ముడివడునొడువుల, దడపెట్టుం దలలు మెట్టు దవడలు గొట్టున్. 111

క. ఆలోనాలోకించిన, వేలుపు లయ్యసుర చెవికి వినరా నౌరా !
నీలా నీ లా వెంతయుఁ, మే లని యచ్చెరువుపడుచు మెచ్చిరి యతనిన్. 112

తే. అప్పు డమరారి మదిఁ గోప ముప్పతిల్ల, గిలిశర మేసెఁ గాలిపొకాలు మనుచు
నస్త్రశిఖినీలునకు వి మోహాంబ యొసఁగెఁ, బగరపనుపునఁ గొడుకుపైఁ దగునె తండ్రి?

క. ఈలీల న్నీలుఁడు మూ, ర్ఛాలసుఁడై వ్రాలి లేచునంతటిలో వీ
రాలాపముఖరుఁడై రాఁ, గా లక్ష్మణుఁ దద్దశాస్యుఁ గని మార్కొనుచున్. 114

ఆ. అపుడు మించి మించ నాడినమాటల, కెన్నియక్షరంబు లన్నిశరము
లసురనోళ్ల గ్రుచ్చె నతఁడు నయ్యమ్ములఁ, గొఱికి యుమిసి పెక్కుకోల లేసె. 115

వ. వెండియు నయ్యిరువురుం బరస్పరజయాభిలాషంబున. 116

క. మ్రోఁగుచుఁ దూపులు తూపుల, నాఁగుచు దుస్తరశరక్షతారుణవారిం
దోఁగుచు మూర్ఛాదశలం, దూఁగుచుఁ దేఁగుచు బెనంగ దొరకొని రాజిన్. 117

## రావణుశక్తిచే లక్ష్మణుఁడు మూర్ఛిల్లుట.

ఉ. ఆత్తఱి లక్ష్మణుం డొకమహావిశిఖంబునఁ దూపుతోడ వాఁ

డె త్రిరవిల్లు ద్రుంచిన బళీ! యని విశ్వవిధాయిదేవతా
దత్తమహోగ్రశక్తి తనదక్షిణపాణి నతండు పూని యీ
మిత్రికిఁ గూడుగాఁ గనెఁ జుమీ నిను నీజనయిత్రి లక్ష్మణా! 118

చ. అని యటు చెప్పి త్రిప్పి వెస నార్చుచు వ్రేసిన నయ్యసాధ్యసా
ధనము నినాదనిష్ఠురము తాపధురీణము నిర్భరప్రభం
జనభరితంబు దివ్యశరజాలనిరోధనిరాసకంబు దో
ర్ధనురమితప్రవేగకుపితంబును నై తనుఁ జేరి గ్రక్కునన్. 119

తే. బొమ్మ గాఁడిన సౌమిత్రి దిమ్మ దిరిగి, పుట మెగసి కేలివిలుజాఱ బోర మోవఁ
బడఁగ శేషాంశ మైనయాభవ్యశీలు, ధరణి తలఁ దాల్చె మేలు కృతజ్ఞురాలు. 120

వ. ఇట్లు మూర్ఛానివశుం డై నేల వ్రాలియున్న యన్నరనాథకుమారుం గొనిపోవువాఁ డై వానవారితేరు డిగి యెత్తంబోయి తక్షదక్షుకంబై విష్ణుతేజం బున్నకతంబునఁ గదలింపలేక వితాకుండై తనలోన. 121

క. మును వెండికొండ తూఁచిన, తునుకోలగదా మదీయదోర్దండ మితం
డన నెంత యిన్ని చేతులు, వెనువెనుకకె వచ్చె నెత్త వెక్కసపడుచున్. 122

ఉత్సాహము.—
అంచు నెంచుకొంచు నుండ ననిలజుఁడు తటాన నే
తెంచి తల తలంగు రోరి దిట్టకూళ! యంచు గ
ద్దించి గుద్ది యద్దురాత్ముఁ ద్రెళ్ళఁద్రోచి లక్ష్మణుం
గొంచు నరిగి డించె భానుకులవరేణ్యు చెంగటన్. 123

క. నక్తంచరుఁడును రఘుపతి, భక్తుని గుద్దున ధరిత్రిపైఁ బడి పిదపన్
రక్తంబు గ్రక్కికొనియుం బి, రక్తుఁడు గా కపుడు లేచి రథ మెక్కె వెసన్. 124

వ. ఇవరంబునకుం దిపురుచుండె నట సుమిత్రాపుత్త్రు నురంబు దూఱినశక్తియు నతండు వైవశ్యమగ్నుండై యుండంజేసి తిరిగి పోయి రావణుం జేరె నప్పుడు. 125

## రామరావణయుద్ధము.

ఉ. తాదృగవస్థ నున్న తనతమ్మునిఁ జూచుచు దాయఁ జూచి యో
రా! దనుజాధమాధమ! దురాగతముల్ కొన కెక్కె నంచు నీ
తాదయితుండు కట్టలుకఁ దమ్మికనుంగవ యెఱ్ఱఁ జేసి బ్ర
హ్మాదులఁ జొచ్చినన్ విడుతునా? యిఁక నీని వధింతుఁ గా కనిన్. 126

తే. అని పలికిన వీరసన్నాహ మలవరించి, హనుమదంసాధిరూఢుఁడై యనికిఁ గదలె
రక్కసులఱేఁడు నెదురుగా రథము దోలె, నాగలువాహానకక్షితోడల్ వగులఁదాఁక,

వ. ఇత్తెఱంగున నొత్తరంబై జగత్తు లుత్తలపడ నొత్తి వచ్చిన యత్తేరిమ్రోలఁ గోస
లేశ్వరకుమారుండు. 128

క. అభ్రంకషరథకపి చిత్రభ్రమణంబుల వెలింగెఁ బ్రళయాంతక ఫా
లభ్రాజిష్ణుభ్రుకుటీ విభ్రమ ధౌరేయ మైనవిల్లుం దానున్. 129

మానిని.—
రావణుఁ డేసె శరంబుల ఘోరతరంబుల నేరి తరంబులునుం
గా వని తాఁకినఁ దాళుకొనం బెనఁగం బవికల్పము లల్పములం
బోవని పాటివి పావనిబిల్లులువోవఁ జలింపఁ దతంబును గ్రొం
బూవులతోఁ బొడవై తగుఁ దాసనపుంబొదచందమునం బొలిచెన్. 130

సీ. దశరథాత్మజుఁడును దనదిట్టతత్తడి నెత్తుట జొత్తిల్లి నెఱకుగాఁడ
నేయుంట కలిగి కట్టెఱ్ఱమూపులఁ జూచి యందుపీఠియందుల వి ల్లుఱునఁ బెట్టి
విశిఖంబు లేయ విద్విషదిషుత్రుటనంబు, లవి యమేయజ్వాల లలనఁ బొదివి
పగ భస్మ మయ్యె గట్టిగ నిప్పు డన సవాహనసారథికము గా నరద మెరియఁ
తే. జేయ బూడిదప్రోవులై చిన్నవోయి, కానఁబడెః గంటె నిశ్శేషగళితశత్త
దశమకుటకాంచనద్రవధార లున్న, తనువుతో రిత్తతలలతో దనుజరాజు. 131

క. ఇలు కాలి కూల నిట్టక, నిలిచిన నిట్రాడువోలె నిజరథ మటులం
బొలియ న్నిలఁబడి రాకా, సులఱేఁ డుండుటకు నగుచుఁ జూచిరి వేల్పుల్. 132

వ. కౌసల్యాకుమారుండునుం బంక్తిముఖుని వీక్షించి. 133

## రాముఁడు యుద్ధశ్రాంతుఁ డగు రావణుని లంకకుఁ బుచ్చుట.

క. ఎఱకలు నఱికినఁ గొమ్ములు, విఱికినఁ బోలేనిగిరిని బెగడినకరి ని
త్తఱిఁ దలఁపించెదు తేజం, బఱి యింత యవస్థ వచ్చెనా నీ? కకటా! 134

చ. అదియునుఁ గాక గంధకరియాకృతి రేపటిఁ బట్టి యొక్కటిం
గద కపిరాట్చమూకదళికావనవాటిఁ బెకల్చి యాడి తిం
తదడవుదాఁక దూపటిలినాఁడవు కయ్యము నేయ నెల్లి వ
చ్చెద విపు డేమి దప్పెని నిలు చేరి సుఖంబున నుండు నేఁటికిన్. 135

## లక్ష్మణుఁడు మూర్ఛఁ దేరుట.

వ. పుత్త్రమిత్త్రకళత్త్రాదులతో విభవానుభవంబున నున్న నిన్ను నీయధర్మంబే దరిద్రాక్రాం
చెంగ దాయని యానతిచ్చి తద్దయానిధి యతనిం బొమ్మని యనిచి హనుమదంసావత
రణంబొనర్చి వెంచేసి యనుజునిం దేర్చెనఁ బౌలస్త్యుండును నచట నుండక చనుచో
వనచరులు తన్ను వెన్నుదగిలి దుమ్ముతో లించి చల్లువారును జప్పట్లఁ జఱచువారును
నడ్డంబురిగి వెక్కిరించువారును నై చేరి చేరి కేరి కేరి నవ్వ నందఱం జేవిసరులం జెదరం
జేయుచుం బరాభవఖిన్నుండును దయాపన్నుండును నై వేఱొక్కతె రెక్కి పురంబు
చొరంబఱచి తననగరివాకిట నరదంబు డిగ్గి యాప్తపరివృతుం డై పోయి యేకాంత

మంటపంబునం గూర్చుండి కొండొకసేపు చింతించి కుంభకర్ణుం డుండఁ గురుకుర విచారణంబులేల?యని యతని లేపికొని తెండని యనిచిన ననేకులు యూపాక్షాదులు భక్ష్యభోజ్యాదులు పట్టించుకొని చని దివ్యమణిమరీచిస్ఫారితతటిద్వారం బైనతదీయ శయనగుహాద్వారంబుఁ జొచ్చి పోనంబోవ. 136

## రాక్షసులు కుంభకర్ణుని నిద్ర లేపుట.

సీ. తాత్కాలికతదీయఫూత్కారమారుతం బెత్తివైచినఁ దూలి యెల్లవారు
వచ్చి వాఁకిటఁ బడి వక్షంబు పగిలినవాఁడుఁ గేలిలికినవాఁడుఁ గాలి
కీలుదొలంగ మొగ్గినవాఁడు మోనముక్కు చెక్కుఁబోయినవాఁడుఁ బ్రక్కయెముక
మురిసినవాఁడును మొగము ట్రోఁగినవాఁడు నై నొచ్చి యల్లన నలపు దేఱి
తే. గహ్వరముఁ గ్రమ్మఱఁగఁ జొచ్చి కడలఁ దప్పఁ, దెరువు లిడికొని తలయంపి దెసకుఁ జేరి
యనిఁ గపులఁ దారుజావ నేట్లాడునంత, లేసి ఱాలెత్తి వ్రేసియు లేపలేక. 137
ఆ. ముక్కుఁ జెవులు నోరు మువ్వేవు రసురల, నూర్పు వెడలకుండ నెత్తిపట్టఁ
బఱచి కడుపుమీఁద బండులు దోలించి, రిటులు దోలఁగా నొకింత దెలిసి. 138

వ. కనువిచ్చి చూచి లేచిన వానికిం బొట్టనిండఁ దిండివెట్టి వేయికడవల కారెనుపోతుల నల్లకలిపినకల్లు దప్పికి నిచ్చి తృప్తునిం జేసిన నతం డతిమాత్రవిపులవృత్తారుణతారకంబులు ఘూర్ణమానంబులుగాఁ గదలి గవి గ్రక్కదల హుంకరింపుచుం దను లేపిన పని తెఱంగు యూపాక్షాదులచే విని వెడలి విపణివీథి నేతేర నాతని పొడవు కోట లోపలి బలీముఖులు గనుంగొని కనుకనిం బఱవం దొడంగి రిట్లు కుంభకర్ణుఁ డన్న కొలువునకు వచ్చి యతనికిం బ్రణమిల్లి దేవా! నన్నుఁ దెలివితెచ్చుట యెందులకు నానతిమ్ము. 139

## కుంభకర్ణుఁడు రావణానుజ్ఞాతుఁ డై యుద్ధమునకు వెడలుట.

క. నాకముఁ గూల్చుటకో? భూ, లోకముఁ గాల్చుటకొ? యుఱగలోకము నీకుం
గైకొల్పుటకో? నాకు, న్నాకొల్పెదు కోఁతిపోరు వాక్రువ్వకుమీ. 140

వ. అనవుడు మనఃఖేదంబు మఱచి మందోదరీమనోరథుండు. 141

క. నా చేసికొనిన నేరమి, నీచేతుల మఱుఁగుఁ జొచ్చి నీఁగెదఁ గృపసా
రాచానలకృత వేదనఁ, బాచెన్ భవదీయవచనభంగులు నాకున్. 142

వ. మకుటంబులును మరల మస్తకంబులకు వచ్చినయవియు మత్కృతంబులెల్లఁ జెల్లించెదవుగాక నీవేమి విభీషణుండవే విడిచిపోవుటకు? నని యంతయుం సూచించిన విని యతండు కటకటంబడి పాకశాసనప్రముఖప్రతీక్ష్యసేవావసరుండ వై యుండునీ కా యీకాఱియ? రావణేశ్వరా! నానిదురగఢా ఢయింతకుం దెచ్చెఁ దెచ్చుం గాక తజ్ఞా

ద్యంబు భవత్ప్రేషితులచేతం గొంత దీఱెం గడమం గపులు దీర్చెదరు తదీయ భుజా పర్వతపాదపాది పాతంబులచే లెస్స మేలు గాంచినపుడు నీకు నిర్బంధాపాది యైన పగ మామకజఠరానలంబున జీర్ణం బయ్యె నని నమ్ము మమ్మలికంబు విడువు మని పలికి యగ్రజానుజ్ఞాతుండై కదలి పురంబు వెడలివచ్చువానిం జూచి రఘువీరుండు విభీషణుం బిలిచి వీం డెవ్వండు వియన్మలయపటకుటీరంబునకుం జాలినయొంటి కంబంబు వలె నున్నవాఁ డని పల్కిన దేవా! యితండు కుంభకర్ణుండు దశముఖుని డాసినవాఁడు దీర్ఘదేహుండు పుట్టినప్పుడ పొట్టచిచ్చునకునై జగదఖిలజంతుక్షయం బొనర్ప నేర్పడిన నెదుర్పడి పురుహూతుండు చేతివజ్రాయుధంబున వైవ నది బొమ్మున నొడ్డి వమ్ముపోవం జేసి చౌదంతికొమ్ములు గురుసులకు విఱిచి దానం గొని వైచి యవ్వాసవుం దఱిమెం బ్రపంచపరితాపం బొనరించి బ్రహ్మశాపంబు గాంచె దానం జేసి యితండు నిద్రించుట కాఱునెల లాహారవిహారంబులు గాంచుటకు దినద్వయంబునునై యుండు నిన్నిద్రాళువు మితినిండక మేల్కన్నం జెడు నని యుం బరమేష్ఠియై పలికినాఁడు నేఁడు బలాత్కారంబున లేపి పంచినం జనుదెంచినాఁడని విభీషణుండు విన్నవింప విభుండు వెఱఁగంది చూచుచుండె నంత. 143

## కుంభకర్ణయుద్ధము.

సీ. కదియ ముట్టినకుంభకర్ణునిపైఁ గపుల్ సంఫుల్లభూరిభూజములు వైవ
నతనివక్షఃపీఠి నవి చూర్ణమై మరందరసంబు జిగటమై విరులు నిలిచి
పూవుగట్టిన గందవొడిపోలెఁ బరిమళ భరితమై నెఱయ వారరిది యనుచు
గట్టెత్తి వైవ మోఁకాళ్ల మోఁచేతులఁ దుమురుగాఁ దట్టుచు దూఱి యతఁడు
ఆ. వైచుకొనఁగఁ జొచ్చె వదనబిలంబులో, నురక యొడిసి యొడిసి యూథపతులఁ
గాయభీరువులు దదీయకర్ణఘ్రాణ, వివరమార్గములను వెడల వెడల. 144

వ. ఇది గాదని యయ్యఖిలభీకరుండు దండుమీఁదం బడి పది నూఱు వేయి మొదలైన లెక్కలతో నెక్కువతక్కువం జిక్కినకొలంది కపులం గరంబులం జమిరి పిసికి ముద్దలు చేసి సవ్యాపసవ్యంబుల వైచుకొని మ్రింగం దొడంగిన ముంగలిమూఁకలు వెఱచఱచి పఱచినం గని కనలి యనిలతనయాంగదగవయద్వివిదశరభశతబలిగజగవాక్షాదిప్రముఖ చరశ్రేష్ఠులు భూయిష్ఠమాత్సర్యంబులం బైకి లంఘించిన జంఘాజానుజఘనభాగంబులను వీఁపుల మూఁపులం జాఁపుచేతులం జెవులం జెక్కుల ముక్కుమీఁదనుం గలయఁ బ్రాఁకిన నతండు గొండొకపడి నిండువనంబు తోడికొండవోలె పదంపడి యొడలు జాళించి తూలించినం జాలించక ముంచుకొని ముందఱం బిఱిందివంకను వలపలందావలంబోనీక పొదివిన నుఱికి పిడికిటం బొడిచియుం దిరిగి మోచేతులం గ్రమ్మియుం నొరగి యోరతన్నులు తన్నియు నఖచేతం బఱచియుం బెడచేతనడఁచియుం నందఱం దూఁగి

యాడం జేసినం గని యోసరింపక వానరరాజకుమారుండు మాఱుకొని యొకటిం గొనినం గినిసి నిశిథినీచరుం డద్దండిదోరయురంబు శూలంబునం బొడిచి వెల్లకిలం ద్రోచినం బోయెం బోయెం దీఱెం దీఱెం బని యని వనచరసేన దీనాననయై పెదవులు దడుపుచు నుండె రక్కసుం డక్కపిరాజు చచ్చెనే యని తమ సేనికిం గానుక పట్టువాఁడై కొని పురంబునకుం బోవుచు నుండె నాంజనేయుం డాచకితకపులతోఁ బలిమూర్ఛితుం డింతియ తేఱి యమ్మదోన్మత్తును వ్వేత్తున మోసపుచ్చి వచ్చుం జూచుచుండుండు వేఱొండు గారా దటులైన వీనిం గొట్టి విడిపించుకొనంజాలనే? విభుం డభిమాని తానే విడివడుంగాక యని యొప్పం జెప్పుచుండె నంత. 145

ఆ. కోటలోనఁ బోవుకుంభకర్ణుని మూపు, మీఁదివాఁడు దేఱి మిహిరసుతుఁడు
లంక యిది వియత్తలం బిది నడుమ నాయంనికి యెందు మీఁద నొక్కొ యెఱుఁగ.

క. కయ్యంపువేళ గాదని, యయ్యెడఁ దలపోసి తెలిసి యై నర్థ మెటో
యయ్యో నగుంగా కెపుడీ, దయ్యమునకు బుద్ధి చెప్పి దాఁటెద ననుచున్. 147

ఆ. అసురభటులయార్పు లడుగువట్టి చనంగ, నతని చెవులు గూబ లంటఁ బెఱికి
ముక్కు గొఱికికొని దుముక్కునఁ దన సేన, సరస కుఱికి రామచంద్రుఁ గాంచె. 148

ఆ. దశముఖానుజుండు దనకర్ణఘోణల, ప్రోల్లఁ గుమ్మరించు ముదురు నెత్తు
రిల్ల పొడవుఁ దడప నెఱసంజఁ బడమటి, మిన్ను వెలిఁగినట్లు మేను వెలుఁగ. 149

వ. గిరుక్కున మరలి వీడు వెడలి తన బ్రతుకు మీఁదను మియుం లేఱంగు దోఁప విలూనఘ్రాణగళితంబై వాతెఱకు వచ్చు నెత్తురు తుప్పతుప్పన నుమియుచు రక్షోవీరపరివృతుండై కవిసినం గని కపులు తెంపుచేసి తనగుంపుమీఁదం బడిన నతండాసందడికయ్యంబులోనఁ దనవారు వారివారనక దొరికినవారినెల్లం దునుకలు చేసి బొక్కుచుం ద్రొక్కుచు నెక్కడ నున్నవాఁడు విరాధవిరోధి? యనుచు వలకేల ముద్గరంబును డాకేల నొక్కతరువునుం గైకొని డీకొని సౌమిత్రియేయు నేటులు దనునాటిన గీటుగొనిన పాటి గాక పోకకు నిక్కకం బోక రాకాసిం దునుముతూపు కల్గునొకో! యని వేల్పులు వెక్కసపడి చూడం జేరువాడుచుం జేరంబోయి రఘువీరునితో నిట్లనియె.

## రాముఁడు కుంభకర్ణుఁ జంపుట.

క. కలతూపు లేవి యేయుము, పలుగట్టుం బుడక లివియె పార్థివ! నాకుం
బలు ప్రోఁతులు దంష్ట్రాంతర, ములలోఁ జిక్కుకొని యూడిపో విదె యెప్పుడున్.

వ. అని పలుకునంత. 152

క. తరుముద్గరభరితదు, ర్ధురతరసవ్యాపసవ్యదోర్దండములన్
ధరఁ గూల్చె రఘువరేణ్యుఁడు, మరున్మఘవదేవతాకమహితాస్త్రములన్. 153

వ. అక్కోలుంగవప్రక్కం జిక్కి మక్కినమర్కటులు రక్కసులు పెక్కండ్రు గల రది యట్లుండె సందిళ్లకొలందులకుం దెగినయమ్మోళ్లు రెండు నతం డార్చియెత్తినం జిల్లునం జిమ్మనగ్రోవులం బారుతీరున నెగయుం రుధిరధార లూర్ధ్వలోకంబులం దడిపికొనుచుం బోయె నప్పు డప్పుడమిఱేఁడు వెడందవాఁడితూపుల నతనికాళ్లు కత్తిరించి యయ్యుత్తరము నొత్తరముం గుఱుచపఱిచిన నవుడు గఱచి హుంకరణభయంకరుం డై మ్రింగ నప్పళించు నద్దానవుండు. 154

క. తొంటినడ గుంటువడినఁ, బంటుతనము గుంటుపడక పరుషధ్వనితో
మింటికి నిమ్ముగ నంగిటి, గుంటదనుక నోరు దెఱచికొని యున్ముఖుఁడై. 155

వ. జరిగి జరిగి గిరి గదలి వచ్చుగతి వచ్చుచో నచ్చెరువంది పరేతరాజశర మరింబోసి యారాకాసిజేనిగళంబునకుం బూన్చి తెగనిండఁ దిగిచి జగతీవల్లభుం డేసె నంత.

మహాస్రగ్ధర.—
తెగి తన్మస్తంబు దంష్ట్రాధిగతధగధగద్దీప్తలిప్తాభ్రమై వ
క్త్రగుహాగర్జావశేషోద్గగనచలితగంధర్వవిద్యాధరం బై
నగరప్రాకారకేళీనగశిఖరసరత్నస్ఫురచ్చంద్రశాలల్
పగులంగాఁ దాఁగికొంచుం బలువడిఁ జని తత్ప్రాంతపాథోధిఁ గూలెన్.

క. నడు మొండె మదియుఁ నతనిది, కడలిన్ సగము పడి యొకసగం బిలఁ బడ నం
దడవులుఁ గొండలుఁ గ్రోతుల, తుడుములుఁ బెక్కుపరియె తుత్తుము రయ్యెన్.

వ. అత్తఱిం బరమానందభరితులై దివ్యులు దుందుభులు మ్రోయింపుచుం బుష్పవర్షంబులు గురియించి జయజయశబ్దంబులతో రఘువీరుం బ్రశంసించిరి తప్పిపోక యుండప్పి నిలిచినతరుచరులు తలబువట్టి చూచుకొనిరి యంత నచ్చటరావణుండు నిజానుజవధప్రకారంబు హతశేషనిశాచరులు దెలుపక తొలుత నె యతనితల వీటికిం దాఁటి పోవుటచేత నెఱింగికొనియె. 159

రావణుఁడు కుంభకర్ణమరణమునకు శోకించుట.

క. వినమిన్ విచికిత్సాయుత, మనస్కుఁడై యుండి యుండి మఱి వెనుకం దా
వినియున్ విచికిత్సాయుత, మనస్కుఁడై యుండె నురక మ్రాన్పాటొదవన్. 160

వ. వెండియు నతండు తమ్మునిం దలంచి తలంచి యెలుంగెత్తి పిలుచుచుం దజ్జయంబు లుగ్గడింపుచు హా! యనుచు నేలం బుడుకుచుఁ బొరలుచుఁ బెక్కువగలం బలవించుచుఁ దనతోడంగూడఁ బుత్రమిత్రకళత్రాదు లడలి యడలి తమంతన తాలిమిఁ దెచ్చుకొని తనుం దెలుపం జొచ్చినం దేఱనేరక యూరక పొగులుచు విభీషణునీతి వినక చెడితింగా యనియుం బుద్ధిచెప్పిన ప్రహస్తుని ప్రాణంబులు గొంటింగా యనియుఁ గడపట నీలావు నమ్మితిఁ గా తమ్ముఁడా! యనియుం వాపోవుచున్నం జేర వచ్చి త్రిశిరుండు

దేవ! నీవంటిమానధనున కిది పాటియే? యెప్పనివారు నవ్వ ని వ్వేతలు తలపోసి
కొనంబాడియె? నీ కెదు రెవ్వండు? 161

సీ. విధివితీర్ణం బైన విశిఖంబు విఱిగెనే దొనఁ దొంగి చూడుమా దనుజనాథ!
విశ్వంబు నేఁడు నీవింటికి వెఱవదే? రాముఁ డెక్కడివాఁడు రాక్షసేంద్ర?
కుంభకర్ణునితోడఁ గులమెల్లఁ గ్రుంగెనే? యరుల కేమోపమే యసురరాజ!
యతికాయదేవనరాంతకుల్ చిఱుతలే? యంపుమా నాకుఁ దోడాసురేశ!

ఆ. యనిన వారు నట్ల యగు మాకు సెలవిమ్ము, దేవ! యనిన సమ్మతించి యతఁడు
చనుఁడు మీకు సమరమున మహోదరమహా, పార్శ్వ లెట్టుఁ దోడుపడెదు వారు. 162

## మహోదరాదులు హనుమదాదులచేఁ జచ్చుట.

చ. అని యనుపన్ మహోదరుఁడు హస్తి హయంబు నరాంతకుండున
న్న నలువురుం బ్రభావపరిణద్ధరథంబుల నెక్కి సేనలం
గొని బహుతూర్యముల్ మొరయఁ గొల్లఁగొనం జనువైఖరిం జనన్
వనచరు లాజిఁ బిన్నఁగుల వట్టుగఁ జంపిరి తద్బలంబులన్. 163

క. అంతఁ ద్రిశిరోతికాయన, రాంతక దేవాంతకులు మహాపార్శ్వుఁడు దు
ర్దాంతుఁ డగుమహోదరుఁడు ది, గంతప్రకటాట్టహాసులై పైఁబడినన్. 164

సీ. అరదాలతోఁ గూల్చి నిరుగాలఁ దన్ని దేవాంతక త్రిశిరుల ననిలసుతుఁడు
తత్తడితో నెత్తి తలక్రిందుగా వైచి యని నరాంతకుఁ దీర్చె నంగదుండు
కరటితో సరిపెట్టెఁ గటికి కౌఁగిట నుగ్గ నదిమి మహోదరు నగ్నిసుతుఁడు
సారథితో వ్రేసి చంపె మహాపార్శ్వదానవు వృషభాఖ్యవానరుండు

తే. నప్పు డతికాయుఁ డోరోర! యద్రిచరులు, జమిలి చంపులు చంపి రిచ్చట నటంచుఁ
దచ్చమూమధ్యమునకు రథంబు దూఱి, నూకి పాపట పుచ్చి లో నుసలఁ జొచ్చె. 165

## లక్ష్మణుఁ డతికాయుం జంపుట.

క. ఇరుఁగెలఁకుల కపులుం దన, శరములనో డెలువడంగఁ జనియెన్ సమరో
ద్ధురుఁ డట యేఁడీ రఘువరుఁ?, డరుదేరఁడు చూడుఁ డేయుఁ డనుచుం బిలుచున్.

క. ఇటులఁ జనఁ దత్పరాక్రమ, పటుత్వ మీక్షించి రామభద్రుఁడు విల్లం
దుటయును లక్ష్మణుఁ డాయన, నటు నిలు మని మ్రొక్కి వాని కడ్డము దాఁకెన్.

ఉ. తాఁకినఁ జూచి వాఁ డతనిఁ దారసిలంగ రథంబు దోలి నీ
యాఁకకు నిల్వ దీయరద మన్నఁ బిఱిందికిఁ బోవఁగా నొగల్
దాఁకెడు దేవదంతిఁ బడఁ దాఁకె దురంబునఁ దొల్లి నావుడున్
ప్రేఁకపునారసంబుల హరించె నతండు శతాంగవేగమున్. 168

వ. అప్పు డతికాయుండు. 169

చ. సునిశితనిష్ఠురం బయినసోనధనుర్జనితంబుగా నొన
ర్చిన నది ముంచె ముంచుటయు సీతమయూఖ సమీరసాయకం
బున నెడలించి యట్టిశరము ల్నిగిడించినఁ ద్రుంచుచుం గనం
గనగనమన్విథాత్మవిశిఖంబునఁ ద్రుంచెఁ దదీయమస్తమున్. 170

ఇంద్రజిత్తుమాయాయుద్ధమున వానరవీరులు మూర్ఛిల్లుట.

క. తద్వార్తాకర్ణన మపు, డుద్వేగము వెఱప వెచ్చ నూర్చి నముచిభి
ద్విద్వేషి యనికిఁ ద్రిదివా, పద్వర్ధను మేఘనాదుఁ బయనముచేసెన్. 171

వ. అంత. 172

శా. దిక్కుల్ పుక్కిటఁ బట్టఁగా బ్రబలవాదిత్రధ్వనుల్ సైన్యముల్
వెక్కుల్ గొల్వఁ గదాశకంబి బిరుదుం జేర్వాడుచుం బోయి తాఁ
దక్కం దక్కినమూఁక నెల్లఁ గపియుద్ధక్షోణిఁ గోల్పోయి యా
చక్కి న్నిల్వక మిన్ను చొచ్చికొని గర్జాఘూర్ణితాజాండుఁడై. 173

సీ. అమ్ములు బ్రహ్మమంత్రాభిమంత్రితములు మిను గ్రక్కు ననిపించి మునుఁగఁ గురియ
గజ గంధమాదన గవయ గవాక్ష కేసరి నీల శతబలి శరభ రంభు
లాదిగా యూథపు లర్వదియేడుకోటులు దేవతాసంభవులు బలంబు
తోఁ జచ్చి రినజాంగదులు గతాసువు లైరి రామలక్ష్మణులు మూర్ఛల మునింగి

తే. రంత రవి గ్రుంకె మరలె మాయావి బ్రహ్మ, జపముచే హనుమద్విభీషణులు దేఁటి
విపదపాయంబు దలఁగింప వెరవెఱుంగ, కజసుతుని జాంబవంతుని నడుగఁ జనిరి. 174

హనుమంతుఁడు సంజీవకరణిచే నందఱ బ్రతికించుట.

తే. అతఁడు గొఱప్రాణమున నుండి హరువు దెరువు, లావటిల దెల్పఁ జని వాయుదేవసుతుఁడు
క్షీరపారాకరోత్తరతీరభూమి, నుండు దివ్యౌషధంబులఁ గొండఁ దెచ్చె. 175

సీ. తెచ్చినప్పుడ దాన దీపించునోషధీలతలగాడ్పులు సోఁక హతజనంబు
లగ్నశల్యము లూడి భగ్నసంధులు గూడి మిసమిస పసలెచ్చి యసువులు వచ్చి
దొరలెల్ల దాశరథులతోడ నే లేవ గట్టితం డచట నె పెట్టివచ్చె
సూర్యోదయంబయ్యె సురలాదిగా నెల్లవారుఁ జేరొక్కనిరి సామీరిమహిమ

తే. తిరుగ రే రాఁక గోరుచుండిరి ప్లవంగ, వీరు లంతట రవి గ్రుంకె వెలిఁగెఁ దార
లిరులు నిండె సురారివీ డెరియఁ బెట్టి, రయ్యనర్గళభుజశౌర్యు లార్చి చొచ్చి. 176

తే. ఇట్టివానరపరివార మేసరేఁగి, వైచుచిచ్చుల లంక యేపంకఁ గవిన
గోడమన్నింటికొయ్యయుఁ గోటగాయి, మొదలుగా గాలనది పంక్తిముఖుఁడు చూచి,

### సుగ్రీవహనుమంతులచేఁ గుంభనికుంభులు చచ్చుట.

మ. అనిచెక్ గుంభనికుంభులం గపులతో నాలంబు సేయం బ్రజం
ఘుని యూపాక్షుని శోణితాక్షు మకరాక్షుం గంపనుం గూర్చి వా
రును దూర్యంబులు మ్రోయ సైన్యములఁ దారుం దాఁకి యంతగ్రవి
ష్టనటద్వానరసేన వెల్వఱచి వెంటంబెట్టి బెట్టార్చినన్. 178

వ. సుగ్రీవాంగదాంజనేయమైందద్వివిదులు వివిధవీరాలాపవిజ్ఞాపితనిజాభిధానులై యుద్ధంబు సొచ్చి రందుఁ గుంభుండు జంభారిసుతసోదరుం దాఁకి వీఁకల బెనఁగి పెనఁగి యతని పిడికిలి పిడుగుపడినం గఱుత పగిలి చచ్చె నికుంభుం డంభోరాశిలంఘనవిశృంఖలజంఘాలుం గదిసి తదసిప్రాయనఖరముఖవిదారితవక్షఃకుక్షి యై నేలం గూలె నకంపనప్రజంఘు లంగదుం గని మార్కొని యతనియాంఘ్రిప్రహారంబున కుపహారంబులైరి యూపాక్షశోణితాక్షులు మైందద్వివిదులకు లివ యడంగు పాటిగాఁ బోరి వారికిం జేరలుక దెచ్చి తచ్చపేటంబులకుఁ బ్రాణంబు లిచ్చి రంత నత్యంతకోపాటోపంబున వచ్చి మకరాక్షుం దక్షిణబాణపరంపరాభూతవానరవీరుం డై మాఱులేక యెక్కుడఁజూచినం దానయై యున్నం గనుంగొని ఖరవిరోధి వానిపురోవీథి న్నిలువక తనవెనుకకు వచ్చు యూథనాథుల కభయం బిచ్చి విలుపుచ్చుకొని టంకారంబున నద్దనుజవీరుం జేరం జీరి సమీరసఖసాయకంబునం దేయతోడన నీఱు గావించె నంత సూర్యోదయం బయ్యె నయ్యవసరంబున. 179

### ఇంద్రజిత్తు నికుంభిలాహోమము సేయుట.

సీ. వెండియుం మేఘనాదుండు తండ్రికి నేఁడ పగదీర్తునని పెక్కుబాస లిచ్చి
సన్నద్ధుఁడై వచ్చి సకలయూథపులకు నృపులకుఁ బోడకట్టి నిమిషమునను
మిన్నుదూఱి తేరితోడ నదృశ్యుఁడై యేయఁ జొచ్చి రాముని కల్కఁ దెచ్చి యతని
దివ్యాస్త్రముల మాయ తెగి యాకసముటెంకి యరద మందఱుఁ జూడ నవనిఁ బడిన
ఆ. వెఱచి పరువఁ గపులు వెన్నాడెఁ గుహానాము, హీఁజ నోర్తు వారియెదుటఁ జంపి
శోకమగ్నమానసులఁ జేసి ప్రేల్చికి, నతఁడు చనె నికుంభిలాటవికిని. 180

వ. పాపనిముఖు లగువలీముఖు లద్దాశముఖు నెటుపోవుటయుం జెఱుంగక జానకిం జంపెనే యనుచు నడలుచుం జని విన్నవించినఁ బలవించు కాకుత్స్థులం గనుంగొని విభీషణుం డిది మేఘనాదుని మాయ వాఁడు మాయారణహోమంబునకుఁ జనినవాఁడిది నిక్కువం బది విఘ్నంబు చేసి యిప్పు డప్పగతుం బరిమార్చుట నీతి యనినం దేఱి జానకీవిభుండును నవ్విభీషణహనుమజ్జాంబవదాదులం గూర్చి వానిమీఁదికి సౌమిత్రిం బనిచె నంత. 181

## లక్ష్మణుఁ డింద్రజిత్తు వధించుట.

మ. అతఁడుం బోయి నికుంభిలాటవిని శాటానీకినీరక్షుఁడై
హుతభుక్సన్నిధి ముక్కుపట్టుకొని కూర్చున్నట్టి యయ్యింద్రజి
ద్దితిజుం బోరికిఁ జీరి చంపి మరలెన్ దేవేంద్రుఁ డుప్పొంగ న
క్కృత లెల్ల న్వని పంక్తికంఠుఁ డడలల్కం బొంచె సుద్వేలుఁడై. 182

## రావణుఁడు మరల యుద్ధమున కేతెంచుట.

చ. వెనుక నృపాలురం గపులవేలముచొచ్చి వధింతు మున్న య
జ్జనకజఁ ద్రుంతుఁ గాకదియె చంపె ననేకుల నం చశోకకా
ననమునకై కఠోరగమనంబునఁ బోవ సుపార్శ్వుఁ డాదిగా
ననుఁగులు మాన్పఁగా మరలి యాజికి వెల్వడెఁ బెక్కుకీవులన్. 183

తే. వెడలి యసురాధినాథుండు కొడుకుతోన, తెగనాఁకొ దీనసం బనఁ దేరు డిగ్గి
యెల్లపరివారమునకుఁ జేయెత్తి మ్రొక్కి, నడుపుఁ డీవేళ యిదె సుండినాకు మీరు.

మ. అనిన న్మంత్రులు నాప్తులున్ దొరలు దేవా! మ్రొక్కులన్ రాలఁ దే
రనె యెంతే నలవడ్డయానిమితకాంద్రన్ భానుపుత్త్రాదులన్
వినుమీ చంపక పట్టి తెచ్చి దినము న్నీయింటి కామాట పుం
బనికిం జొచ్చెద మన్న దాఁక నిడె చెంపల్ ప్రేతు మత్యుద్ధతిన్. 185

వ. మీరు తేరెక్కి యిటు విచ్చేసి కనుంగొనుం డనవుడు నుత్సాహంబుతో నతం డట్ల యాచరించె నద్దానవవీరులును భీకరాకారులై తేరులు వారణంబులు వారువంబులు ఘోరమృగంబులుం దమతమ వాహనంబులుగాఁ గొని నానావిధతూర్యంబులు మ్రోయుఁదలకడచి నడచినం గపిసేనలుం గలియఁబడియె నప్పుడు. 186

చ. శిలలను గుప్పుచప్పుడును జేతుల పోటులు త్రిప్పుచప్పుడున్
జెలువుడు డెల్పుచప్పుడును దేరులు సూరెల రొప్పుచప్పుడుం
బలములఁ ద్రిప్పుచప్పుడులు బర్వఁగ నజ్జగడంబు మజ్జగం
బులు వినియెన్ నిశాచరచమూజితు లైగి ష్ఠసంగసైనికుల్. 187

క. విఱిగినకపులం గనుఁగొని, వెఱవకుఁ డని విల్లు పూని విభుఁ డివి యనికిన్
దఱి యని గంధర్వాస్త్రం, బఱిముఱి నరిఁబోసి యేసె నసురులమీఁదన్. 188

వ. ఏసిన నద్దివ్యాస్త్రమహిమంబున. 189

సీ. ముంగల వెనుకవంకం గెలంకుల నిండి తొడిగినమ్ములతోన కడిఁదివిండ్లు
తెగలు నిండారంగఁ దిగిచి ప్రత్యాలీఢ పాదులై తముఁ జుట్టు వాఱుకొనుచు

రాము లనేకు లారణవీథిఁ దోఁచిన దితిజవీరులు వారి దేఱిచూడ
నళికిమీఁదులు చూడ నంపు నొదలలకు విశిఖంబు లానించి విడువఁ జూచు
తే. రాఘవసహస్రములఁ జూచి రాఘవేంద్ర!, కావవే? యంచు ఱెప్పలుగదియమూయ
నుల్లములలోనఁ బొడకట్టె భల్లభగిత, గురుధనుర్భాసి కాకుత్స్థకోటు లపుడు. 190
క. ముంగల వెనుకఁ గెలంకుల,నుం గనఁబడు రాములం గనుంగొన వెఱపై
నింగిఁ గన నందు నెత్తుల,కుం గోలలు వంచు రామకోటులు తోఁచన్. 191
వ. ఇక్కరణి రక్కసులం గక్కసపెట్టి యక్కాకుత్స్థుం డొక్కఘటికాచతుష్టయం
బున ధనుష్టంకారఘోరంబుగా శరాసారంబు నిగిడించిన. 192
క. పదివేలు పసిఁడితేరులు, పదునాలుగువే ల్గుఱాలు భద్రగజంబుల్
పదునెనిమిదివేలున్ మే, లుదొరల్ పంద్రెండు లక్షలుం బొడిమైనన్. 193
మ. కని పౌలస్త్యుఁడు వాహినీపతనశోకక్రుద్ధుఁడై హవ్యవా
హనకుండంబులువోలె విప్పగను డోలాభీలకీలస్ఫులిం
గనికాయంబులు గ్రాయ బోరన శతాంగంబుం జోరం దోలి రా
మునికిం దూఱ విభీషణుండు గదచే నుంచెన్ హరుల్ గూలఁగన్. 194
వ. ఇత్తెఱంగున. 195
ఆ. తేరు గుంటుపఱిచి దిగ్గన వెనుకకు, దాఁటె దాఁటు తమ్ము దాయఁ జూచి
దశముఖుండు క్రోధదందహ్యమానమా,నసము వేఁడి వెలికి విసరఁ బలికె. 196
మ. తులువా! నన్నెదిరించ వచ్చితివె శత్రుం డేఁడి నీకంటె? నా
కలమర్మంబులు వీఁటిఁ బుచ్చి తదియుంగా కయ్యరాతిన్ నికుం
భిలకుం దోకొని పోయితే కొడుకుఁ జంపింపంగ నవ్వేల్మిలోఁ ?
జల మీడేఱె నెంత చేసితివి ? వంశద్రోహి ! ని న్నోర్తునే? 197
సీ. అని పల్కి యొకశక్తిఁ గొని యభిమంత్రించి ప్రేయ విభీషణు వెనుక కొత్తి
తా దాని కభిముఖుండై దీప్తబాణంబు లేసె సౌమిత్రి యయ్యిషుపరంప
రల లెక్కగొన కక్కరాళశక్తి వెలింగి గగనభస్మము రేఁగఁ గలయమలయం
పరుషకీలలతోడఁ బఱతెంచి యుంరమాన గిర గిరఁ గను గ్రుడ్లు దిరుగ నతఁడు
తే. వ్రాలి మూర్ఛిలె హాహావిరావ మొదవెఁ, గపులలోఁ దమ్మునియవస్థఁగనియుఁ విభుఁడు
ధైర్యధుర్యత విలుపూని దాయమీఁద, నడిచి నోనేసి వానిఁ బో నడఁచివచ్చె. 198
తే. వచ్చి తనచేతివి ల్లటు వైచి నేలఁ, జదికిలంబడి యొండిన పెదవు లంట
వాడు నాలుకఁ ద్రిప్పుచు వనరువిభుని, జేరి యూఱార్పఁ దలఁచి సుషేణుఁ డనియె.
వ. స్వామీ! సౌమిత్రి కేమియుం భయంబు గాదాదు మనకు మారుతి గలండు తేఁగ

లందు సూర్యాస్తమయంబు గావచ్చె నింక నోషధులు వెలింగి కనుపట్టునని పల్కు
పల్కులు కడనుండి విని యాంజనేయుండు. 200

క. ఇనుఁ డస్తమింపఁ జయ్యనఁ, జని యౌషధనగముఁ దెచ్చి సౌమిత్రి సజీ
వుని జేసి కొండ మును వుం, డినచోటనె డించి వచ్చె నృపుఁడున్ మెచ్చన్?201

ఉ. కోమలధాముఁడై పొడుపుఁగొండ కినుండు కిరీట మయ్యె సు
త్రాముఁడు పెట్టిపంచినరథంబున రాముఁడు దేజరిల్లె సం
గ్రామము గోరి సన్నహనగర్వముతోఁ బురి నిర్గమించె భే
రీముఖతూర్యఘోషబధరీభవదాశుఁడు రాక్షసేశుఁడున్. 202

## రామ రావణ యుద్ధము.

వ. అప్పుడు సంగరదిదృక్షం జనుదెంచి యంబరంబునం బట్టు చాలక తొట్టియున్న కిన్నర
కింపురుష గంధర్వ సిద్ధ విద్యాధర చారణ సుర గరుడ సందోహంబు సన్నాహ
సాహససముత్సాహాభిరామభీముం డై రాము నెదుర్కొనంబోవు రావణుం గలహా
శనమునికిం గరంబులం జూపి. 203

భుజంగప్రయాతము.—

త్రిలోకీవనీసంచరిష్ణుం ద్రికూటా
ద్రిలంకాగుహాకేసరిన్ వీనిఁ జంపన్
వెలుంగొందె మున్నీటివేడెంబులోనన్
బళీ! రాముఁ డంచుం బ్రభావంబు లెంచున్. 204

ఉ. ఆదశకంఠుఁడుం దెలివి నంతట సారథిఁ జూచి కుంభక
ర్ణాదులు దోడులేమి కెటు లయ్యెడునో యనుచింత మానుమీ
యేదొర తోడువట్టి యెదురెత్తెఁగ నెత్తితి వెండికొండ నా
కీదుర మెంత? నీవెరవు లేమఱ కెక్కు మటంచుఁ జేరఁగన్. 205

చ. మనుకులసార్వభౌమునకు మాతలి చేతులు మోడ్చి దేవ! యి
ద్దనుజునివింటిచేయి బెడిదంబుసుమీ జతనంబు సూరెలం
గనుఁగొనుమయ్య! వానరులఁ గాల్చుచు వచ్చె శరంబు లొక్కరుం
డన వల దెంద ఱెంద ఱెదు రందఱకున్ బరు వీతఁ డాజులన్. 206

తే. పెక్కుడలఁ జూచి యెఱుఁగుదు నిక్క మనిన, నగవు మొలక మొగంబున నిగుడ దేర
మాతలికిఁ బ్రత్యయకరంబు నాతనికి దు, రత్యయతరంబుఁ గాఁ గార్ముకారవంబు. 207

వ. రఘువీరుండు. 208

క. ఇషువర్షద్విషభద్రం, కషగర్వాగమనమునకుఁ గనలు గదిరి దు
ర్విషహావిషానలభీషణ, పృషత్కముఖములకు సెలవు పెట్టుచు నేసెన్. 209

చ. అవి నిజబాణదాహకము లైనదశాననుఁ డల్గి యగ్నితూ
పు వెలుఁగఁజేసెఁ జేసిన నభోవపురుగ్రలలాటదృష్టి తె
ప్ప విఱుగఁ ద్రోచి తేచె నన బాణముమంట మొగుళ్ళ ముట్టి గ
ర్భవిషము దీర్చి యేర్చి పయి భస్మము రాల్చుచు నేన నంటఁగన్. 210

శా. పర్జన్యాస్త్రము రాముఁ డేసుంటయుఁ బైపైఁ బట్టి మబ్బుల్ గడున్
గర్జిల్లెన్ దనుజాస్త్రవహ్నితటిదంతర్వ్యాప్తముం జేసి వి
స్ఫూర్జద్వ్యాగిజటు న్నటుం గఠినహాసున్ భైరవుంబోలు మే
లార్జించెన్ బిడుగుల్ పడెన్ బిదపఁ దోయంబుం బ్రవర్షింపఁగన్. 211

వ. అంత. 212

క. కీలిశర మాఱిపోయినఁ, గాలోరగశరము పంక్తికంఠుఁడు వఱపెన్
వ్యాళమయ మగుచు మిన్నై, వ్రాలెన్ బ్రాణములమీఁద పచ్చెన్ విధికిన్. 213

తే. నల్లత్రాఁచులు మేనులనెల్లనిండఁ, దగిలికొని వానరులసోఁక మొగులుఁ దీవ
లలమిన సుమేరుశృంగంబు లట్లు యుండి, రేసె సౌవర్ణబాణంబు రాసుతుండు. 214

వ. అప్పుడు. 215

క. అట్టియెడ నెన్నియేనిన్, బుట్టెన్ వెన్నునిగుఱ్ఱాలు భూమియు నభమున్
ముట్టెన్ దొట్టెన్ గడకున్, బట్టెన్ ఫూత్కారఘోరఫణభృద్గణమున్. 216

క. ఒకకడఁ బులుగులదొర యెుఱు, పొకకడఁ బెనుపాపనలుపు నొదవిన నుడుపీ
థికిఁ బగ లొకకడనున్ రే, యొకకడనుం గలసురాద్రి యొరపు లభించెన్. 217

వ. వెండియుఁ బ్రచండపక్షవిక్షేపవాతోద్ధూతవారాకరతరంగం బగునవ్విహంగపుంగవగణంబు తత్ఫణాధరనికరంబుమీఁదం గదిసి ఱెక్కలు విసరిన బొక్కలు దూఱి పాతాళంబు పట్టిచన నడుచునెడం జెదరి తదీయశిరోరత్నంబులు రఘువరునిరుకెలంకులం దొరఁగు తన విభునియస్త్రవిద్యాపరిపాటికిం గనుచాటు దాఁకకుండ నీరాజనం బిచ్చి కడలవైచుదీపకళికల పోలుపు దాల్చెనంత. 218

క. వలచుట్టి పీడుకొనుచుం, బులుఁగుదొరల్ విభునిఁ బొగడి పోవ నసుర గ
ర్జిలి యేసెఁ దామసాస్త్రము, సెల లడసె ననంగఁ గప్పి చీఁకటు లెసఁగన్. 219

సీ. తరుచరుల్ కరగృహీతమహీరుహంబులు మహీయూఁదుకొనియొడల్ మఱచినిలుపు
నిదురలతోఁదూగనెదుటఁ గనుంగొని రాచూలి సౌరశరంబు వఱపి
యఖిలాంధకారంబు నడఁచి యాశ్రితుల సమ్మోహబంధంబులు మునియఁబాపి

వాసరంబు వెలుంగఁ జేసి శూలమున వ్రేసిన నైంద్రశక్తిచేఁ దునిమె నదియుం

తే. ఇట్లు పోరి రయ్యిరువురు నేరిజయము నెఱుక కెక్క దయ్యాశ్చర్య మేమిచెప్ప?
విలయవాత్యలఁ దాఁకుచుఁ దలఁకుచుండు, కొండకవవోలెఁ దేరులు రెండు మెలఁగె.

వ. మఱియు నయ్యిరదంబులు చలితకేతనపటాంశుకంబుల పేరంబుట్టి పట్టెంబులు జళిపించియు విటంకఘటితఘంటానాదవ్యాజంబున వీరవాదంబు లుగ్గడించియు వలభిముఖవిలంబిచామరచ్ఛటచ్ఛలంబున నట్టహాసంబులు నెఱపియుఁ దూపులు దూఱఁగాఁడిన నంగంబులం గలయంగ నుపట్టుగరుల మిషంబున నుత్సాహపులకాంకురంబులు దాల్చియుం బశ్చాదాకృష్టప్రరూఢత్సారితత్వచ్ఛద్మంబునం జెప్పుడాఁటితలపాటు లలవఱిచికొనియు నొండొంటితోడం బోరాడుజాడలం జూడ వేడుకలు పుట్టించె నయ్యవసరంబున.

ఆ. వార లేటులాడ వాలమ్ము లిల యంచ్చి, చనియుఁ బైఁకి నెగసి తునిసిపడియు
నువ్వుఁగింజ వ్రేయనుం జోటు లేకుండ, మునుగువడఁగ నిండె ముజ్జగముల. 222

## శ్రీరాముఁడు రావణుం ద్రుంచుట.

వ. పోరి పోరి యలుక దెచ్చుకొని రఘునాయకుండు రాక్షసరాజు నీక్షించి. 223

క. పుడమిసుతఁ దేరఁ దోడనె, యడుగెత్తెద ననుచు నింగి నరుదెంచితి వ
ప్పుడలిక మ్రుచ్చిలి తెచ్చుట, గడదాఁకఁగఁ బిడుగుపడియెఁగా పై నోరీ! 224

వ. అని యదలించి. 225

ఆ. దేవమునివరోపదిష్టంబు రవిహృద, యము జపించి రాముఁ డమరవైరి
తలలు దెంచెఁ దెంచె మొలతెంచె మొలతెంచె, మొలిచె మొలిచె మఱియు మొలిచె మొలిచె.

తే. అట్టిపోరాటలోపల నస్తమయము, లేదు గడచెను నుదయంబు లేదుదోఁచె
దాశరథి యంతమీఁద వైధాత్రశరము, విహితమంత్రంబుచే లేపి వింటఁ దొడిగె. 227

శా. మీఁదం జూచి విరోధి నేయుటయు నున్ మీలన్ముఖజ్వాలలన్
మీఁదుం గ్రిందును బోయెఁ బోయెఁ దిరుగ న్నిర్మించుసామగ్రి తెం
దేదేవో పడియెన్ విధాత కనఁగా నిట్లేఁగి తీ ర్పేర్పడం
గాఁ దద్దివ్యశరంబు రావణునివక్షం బుచ్చి యత్యుద్ధతిన్. 228

క. చని నేలఁగాఁడి క్రమ్మఱ, మనుకులమణి దోనను వచ్చె మఘవాహితుఁడున్
దనపాటునఁ దే కొరుగఁగఁ, బెనుగబ్బలి పడనగతి గుభేలునఁ బడియెన్. 229

క. గతజీవుఁడు వ్రేఁగనియెడు, కతయది మునిస యయ్యెఁ బంక్తికంఠునియెడఁ దా
నతఁడు మును బ్రతికి వేఁగై, బలిమాలిచె జగముఁ జచ్చి భారము వాపెన్. 230

ఆ. అతని యూర్పు శాంతమగుటయుఁ జల్లనై, విసరె మారుతములు వెఱపులేక
యతనిముఖవికాసమడఁగఁగా దిశలనుఁ, దేటవచ్చె నినుఁడుఁ దేజరిల్లె. 231

వ. తక్కినగ్రహగణంబులు వెలుంగొందె బృందారకులు దుందుభిధ్వనిపూర్వకంబుగా శ్రీరామునిమీఁదం బుష్పవానలు గురిసిరి గంధర్వగానంబులు బయలు మెఱసి వినవచ్చె నంత. 232

## మందోదరీవిలాపము.

సీ. తనప్రాణనాథుఁడు పోయినపోక మందోదరీదేవి విని నేలఁ ద్రెళ్ళి సఖులు
దెలుపఁగా నొక్కింత దేఱి 'హా! దశకంఠ?'యని మోముచే మోఁదుకొనుచు లేచి
యవరోధసతులుఁ జౌరనీలవేణులు వెంట నంటఁగ వీడు వెడలివచ్చి
కటిబంటి నెత్తురుకాలువల్ వలువలు దడియ నేఁదుచుఁ జొచ్చి దాఁటి దాఁటి
తే. కొడుకుఁగుఱ్ఱలపీనుఁగుల్ కుంభకర్ణు, మొండెమును బంధుతనుఖండములును బడిన
పోలికలనిలోన మూర్ఛలు వోవుచును, వచ్చి నిజనాథుపై వ్రాలి వనర చనియె.

వ. విభీషణుండును రామచంద్రునియనుజ్ఞం జని తనయన్నలకుం జాల వగచి తదీయ తనయులకుం బలవించి యందఱకు నుచితవిధినగ్నిసంస్కారాదు లాచరించి యరుదెంచె నంత. 234

## విభీషణుని లంకాపట్టాభిషేకము.

క. ఆమ్రేడితకరుణారస, కమ్రమనోవాక్క్రియావకాశుఁడు లంకా
సామ్రాజ్య మొసఁగె రఘుపతి, నమ్రునకు విభీషణునకు నయగుణనిధికిన్. 235

## సీతారాములు పుష్పకారూఢులై యందఱితో నయోధ్య కేతెంచుట.

సీ. పోదచొచ్చి మైఁజల్లు వదను దెచ్చిన సీతఁ గెంగేలఁ దాపమాఱంగ నంటి
పొగడ వచ్చినవేలుపులదీవనల హాత ప్లవగుల బ్రతికించి పూఁజచేసి
త్రిదివావతీర్ణుఁ దండ్రి భజించి తెక్కు దప్పాము భవత్కృప నంచుఁ బలికి యనిచి
చండభానుజవిభీషణులతో దేవితో సౌమిత్రితోఁడఁ బుష్పకము నెక్కి
తే. తేరు దేవేంద్రునకు నిచ్చి తిరుగఁ బనిచి, జనకజకు లంకలోవింత లునికి చూపి
పైఁజనుచు సేతురచన లుపన్యసించి, గగనయానంబు కిష్కింధకడను నిలిపె. 236

క. నిలిపినఫలాదివన్యము, లులుపాపట్టించె నినజుఁ డోడయని కవ్వం
దులవెనుకఁ గపుల సకుటుంబులుఁగా నెక్కించుకొనియెఁ బుష్పక మతఁడున్. 237

వ. అనంతరంబ యచ్చోటువాసి చనుచో మనుకులకుండు జనకజం గనుంగొని. 238

సీ. హనుమదాలోచనావని పంప యిది సుమీ యదిసుమీ శబరిఁ గన్నట్టిపట్టు
ప్రతిబంధక కబంధమృతిదేశ మిది సుమీ యదిసుమీ ఖరదూషణాజిధరణి
గోదావరియగస్త్యమేదిని యిది సుమీ యదిసుమీ మాయలేడఁడఁగుచోటు

బుధనిరోధినిరాధవధభూమి యిదిసుమీ యాదిసుమీ ప్రథమోటజాజిరంబు

తే. చెలువ ! కనుగొంటివే? యంచుఁ జిత్రకూట,మునకు డిగ్గి భరద్వాజమునివనంబు
కడ విమానావతరణంబు నడపి యమ్మహర్షి భజియించి యాతిథ్య మపుడు గాంచి.

వ. అందు నొక్కయెడ విశ్రమించి హనుమంతుని భరతుకడకు నిజాగమనవార్తవినిపిం
చంబంచిన నతండును నందిగ్రామంబునకుం బోయి శ్రీరామపాదుకారాధనతత్పరుం
డైన యారాజన్యఋషికి నానతుండై తన్నుందాను దెచ్చినవార్తయు నెఱింగించిన
నాలింగనం బాచరించి యాక్షణంబ యయోధ్యకు శత్రుఘ్ను ననిచిన నతండు చని
హజారంబున నుండి మంత్రులం బిలిచి రాజు వచ్చెం బురంబు శృంగారింపం బరిచార
కులం బనిచి మీరును భైనంబులై రండు లెండు పోం డెదురుకొనంబోవలయు ననిన
విని వారునుం బరమానందభరితులై యట్లన యాచరించి రప్పుడు. 240

క. బంగారుమిసిమి గులికెడు, చుంగులకురుజాలును ధూపసురభులు సౌధా
లిం గడచె రాజధానిక, శృంగారముసకలదృగ్వశీకృతిఁ బొలిచెన్. 241

మ. పయనంబై చతురంగసేన యెదుటం బన్నం బ్రధానుల్ జగ
జ్జయలాభం బొడఁగూడె నేఁ డని మహోత్సాహంబునం దేరు లె
క్కి యనేకంబులు తూర్యముల్ దిశల మ్రోఁకల్ ప్రేయఁజేయక సు
గ్రాముతుల్ వచ్చిరి కొంచుఁ బట్టపుఁగరిక రాజన్యసామ్రాణులన్. 242

సీ. శత్రుఘ్నుఁడపుడు కౌసల్యాదిజననులను దెచ్చెఁ బసిఁడిపాలకులలోన
వారిఁ దోకొనిపన్ని వచ్చినమంత్రులు వివిధసేనలు గొల్వ వెంటఁ దవిలి
సాకేత మంతయుఁ జనుదేరఁగఁ బరాశరమునీంద్రు తాతఁ బురస్కరించి
కొనుచు నందిగ్రామమునఁ జేరుచో భరద్వాజు వీడ్కొని రఘువరుఁడు వచ్చి

తే. భూమిజయు లక్ష్మణుఁడుఁ దానుఁ బుష్పకంబు,నచట డిగ్గి నిజాంఘ్రిపద్మానతులను
భరతశత్రుఘ్నులఁ బ్రసన్నకరుణఁ జూచి, వంశగురునకు మ్రొక్కి దీవనలు గాంచి.

క. కౌసల్యం గైక సుమి,త్రాసాధ్విఁ బ్రణామములపరంపర లెసఁగం
గా సేవించి తదాశీ,ర్వాసితముని జయజయేతివచనప్రియులై. 244

## ——◉ శ్రీరాముల పట్టాభిషేకము. ◉——

వ. సంతసంబునం బొదలిరి తదనంతరంబు. 245

సీ. గురుజనానుమతి రఘుస్వామి లక్ష్మణ భరతుల కభినవాభ్యంగవిధులు
సాంగించి మంగళస్నానక్రియానంతరమున శత్రుఘ్నుండు విమలవసన
గంధమాల్యామూల్యకమనీయభూషణ ప్రతతి నన్నల నలంకృతులఁ జేసె
నార్తి కోడలిఁదోడికోడండ్రతోఁగూడి యొఱపలోమి కౌసల్య యుపచరించె

తే. రాముఁడు తలంచినప్పుడ రమ్మటంచుఁ, బలికి ధనదునికడకుఁ బుష్పకము ననిచి
యినసుత విభీషణాంగదహనుమదాదు,లకు నలంకారవాహనాదికము లొసఁగి. 246

క. తారాదిసకులకును మణి; హారాదివిభూషణమ్ము లమ్మల నేఁ జే
శ్వరు సతుల నిప్పించినుఁ, బౌరుల హితమాత్యులం గృపం గనుఁగొనియున్. 247

శా. శ్రీమన్మంగళవైభవంబులఁ బ్రవేశించెం బురంబున్ మునుల్
ప్రాముఖ్యుల్ పఠియింపఁగాఁ గ్రమమునన్ భద్రాసనం బెక్కి మీ
ర్మి మీరాజ్యము లేలుఁ డం చనిచె సుగ్రీవాదులం బెంపుమై
సౌముఖ్యంబునఁ బ్రోచు చుండె రఘువంశస్వామి లోకంబులన్. 248

ఆశ్వాసాంతము.

శా. భూపాలాగ్రణి! సత్యసంధ! కలశాంభోరాశిగాంభీర్య! యో
షాపంచాస్త్ర! కృపానిధీ! యుభయవంశశ్రేష్ఠ సాహిత్యగో
ష్ఠీపాండిత్యధురీణ! నిత్యజయలక్ష్మీవైభవా! దానవి
ద్యాపారీణ! భుజాబలార్జితసమస్తప్రాజ్యరాజ్యోదయా! 249

ఉత్సాహ. —
ఆర్యవర్య! పూజ్యధీరతాభిభూతనిర్జరా
హార్య! శౌర్యరాశి! భూసురాశ్రితావనైకతా
త్పర్య! పర్యటద్యశోవితాన! వైరిభూవరా
వార్యకార్యవేది! సూర్యవంశవార్ధికౌస్తుభా!

క. గండరగండ! హరిద్వి,దండనులాచలకిటీంద్రదర్వీకరరా
ద్దండన పాండిత్యసము, ద్దండమహీమండలాస్పదభుజాదండా! 251

గద్యము. ఇది శ్రీమదొంటిమెట్టరఘువీరశతకనిర్మాణకర్మఠజగదేకఖ్యాతిధుర్యాయ్యల
రాజు తిప్పయమనీషిసర్వతాభిధానపౌత్రాక్కయార్యపుత్త్ర పరిశీలితసమిద్ధ
రామానుజమతసిద్ధాంతమర్మ ముమ్మడివరదాచార్యకటాక్షవీక్షాపాత్రహృదయ
పద్మాధిష్ఠితశ్రీరామభద్ర రామభద్రకవిప్రణీతం బైన రామాభ్యుదయమహా
ప్రబంధంబునందు సర్వంబును అష్టమాశ్వాసము.

రామాభ్యుదయము సంపూర్ణము.



చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము:—1931.